శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము ౨౭ | ప్రమాధినామసంవత్సరము. చైత్రవైశాఖ మాసములు. | సంచిక ౧.



కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక, రు. ౦-౮-౦.

1939 ఏప్రెల్, మే.

# విషయసూచిక.



శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౮. { ప్రమాధినామసంవత్సరము. చైత్ర వైశాఖ మాసములు. } సంచిక ౧.

## స్వవిషయము.

ఈసంచికతోఁ బరిషత్పత్రిక కిరువదియెనిమిదవ వత్సరము ప్రారంభమయినది. స్థాపించినది మొదలు, ఆంధ్రభాషాభివృద్ధికై పరిషత్తు పాటుపడుచున్న విషయ మందఱకును దెలిసియున్నది. నాఁటికిని నేఁటికిని బరిషదాశయ మొకటియే. ప్రథమసమావేశమున వ్యావహారికభాషా ప్రయోగము, అర్ధానుస్వారము, శకటరేఫము, సంధి, అన్యదేశ్యములఁ గూర్చి పండితు లేకగ్రీవముగ నంగీకరించిన తీర్మానములే నేఁటికిని మన కాదర్శప్రాయములై యున్నవి. (1) 'గ్రంథరచనయందుఁ బూర్వలాక్షణికమతానుసారమగు భాషను బ్రయోగింపవలయును గాని లక్షణవిరుద్ధమగు భాషను బ్రయోగింపఁగూడదు. గ్రంథములను మృదుమధుర శైలిని రచింపవలయుననుట సర్వజనసమ్మతము. అట్లొనరించుటకు లక్షణభంగ మావశ్యకము కాదు......' (2) అర్ధానుస్వారశకటరేఫములు శబ్దస్వరూపావయవములగుటను, శబ్దవ్యుత్పత్తుల నిరూపించుటకు సాధనములగుటను త్యాజ్యములుకావు. (3) సంధి—గద్యరచన యందచ్చటచ్చట నర్థావబోధనార్థమును, బఠనసౌకర్యార్థము నావశ్యకమని తోఁచినపట్టులందు సంధిచేయకున్నను దోషము కాదు, కాని సంధి

యెప్పుడును జేయనక్కఱలేదని వాదించువారి వాద మంగీకార్యము కాదు..

పరిషదుద్దేశ మిప్పటికి నిదియే. లక్షణగ్రంథములఁ గొన్ని ప్రయోగముల విషయమై గల భిన్నాభిప్రాయములను బండితబృంద మేదోయొక రీతిని బరిష్కరించుకొనవచ్చును. ఒండురెండు ప్రయోగముల లక్షణకర్తలకును గవులకును భేదాభిప్రాయ ముండవచ్చును. కవి స్వతంత్రుఁడగుట భాషాలక్షణముల నిచ్చవచ్చినటుల నుల్లంఘన మొనర్పవచ్చునను వాదము గ్రాహ్యము కాదు. "సంస్కారార్థో నియమః. అనియమాత్ గ్రామ్యం హి యత్త్వపభ్రంశః" అని చింతామణియు, "సామ్యాలవత్త్వా ద్బ్రాహ్మణత్వా ద్గ్రహీతత్వాచ్చ సాధుభిః। నాపభ్రంశత్వ మేవ స్యాత్ నియమాభావతస్తు తత్" అని వికృతివివేకమును ఘోషించుచున్నవి కదా. ఏకాలమందైనను, ఏదేశమందైనను, జనసామాన్యము మాటలాడు భాషకును గ్రంథస్థమగు భాషకును వ్యత్యాస ముండక తప్పదు. గ్రంథస్థమగు భాషయుఁ బద్యగద్యముల భిన్నముగ నుండును. జనసామాన్య భాషయు వాడుకయందుఁ బండితులు మొదలు పామరుల వఱకు ననేక భేదములు గలిగి యుండుననుట నిర్వివాదాంశము. నేఁడు వ్యావహారిక మనఁబరఁగుచు నాయాకవులు, వ్యాసరచయిత లుపయోగించెడి భాష నియమము, పద్ధతియును లేక వక్రగతుల నడచుచున్నది. ఈ వ్యావహారికభాషావాదులు గ్రాంథికభాషను గృతకభాషయని దూఱుట పరిపాటి యయినది. నేఁడు వెలువడుచున్న గద్యపద్యములను, అందలి వింతపద జాలము, సమాసములు, ప్రత్యయములు, పదముల కూర్పును, దిలకించినచో దేనిని గృతకభాష యనవలయునో విస్పష్టమగును. కొన్ని ప్రయోగముల సాధుత్వాసాధుత్వములనుగూర్చి భిన్నాభిప్రాయములమైనను గ్రాంథికభాషయందు దోషరహితముగ వ్రాయుట కష్టసాధ్యమని మన మెంచినను, సలక్షణమగు భాషయే మన కాదర్శముగ నుండవలయు నని నొక్కి వక్కాణింపఁగలము. సలక్షణమనిన సంస్కృతభాషాసంప

దాయములు, అతిదీర్ఘసమాసములు, దుర్గ్రాహ్యములగు పదములను దీసికొన నవసరము లేదు. సుశబ్దములతో నాతికఠినముగ రచింప వీలగు ననియే పరిషదుద్దేశము. కవులు దమఖండకావ్యముల నట్టి భాషలో రచింపవచ్చును. ప్రబంధశైలిని రచింపుఁడని వీరి నెవరును నిర్బంధిం చుట లేదు. ఈయుగమున గద్యరచనమున వీరేశలింగకవిప్రభృతులు మనకు మార్గదర్శకులై పెక్కుగ్రంథముల రచించియున్నారు. నవలలు ఖండకావ్యములు, నాటకములయందును బాత్రౌచితిని గమనించి, నీచ పాత్రములకుఁ దగిన భాషను మనముపయోగింపవచ్చును. మన కాయా సందర్భములఁగలిగిన భావముల మాసవలోకమున కందఁజేయుటయే భాషాప్రయోజనమై యున్నది. అట్లుగాక ప్రతివాఙ్మయనిర్మాతయుఁ దనభాషయు, రచనమును దనకొఱకే యని భ్రమించి, యిష్టము వచ్చి నటుల రచింప మొదలిడినచో నది వాఙ్మయమున కనర్థదాయకమగు ననుటలో సందియము లేదు. అట్టిపద్ధతులవలన భాషాప్రయోజనమును నశించుచున్నది.

ఈశతాబ్దమున మన వాఙ్మయమునందుఁ గలిగినమార్పు లితర హైందవ భాషల సంబంధమువలనను, పాశ్చాత్యదేశముల ప్రాచీనాధు నాతనపద్ధతుల సంఘర్షణము వలన నేర్పడినవని మనము గ్రహింప వలసియున్నది. దేశీయవాఙ్మయముల ఖండకావ్యములు, నవలలు, చిన్ని కథలు, నాటకములు జనసామాన్యము నెక్కువగ నాకర్షించుచున్నవి. అందులకు లక్షణవిరుద్ధముగాని సులభశైలినే మనము వాడవచ్చును. భాషావిషయమునఁ గవులును, నాటకనవలారచయితలును దమతమ బాధ్యతను గుర్తింపవలసియున్నది. భాషాభిమానము గలిగి దేశభాషల గౌరవమును నిలువఁబెట్టుకొనవలసియున్నది.

అర్థానుస్వారశకటరేఫములను సంధులను విడనాడుటయే నూతన మార్గమని తలఁపరాదు. ప్రతిభాషకు నేదియో విలక్షణత యుండును. తమిళమునఁ గల వింత యక్షరము, మూడవ 'న'కార మిందుల కుదాహ

రణములు. ఆంగ్లమున F సంజ్ఞకు సరియగు నక్షరము మనదేశభాషలఁ గన్పడదు. ఇటులనే తెలుఁగుభాషను నర్ధానుస్వారశకటరేఫములును గలవు. వీనివలన శబ్దస్వరూప మెఱుకపడుటయే గాక పెక్కుపదముల భిన్నార్థములు వీనియుపయోగముపై నాధారపడియున్నవి. అర్ధానుస్వారశకటరేఫములను బ్రయోగించుటచే నర్థభేదము కలుగుచున్నది. వానిని విసర్జించుటవలన భాష కపకారముచేసినవార మగుదుము. సంధి యనునది పదములకూడికచేఁ గలిగిన మార్పగుటచే, సులభముగ నర్థముదెలియుటకై కొన్నిస్థలముల సంధినియమములఁ బాటింప నవసరము లేదని యంగీకరింపఁబడినది. అట్లని సంధి త్యాజ్యముకాదు. స్వరవ్యంజనముల సాహచర్యముచే వలదన్నను సంధి కలుగుచునే యుండును. సంధినియమములనుల్లఘించుట వలనను, విసంధినుపయోగించుట వలనను, భాషాసౌష్ఠవము, మాధుర్యము కొఱఁతవడుచున్నవి. ప్రయత్నపూర్వకముగ సంధిసూత్రముల నుల్లంఘించుట మిక్కిలిశోచనీయము. నేఁటి వాఙ్మయరచయితలు వంగాదిభాషలఁ గల పద్ధతుల గతానుగతికముగ ననుకరింపుచు భాష నొక వింతమార్గమున నడిపింప యత్నించుచున్నారు. అది మనభాష కనర్థదాయకమని తెలిసికొనవలసియున్నది. స్వస్థానవేషభాషాఽభిమతాః సంతో రసప్రలుబ్ధధియః ... అను చింతామణిసూత్రమును విస్మరింపకుఁడు.

కేవలము భాషావిషయముననే గాక భావములందును మనకు దాస్యము వృద్ధియగుచున్నది. నేఁటి నవలలు, చిన్నకథలును జాలవఱకు ననుకరణములే. మాతృక లెవ్వియో తెలుపక పెక్కు కథలు, వ్యాసములు ననువదింపఁ బడుచున్నవి. మూలమును దెలుపకపోవుట స్వతంత్రరచన మనుకొందురని వీరి యభిప్రాయమైయుండును. మహాకవులు, వాఙ్మయనిర్మాతలు రచించిన కొన్నిగ్రంథము లవశ్య మన్యభాషల ననువదింపవలసినదే కాని యన్నివిషయముల నట్టి యన్యభాషారచనలనే యనుకరింపుచు నవలలను, కథలను రచింపుట మనభాషకు గౌరవదాయకము

కాదు. అట్టివానిని విడచి, స్వతంత్రముగ గ్రంథముల రచించి కవులు, నవలారచయితలు, కథకులు నాంధ్రభాషామతల్లి కమూల్యాలంకారము లొడఁగూర్తురుగాక.

---

## కీ. శే. చరిత్రచతురానన చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు.

ఈమేనెల 16 వ తేది సాయంకాలము 3-35 గంటలకు శ్రీ చరిత్ర చతురానన చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు కొవ్వూరులో స్వర్గస్థులైరి. వీరిమరణమువలన నఖిలాంధ్రదేశమునకుఁ దీటని లోటు వాటిల్లినది. వీరిని, వీరి ముఖ్యగ్రంథమగు నాంధ్రులచరితమును దెలియని యాంధ్రుఁ డుండఁడనియే మానమ్మకము. కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు స్థాపించిన విజ్ఞానచంద్రికాగ్రంథమాలలో వీరియాంధ్రుల చరిత్రము మొదటి రెండుభాగములును ముద్రితములైనవి. వీరియాంధ్రులచరితమే యాంధ్రదేశమునకుఁ బెన్నిధి. పెక్కు పరిశోధనలను సలిపి యాంధ్రుల ప్రాచీనచరిత్రమును యౌన్నత్యమును వేనోళ్ళఁ జాటిన దీగ్రంథమే. వీరి పరిశోధనాఫలితములఁ గైకొని నేటి యాంధ్రయువకులు యాంధ్రులచరిత్రమునుగూర్చి వ్యాసముల రచింపుచున్నారు. వీరి పరిశోధనము లాంధ్రదేశమునఁ బ్రసిద్ధినిగాంచినవి. ఆంధ్రమహాసభవారొసంగిన చరిత్రచతురానన బిరుదము వీరియెడ సార్థకమయినది. ప్రథమమునుండియు వీరు సంఘసంస్కరణాభిలాషులు. ఆంధ్రభాషా, చరిత్రాభిమానులు. దేశోపకారి, ఆంధ్రకేసరి పత్రికాసంపాదకులు. వివిధగ్రంథరచయితలు. వీరి లేఖిని వాదోపవాదములఁ బ్రళయతాండవమును దలఁపించుననుట యతిశయోక్తి కాదు. అళియరామరాయ లనుగ్రంథమును రచించి వీరు దివరెండు హీరాసుగారి వ్రాతలను సమూలముగ ఖండించిరి. వీరికాకతీయాంధ్రరాజయుగచరిత్ర మాంధ్రులచరిత్రమున నైదవ

సంపుటముగఁ బ్రకటింపఁబడినది. అందు రాజమహేంద్రవరములోని యాంధ్రేతిహాసపరిశోధకమండలిచేఁ బ్రకటింపఁబడిన కాకతీయసంచిక యందలి పెక్కువిషయములు సప్రమాణముగ ఖండింపఁబడినవి. వీరు ప్రథమమున జీర్ణకర్ణాటసామ్రాజ్య మనుగ్రంథమును బ్రకటించిరి. వీరి భాషాభిమానము, చరిత్రాభిమానము నపారము. తిమ్మరసు, తిక్కన, శ్రీనాథుఁడు, శివాజీ, కర్ణసామ్రాజ్యము, నాయకురాలు మొదలయినవి వీరి యితరగ్రంథములు. వీరి విమర్శనాపాటవమును జవిచూడని వ్యాసకర్త లుండుట యరిది. వీరు మొగమోటము లేకుండఁ జారిత్రకదృష్టితో వారి వారి వ్రాతలను ఖండింపుచుండిరి. తమ యాంధ్రులచరిత్రమును దిరుగఁ బ్రకటించుటకై తగినసామగ్రిని సంపాదింపుచుఁ గొన్నివారులలో వీరకాల మరణమునొందిరి. వీరి గ్రంథములతోడను వ్యాసములతోడను నాంధ్రులకొకనూతనయుగము ప్రారంభమైనది. ప్రథమముద్రణానంతరము దొరకిన నూతనవిషయముల గ్రహించి వీరి యాంధ్రులచరితమును తదితర చారిత్రకగ్రంథములను వీరిపేరఁ దిరిగి ప్రకటించుటయే వీరికి మనము కృతజ్ఞతాపూర్వకముగఁ జేయఁదగిన స్మారకచిహ్నము. వీరిభాషాచరిత్రాభిమానములు, కార్యదీక్ష, పట్టుదల, విమర్శనాతత్త్వమును బ్రశంసనీయములు. వీరిమార్గము నవలంబించియే శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారును, పంతులుగారి మేనల్లుఁడగు కుందూరి ఈశ్వరదత్తుగారును, ఆంధ్రులచరిత్రమునుగూర్చి పరిశోధనల సలుపుచు సమూల్యములగు వ్యాసములఁ బ్రకటింపుచున్నారు. శ్రీ వీరభద్రరావుపంతులుగారి మరణమును వినినంతనే శ్రీశర్మగారు తమదుఃఖము నాపుకొనఁజాలక యీమేనెల 17 వ తేది యాంధ్రపత్రికయందుఁ దమ యశ్రుతర్పణమును గావించిరి. శ్రీశర్మగారే కాదు. ఆంధ్రులందఱును శ్రీ పంతులుగారిధన్యజీవితమును దలఁచి యశ్రుతర్పణ మొసఁగవలసియున్నది. భగవంతుఁడు వీరి యాత్మకు శాంతి నొసఁగును గాక.

---

# ప్రాచీనాంధ్రభాషాగౌరవము.

శ్రీమత్తిరుమల పెద్దింటి రాఘవాచార్యులుగారు, కాకినాడ.

గీ. తొదలను సీలమై యొప్పె నాంధ్రభాష
కావ్యమత గ్రంథవాసనా యమరభాష
రాజరాజనరేంద్ర పూర్వాపరకాల
ములను రెడ్లరాజ్యము మహిఁ వెలయువఱకు. ౧

ఉ. భారతపారిజాతమును బావనవ్యాస మృదూక్తిద్యోమహా
తీరమునుండి నన్నయ సుధీసుముఖంబునఁ దెచ్చియాంధ్రవా
గ్తీరమునందునాటిన ప్రధీమణి రాజనరేంద్రుఁడేగఁగఁ
బేరగుపెద్దలందఱును బెంచిరె తిక్కన దాఁకఁదత్తరున్. ౨

గీ. ప్రభులదయనొంది గీర్వాణవాణియెక్కె
గద్దెఁ బట్టాభిషిక్తయై గంతులిడుచుఁ
జేతఁ జిప్పను దాల్చి ముష్టికినిబోయె
దిక్కులేకయ యానాఁడు తెలుఁగురాణి. 3

సీ. విద్వత్సభలయందు విద్యాలయములందు
సద్గ్రంథగ్రథనసత్సమితియందు
రాజగేహములందు రాజవీథులయందు
గీర్వాణభాషాజ్ఞ కేంద్రమందు
బంధువర్గములందుఁ బాలనాకృతులందు
సందుగొందులయందు విందులందుఁ
గావ్యధర్మములందుఁ గళ్యాణములయందు
వినుతులందును మఱి చనవులందు

నాంధ్రభాషాసమాఁదప్రజ్ఞాఢ్యునైన, గోఁగఁగాఁజూచిరానాఁడులోకులెల్ల
నెప్పినానుంటురోగంబు దుష్కువడుట, రెడ్డిరెడ్జుల సద్ధర్మలీలనిపుడు.
ప్రభుసమక్షానఁజెల్లుటపలుకుబడియు,నాంధ్రపండితకవిబృందవ్యక్తిఁగాదు
నాఁడుసంపూర్ణగీర్వాణన్యాయవాక్కు,వారికొకప్రక్కఁ గైదండపాలుగొ
నుట,

ఉ. కాకతివంశ్యులైన ననుకంపను జూపని దేశభాష న
త్రాకలిఁగొన్నదాని గని రడ్డులు తత్త్వవిశారదుల్ గడున్
లోకుల గొట్టెదాఁటునకు లోఁగుచు దానికిఁ బీఠమిచ్చి పె
న్వేఁకను సంస్కృతాంబ వెలివెట్టక ప్రోచిరి పూర్వపద్ధతిన్. ౬

గీ. కొంతకాలంబు తమచిత్తకాంతితులను
దూఁగు చిరుగురు మ్రొగ్గక వీఁగుచుండఁ
గాలవశమను ములు సూపె గౌరవంబు
తెలుఁగు తల్లికి శ్రీనాథ ఫలకమహిమ. ౭

సీ. ఆద్యంత పురుషార్థహారలసద్గ్రంథ
రాజానువాదంబు రాణతగ్గఁ
బల్నాటి వీరప్రపంచ విజయసూచ
కస్వతంత్ర చరితలు క్రాలఁదొడఁగఁ
గులమతదోష సాకులసరిత్ప్రతివృద్ధి
సాంఘికబడబచే సర్దుకొనియె
వాఙ్మయతత్త్వాల వర్తనాచారము
లొండొక దానిని నూని యుండెఁ

గీ. రసము ప్రాణంబు కావ్యసరస్వతికిని
ప్రభులయాదృతి భావి సౌభాగ్యబలము
ననుచు శ్రీనాథుకాలంబు వినుతిసేయఁ
గేతనము నెత్తె తద్గ్రంథగేహమందు. ౮

క. కవిసార్వభౌమపూర్వులు, ను విశేషఖ్యాతిఁ జెంది నుతులంబడయున్
గవితావాహినిపాయలు, గవిరూపంబున విజయనగరముకుఁ బాఱెన్.

తే. మనుచరిత్రాది సత్కావ్యమాల కృష్ణ
రాయహృదయంబు పెనఁగొని రక్తినుంట
కూర్పుభారంబు మోపుట నేర్పరతఁడు
పెద్దనాది కవీంద్రులఁ బెద్దసేసి. ౧౦

# బంకించంద్రుఁడు.

## — కొమాండూరి శఠకోపాచార్యులు. —

మనదేశభాష లన్నిటిలోను హిందీతరువాత బంగాళీయే హెచ్చుమందికి మాతృభాష. ఆంధ్రము దీని యనంతరస్థాన మందున్నది. నేఁటి యావశ్యకతలకుఁ దగిన యాధునికవాఙ్మయము బంగాళీలోనే యధికముగ నున్నది. ఇప్పటి వంగసాహిత్యము తక్కిన వాఙ్మయములకు మార్గదర్శకమైనది. ఆ యభివృద్ధి 19 వ శతాబ్దిలోనే కల్గినది. ఆ వికాసమునకు ముఖ్యకారకుఁడు "బంకిమ్‌చంద్ర చటర్జి." "చటర్జి" వీరివంశనామము. వంగభాషలో వీరిని "చట్టోపాధ్యాయ" యందురు. వీరు బంగాళీ (గౌడ) బ్రాహ్మణులు. కలకత్తాకుఁ బండ్రెండుక్రోసులలో (24 పరగణాలను జిల్లాలో) "కాంతల్పార" యను కుగ్రామమున నిప్పటికి నూఱేండ్లక్రిందట 27-6-1838 వ తేదీని బంకించంద్రుఁడు జనించెను. ఆతనితండ్రి "యాదవచంద్ర చటర్జి" గొప్పమనీషి, విద్వాంసుఁడు, గౌరవపాత్రుఁడు. ఇంగ్లీషు కంపెనీ సర్కారువారి ప్రభుత్వములో నాతఁడు 'డిప్యూటీకలెక్టరు'గఁ బని చేసెను. సహజముగఁ దనకుమారున కాతఁ డింగ్లీషువిద్య నేర్పించెను. బంకించంద్రుఁడు ధీమంతుఁడు. బాల్యమునుండియు నాతనికి జ్ఞానాపేక్ష హెచ్చు. ఆటపాటలం దాసక్తిలేక, దీక్షతోఁ జదువుచు, 'మేదినీపుర'మందలి యున్నతపాఠశాలలోను, హుగ్లీకళాశాలలోను, ఆంగ్లవిద్య నభ్యసించి, క్రమముగఁ బరీక్షలనిచ్చి, కలకత్తా "ప్రెసిడెన్సీ కళాశాల"లో నాతఁ డున్నతవిద్యఁ బూర్తిచేసికొనెను. మనదేశమం దప్పుడే యాంగ్లవిశ్వవిద్యాలయము లేర్పడినవి. అతఁడు కలకత్తా విశ్వవిద్యాలయపుఁ బ్రథమ పట్టభద్రు లిరువురిలో నొకఁడై, మొదటితరగతిలోఁ గృతార్థుఁడాయెను; ఈలోపుగనే సంస్కృతమునందును మంచి పాండిత్యమును సంపాదించెను.

అప్పుడు యువకుఁడు నుత్సాహియునగు బంకించంద్రుఁడు తన భావిజీవితమంతయు సాహిత్యకృషికే వినియోగించుటకు మొదట నుద్దే

శించెను; అందులకై, దేశభాషలోఁ బత్రికాసంపాదనమే వృత్తిగఁ జేసి కొనఁదలఁచి, వంగభాషలో నీశ్వరచంద్రగుప్తుఁడు నడుపు 'ప్రభాకర'పత్రికకు బంకించంద్రుఁ డుపసంపాదకుఁడై, కొంతయనుభవము గడించెను. కాని దైవ మన్యథా తలఁచెను. అతఁడు చిరకాల మందులో నుండలేదు.

1857 లో మనదేశమందు 'సిపాయియుద్ధము' జరిగెనుగదా! అది యణఁగఁగనే, కంపెనీరాజ్య మంతరించి, బ్రిటిషుప్రభుత్వమే స్వీయముగ నీదేశపాలన మారంభించినది. ఇట్లు లాంగ్లపాలనము స్థిరపడఁగనే, ఆంగ్లభాషకు విశేషప్రాధాన్య మేర్పడినది. అప్పటికి మనదేశీయులలో నాంగ్లవిద్వాంసులు చాలఁదక్కువ. వారికి సర్కారులో నతిసులభముగ నుద్యోగము దొరకుచుండెను. బంకించంద్రుఁడు ప్రతిభాయుతుఁడగుటఁ గనిపెట్టి, అప్పటి బెంగాలు (లెఫ్టనెంటు) గవర్నరాతనిఁ బిలిచి, మొదటనే డిప్యూటీకలెక్టరుపదవి నిత్తుమనియు, ప్రభుత్వోద్యోగ మంగీకరింపుమనియు,తొందరఁజేసెను. అప్పటి కాహోదా కధికారమును గౌరవమును హెచ్చు; దానియాకర్షణ దుర్నివారమైనది; మొదట సందేహించినను, బంకించంద్రుఁడు తుదకంగీకరించెను; అందును గొంత ప్రజాసేవ చేయువచ్చునని తృప్తినొందెను. ఇట్లతఁ డిరువదియేండ్ల వయస్సుననే సర్కారు రివిన్యూక్రిమినలుశాఖలం దున్నతోద్యోగియై, 33 సంవత్సరము లుద్యోగముఁజేసెను. ఆయన కార్యదక్షుఁడు, ప్రజ్ఞావంతుఁడు, న్యాయస్థుఁడు; మఱియు దీక్షతోను, జాగ్రత్తతోను, ఉత్సాహముతోను,తనవిధులను నిర్వర్తించెడివాఁడు. అట్టిమహనీయుని కార్యనిర్వహణము ప్రభుత్వమునకును బ్రజలకునుగూడ సంతృప్తినిచ్చెనన్న యాశ్చర్యమేమి? ఆయన ప్రజ్ఞను దీక్షను న్యాయపరతను గమనించి ప్రభుత్వమువారు కొన్నియేండ్లకుఁ దమకేంద్రస్థానమగు కలకత్తాలోని పాలకవర్గములో నాయనను సహాయకార్యదర్శిగఁ జేసికొనిరి; అప్పటికి బ్రిటిషుపాలనములో భారతీయులకట్టి బాధ్యతాయుతమగు నుద్యోగము లభించుటలేదు. ఇక్కడఁగూడ బంకిమ్ తనకార్యములను జాల సమర్థతతో నిర్వర్తించెను. కాని, బంకిం

చంద్రుఁడు కేవలము ప్రజాహితైషి, మఱియు స్వతంత్రభావుఁడు, ఆత్మగౌరవము రక్షించుకొనువాఁడు. కొందఱి యాంగ్లేయుల దుశ్చర్యల నాతఁడు తీవ్రముగ విమర్శించెను. అది ప్రభుత్వమువారికిఁ గష్టముగఁ దోఁచెను. ప్రభుత్వకేంద్రమందలి యాంగ్లపాలనరహస్యము లాతనికిఁ దెలియుట యు ప్రభుత్వమున కిష్టములేకపోయెను. కనుక, ఆంగ్లయజమాను లాయనను గేంద్రస్థానమందుఁ జిరకాల ముంచలేదు; మఱియు, ఆయనకు జిల్లాకలెక్టరు బాధ్యత నీయలేదు. బంకించంద్రుఁ డిట్లు తనయుద్యోగకాలమంతను డిప్యూటీకలెక్టరు హోదాలోనే గడపవలసివచ్చెను. కాని యప్పుడును, ఆయన బీదల నుద్ధరించుటకును, భారతీయులయాత్మగౌరవము ను గాపాడుటకును, న్యాయము జరుపుటకు నవసరమైనప్పుడెంతటి ధైర్యసాహసముల నైనఁగనఁబఱచుచు, మహాప్రజ్ఞతో నుద్యోగధర్మమును నిర్వర్తించుచుండెనఁట. ప్రభుత్వసేవలోనుండియు సంఘసేవఁజేయుటకు ధీరుల కవకాశము న్నదనుట కాయనజీవితమం దనేకనిదర్శనములున్నవి. ఆయన యుద్యోగిగనుండిన ప్రాంతములందాయన ప్రజాప్రియుఁడై స్వాతంత్ర్యభావముతో వ్యవహరించిన ట్లితివృత్తము లనేకములు నేటికిని జెప్పుచుందురు. ఆయన ఖుల్నాలో నుద్యోగముఁ జేయునప్పు డక్కడ నీలిమందువ్యాపారముఁజేయు 'మారెల్', అను నాంగ్లేయుఁడు రయితులను బాధపెట్టెను; నీలివ్యాపారముజేయు బ్రిటిషువారప్పుడు రయితులఁ బీడించుచుండిరి. ఆ దొర ప్రోత్సాహమున చుట్టుపట్ల దోపిడులును,అగ్నిప్రమాదములును దౌర్జన్యములును జరిగెనఁట. 'మారెలు' కధికారులలోఁ బలుకుబడి యుండెను; ఆతనిజట్టువలనఁ దనకుఁ బ్రాణభయము గల్గునట్లుండినను, బంకించంద్రుఁడు సాహసముతో దోషు లందఱిని బట్టుటకు విశ్వప్రయత్నముఁజేసెను. 'మారెలు'ఆంగ్లేయులలోఁ దనపలుకుబడి నుపయోగించి, యుస్తులుపన్ని, తప్పించుకొని, ఎట్లో విదేశమునకుఁ బారిపోయెను. బంకించంద్రుని యద్భుతకృషివలనఁ గొందఱు పట్టుబడి శిక్షనొందిరి. ఆప్రాంతమున మఱల శాంతి యేర్పడినది. ఇట్లే, బంకిమ్ బ్రహ్మ

పురములో నుండినప్పుడు 'కర్నల్ డఫ్రిను' అను నొకయాంగ్లోద్యోగి యాయనస్వతంత్రత కాగ్రహావిష్టుఁడై యాయనపైనఁ దిరుగఁబడి దౌర్జన్యముఁజేసెను. అందుకాయన చర్యజరిపెను. అప్పుడాప్రాంతమందు గొప్ప యాందోళనజరిగెను. తుదకెట్లో యా దొర క్షమార్పణఁ జెప్పుకోవలసి వచ్చి, భారతీయుల యాత్మగౌరవము నిలిచెను; హౌరాలో నతఁడధికారిగ నుండినప్పుడు, కొందఱు సిపాయిలొక స్త్రీయింటఁ జొరఁబడి యల్లరిచేసి, పైగా, ఆమె యధికారులపై దిరుగఁబడినట్లామెపైనఁ గేసుపెట్టించిరి. అందుపైనఁ దీవ్రకోలాహలము గల్గెను; బంకించంద్రుఁ డా కేసు దీర్ఘముగ విచారణచేసి, ఆస్త్రీ నిర్దోషియనియెంచి విడుదలఁజేసి, న్యాయము జరిగించెను. పై యధికారియగు జిల్లాకలెక్టరు బంకిము నందులకు దూషించెను; కాని బంకిము కలెక్టరుకోపాగ్ని నెదిర్చి, సాహసముతోఁబోరి, ఆయాంగ్లమండలాధికారియే లొంగునట్లుజేసి, దీనరక్షణఁజేసెను. ఆయన యిట్లు శ్రద్ధతో ప్రభుత్వసేవనుఁ బ్రజాసేవను, జేయుచునే, తనయభిమాన కళయగు వాఙ్మయరచనను నిరంతరముఁ జేయుచుండెను. నిజముగా నాయన వ్రాసిన యుద్గ్రంథములను, ఇతరవృత్తిలేకుండఁ దదేకదీక్షతో రచించిన సాహితికులును, అప్పటికి మనదేశీయభాషలందు రచింపలే దనవచ్చును. రాజకీయములం దాయన స్వతంత్రధోరణి యొకప్పుడు ప్రభుత్వమునకుఁ గొంతకష్టముగఁ దోచెను; కాని, ఆయనఖ్యాతి ఇంగ్లండుకును వ్యాపించెను. వా రాయన కార్యదీక్షను, శ్రద్ధను, కౌశలమును, నిర్వహణప్రజ్ఞను గమనించి, రాయబహద్దరు సి. ఐ. ఇ. బిరుదములతో బంకిమును బహూకరించిరి. దరిమిలాను రమేశచంద్రదత్తు మొదలగు నున్నతోద్యోగులును జాతీయభావులు సాహిత్యసేవకులు నగుట కాయన మార్గదర్శకుఁడాయెను. బంకిము 1891 లో సర్కారు నౌకరీనుండి విరమించెను. తరువాత నాధివ్యాధులవలన బాధపడుచున్నను, ఆయన వాఙ్మయకృషినిఁ ఆధ్యాత్మికకృషిని దుదివఱకుఁ జేయుచు, 1894 సం॥లో కాలధర్మునొందెను.

బంకించంద్రుని శరీరవ్యక్తియు గొప్పది. ఆయనయున్నతలలాటము, ఆజానుబాహువులు, విశాలవక్షము, స్ఫురన్నేత్రములును, ధవళదేహమునకు మంచిసౌందర్యమిచ్చినవి. కాని, ఆయనబుద్ధికుశలత, ఔదార్యము, దయార్ద్రభావము, ధైర్యము జూడ, ఆయన యాకారసదృశప్రజ్ఞుఁడని విశదమగును. ఆయనదేహవర్చస్సును బ్రతిభయు ననురూపములు నద్భుతములు నని రవీంద్రకవీంద్రుఁడు తనయాత్మకథలో వర్ణించినాఁడు.

బంకించంద్రుని సాహిత్యకృషిలోని విశేషతనిప్పుడు గమనింతము. అందులకప్పటి మనదేశపు వాఙ్మయస్థితిని గ్రహింపవలెను. హిందీ తమిళములలోను గొంతవఱ కాంధ్రములోను బ్రశస్తమగు ప్రాచీనవాఙ్మయము కలదు. ఈవిషయమున వంగభాష వెనుకఁబడినది. మనదేశీయవాఙ్మయములు మనసాంఘికస్థితివలెనే ప్రగతినిగోల్పోయి, నిలువనీటిస్థితికి వచ్చినవి. సాంప్రదాయికమగు ప్రబంధములకు ధార్మికగీతములకుమాత్రము బాహుళ్యమేర్పడినది. ఈలోగాఁ బాశ్చాత్యసంఘములందభివృద్ధిగల్గుచు నక్కడ వాఙ్మయమందును నవ్యభావములేర్పడి, ప్రబంధనాటకముల ప్రాభవము తగ్గి, ప్రకృతమున నాఖ్యానయుగ మేర్పడినది. వానిసంపర్కమున మనవాఙ్మయములకు నుత్తేజనముగల్గినది. ఈపరిణామము తక్కినవానికన్న (ప్రభుత్వకేంద్రమగు) కలకత్తాప్రాంతమున ముందుగ నంకురించినది. శ్రీరాజారామమోహనరాయల సాంఘికకృషి సర్వతోముఖమై వాఙ్మయరంగమునకును బ్రసరించినది. ఆయన సంస్కరణప్రచారమునకై రచించినకరపత్రములను బత్రికలను సుబోధమైన వచనశైలిలో వ్రాసెను. దేవేంద్రనాథాదులు నట్టిశైలినే తమ ధార్మికకృషికి వినియోగించిరి. ఇట్లు వచనవాఙ్మయమారంభమాయెను. కాని దానికి స్థిరత్వపటుత్వములు మంచిపదజాలమును లేకుండెను. ఈస్థితిలో బంకించంద్రు డంపుకొని, తనరచనలవలన బంగాళీవాఙ్మయము నున్నతమగు నగ్రస్థానమునకుఁదెచ్చెను. లేఖకునికిఁ బాండిత్యముండుట లాభకరము; కనుక, ఆంగ్ల మందప్పటికి వెలువడిన స్కాట్లునవలలు వగైరా వాఙ్మ

యము నతఁడు చదివెను; విజ్ఞానబోధకమగు ప్రకృతిశాస్త్రములందలి రహస్యముల నతఁడు బాగుగ గ్రహించెను; సంస్కృతమందలి మనప్రాచీన సాహిత్యమును గూడఁ బూర్తిగ నభ్యసించెను. బారిస్టరు మధుసూదన దత్తు ననుసరించి, బంకిమును మొదటఁగొన్ని యాంగ్లరచనలను బెంగాలీలోఁ బద్యకావ్యములను రచించెను. కాని యెంతయాంగ్ల ప్రవీణులైనను భారతీయులు స్వభాషమూలముననే వాఙ్మయసేవను జేయఁదగుననియు, వచనవాఙ్మయవృద్ధి ప్రస్తుతపరిస్థితి కనురూపము నావశ్యకమునని బంకిము గ్రహించి,1864 నుండి బంగాళీలో వ్యాసములు, కథలు, నవలలుమున్నగు వచనవాఙ్మయమును రచించుటకుఁదనప్రతిభను వినియోగించెను. ఆయన 14 బంగాళీనవలలను గొన్ని 'గల్ప'ములను †, ఆధునిక విజ్ఞానరహస్యములఁ దెల్పు గ్రంథములను, ప్రాచ్యపాశ్చాత్యమహాకవుల కావ్యవిమర్శలను, జీవితచరిత్రాదులను గూడ రచించి, ఇతరులకు మార్గదర్శకుఁడాయెను. బంకించంద్రుని మొదటినవల (Rajmohan's wife) రాజమోహనునిభార్య యనునది. ఇది యాంగ్లభాషలో మనోహరమగు శైలి లో నీదేశపు సాంఘికపరిస్థితులను యథాస్థితిగ వర్ణించును. ఇది రమ్యతలో వాల్టరు స్కాటుగారినవలలకుఁ దీసిపోదు. అప్పుడు కలకత్తానుండి వెలువడుచుండిన Indian Field అను వారపత్త్రికలలో నీ నవల 1864 లో ధారావాహిగఁ బ్రచురింపఁబడినది. ఇటీవల నిది కలకత్తాలోని 'మోడరన్ రివ్యూ' కార్యాలయమందుఁ బ్రత్యేకపుస్తకముగఁ బ్రకాశితమాయెను.

బంకించంద్రుఁడువ్రాసి ప్రచురించిన మొదటి బంగాళీనవల 'దుర్గేశనందిని'. ఇందలి యితివృత్తమైతిహాసికము, బెంగాలు ఒరిస్సాల 16 వ శతాబ్దిచరిత్రకు సంబంధించినది. అప్పుడు, అక్బరు మొగల్చక్రవర్తి. మహమ్మదీయసేనానియగు కుతుల్లుఖాను వంగదేశముపైన దాడిసల్పి,

---

† చమత్కృతిగల చిన్నకథలు Short stories అను పేర నిటీవల నన్నిభాషలలోను వెలువడి, వాఙ్మయమందు ముఖ్యస్థానమునను వచ్చుచున్నవి. వీనిని హిందీ బంగాళీలలో 'గల్ప' ములందురు.

యాప్రాంతమును జయించి యాక్రమించును. అప్పుడు వీరేంద్రసింహుని రాజదుర్గము శత్రులవశమగును. శతఘ్నులయెదుట హిందూవీరుల యద్భుతశౌర్యము వ్యర్థమగును; రాజు హతుఁడగును. వీరేంద్రుని గృహిణియగు విమల యసలు నిమ్నజాతీయురాలనుసంగతి రహస్యమైనది. కానియామె యాదర్శగృహిణియై, రాజ్యరక్షణకు విశేషప్రజ్ఞతోఁ గృషిచేయును; తన యుక్తివలన వీరావేశముతో నెట్లో కుతులూఖాను నంతమొందించును. ఇందు వీరరసమేగాక, కొంతవఱకు శృంగారరసమును బ్రధానమే. తిలోత్తమపైన జగత్సింహుని యవ్యాజప్రేమ కడుమనోహరముగ వర్ణింపఁబడినది. ఇందలి కథాసంఘటనములు నద్భుతములై, విచిత్రముగ నుండును. ఇందు వీరశృంగారరసముల కుచితసమన్వయము కలదు. దుర్గేశనందినియేగాక, బంకిము వ్రాసిన తక్కిన నవలలును చదువుట కత్యాకర్షకములుగ నుండును.

'నవల' అనుపేర నిప్పుడు లోక మంతటను వాడుకలోనున్న చిత్రకథాగ్రంథములు మనదేశపు మహాభాషలలో నేర్పడుటకు 'దుర్గేశనందిని'యే ప్రారంభము. దీనిప్రకాశనముతో మనదేశభాషల వాఙ్మయమందుఁ గ్రొత్తయుగమేర్పడినది; భాషాశైలిలోను నవ్యత గల్గినది. అంతవఱకు మనదేశీయగ్రంథరచనల శైలిలోఁ దఱచు రెండురకములు మాత్రముండినవి. విద్వాంసులు క్లిష్టమగు దీర్ఘసమాసములతో జటిలశైలిని వ్రాయుచుండిరి. అది వారిపాండిత్యప్రకర్షమునకుసూచకము కావచ్చునేమోగాని, సామాన్యజనుల కా రచనలు బోధపడవు. వాని నవగాహనచేసికొనుటకుఁ జాల శ్రమపడవలసియుండెను. అందలి భావములు విషయములుగూడ జనసామాన్యమునకు రుచింపవు, ఉపయోగింపవు. ఇఁక గ్రామ్యజనుల రచనలు గీతములుగనుండెను; అవి యాయాజిల్లాలవాడుకభాషలో నుండుచుఁ దగుపదజాలములేనివై, నిస్సారముగ నుండెను; అందలిభావములున్నతములుకావు; విషయములును జ్ఞానదాయకములుకావు. బంకించంద్రుఁడు మధ్యమార్గము ద్రొక్కి పరస్పరవిరుద్ధమగు నీరెంటికినిసమన్వ

యమగు క్రొత్తశైలి నేర్పఱచెను. ఆయన తనరచనలలో నాధునికభావము లకుఁదగినయుక్తమగు పదజాలమును సంస్కృతమునుండియు నవసరమైన ప్పుడుపారసీనుండియుఁగూడఁదీసికొని, వానినియథోచితముగ వంగభాష లోధారాళముగ నుపయోగించెను; కాని, ఆయన నాగరికజనులందఱికిని దెలియు సులభపదములనే వాడెను; క్లిష్టపదములను దీర్ఘసమాసము లను రాసిముతేదు. అందువలన దుర్గేశనందిని శైలి పటువై,యుజ్వలమై జ్ఞానాభివృద్ధిగల్గించుచు, కాని మధురము, సుబోధము రంజకముగఁ గూడ నుండును. ఈ నవ్యరచన పాఠకజనుల యామోదమును బడసి వెంటనే ప్రఖ్యాతికి వచ్చెను. బంకించంద్రుఁడు యువకుఁడయ్యుఁ బ్రతిభావంతుఁడు మహాకవియునని తెలిసెను. ఇది 1865 లోఁ బ్రచురింపఁబడినది. ఈనవల స్కాట్టుగారి 'ఐవన్హోను బోలునను వాడుక గలదు. కాని యిది స్కాట్టుగారి నవల కనువాదము, అనుకరణముగూడ, కాదు. ఇందలికల్పనలు, నిర్మిత ములగు పరిస్థితులు, చాలవిషయములుకూడ స్వతంత్రములే. అవి భార తీయసంఘమున కనురూపమై, ఈవాతావరణమునకుఁ దగియున్నవి.

ఇట్లు తనప్రథమయత్నము జయప్రదమగుట బంకించంద్రునికి ప్రోత్సాహమిచ్చినది. తనయుద్యోగభారము శ్రమావహముగ నున్నను, బంకించంద్రుఁడు కొంతకాలమును దీక్షతో వాఙ్మయకృషికి వినియో గించెను; తా నాయాజిల్లాలలోఁ బ్రజలలోని వివిధశాఖలతోఁ గలిసి తిరుగుచు, జనస్వభావమునుగూర్చి యాయావర్గముల యాచార ప్రవృత్తులఁగూర్చియు విశేషముగఁ దెలిసికొనెను. ఆయనుభవముసం తయు నైపుణితో బంకిము తనగ్రంథములఁ గథాకల్పనకును, స్వభావ చిత్రణమునకును వినియోగించెను. కనుక నాయన చాల నవలల రచిం చినను, ముఖ్యమగు నవలలలో నేదో విశేషమును బ్రత్యేకతయు నుం డెను. పాఠకుల కందువలన 'క్రొత్త జ్ఞానమును విశిష్టానుభవమును గల్గును.

వంగభాషలో బంకిము రెండవనవల 'కపాలకుండల'. అతఁడప్ప టికి నాలుగైదేండ్లక్రిందట 'నాగ్వాలా'లో డిప్యూటీకలెక్టరుగ నుండి

నప్పుడాప్రాంతమందు విచిత్రానుభవమునొంది, దాని నీకథలోఁ జేర్చెనని కొందఱి యభిప్రాయము. కాపాలికుల యాచారవ్యవహారములు, వారి జీవహింసాకృత్యములు, తాంత్రికపద్ధతులు నిందుఁ జిత్రితములు. ఇందు సహజముగ రౌద్రరసమునకుఁగొంతప్రాముఖ్యమేర్పడినది. ఈకథానాయిక యగు 'కపాలకుండల' మనః పరిణామమును గవి యద్భుతప్రజ్ఞతో వివరించినాఁడు. ఆబాలిక ప్రకృతిమధ్యనే పెరిగినది, సుందరమగు పరిశుద్ధ హృదయముగల్గినది, కాని ప్రకృతిలోఁ దుపానుకల్గునట్లే,ఆమె హృదయ మందును హఠాత్తుగ నుద్రేకమేర్పడినట్లును, నాగరికుల సంపర్కమున మాలిన్యముగల్గినట్లును, ఇందుఁ జిత్రితము. వంగదేశీయులలోఁ జాలమంది దుర్గాపూజకులు;కొందఱు శాక్తేయులు కాళీదేవిని గాలభైరవుని బూజింతురు. వీరిలోని కాపాలికులు దుర్గాదేవిని భీకరరౌద్రరూపిణిగ భావించి, యాదేవతతృప్తికై యభిచార హోమాదులఁగావించుచు, ధారాళముగ జంతుబలినిచ్చుచుందురు;కొన్నిచోట్ల నిగూఢముగ నరబలి నిచ్చుటగూడఁ గలుగుచుండెను. క్షుద్రదేవతల భజింపుచు,దేవతాపూజపేరిట సురాసేవఁ జేసి జీవహింసగావించి భయానకచర్యలతో బలులనిచ్చుట, ఆదిమజాతులలోను గొందఱు నిమ్నజాతీయులలోను మనప్రాంతమందుఁగలదు. ఒక్కొకప్పుడు మధ్యవర్గమువారును వైదికయజ్ఞములందు జంతుబలినిచ్చుటయు నాచరణలో నున్నది. శాక్తేయుల వివిధవామాచారములను బ్రాణిహింసలను దేవీపూజపేర జరపు దుశ్చర్యలను బంకించంద్రుఁడీకపాలకుండలలో వెల్లడిగ వివరించి, అందలి దురాచారములచే హిందూధర్మమునకును సంఘమునకును హానిగలుగుచున్నదని సూచించెను. ఆయన నవలలలో మఱియొకరీతిది కృష్ణకాంతునిమరణశాసనము.దీనిలోను బ్రత్యేకతగలదు; ఒక జమీందారుని కుటుంబపుస్థితి,ఆయన సోదరపుత్రుని కష్టసుఖములును మన హిందూకుటుంబముల యాచారవ్యవహారములవలన దఱుచు స్త్రీలలో నేర్పడు కలహములు గృహచ్ఛిద్రములును, స్వభావోక్తితో వర్ణింపఁబడినవి. ఇందు దుఃఖకరదృశ్యములు హెచ్చు. ఈయాఖ్యాయిక

యమగు క్రొత్తశైలి నేర్పఱచెను. ఆయన తనరచనలలో నాధునికభావము లకుఁదగినయుక్తమగు పదజాలమును సంస్కృతమునుండియు నవసరమైన ప్పుడుపారసీనుండియుఁగూడఁదీసికొని, వానినియథోచితముగ వంగభాష లోధారాళముగ నుపయోగించెను; కాని, ఆయన నాగరికజనులందఱికిని దెలియు సులభపదములనే వాడెను; క్లిష్టపదములను దీర్ఘసమాసము లను రాసియులేదు. అందువలన దుర్గేశనందిని శైలి పటువై, యుజ్జ్వలమై జ్ఞానాభివృద్ధిగల్గించుచు, కాని మధురము, సుబోధము రంజకముగఁ గూడ నుండును. ఈ నవ్యరచన పాఠకజనుల యామోదమును బడసి వెంటనే ప్రఖ్యాతికి వచ్చెను. బంకించంద్రుఁడు యువకుఁడయ్యుఁ బ్రతిభావంతుఁడు మహాకవియునని తెలిసెను. ఇది 1865 లోఁ బ్రచురింపఁబడినది. ఈనవల స్కాట్టుగారి 'ఐవన్హో'ను బోలునను వాడుక గలదు. కాని యిది స్కాట్టుగారి నవల కనువాదము, అనుకరణముగూడ, కాదు. ఇందలికల్పనలు, నిర్మిత ములగు పరిస్థితులు, చాలవిషయములుకూడ స్వతంత్రములే. అవి భార తీయసంఘమున కనురూపమై, ఈవాతావరణమునకుఁ దగియున్నవి.

ఇట్లు తనప్రథమయత్నము జయప్రదమగుట బంకించంద్రునికి బ్రోత్సాహమిచ్చినది. తనయుద్యోగభారము శ్రమావహముగ నున్నను, బంకించంద్రుఁడు కొంతకాలమును దీక్షతో వాఙ్మయకృషికి వినియో గించెను; తా నాయాజిల్లాలలోఁ బ్రజలలోని వివిధశాఖలతోఁ గలిసి తిరుగుచు, జనస్వభావమునుగూర్చి యాయావర్గముల యాచార ప్రవృత్తులఁగూర్చియు విశేషముగఁ దెలిసికొనెను. ఆయనుభవముఁగం తయు నైపుణితో బంకిము తనగ్రంథములఁ గథాకల్పనకును, స్వభావ చిత్రణమునకును వినియోగించెను. కనుక నాయన చాల నవలల రచిం చినను, ముఖ్యమగు నవలలలో నేదో విశేషమును బ్రత్యేకతయు నుం డెను. పాఠకుల కందువలన క్రొత్తజ్ఞానమును విశిష్టానుభవమును గల్గును.

వంగభాషలో బంకిము రెండవనవల 'కపాలకుండల'. అతఁడప్పటికి నాలుగైదేండ్లక్రిందట 'నాగ్వాలా'లో డిప్యూటీకలెక్టరుగ నుండి

నప్పుడాప్రాంతమందు విచిత్రానుభవమునొంది, దాని నీకథలోఁ జేర్చెనని కొందఱి యభిప్రాయము. కాపాలికుల యాచారవ్యవహారములు, వారి జీవహింసాకృత్యములు, తాంత్రికపద్ధతులు నిందుఁ జిత్రితములు. ఇందు సహజముగ రౌద్రరసమునకుఁగొంతప్రాముఖ్యమేర్పడినది. ఈకథానాయిక యగు 'కపాలకుండల' మనః పరిణామమును గవి యద్భుతప్రజ్ఞతో వివరించినాఁడు. ఆబాలిక ప్రకృతిమధ్యనే పెరిగినది, సుందరమగు పరిశుద్ధ హృదయముగల్గినది, కాని ప్రకృతిలోఁ దుపానుకల్గునట్లు,ఆమె హృదయమందును హఠాత్తుగ నుద్రేకమేర్పడినట్లును, నాగరికుల సంపర్కమున మాలిన్యముగల్గినట్లును, ఇందుఁ జిత్రితము. వంగదేశీయులలోఁ జాలమంది దుర్గాపూజకులు; కొందఱు శాక్తేయులు కాళీదేవిని గాలభైరవుని బూజింతురు. వీరిలోని కాపాలికులు దుర్గాదేవిని భీకరరౌద్రరూపిణిగ భావించి, యాదేవతతృప్తికై యభిచార హోమాదులఁగావించుచు, ధారాళముగ జంతుబలినిచ్చుచుందురు; కొన్నిచోట్ల నిగూఢముగ నరబలి నిచ్చుటగూడఁ గలుగుచుండెను. క్షుద్రదేవతల భజింపుచు,దేవతాపూజపేరిట సురాసేవఁ జేసి జీవహింసగావించి భయానకచర్యలతో బలులనిచ్చుట, ఆదిమజాతులలోను గొందఱు నిమ్నజాతీయులలోను మనప్రాంతమందుఁగలదు. ఒక్కొకప్పుడు మధ్యవర్గమువారును వైదికయజ్ఞములందు జంతుబలినిచ్చుటయు నాచరణలో నున్నది. శాక్తేయుల వివిధవామాచారములను బ్రాణిహింసలను దేవీపూజపేర జరపు దుశ్చర్యలను బంకించంద్రుఁ డీకపాలకుండలలో వెల్లడిగ వివరించి, అందలి దురాచారములచే హిందూధర్మమునకును సంఘమునకును హానిగలుగుచున్నదని సూచించెను. ఆయన నవలలలో మఱియొకరీతిది కృష్ణకాంతునిమరణశాసనము.దీనిలోను బ్రత్యేకతగలదు; ఒక జమీందారుని కుటుంబపుస్థితి,ఆయన సోదరపుత్రుని కష్టసుఖములును మన హిందూకుటుంబముల యాచారవ్యవహారములవలన దఱుచు స్త్రీలలో నేర్పడు కలహములు గృహచ్ఛిద్రములును, స్వభావోక్తితో వర్ణింపఁబడినవి. ఇందు దుఃఖకరదృశ్యములు హెచ్చు. ఈయాఖ్యాయిక

కేవలము శోకాంతము; ఆయనవ్రాసిన 'విషవృక్షము' గూడ చాలవఱ కట్టిదే. ఇందును, ముఖ్యపాత్త్రల యీర్ష్యాసూయాదులవలన మనోవైకల్యము సంఘపరిస్థితుల దుఃఖమును ముఖ్యపాత్త్ర కకాలమరణమును గల్పింపఁబడినది.

అప్పుడు బంకించంద్రుఁడు నవలలతోఁదృప్తినొందక నొకప్రత్యేకమాసపత్త్రికను గొన్నియేండ్లు ప్రచురించెను. ఇదియే 'వంగదర్శన్'. ఇందాయన వంగసంస్కృతాదుల సాహిత్య విమర్శ, విజ్ఞానవిషయములు, సాంఘికసమస్యలు, కథలు, ఆర్థికప్రశంసలు మున్నగు ప్రజోపయోగులగు సంగతులన్నిటిని వ్రాయుచుండెను. ఇట్టి సర్వతోముఖమగు నున్నతరీతి మాసపత్త్రిక దేశభాషలలో వెలువడుట కిదియే యారంభము. ఈయన యీపత్త్రిక నాతేండ్లాదర్శరూపముగ నడిపెను. ఈయన నవలలలో విషవృక్షము. కృష్ణకాంతునివిల్లు, రజని, చంద్రశేఖరయుఁ గొన్నికథలును 'వంగదర్శన్' లోనే మొదట వెలువడినవి.

'వంగదర్శన్' పత్త్రికాప్రచార మప్పుడు క్రమముగ హెచ్చినది. అంతవఱకు దేశభాషలందట్టి మాసపత్త్రికలులేవు. సామాన్యజనుల కుద్బోధకములైన జ్ఞానవిషయములు, భాషావిషయములు, సాంఘికవిషయములు మున్నగు జనోపయోగకరమైన సంగతులఁగూర్చి సారవంతములైన వ్యాసములతోఁబాటు కథలు, హాస్యగాథలు, నవలలును, బంకించంద్రుఁడా పత్త్రికలోఁ బ్రచురించుచుండెను; అట్టి వ్యాసములను ధీమంతులగు యువకవులచేఁగూడ వ్రాయించుచు వారికిఁ బ్రోత్సాహమిచ్చుచుండెను. 'వంగదర్శన్'లోనా యా ముఖ్యభాషలలోని గ్రంథముల విమర్శలుగూడఁ దగు నిదానముతోను న్యాయ్యముగను జ్ఞానపూరితములుగను వ్రాయఁబడుచు, ఉత్తమవాఙ్మయము వృద్ధియగుట కనుకూలముగనుండెను. ఆయన సమాలోచనలు వంగసాహిత్యములోఁ బ్రసిద్ధికెక్కినవి. ఉద్యోగధర్మమున నానాప్రాంతములందు సంచారము చేయుచున్నను దూరస్థమగు కలకత్తానుండి తన మాసపత్త్రిక

నాఁటేండ్లు నిర్విఘ్నముగ నున్న తాదర్శముపైన నడుపుటనుబట్టి, బంకించంద్రుని సాహిత్యాభిమాన మెంతగాఢమో గ్రహింపవచ్చును.

ఆకాలమందుఁ బ్రయాణముద్రణల కిప్పటిసౌకర్యములేదని గ్రహించిన, బంకించంద్రునిశ్రమ తెలియును; ఆంధ్రమాసపత్రికలలో సుప్రసిద్ధాఖ్యానకుఁడగు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు లోగడఁ గొన్ని యేండ్లు నడిపిన 'మనోరమ' పత్రికకు 'వంగదర్శన్'తోఁ గొన్ని విషయములందుఁ బోలిక కన్పట్టును. ఈపత్రికలోను, తన నవలలలో నప్పుడప్పుడు బంకిము పద్యములను గీతములను గూడ, వ్రాయుచుండెను.

ఇంతలో నుద్యోగపుఁ గార్యభారము హెచ్చినందున, తీఱిక చాలక, బంకిము 'వంగదర్శన' సంచాలనము తాను మానుకొని యితరుల కొప్పగించెను. ఆరంభమై సుమారు డెబ్బదియేండ్లయినను, ఈ 'వంగదర్శన్' నేఁటివఱకు నవిచ్ఛిన్నముగ నడుపఁబడుచు, ఈకవిచంద్రుని కీర్తిస్తంభముగ నేఁటికిని విలసిల్లుచుండుట ముదావహము. ఆయన తరువాత వ్రాసిన 'రాజసింహ్, దేవీచౌధురాణి, ఆనందమఠ్, సీతారామ్' కూడఁ బ్రౌఢభావములుగల్గి, మనోహరములగుటయేగాక, సంఘము నుద్ధరించుటకుఁ బాఠకులఁ బ్రోత్సహించునవిగ నున్నవి.

తుది సంవత్సరములందాయన సనాతన హిందూధర్మపు నిజతత్త్వమును విశదపఱుచుటకు, మతముపేరిట సంఘములోఁ బ్రవేశించిన, మాలిన్యమును దొలగించుటకేగాక, శుద్ధ హిందూమతాచారములను బ్రచారము చేయుటకును శ్రద్ధతోఁ గృషిచేసెను. అందుకుఁ గొన్ని గ్రంథముల వ్రాసెను. సనాతనధర్మపు మూలసూత్రములను పఱల జనులలో వ్యాపింపఁజేయుటకుఁ గొంతకాలమాయన 'ప్రచార్' అను పత్రికనుగూడ నడిపెను; ధార్మికకృషికే తుదిజీవితమును వినియోగించెను.

పైనఁజెప్పిన బంకించంద్రుని నవలలు కథలుగూడ స్వకపోలకల్పితములే. (ఇందైదుకథలు చారిత్రకములు. ఆఱునవలలు సాంఘికములు. తక్కినవి మన కుటుంబపరిస్థితుల వివరించునవి.) 'రజని' యను నవల

మాత్ర మప్పటి మనవైస్రాయి యగు లిట్టనుప్రభువుగారి Last Days of Pompei అను నింగ్లీషునవల కనువాదము. ఇది కరుణ రసయుతము. ఇందలి నాయికయగు 'రజని' యొకయంధబాలిక; ఆమె పవిత్రప్రేమయుఁ గష్టసహనమును బాఠకులసానుభూతి నాకర్షించును.

ఆయన నవలలలోనెల్ల దేశమంతట నెక్కువప్రసిద్ధి 'ఆనందమఠ్'కు వచ్చినది. దీనికథయుఁ గొంతవఱకైతిహాసికము. వంగరాష్ట్రమునైదాఱు శతాబ్దములు పఠానుముస్లింరాజులు పాలించిరి. వారిలోఁ గొందఱి నిరంకుశపాలనమువలన జనులకు బాధగల్గుచుండినది. అప్పటి కక్కడ ముస్లిమ్ మతవ్యాప్తి హెచ్చినది. 18 వ శతాబ్దిలో హిందువులలో గొందఱి కానిరంకుశపాలనమును బ్రతిఘటించి, ప్రజాసామాన్యములో స్వాతంత్ర్యభావ ముజ్వలింపఁజేయుట కుత్సాహము కలిగినది. ముఖ్యముగఁ గొందఱు సన్యాసులు జాతీయభావమును జనులలో వ్యాపింపఁ జేసిరి; ఆ సన్యాసు లప్పుడొకవిప్లవమును లేవఁదీసి, మొదటఁగొంత జయ మొందినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. ఈకథాఘట్టమే 'ఆనంద మఠ్'లోని ప్రధానేతివృత్తము. సాధారణముగ సన్యాసు లాధ్యాత్మిక విషయములకే తమ జీవితమును వినియోగింతురు. కాని చాలమంది ప్రస్తుతకాలపుసన్యాసు లాధ్యాత్మికజీవితముపేర నలసులై వ్యర్థముగఁ గాల క్షేపము చేయుటయు, తాము ధార్మికాభివృద్ధి నొందకపోవుటయు, వారు సంఘమున కంతటికిని భారమగుటయు, విచారకరము కాని యనుభవసిద్ధము. పూర్వము వ్యాసవసిష్ఠవిశ్వామిత్రాదిఋషులేగాక,బుద్ధశంకరరామానుజాదిసన్యాసులును దమజీవితమంతయును లోకోపయోగమునకై వినియోగించిరి. తరువాత విజ్ఞానేశ్వరుఁడు మాధవుఁడు మున్నగువారును దమతమ రాజులద్వారా సంఘమును బాగుచేసి, ప్రజాక్షేమముఁ గల్గించుటకు నిరంతరకృషిఁజేయుచుండిరి. భగవద్గీతలోఁగూడ స్వలాభముకొఱకు చేయుపనులగు కామ్యకర్మలువిడుచుటే సన్యాసమనియు, 'త్యాగ' మన

గాఁ గర్మఫలాపేక్ష లేకుండు చేయుననియు విశదీకృతము.† సన్న్యాసాశ్రమము ప్రజాక్షేమమునకై కృషిచేయుట కుద్దేశింపఁబడినదను భావమును బంకించంద్రుఁ డీనవలలో నతిసుందరముగ సూచించినాఁడు; ఇందలి 'సంతాను'లను సన్న్యాసులబృందము 'సత్రేభోజనం మఠేనిద్రా'తోఁ దృప్తి నొందక, మాతృభూమి నుద్ధరించుటకును స్వధర్మరక్షణకును దమ శక్తులవినియోగించెను. ఆధ్యాత్మికసాంఘికవృద్ధి గల్గుటకు ముందు రాజకీయస్వాతంత్ర్యము కావలెననియు, కనుక నాధ్యాత్మికనాయకులు కొంత వఱకైనను జాతీయాభివృద్ధినిగూర్చి కృషిచేయవలెననికూడ బంకించంద్రుని యభిప్రాయ మీ నవలలోఁ గనపడును. 'ఆనందమఠ'పు సన్న్యాసులు నిరంకుశపాలకులపైనఁ దిరుగఁబడి, జాతీయోద్రేకముఁ గల్గించి, దేశోద్ధరణమునకై విజృంభించిరి; వీరప్పుడు వీరావేశముతో రణరంగమునకుఁబోవుచు "సుజలాంసుఫలాం, మలయజశీతలాం సస్యశ్యామలాంవరదాం...... మాతరం వందే" అనునద్భుతగీతమును బాడుచుండిరని యిందు వర్ణింపఁబడినది. మహాకవి యీ యాఖ్యాయికలో నిట్లు జొప్పించిన విచిత్రగీతమే 'వందేమాతర'మను పేర మన జాతీయగీతముగఁ బ్రసిద్ధికెక్కి భారతదేశమంతటను వ్యాపించినది. ఈనవల వీరరసప్రధానము.

బంకించంద్రునినవలల కథారచనయాకర్షకము, వివిధరసభరితము, ఆనందకరమునేగాక, విజ్ఞానదము, నీతిబోధకముగఁగూడ నుండును. ఈ విషయములందాయన రచనలు స్కాటుమున్నగు జగత్ప్రసిద్ధులగు కవుల గ్రంథములకుఁ దీసిపోవు. ఇట్టి యాఖ్యాయికలనేగాక, ఆయన చిన్నకథలనుగూడ వ్రాసెను. అవియుఁ జాల రమ్యములై, శక్తియుతములై, నీతిబోధకములుగఁగూడ నుండును. వీనిలో 'ఇందిర' అప్పటికాప్రాంతములో వ్యాపించిన యశాంతిని, బందిపోటులవలని బాధలను, ఘోషాపద్ధతివలన స్త్రీలకుఁగల్గు కష్టములవగ్గెరాలను జిత్రించును. బంకించంద్రుఁడు సూక్ష్మ

---

† కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయోవిదుః। సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥ భగవద్గీత. అ. 18. శ్లో. 2.

బుద్ధితోను జాగ్రత్తతోను సంఘస్థితిని జనుల ప్రవృత్తిని గమనించి, తన యనుభవములను భావములను, రంజకముగ వివరించియున్నాఁడు. ఆయాపరిస్థితులం దాయావ్యక్తుల మనోభావములలోను ప్రవర్తనలోను గలుగుపరిణామములును, అన్ఖ్యతముగను క్రమాగతముగను వివరింపఁ బడినవి. అక్కడక్కడఁజరుపుధార్మికసాంఘికసమస్యల చర్చగూడ నానంద కరముగ నుండును.

కథానకరచనలలోనేగాక మరికొన్ని విషయములలోను బంకిం చంద్రుఁడుక్రొత్తమార్గములఁద్రొక్కి భావిలేఖకులకు దారిఁజూపినాఁడు. తన మాసపత్త్రికలలోను విడిగను ఖగోళశాస్త్రము, ప్రకృతిశాస్త్రము, కృషి విజ్ఞానము, జంతుశాస్త్రము మొదలగు నీనాటి యావిష్కరణములవలనఁ దెలిసిన వైజ్ఞానికవిశేషములఁగూర్చి జ్ఞానబోధకమై సామాన్యులకును గ్రాహ్యమగురీతిని జాలనిబంధముల నాయనవ్రాసెను. ఆయన 'విజ్ఞాన రహస్య' మిట్టిగ్రంథమే. కాళిదాసు భవభూతి మొదలగు సంస్కృత కవీశ్వరులఁగూర్చి పాణిన్యాదులఁగూర్చియు మన ప్రాచీనదర్శనశాస్త్రముల విషయముల (గూర్చియు) వంటానుగూర్చి గోల్డుస్టక్కరు మాక్సుముల్లరు మున్నగు పాశ్చాత్యవిద్వాంసుల పరిశోధనలసంగతుల నాధునికవిమర్శ పద్ధతిని సమీకరించి యాయన యమూల్యములగు చాల వ్యాసములు జనసామాన్యమునకుఁ దెలియునట్లు రుచికరముగ వ్రాసెనాఁడు.

ఆయన కొన్ని చక్కని ప్రహసనములనుగూడ రచించెను. ఇవియు కేవలము వినోదకరములేకాక, ఏదో నీతిని సూచించుట కుద్దేశింపఁబడినవే. ఇందు ముఖ్యముగఁ జేర్పఁదగినది వ్యాఘ్రాచార్యబృహల్లాంగూల. ఒక మహాటవిలోఁ బెద్దపులులన్నియు నొకమహాసభఁ జేసినట్లును, అందొక శార్దూలమహాశయుఁడు మానవజాతిస్వరూపస్వభావములను నాచార వ్యవహారములనుగూర్చి విమర్శతోస్వానుభవమునుదెల్పుచు మహోపన్యాసము గావించినట్లును, ఇందువ్రాయఁబడినది. నరుల భోజనపద్ధతులు వివాహసంస్థ మొదలగు కొన్ని చర్చింపఁబడి మనుష్యులు కేవల పశ్జాను

లు పిఱికివారు, హీనసంస్కృతిగలవారు 'పశుస్వభావము' గలవారు నని, మానవజాతిని వ్యాఘ్రజాతి కుపకరించుటకే యీశ్వరుడు సృజించెనని, వ్యాఘ్రములే సృష్టిలోనుత్తమజాతి లోనివి కనుక నరజాతికిఁ దమమంచి సంస్కృతిగల్గించు బాధ్యతనిర్వర్తించుటకు వ్యాఘ్రమహాసభలో దీర్మానించఁబడి, యాశార్దూలప్రతినిధులందరును తోకల ఝాడింపుతో హర్షము దెల్పి యామోదించి, ఇంతలో నొకలేళ్ళమందనుజూచి పరుగెత్తినవి. ఇంతవఱకు నక్కడిచెట్లపై నక్కియుండి గమనించుచుండిన వానరోత్తములంతటఁ గ్రిందికిదూకి యాయుపన్యాసములోని సిద్ధాంతముల సవ్యతను గూర్చి తమ దృక్పథముతోఁ జర్చించును; ఇది మఱియు వినోదకరము. శ్వేతవర్ణులై హింసాతత్పరులగు పాశ్చాత్యులు ప్రపంచమంతయుఁ దమ లాభముకొఱకేర్పడి నట్లెంచుచు, భారతీయులుమున్నగు ప్రాచ్యజాతులను 'నాగరికులు'గఁ జేయవలెననియు, నందుకే వారిదేశములు వశపర్చుకొని వారిని దమ కధీనులుగనే యుంచుట యీశ్వరోద్దేశమని భావించుట, యందుఁ గ్రైస్తవమతాచార్యులును బ్రోత్సాహమొసఁగుట, ఇందు స్ఫురించునని తోచును. కథయు నిట్టిదే. 'బాబు' అను విచిత్ర జాతి యెట్టిదో తెల్పుమని జనమేజయుఁ డడుగఁగా, నీకాలపుఁ గొందఱు వంగయువకులలో నేర్పడిన డంబము, ఆడంబరము,విచిత్రవేషము,విజాతీయ తత్త్వమును వైశంపాయనుఁడు వివరించినట్లువినోదకరముగ వ్రాయఁబడినది. ఇందు వంగీయమహింపుత్రులలో నుండులోపముల నాతఁడు ధైర్యముతో వెలిబుచ్చి ఖండించినాఁడు.

ఇట్టి వ్యాసముల సంపుటియొకటి 'లోకరహస్య' అనుపేరఁ బ్రచురింపఁబడినది. 'కమలాకాంత' అను నవలలోను బంకించంద్రుఁ డాధునిక సంస్థలలో నేర్పడియున్న లోపములను హాస్యరసమిళితముగ వ్యక్తము జేసినాఁడు. ఈకథలో ముఖ్యపాత్ర యొక 'నల్లమందుభాయి'. ఈమతభ్రష్టుని చేష్టలు సంభాషణలు చాల వినోదకరములు. కాని, కొన్నిసాంఘికాచారములగూర్చియు, కోర్టులుసర్కారా సంస్థలపద్ధతులఁగూర్చియు, ఆర్థిక

సిద్ధాంతములఁగూర్చియు, నాతఁడను మాటలలోఁ జాల సత్యమున్నదని గూడఁ జదువరులకుఁ దోచుచుండును. 'చతుర్వేదిగారి చిట్టా'యు హాస్య భరితమే.

తన జీవితమును సర్కారునౌకరిలోనే గడపినను, బంకించంద్రుఁడు గొప్పదేశభక్తుఁడు, స్వాతంత్ర్యాభిలాషి; ఆయన భారతీయుల నైకమత్యమవ సరమని తనగ్రంథములలోఁ జాలచోట్ల దృఢముగ సూచించినాఁడు. ఆయన గ్రంథములలోని 'ఆనందమఠ్'లో జాతీయభావమే ముఖ్యవిష యము. ఈపుస్తకమును ప్రభుత్వమువారు చాలకాలము నిషేధించిరి. ఆయన నవలలకథలనే గిరీశచంద్రఘోషు మున్నగువారు నాటకము లుగను వ్రాసి ప్రచురించిరి. కాని 'ఆనందమఠ' నాటకము నేటికిని నిషిద్ధ మేనఁట.

'అంగరేజస్తోత్ర'మనున దొక దండకము. ఆంగ్లేయులభజించుట కనుపేర శ్వేతవర్ణుల లోటుపాటులను భారతీయుల భావదాస్యము పరాధీనబుద్ధియు హాస్యరసపూరితముగ నిందు వర్ణింపఁబడినవి. 'గర్దభ' కూడ నిట్టిదే. రాజకీయసాంఘికాదివిషయములఁగూర్చి బంకించంద్రునికి ప్రత్యేకాభిప్రాయములు గలవు. జాతీయస్వాతంత్ర్యమం దుత్సాహము నాయన 'ఆనందమఠ'లోనేగాక, ఇంకను జాలరచనలలోను, హాస్యకథ లందునుగూడ వెలిపుచ్చెను. తాను ప్రభుత్వమువారి యుద్యోగియై 'శాంతిభద్రత' రక్షణకు బాధ్యుఁడై యుండియు, నట్టి గ్రంథములరచించు టనుబట్టి, ఈవిషయము ప్రజల కెంత ముఖ్యమని యాయన యభిప్రాయ మో పాఠకు లూహించుకొనవచ్చును. మతము పేరుపెట్టి చాలమంది యవలంబించు దురాచారములు మన సంఘక్షేమమునకు హానికరము లనియు, వానికి మతాధార మారోపించుట సనాతనహిందూమతమున కన్యాయముచేయుటయనియు, బంకిము తనరచనలలో సూచించినాఁడు. సంఘమందలి పాత్త్రలద్వారా వెలిపుచ్చినాఁడు. ఇట్లుమాతృభాషావాఙ్మ యమందుఁ గ్రొత్తరీతి గ్రంథముల రచించి భావిసాహిత్యవృద్ధికిఁ బునాది

వేయుటలోను, సంఘలోపముల వెలిబుచ్చి సంస్కరింప యత్నించుటలో
ను, ఆయనకును మన శ్రీ వీరేశలింగం పంతులుగారికిని గొంతవఱకుఁ
బోలిక కలదు. కాని, ఆయన రచనలు కేవలము సౌమ్యములు; వానిలో
నెక్కడను సనాతనవాదులు తీవ్రసంస్కర్తలు మున్నగు నాయాకక్ష్యల
వారిపైన ద్వేషమును దూషణయుఁ గన్పడవు. ఆయన క్రమసంస్కరణ
శీలుఁడు, సాంఘిక విషయములం దుదారుఁడు; కాని, అప్పటి బ్రహ్మ
సమాజము ననుసరింపలేదు. వంగదేశమం దప్పటికి శ్రీ రాజారామ
మోహనరాయలు మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు తమసంస్కరణసిద్ధాం
తముల బోధించిరి. కేశవచంద్రసేను తన నవ్యసిద్ధాంతములఁ బ్రచారము
చేయుచుండెను. ప్రాచీనహిందూమతములోను, ఆచారములలోను, కాలక్ర
మమునఁ గల్గిన దుష్పరిణామములఁ బోగొట్టి పరిశుద్ధ స్థితికిఁ దేవలసినది;
అట్లు హిందూధార్మికసంస్థల సంస్కరించి యుద్ధరింపఁ దగునే గాని
వాని నసలే తొలఁగించుట క్షేమకరము కాదని యాయనభావము. ఆయన
వ్రాసిన సాంఘికాధ్యాత్మిక వ్యాసములందు హిందూమతము పైన
గాఢాభిమానము వ్యక్తమగుచుండును. ఆకాలమందు వంగరాష్ట్రములో
క్రైస్తవమతప్రభావము విద్యాధికులలో వ్యాపించుచుండెను. పాశ్చా
త్యప్రచారకులతో సంపర్కమువలనను కేవలహేతువాదులనిరీశ్వరసిద్ధాంత
బోధవలనను శ్రీకృష్ణాదుల యవతారము లబద్ధములనియు, అట్టివారు
జనింపనేలేదనియు, అప్పటి నవ్యయువకులలో నొకభావ మేర్పడినది.
నిర్గుణబ్రహ్మమే సేవ్యమను భావమునఁ గొందఱికి సగుణబ్రహ్మసేవపైన నిర
సనభావము గల్గినది. తగు యాలంబనము లేక కొందఱుయువకులు చెడి
బ్రాందివగైరా దురభ్యాసములకు లోనైరి. పౌరాణికహిందూమతము
నసలే త్రోసివేసి నిర్గుణబ్రహ్మముపైన సామాన్యజనులమనస్సును లగ్నము
చేయఁబూనుట ఫలప్రదము కాదని బంకిము నిశ్చయించెను. ఆయన హిం
దూమతపు శుద్ధసిద్ధాంతముల ప్రచారమునకై పత్రిక నడుపుటే గాక, ఈ
సమస్యలను సహేతుకముగఁ జర్చించుచుఁ గొన్నిగ్రంథముల వ్రాసెను.

వీనిలో 'ధర్మతత్త్వ'లో హిందూమతపు ముఖ్యసూత్రములను ధార్మికభావములను విపులముగఁ జర్చించి విమర్శించెను. దీనిలోను 'శ్రీకృష్ణచరిత్ర' అను సద్గ్రంథములోను బంకిము నిర్గుణబ్రహ్మసేవకును భాగవతసిద్ధాంతములోని యవతారపూజకును మధ్య సమన్వయముఁ జేయుచు, పరిశోధనఁ జేసెను. భాగవతాదులందు శ్రీకృష్ణుని కారోపించిన కొన్ని జారచోరత్వాదికృత్యముల వర్ణనలు నిజముగాఁ బ్రక్షిప్తములనియు శ్రీకృష్ణుఁడు నిజముగఁ జారిత్రకపురుషుఁడనియు నతఁడు బోధించెను. బ్రహ్మానంద కేశవచంద్రుఁడు నిట్టి భావములనే దెల్పెను. గౌరగోవిందరాయులు వంగభాషలో 'యోగాచార్య శ్రీకృష్ణ' అను ప్రసిద్ధగ్రంథములో నీసిద్ధాంతమును సమర్థించెరు. భగవదవతారము లనఁబడువారు చారిత్రకులగు నుత్తమపురుషులే యని బంకించంద్రుఁడు చెప్పిన సిద్ధాంతమును బ్రహ్మసమాజపుఁ బ్రసిద్ధప్రచారకులగు శ్రీ ప్రతాపచంద్ర మజుందారుగారు యేసుక్రీస్తున కన్వయించుచు, The Oriental Christ లో విపులము చేసినారు. హిందూమతతత్త్వమునుగూర్చి శ్రీరాజా రామమోహనునివలె బంకించంద్రుఁడును బ్రిటిషు మిషనరీలతో దీర్ఘచర్చజరిపి, వాదములో హిందూమతపు సిద్ధాంతములను సదాచారములను సమర్థించుచు, మిషనరీల యపవాదములను సహేతుకముగ నిర్మూలించెను. ఈసందర్భమున Origin of Hindu Festivals, Buddhism and Samkhya Philosophy, 'Study of Hindu Philosophy' Vedic Literature, అనువానిని ముఖ్యముగఁ బేర్కొనవచ్చును. హిందూమతపు సిద్ధాంతముల ముఖ్యసూత్రములేవో, హిందువుల యాచారములలో మంచివేవో చెడ్డవేవో బాలురకును సులభముగఁ దెలియుటకు, హేతుయుతమగు చర్చతో నాయన బంగాళీలో 'అనుశీలన్' అను గ్రంథమువ్రాసెను. ఇది ప్రశ్నోత్తరరూపమైనది. ఇట్లు గాఢహిందూమతాభిమానియైనను, బంకించంద్రుఁడు కొందఱు సనాతనులవలె పరమతద్వేషి కాఁడు; క్రైస్తవమతమునుగాని మస్లిం మతమునుగాని బంకిము యెన్నఁడును దూషింపలేదు.

తన నవల లన్నిటిలోను బంకించంద్రుఁడు మనోహరవనములు, కొండలు, నదులు, సస్యములు మున్నగు ప్రకృతిదృశ్యములను సుందరముగను విస్పష్టముగను రక్తితోఁ జిత్రించెను. ఆయా యితివృత్తసందర్భమున, ఆయా పాత్రల మనోభావములందు, ఆయా భౌతికపరిస్థితి వలన పరిణామము గల్గుటను, అనగా నైసర్గికదృశ్యమానసికవికాసములకును సమన్వయమేర్పడుటను, బంకించంద్రుఁడు తన యాఖ్యాయికలన్నిటిలోను నద్భుతశక్తితో వివరించెను. ఇట్టిచిత్రణమం దాయన ప్రజ్ఞ యమోఘము. నరజాతి శాస్త్రముఁగూర్చియు, పురాతత్వమునుగూర్చియు, ఆయన పరిశోధనయుతమగు కొన్ని వ్యాసముల వ్రాసెను. వంగీయు లార్యభాషికులైనను,శుద్ధార్యులనుట తప్పు. వా రార్య ద్రావిడ మంగోలియనుజాతుల మిశ్రితులు, అని యీ సత్యప్రియుఁడు వంగీయుల కప్రియమగు యథార్థవచనముల నిందుఁ దెల్పెను.

బంకించంద్రుఁడు కేవల మాదర్శవాది (idealist) యు నట్టి యథాస్థితివాదియుఁగాక, ఈ రెండుసిద్ధాంతములను దన గ్రంథములందు సందర్భోచితముగ నుపయోగించెను. కనుక, ఈయన సమన్వయవాది యని చెప్పనొప్పును. బంకించంద్రుని 'ఉపన్యాససామ్రాట్' బిరుదమును హిందీ వాఙ్మయప్రపంచమున దరిమిలా నీ శతాబ్దిలో బొందిన 'ప్రేమచంద' నీ పద్ధతినే యనుసరించెను. వంగవచనవాఙ్మయములో నీ శతాబ్దిలో నిద్దఱు మహాకవు లవతరించినారు. వీరిద్దఱును బంకించంద్రుని శిష్యులమని చెప్పుకొనినారు. వీరిలో శ్రీ రవీంద్రనాథఠాకూరు కేవల మాదర్శవాది; శరచ్చంద్రచటర్జీ కేవలము యథాస్థితివాది. ఇద్దఱి రచనలును వంగవాఙ్మయమున కింకను విశేష ఖ్యాతిని సంపాదించినవి. ఇట్టి శిష్యులఁదయారుచేయుటలోను బంకిము ఘనతమధికమగుచున్నది; 'స్థానే స్వశిష్యనివహై ర్వినియుజ్యమానా విద్యా గురుంహి గుణవత్తరమాతనోతి'గదా. †

---

† ముద్రారాక్షః అనర్ఘరాఘవం.

బంకించంద్రుని శైలిలో విశిష్టతగలదు. 19 వ శతాబ్ది యారంభముకు వంగభాష చాల దీనస్థితిలో నుండినది. దాని ప్రాచీనవాఙ్మయము మిక్కిలి స్వల్పము, హీనము. హిందీ, అఱవము, ఆంధ్రములం దప్పటికున్న దానితో వంగసాహిత్యము నెంతమాత్రమును బోల్ప వీలులేదు. 16 వ శతాబ్దివఱకు బెంగాలీకి ప్రత్యేకభాష యను గణనయేలేదు. బంకించంద్రుఁడు సభ్యజాతి కవసరమగు తత్త్వవిజ్ఞానాది వివిధవిషయములఁగూర్చి సామాన్యజనులకు జ్ఞానోత్సాహములఁ గల్గించుచు వ్యాసములను, నిబంధనలను, ఆఖ్యానములను వ్రాసి నవ్యవాఙ్మయము నిర్మించెను. అందుకు వలయు భావములను జాలవఱకు నాంగ్లసంస్కృత వాఙ్మయములనుండి తీసికొనెను. ఇట్లే భాష పేలవముఁగ నుండక యుజ్జ్వలముగ నుండుటకును, వర్ణనలకు రమ్యతగల్గుటకును, శైలికి పటుత్వముండుటకును, ఆయన తన నవలలలోను, చిన్ని కథలలోనుగూడ సంస్కృతాదులనుండి మంచి పదజాలమును హెచ్చుగ నుపయోగించెను. ఆయనది కదళీపాకము. దర్శన విజ్ఞానాది శాస్త్రీయవిషయములఁగూర్చి మన మాతృభాషఁలో వ్రాయుటకుఁ దగిన పదజాలము లేదని యెంచి, చాలమంది మన భాషయందాధునికభావములఁ దెల్పుట కర్హ్యముకాదని, కనుక, ఆంగ్లభాషయే మన దేశమంతటికి సాహితికభాషగను వ్యవహారభాషగను నుండవలెనని నవనాగరికులగు యువకులు తలఁచుచుండిరి. బంకించంద్రుఁడు సంస్కృతమందు షడ్దర్శనములను వైద్యాదిగ్రంథములను, ఆయా శాస్త్రీయగ్రంథములనుగూడఁ జదివి యుండెను. వీనిలోనున్న సమృద్ధమగు పదజాలపుసహాయముతో బంకించంద్రుఁడు వంగభాషలో ననేక శాస్త్రీయవిషయములఁగూర్చి చక్కని సుబోధములగు వ్యాసములను వైజ్ఞానికగ్రంథములనుగూడ వ్రాసెను.

ఆంగ్లభాషాముగ్ధులగు నీ నవనాగరికుల భావము వట్టిభ్రమయనియు, తగుపూనికయు భాషాజ్ఞానము నున్నచో పారిభాషికపదములఁ గూర్చి కష్టముండదనియు, పదములవిషయమున సంస్కృతభాష యొక

మహాఖనియనియు, బంకించంద్రుఁడు నిదర్శనయుతముగ నాచరణద్వారా రుజువుచేసెను. ఆయన చాలవఱకు సులభములగు సంస్కృతపదములనే శాస్త్రీయభావములకు వాడినందున, అట్టి గ్రంథములను హిందీ మున్నగు తక్కిన మన దేశభాషలలోని కనువదించుటకును, అట్టి శాస్త్రీయగ్రంథములను మనము స్వతంత్రముగ రచించుకొనుటకును గొంత సౌకర్య మేర్పడినది. చాలవఱ కాయన గ్రంథములు మన తక్కిన భాషలలోనికిఁ దర్జుమాలైనవి. ఇందుఁ బారిభాషికపదములలోఁ గొంతవఱకు (ముఖ్యముగ ఉత్తరహిందూదేశపు భాషలలో) సమత్వ మేర్పడినది. ఈయను వాదగ్రంథములవలన మన దేశభాషలలోఁ గొంతవఱకు భావసమన్వయమును గల్గినది. తరువాతఁ జాలమంది యీయనశైలినే యవలంబించిరి. సంస్కృతపదముల విరివిగ వాడు సంప్రదాయ మాంధ్రప్రబంధములలో నన్నయనాటినుండియు నున్నది.

బంకించంద్రుని శైలి తెలియుటకై, మచ్చుకు 'వ్యాఘ్రాచార్య బృహల్లాంగూల'లోని మొదటి వాక్యములీ క్రింద నీయఁబడినవి. "ఏకదా సుందరవనమధ్యే, వ్యాఘ్రదిగేర్ మహాసభా సమవేతహఇయాఛిల్. నిబిడవనమధ్యే ప్రశస్తభూమి ఖండే భీమాకృతి బహుతర వ్యాఘ్రులాంగూల భరితకరియా, దంష్ట్రాప్రభాయ్ ఆరణ్యప్రదేశ ఆలోకమయ కరియా, సారిసారి ఉపవేశనకరియాఛిల్. సకలే ఏకమత హఇయా అమితోదరనామే ఏక అతిప్రాచీన వ్యాఘ్రకే సభాపతి కరిలేన్. అమితోదర మహాశయ్ లాంగూలాసనగ్రహణపూర్వక సభాకార్య ఆరంభకరిలేన్."

బంకించంద్రుని చాల నవలలును, కొన్ని చిన్ని కథలును ఇంగ్లీషులోని కనువదింపఁబడి,ఆంగ్లవిద్వాంసులచే శ్లాఘింపఁబడినవి. సుప్రసిద్ధమగు బ్రిటిషుపత్రికలు బంకించంద్రుని కథానిర్మాణప్రతిభను స్వభావచిత్రణప్రజ్ఞను వర్ణననైపుణిని శైలిని గొనియాడినవి. ఈయన నవలలలోఁ గొన్ని జర్మనుభాషలోనికిని తర్జుమా యైనవఁట. దాదాపు బంకించంద్రుని వివిధరచన లన్నియు హిందీలోని కనువదింపఁబడినవి. ఈ రెండు

భాషలకు సన్నిహితసంబంధమున్నది. కనుక, ఈ యనువాదములందు బంకించంద్రుని శైలిమాధుర్యములు పోకుండ నిల్చినవి. ఈ పుస్తకములు హిందీ వచనశైలిలో నద్భుతమగు మార్పునకుఁ గారణమైనవి. ఆయన నవలలలో, ఆనందమఠ, దేవీ చౌధురాణీ, కపాలకుండల, కృష్ణకాంతుని మరణశాసనము మొదలగునవి ముఖ్యమగు మన దేశభాషలన్నిటిలోని కిని తర్జుమాలైనవి. వీనివలన మన దేశభాషలన్నిటిలోను, ఆఖ్యాయికలఁ జదువుటలో జనులకుఁగుతూహలమును, అట్టి రంజకమగు స్వతంత్రగ్రంథములరచనయందాసక్తియు నేర్పడి, అన్ని దేశభాషలయందు వచనవాఙ్మయముకు గొప్ప ప్రోత్సాహముగల్గినది. ఈ రీతిగా, బంకించంద్రుని రచనలు ప్రత్యక్షముగ వంగభాషలోనేగాక, పరోక్షముగ మన దేశభాషలన్నిటిలోను నవ్యయుగమున కారంభకములైనవి. మఱియు స్వయముగఁ జక్కని వాఙ్మయము నిర్మించుటేగాక, ఉద్యోగులు, అనుద్యోగులు నగు యువకులఁ బ్రోత్సహించి, వారిని సాహిత్యసేవాపరులఁ జేయుటయు నాతని ఘనతకు నిదర్శనము.

అప్పు డాంగ్లభాషాపండితులైన మన దేశీయులు మాతృభాషను దృణీకరించి నిరసించుచుండిరి. బంకించంద్రుఁ డట్టి వ్యామోహము తొలగించి వారు మాతృభాషను సేవించి వృద్ధిచేయుటకు బాధ్యులని బోధించి యుత్సాహ పఱిచెను.

బంకించంద్రుఁడు జనించి 1938 సం॥ జూన్ నెలకు నూఱేండ్లయినందున, అప్పుడు, అందుల శతవార్షికోత్సవము వంగరాష్ట్రమందేగాక మఱికొన్నిచోట్లను జరుపఁబడినది. అప్పుడు రవీంద్రనాథుఁడు మున్నగు సాహిత్యనిర్మాతలు విమర్శకులు బంకిము ఘనతను ప్రత్యేకతను వివరించిరి; బంకిము గంభీరుఁడు, అభిజాతుఁడు; ఏకాకిగ నున్నట్లుండెను; కాని, ఆయన యెప్పుడును దీనులయెడఁ గరుణామయుఁడై వారి నుద్ధరింప యత్నించుచుండెను. ఆయనను వంగీయులు 'సాహిత్య సమ్రాట్' అని పేరిడిరి. సంఘము నుద్ధరించుటే యాయన ముఖ్యోద్దేశము. భారతదేశపుఁ బూర్వా

ధిక్యము నుగ్గడించుచు, మాతృభూమి కా యౌన్నత్యము మరల సంపాదించు బాధ్యత మనపై నున్నదని, ఆయన తన రచనలలో సూచించెను.

ప్రతి ప్రాంతపు వాఙ్మయము నప్పటి యాసంఘపుస్థితికిఁ బ్రతిబింబ మందురు. ప్రస్తుతము కొందఱి కథలు వగైరా రచనలలో నశ్లీలతయు, ఉచ్ఛృంఖలత్వమును, ఉద్రిక్తతయు విపరీతవర్తనమును గాన్పించును. ఇవి సంఘములోని కొందఱి యథాస్థితినే తెల్పుననియు, తమ లేఖలోని యట్టి వృత్తాంతములు లోకములో నున్నవి గనుక యథాస్థితివాదులు (realists) అయిన తాముట్లు వ్రాయుచున్నామనియు, ఈలేఖకులుసమర్థించుచు, ఇందుకు బంకిమును, శిష్యుఁడైన శరచ్చంద్రుని, ప్రమాణముగఁ జెప్పుటకలరు. బంకిముశరచ్చంద్రుఁడు 'విషవృక్ష' 'చరిత్రహీన' మున్నగు బడి కొన్నినవలలలో సంఘాచారములకు భిన్నముగ వర్తించి భ్రష్టులని యెంచదగువారికథల వివరించిన సంగతి నిజమే కాని, సంఘమందలి కొన్ని యాచారములవలనఁ గలుగు నన్యాయముల వెల్లడిచేసి సంస్కరణాభిలాషఁ గల్గించుటకును, దైవదుర్విపాకమున భ్రష్టులైనవారికిని దయాదాక్షిణ్యాదులును మానవత్వము నుండవచ్చును. కనుక, అట్టి గుణములఁ బ్రోత్సహించి, పతితులనుగూడ నుద్ధరించుటకే యత్నింపవలెను గాని బహిష్కరించి యణచివేయుట యన్యాయమనియునే వారు తమ రచనలలో సూచించిరి; అంతేగాని దుర్నీతిని బ్రోత్సహించు రచనల వ్రాయలేదు. సంఘోద్ధరణమే యుత్తమలేఖకులకుఁ దగిన యాదర్శమని శరచ్చంద్రుఁడును భావించెను. పద్ధతులు భిన్నమైనను బంకిము శరచ్చంద్రుల యిద్దఱి యుద్దేశమును జనులలో జాతీయతను వృద్ధిచేసి సంఘపుఁ బునర్నిర్మాణము గావించుటే. అద్భుతప్రతిభగల బంకిము శరచ్చంద్రుల దూరదృష్టిని క్షేమంకరత్వపు శక్తిని, అలవర్చుకొనక, అశ్లీలరచనలనుమాత్ర మలవరచుకొని, శరచ్చంద్రుని బ్రమాణముగఁ జెప్పుట శరత్తుకు, బంకిముకుఁగూడ, అప్రతిష్టనుగల్పించుటే.

నీతినుండి చెడిన సంఘము వృద్ధికాదని నమ్మి, దేశాభిమానియగు బంకిము సంఘపునైతికవృద్ధిద్వారానే జాతీయతను బెంపొందించెను. సాహిత్య ప్రపంచములో నిర్మాణాత్మకమగు మంచి కథలను నవలలను వ్రాయు స్రష్టలు విమర్శలోఁగూడఁ బ్రజ్ఞావంతులగుట యరుదు. బంకిం చంద్రుఁ డీ రెంటిలోను సమాన ప్రతిభగలిగి యుండెను; కనుక ఆయన 'సవ్యసాచి' అనియు, అతఁడు బీదలకు నుపకారకమగు కర్షకసమస్య, విజ్ఞానవిషయములు వగైరా సార్వజనికవిషయములఁగూర్చియు వ్రాసినం దున 'సర్వతోముఖకవి' యనియు రవీంద్రనాథుఁడును శ్లాఘించి యున్నాఁడు.

వాఙ్మయము బాగుపడినప్పుడే సంఘము బాగుపడును; వాఙ్మయము పరిశుద్ధమై స్వాతంత్ర్యభావములను గర్భీకరించుకొన్నప్పుడే, సంఘ ము పరిశుద్ధమై స్వాతంత్రము కాగలుగునియు బంకిమురచనయుఁ బ్రవర్త నమును బోధించుచున్నవి.

---

# నన్నెచోడుని కాలము.

—బండారు తమ్మయ్యగారు—

ఉ. తేజును జానుతెన్గునుడితీరును సంస్కృతసూక్తిబంధమున్
రాజిలు కల్పనామములను గ్రాలఁగ శ్రీగురుపాదపద్మమం
దోజఁ గుమారసంభవ సముజ్జ్వలకావ్యముఁ బూన్చు సద్గుణ
భ్రాజిని నన్నెచోడకవిరాజశిఖామణి సంస్మరించెదన్.

ఆంధ్రభాషాదేవి కమూల్యభూషణములయి వెలసిన కృతిరత్నములలో 'టెంకణాదిత్య' బిరుదాంకితుఁడగు నన్నెచోడకవిరాజశిఖామణి కుమారసంభవ మొకటియని చెప్పక తప్పదు. ఇది భావమాధుర్యమునకుఁ బరమావధి. అర్థసంపదకుఁ బెన్నిధి. అలంకారముల కాలవాలము. జానుతెన్గునుడిపెక్కువకుఁ జక్కటి. అనల్పకల్పనలకుఁ గల్పకము. వర్ణనాచమత్కారమునకు మహార్ణవము. సరసత్వమునకు నిరుపమాశ్రయము. ఇట్టి గుణగణములతో విరాజిలు నీ కావ్యరత్నము చిరకాల మాంధ్రవాఙ్మయ రత్నాకరగర్భమం దడఁగియుండి నామిత్రులు శ్రీ మానవిల్లి రామకృష్ణకవిగారి ప్రయత్నమువలన 1910, 1914 సంవత్సరములలో రెండుభాగములుగాఁ బ్రకటింపఁబడినది. ఇంతకాల మీ మహాకావ్యము విస్మృతమగుటకు ముఖ్యకారణ మాంధ్రదేశమున రానురాను శైవమతవాఙ్మయముల దెసఁ బ్రబలిన నిరాదరణమని చెప్పవచ్చును. నన్నెచోడుఁడు శైవుఁడు. శివకవులు పలువురువలె నీతఁడు తన కావ్యమునఁ దనముందు వెలసిన యాంధ్రకవులనుఁ బేర్కొనఁడయ్యెను. ఇతనితరువాత వెలసిన శివకవులుగాని, కొందఱు లక్షణకవులుతప్పఁ దదితరకవులుగాని యీతనిఁగూడఁ దమకావ్యములం దేకారణముననో పేర్కొనరయిరి. ఇతనికావ్యమును జదివి యీతని వర్ణనల ననుకరించినట్లు కాననగు జక్కన, పింగళిసూరన, తెనాలిరామకృష్ణుఁడు మున్నగు నాంధ్రకవులుగూడ నీతనిఁ బేర్కొనకుండుట యాశ్చర్యము. ఇందుచే నీ కవివర్యునికాలము పలుసందియముల

కెడమిచ్చుచు నిస్సంశయముగ నిర్ణయమగు నవకాశమొసంగక యిప్ప టికిఁ గూడ నాంధ్రవాఙ్మయరంగమున వివాదగ్రస్తముగనే యున్నది.

చ. సరళముగాఁగ భావములు జాను తెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్.

అని నన్నెచోడుఁడు తన కావ్యమును బ్రశంసించుకొనినను దాని యం దెడ నెడ నిప్పుడు వాడుకనుండి వెడలిపోయిన ప్రాచీనపదములను రూపముల ను ద్రావిడకర్ణాటకభాషాపదములను నెక్కువగఁ బ్రయోగించియున్నాఁడు. ఇట్టి పదములనుబట్టియు, అథర్వణప్రోక్తమని వినవచ్చు

క. మగణమ్ము గదియ రగణము
వగవక కృతిమొదట నిలుపు వానికి మరణం
బగు నిక్కమండ్రు, మఱియఁడె
యగునని యిడి తొల్లి శేంకణాదిత్యుఁడనిన్.

అను పద్యమునుబట్టియు నన్నెచోడుఁ డాంధ్రవాఙ్మయమున నాదికవి యని సామాన్యముగఁ దలంపఁబడు నన్నయభట్టారకునకంటెఁ బ్రాచీనుఁ డనియుఁ బదియవశతాబ్దియందు వెలసి క్రీ॥ శ॥ 940 సంవత్సరములోఁ బాశ్చాత్యచాళుక్యులతోఁ బోరాడి రణరంగమున నిహతుఁడయ్యెననియు శ్రీరామకృష్ణకవిగారు తమకుఁ దోఁచిన యుపపత్తులతో గ్రంథమునకుఁ దాము రచించిన పీఠికలోఁ దమ యభిప్రాయమును బ్రకటించిరి. అంతను పయి నీయూహను ఖండించుచు ననేక వాదోపవాదములు బయలు దేఱినవి. క్రీ॥ శ॥ 940 సంవత్సరమున నన్నెచోడుఁడు యుద్ధమున నిహ తుఁ డయ్యెనని వ్రాయుటయేగాని యందుకుఁ దగిన శాసనాద్యాధార ములు వేనిని రామకృష్ణకవిగారు ప్రకటింపరయిరి. గ్రంథావతారికలో నన్నెచోడుఁడు తనతండ్రి "పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీ

శుఁడు" అగు చోడబల్లియనియు, తల్లి "హైహయాన్వయాంబుశశిరేఖ" యైన శ్రీసతియనియుఁ జెప్పికొని తాను,

క. కలుపొన్నవిరులఁ బెరుగం
గలుకోడి రవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచు నొరయూరికధిపతి
నలఘుపరాక్రముఁడఁ టెంకణాదిత్యుండన్.

అని వ్రాసికొనినాఁడు. తెలుఁగుచోడులు పాకనాటిని బరిపాలించుచుండఁగఁ బ్రక్కనున్న పలనాటిని హైహయాన్వయులు పాలించుచుండిరి. ఇరుతెగలవారికి సంబంధబాంధవ్యములు గలిగియుండెడివి. పలనాటివీర చరిత్రమున వర్ణితులయిన నలగామరాజు మున్నగువారు హైహయాన్వయులే. తెలుఁగు చోడరాజులపూర్వులు పూర్వము దక్షిణదేశమును జయించి "దక్షిణదేశము సూర్యుఁడు" అను నర్థమిచ్చు టెంకణాదిత్యబిరుదమును వహించుచుఁ గావేరీతీరమునఁగల యొరయూరు రాజధానిగాఁ జాలఁగాలము దక్షిణదేశమును బరిపాలించినట్లు లైతిహ్యములు శాసనాద్యాధారములు గూడఁగలవు. కావున నొరయూరుపురాధిపత్యము టెంకణాదిత్యబిరుదము మన కవిరాజు కులక్రమాగతమర్యాదననుసరించి చెప్పికొనినవేగాని కుమారసంభవరచనాకాలమునాటి కాతఁడు దక్షిణదేశమున నొరయూరు పరిపాలించుచు నచ్చటనే గ్రంథమును రచించెననుటకు సాధకములు కాఁజాలవు. తండ్రి చోడబల్లి తెల్గుదేశమునఁ బాకనాడు పరిపాలింపఁగా నన్నెచోడుఁడు తండ్రిరాజ్యమునుగాక దక్షిణదేశమును బాలించెననుట సంగతముకానేరదు. కావున నన్నెచోడుఁడు నాతనితండ్రి చోడబల్లియుఁ బాకనాడు పరిపాలించిన తెలుఁగుచోడుల సంతతివారనుట కెట్టి సంశయమును లేదు. ఈ తెలుఁగుచోడుల శాసనములు చాల దొరకినవి. వానినిబట్టి చూడఁగా బల్లిచోడుఁడు చోడబల్లి నన్నెచోడుఁడు నను పేరులుగలవారు వేర్వేఱుకాలములలోఁ బలువురున్నట్లు తెలియుచున్నది. ఇందుచే నీ శాసనములుగూడ మన నన్నెచో

డకవి కాలమును నిర్ణయించుటకు సాధనములు కాఁజాలకున్నవి. శ్రీసతి భార్యగా, నన్నెచోడుఁడు కుమారుండుగా నున్న చోడబల్లినిగాని, శ్రీసతి చోడబల్లులు తల్లిదండ్రులుగానున్న నన్నెచోడునిగాని పేర్కొను శాసనము లింతదనుక లభింపలేదు. నన్నెచోడుఁడు తన కావ్యమును దన గురుఁడయిన జంగమమల్లికార్జునయోగి కంకితమొనర్చి గ్రంథమందంతట నాతనియెడ ననన్యసామాన్యమగు భక్తిప్రపత్తిని బ్రదర్శించినాఁడు. గ్రంథావతారికయందును, అంకితాంకపద్యములందును నాతనికిఁ గూర్చిన విశేషణములఁబట్టి యీ జంగమమల్లికార్జునుఁడు బ్రహ్మచారియనియు, బ్రహ్మర్షియనియు, శమదమనియమాన్వితుఁడగు పరమతపస్సంపన్నుఁడనియు వ్యక్తమగును. 'కమలభవకులతిలకేత్యాది' విశేషణములుగూడ నెడనెడ నాతని కుపయుక్తములయినవి. కాని యాతనికాలమైనను నిస్సంశయముగ నిర్ణయించుట కుపకరించు వర్ణన లందేమియుఁ గానరావు. జంగమశబ్దము కులవాచకముగఁ గాక ప్రాచీనవాఙ్మయమున, చరలింగ (జీవరూపమునఁ జరించు శివుఁడు=శివభక్తుఁడు) వాచకముగ వాడఁబడినట్లు కానవచ్చును. శబ్దమందలి వ్యుత్పత్త్యర్థముగూడ దానినే సూచించును. "జం భృశం గచ్ఛతీతి జంగమః" అని మల్లినాథుఁడు. మల్లికార్జునగురునకు జంగమోపపదమును జేర్చుటలో నన్నెచోడుని భావమిట్టిదే యని యీ క్రిందివచనములవలనఁ దెలియనగును.

"సర్వజ్ఞు జంగమలింగంబగు మల్లికార్జును సదాకల్యాణుఁగీర్తించెదఁ" (ఆ 1 ప 15).

"కావునం బరమ శ్రీనగోత్తుంగ మణిశ్రీ సంగత మల్లికార్జున దేవతాకంబై జనంబులఁ బ్రత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమమల్లికార్జునదేవుండై" (ఆ 1 ప 55).

"మనుజాకారమహేశునకు" (ఆ 1 ప 66) కుమారసంభవమునందలి పద్యములఁ బట్టి నన్నెచోడుఁడు నాతనిగురుఁడు మల్లికార్జునుఁడు పాశుపత మతప్రవిష్టులని తలంచుట కనేకావకాశము లున్నవి. లకులీశ

ము, కాలాముఖము మున్నగునవి పాశుపతములోని యవాంతరభేదము లు. మహావ్రతులనికూడఁ గాలాముఖులకు వ్యవహారముగలదు. సురా కుంభస్థాపన, మండలార్చనాదులు కాలాముఖాచారాంగములుగఁగాన వచ్చును. ఈక్రిందియుదాహరణములఁ దిలకించునది.

మ. హరికంకాలము చేతిముద్ర దివిజేంద్రాస్థుల్ సుభూషావళుల్
గరళం బభ్యవహార మంతకతనుక్షారంబు మైపూఁత పం
కరుహాసీను శిరఃకపాల మురుభిక్షాపాత్ర గా విశ్వసం
హారు వర్తించు మహావ్రతోపహతి సేయంబూన నీప్రాప్తియే.

వ. అంత నంద కొందఱు మధుపానగోష్ఠికిం జొచ్చి మండలార్చన దీర్చి మూలజవృక్షజగరుడమధువిష్ఠకుసుమవికారంబులగు సుగంధాసవం బులుకనకమణిమయానేక కనకచషకాదుల న్నించి హర్షించి—ఆ 9. వ 32౦).

క్రీస్తుశకము పది పదునొకండు శతాబ్దు లందాంధ్రదేశమునఁ బాశుపత మతాచార్యులు, కాలాముఖాచార్యులు తూర్పుచాళుక్యరాజులకుఁ దెలుఁగుచోడరాజులకు గురువులుగా నుండి పాశుపతమతవ్యాప్తి నొనర్చుచుండి రనుటకు శాసనాద్యాధారములు గలవు. తూర్పుచాళుక్యరాజు రెండవ అమ్మరాజు (క్రీ. శ 945-970) రాజ్యకాలమున వెలసిన తాడికొండశాసనము చూచునది (భారతి. సం 15 సం. 8) కాలాముఖాచార్యులలో సుప్రసిద్ధుఁడు తపోరాశి శిష్యుఁడునగు మల్లికార్జునయోగి దక్షిణదేశమునఁ గాలాముఖమతస్థాపన మొనర్చి, క్రీ. శ. 950 ప్రాంతమున నుండిన విక్రమకేసరియను చోడరాజుచేఁ బూజింపఁ బడినట్లు కొడుంబాలూరు శాసనమువలనఁ దెలియుచున్నది. ఈతఁడే కుమారసంభవ కృతిపతియని శ్రీరామకృష్ణకవిగారు తలంచిరి. నన్నెచోడుఁడుకూడ నీకాలము వాఁడని బలవత్ప్రమాణములచేనిర్ణయమయినప్పుడే యీయూహ చాల సంగతముగా నుండునుగాని యట్టి యాధారములు లేనప్పు డది యిదమిత్థమని నిర్ణయింపరాదని నాయభిప్రాయము. మల్లికార్జునునికాలాముఖ

మఠము మొదట దక్షిణదేశమున స్థాపితమయినను దరువాత నది వస వాసిదేశమందలి బలిగ్రామమునకుఁ దరలింపఁ బడినట్లును, అలంపురి, శ్రీ శైలము మున్నగు తావులందుఁ గూడఁ దచ్ఛాఖామఠములు నెలకొని నట్లును శ్రీరామకృష్ణకవిగారే వ్రాయుచున్నారు.

కాకతీయ గణపతి చక్రవర్తికి సామంతుఁడుగానుండిన రెండవమల్లి దేవచోడుఁడు క్రీ. శ. 1260 ప్రాంతమున వెలయించిన పెదచెఱుకూరు శాసనమునుబట్టి యాతని పూర్వులలో నాతనికాఱవతరమువాఁడగు నన్నెచోడుఁ డొకఁ డుండినట్లును, ఆనన్నెచోడుని తండ్రి చోడబల్లియని యుఁ దెలియుచున్నది. ఈశాసనమునుబట్టి యందుఁ బేర్కొనఁబడిన చోడ బల్లి నన్నెచోడులు క్రీ. శ. 1120-1140 ప్రాంతమువారగుదురు. మఱి యు క్రీ. శ. 1115 సంవత్సరమునఁ గామచోడుని పుత్త్రులు కన్నరచో డుఁడు చోడబల్లియను సోదరులు వెలయించిన కొప్పవరశాసనమునుబట్టి పాలూరునివాసియు, కాలాముఖవ్రతస్థుఁడునగు నొక మల్లికార్జునయోగి వారిచే సంభావితుఁ డయినట్లు కానవచ్చుచున్నది. ఉపలబ్ధములయిన చో డశాసనములలో నివియే నన్నెచోడుని కాలనిర్ణయమునకుఁ గొంత సం గతములు గానుండుటచే రెండవమల్లిదేవచోడుని కాఱవతరమువాఁడగు నన్నెచోడుఁడే కుమారసంభవకర్తయై యుండుననియు, కొప్పవరశాసన మున నుదాహృతుఁడయిన మల్లికార్జునుఁడే తత్కృతిపతియగు జంగము మల్లికార్జునుఁ డై యుండుననియుఁ బలువు రిప్పుడు తలంచుచున్నారు. * కుమారసంభవకృతిపతి యీమల్లికార్జునయోగులలో నెవ్వఁడయినను నాతఁడుతప్పకనన్నెచోడుని సమకాలికుఁడేయని తలంప నవసరము లేదని నాయభిప్రాయము. అట్లే నిర్ణయింపవలెననుటకుఁ దగినన్ని యవకాశ ములు గ్రంథమునఁ గానరావు. నన్నెచోడుఁడు తరువాతి కాలమువాఁ డయినను సుప్రఖ్యాతుఁడు మొదటికాలాముఖాచార్యుఁడునగు క్రీ. శ.

---

* ఇందుఁ గూర్చిన చర్చలకయి ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక సంపుటము 14 సంచికలు 1,2 చూచునది.

950 ప్రాంతపు మల్లికార్జునునకే యాతనియందలి భక్తిగౌరవములచేఁదన గ్రంథ మంకితమిచ్చియుండునని తలంచుటలో నసంగతమేమియు నుండ రాదు. అద్వైతమతస్థు లెవరైన నేఁడొకగ్రంథమును వ్రాసి యాదిశంక రునందలి భక్తిచే దాని నాతని కంకిత మీయరాదా ! పాల్కురికి సోమ నాథుఁడు బసవేశ్వరునకు సమకాలీనుఁడు గాకున్నను నాతనియం దలి భక్తిపారవశ్యముచేఁ దనపండితారాధ్యచరిత్రము నాతని కంకితమి చ్చి యుండెను గదా ! నన్నెచోడుఁడు మల్లికార్జును నెడ నుపయో గించిన "ఆదిమునీశ్వరుఁడు" (ఆ 2 ప 241) మున్నగు విశేషణములు పై యభిప్రాయమునకు సాధకములుగాకపోవు. శ్రీవంగూరి సుబ్బారావు గారు తమశతకకవులచరిత్రలోఁ బసవేశ్వరునకు సమకాలికుఁడగు మల్లి కార్జునపండితారాధ్యుఁడే యీజంగమమల్లికార్జునుఁడు కాఁగూడదా యని శంకించిరి. ఇది కేవల మసంగతము. మల్లికార్జునపండితుఁడు గృహ స్థుఁడు. వీరశైవమతప్రవిష్టుఁడు. నన్నెచోడునిగురువు బ్రహ్మచారి యని యాతని వర్ణనలవలన విస్పష్టమగును. వానిలో మల్లికార్జునపండితున కుఁ దగిలి వచ్చున వేమియుఁ గానరావు. నన్నెచోడుఁడు నాతనిగురువు కాలాముఖశైవులనుటయే సత్యసమ్మతము.

పూర్వోక్తకారణములచే నిర్బాధకముగ నిస్సంశయముగ నన్నె చోడునికాలము నిర్ణయింపఁ దగిన బలవత్ప్రమాణములు లభింపనప్పుడు గ్రంథమందలి యాంతరంగిక సాక్ష్యమునుబట్టియే దానిని నిర్ణయింపఁ బూనుట సరియగు మార్గము గాకపోదు. నన్నెచోడుఁడు తన కావ్య మున సంస్కృతకవులలో వాల్మీకి, వ్యాసుఁడు, కాళిదాసు, ఉద్భటుఁడు, భారవి, బాణుఁడు అను నార్వురనుమాత్రమే పేర్కొనెను. వ్యాసవాల్మీ కులు చాలఁ బూర్వకాలమువారు. కాళిదాసునికాలము క్రీ॥ పూర్వము 56, క్రీ॥ శ॥ 600 మధ్య నూఁగులాడుచున్నది. ఉద్భటుఁడు క్రీ॥ శ॥ 780-820 ప్రాంతమునఁ గాశ్మీరదేశము నేలిన జయాపీడుని యాస్థానకవి. భారవి క్రీ॥ శ॥ 550-620 ప్రాంతమువాఁడని చరిత్రజ్ఞుల యభిప్రాయము.

బాణుఁడు క్రీ॥ శ॥ 650 ప్రాంతమునఁ గన్యాకుబ్జమును బాలించిన హర్ష వర్ధనుని యాస్థానకవి. వీనినిబట్టి నన్నెచోడుఁడు క్రీ॥ శ॥ తొమ్మిదవశతాబ్దికిఁ దరువాతివాఁడని చెప్పుట కెట్టియాటంకమును లేదు. ఇఁక దేశికవులలో నన్నెచోడుఁ డుదాహరించినవారుగాని, లక్షణకవులుతప్ప నాతనిని బేర్కొనినవారుగాని కానరారని మొదటనే మనవిచేసితిని. కాని గ్రంథావతారికలో,

క. మునుమార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమున
జనసత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్.

(తెనుంగు నిలిపి రంధ్రవిషయంబునఁ జనఁ జాళుక్యరాజు మొదలుఁ గఁ బలువుర్ అను పాఠాంతరముగూడఁ గలదు) అను పద్యమును వ్రాసి యటుతరువాత నీ క్రిందిపద్యము రు నన్నెచోడుఁడు లిఖించెను.

చ. సురవరులం గ్రమంబున వచోమణి సంహతిఁబూజచేసి మ
ద్గురు చరణారవిందములకుం దగ సమ్మతిఁజేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవి సంఘము నుత్తమమార్గ స్తత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిచేసి మనోముదంబునన్.

ఈ రెండుపద్యములకు నడుమ మఱికొన్ని పద్యము లుండియుండుననియు వానిలో నన్నెచోడుఁడు దేశికవులఁ గొందఱ నుదాహరించియుండునని యుఁ గొందఱు తలంచుచున్నారు. కాని దొరకిన వ్రాఁతప్రతిలో నట్టి పద్యములేవియుఁ గానవచ్చుట లేదు. పయిపద్యమునఁ బేర్కొనఁబడిన చాళుక్యరా జాంధ్రమహాభారతమును నన్నయభట్టుచే రచియింపించి కృతినందిన రాజరాజనరేంద్రుఁడనియే పలువురు పండితు లభిప్రాయపడు చున్నారు. ప్రత్యక్షప్రమాణముగఁ గానవచ్చు నన్నయ భారతమును బట్టియు దేశమునఁ జిరకాలమునుండియు వచ్చుచున్న ప్రతీతినిబట్టియు నీయభిప్రాయ మసంగతమనుటకు వీలులేదు. కాని నన్నెచోడుని

నన్నయ్యకంటెఁ బ్రాచీనుఁడో లేక తత్సమకాలీనుఁడో యని తలంప నెంచు కొందఱిందుకు విపరీతార్థమును దీయఁ బ్రయత్నించుచున్నారు. దీనితరువాతిపద్యములోనున్న వరుసను దేశికవిస్తుతి కడపటనున్నది కావున "మునుమార్గకవిత" యనుపద్యము దేశికవిస్తుతిపరముగానే గ్రహింప వలెననియు, అందలి సత్యాశ్రయాదులగు చాళుక్యరాజులు దేశికవితా పోషకులుగఁ గాక దేశికవులుగనే గ్రహింపఁ దగుననియు శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు "నన్నెచోడ నన్నయభట్టులు సమకాలమువారు" (విభూతిపత్రిక సం 1 సం 2) అను వ్యాసమున వ్రాసి యున్నారు.

సత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపులందఱును దేశికవులేనా? నన్నెచోడుఁడు దేశికవులనే పేర్కొన్నచో నంతఱును రాజకవులనే యుదాహరించెనా? "పుట్టించి" అనుప్రేరణక్రియకు రచించి యనియే యర్థము చెప్పవలయునా? రాజరాజు మనుమలలో నొకఁడు వెలయించిన శాసనము లోకదాసిలో నాతఁడు నొనరింపఁజేసిన మహాభారతకృతిని బ్రశంసించుటలో "ఆంధ్రీచకార" అను ప్రయోగమునుబట్టి మహాభారతకర్త రాజరాజనరేంద్రుఁడేగాని నన్నయభట్టు కాదను వింతవాదమును గొంతకాలమయి యొకరు ప్రకటించిరి. కాని సహృదయులెవరు దానినంగీకరింపలేదు. పయిసంగతులనెల్లఁ బర్యాలోచింప దేశికవితా ప్రాదుర్భావమునకయి చాళుక్యరాజులొనర్చిన కృషిని బ్రశంసించుటకే పయిపద్యము ద్దేశింపఁబడెననియు నటుతరువాత దేశికవులను వారినామములతోఁ బేర్కొనకున్నను నన్నెచోడుఁడు సాముదాయకదృష్టితో "దేశిసత్కవుల సంస్తుతి చేసె" అని వ్రాసియుండుననియుఁ దలంచుటయే సంగతముగా నుండును. ఇంతకు నీరెండుపద్యములనడుమ దేశికవులను గుఱించిన కొన్నిపద్యము లుండియుండుననియు, అవి మనకు దొరకిన ప్రతిలో లోపించియుండుననియు నాయనుమానము. ఒండురెండుపత్రికలు వెలసినను నిక్కమాలోచింప మనకీగ్రంథమునకు దొరకినది తంజావూరు సరస్వతీమహాలునందలి యేక ప్రతియే గదా?

గ్రంథావతారికలో "అన్యతారకవితతు లనాదరించి। వెలయ సత్కవి బుధగురుబలమువడసి। యొనరదైవజ్ఞునట్లశుభోదయమున। దివ్య సుకృతిఁ బ్రతిష్ఠింతుఁ జిరముగాఁగ (ఆ 1 ప 34) అను పద్యమునుబట్టియు,కథామధ్యమునఁదారకాసురయుద్ధసందర్భమునందున్న "తారకవిరచిత కృతియుం దారకవిరచితవికృతియుఁ దానడఁగుసదా। చారకవిబుధాళికి సువి। చారకవిబుధాధినాథు షణ్ముఖుఁ గనిరి" (ఆ 10 ప 518) అను పద్యమునుబట్టియు నన్నెచోడునకుఁబ్రత్యర్థి తారకుఁడను నొకఁడుండెనని యు నాతఁడే యిందుదాహృతుఁ డనియుఁ గొందఱుతలంచిరి. మఱి కొందఱీప్రత్యర్థి జాను తెనుఁగురచనకుఁ బ్రతికూలుఁడగు నన్నయభట్టే యనియు, ప్రతారము=వంచనము దానినొనర్చువాఁడు తారకవియను నర్థముతో నన్నెచోడుఁ డాతనినే యుద్దేశించెననియు వ్రాయు సాహసమునకుఁ గూడఁగడంగిరి. పదియవయాశ్వాసమునందలి దారిద్ర్యవిద్రావణస్తవములోని శ్రీరామేశగవీశ్వరాదు లెద నీ శ్రీపాదముల్ భక్తితో। నారాధించి సమస్త..."అనుపద్యమున "గవీశ్వర" శబ్దము ప్రమాదమున "కవీశ్వర" అని లిఖింపఁబడి ముద్రింపఁ బడుటచే శ్రీరామేశకవియను నాతఁడుకూడ నన్నెచోడుని కాలమున నుండెనని కొందఱు తలంచిరి. ఇవి యన్నియు నత్యూహలు. ఈయభిప్రాయములన్నిటికి శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు నన్నెచోడుఁడు తిక్కనకేతనాదులకుఁగూడఁ దరువాతివాఁడను నభిప్రాయముతోఁ బ్రకటించిన "A Critique on Nannechoda Deva's Kumarasambhavam" అను గ్రంథములోఁజక్కనిసమాధానములు వ్రాసియున్నారు. నన్నెచోడుని గ్రంథములో ననవసరశ్లేషలకు, గూఢభావములకుఁ దావులేదు. "సరళముగాఁగభావములు..." అని గ్రంథావతారికలో ఘంటాపథముగ నాతఁడు చెప్పికొనిన పద్యమిందుకు నిదర్శనము. మనయూహలను బలపఱుచుటకు, సిద్ధాంతముల నిల్వరించుటకు గూఢత్వము నారోపించి యాతనిపదప్రయోగములకు విపరీతార్థములు చెప్పఁబూనుట యాతని కపచారమొనర్చుటయే యని నాయ

భిప్రాయము. పయిపద్యములలో అన్యతారకవితతులనఁగా శుభేతరనక్షత్ర గణములనియే సహజార్థము. ఇతరులను వంచించు కుకవిసమూహముల ను వ్యంగ్యార్థముగూడ గ్రహింపవచ్చును. రామకృష్ణకవిగారు సూచించి నట్లు వితతు లనుపాఠమును వికృతులుగా మార్పనక్కఱలేదు. మనయూ హలకొఱకుఁ బాఠములనుగూడ మార్చివేయుటయా ? తారకవిరచిత కృతియనుచో నక్షత్రములచేఁ గూర్పఁబడినకార్యము అనఁగారాత్రి య నుటయే సహజార్థము. రెండవపాదములో "వికృతియు" అనుటకుఁ బొరపా టున "సుకృతియు" అని లిఖింపఁబడి ముద్రింపఁబడినట్లు తోఁచుచున్నది. సదాచారులయిన విబుధులకు (పండితులకు, దేవతలకు) సువిచారక విబు ధాధినాథు (సూర్యుని) షణ్ముఖుఁ గనినంతనే చీకటితోఁగూడినరాత్రియు, తారకాసురునిచేఁ గలిగినబాధయు నడఁగుసని పద్యార్థము. శ్రీరామేశగవీ శ్వరాదులనుచో (శ్రీరామేశ=లక్ష్మీకాంతాప్రాణేశుఁడు=విష్ణువు; గవీశ్వర= వాగీశ్వర=బ్రహ్మ) విష్ణువు బ్రహ్మ మొదలయినవారనియే యర్థము. పరమే శ్వరునారాధించి సమస్తలోకపాలకత్వాది సంపద లందినది వారే గాని కవులెవరునుగారు. పయిపద్యములలో నన్నెచోడుఁడు మిత్రులనుగాని శత్రులనుగాని తనసమకాలికకవుల నెవరిని సూచింపలేదనియే నానిశ్చితా భిప్రాయము.

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు నన్నెచోడుని గ్రంథమును గూఢవస్తుమయకావ్యమనియెంచి గ్రంథరచనాకాలమును దనరాజధాని నామమునుగూడ నాతఁడు కావ్యములో గూఢముగఁ జెప్పెనని తమ పూర్వోక్తవ్యాసములోఁ గొంత చిత్రప్రదర్శన మొనరించిరి. నన్నె చోడుఁడు తనగ్రంథము గూఢవస్తుమయ కావ్యమని మెచ్చుటను జెప్పి కొనలేదు. అది యట్టిదే యయినచో నింకను దనగూఢగాఢనిద్రావస్థ నుండి తెల్విఁనొందక లోకమున కందక పూర్తిగ నశించియేయుండునేమొా. సంస్కృత కవులలో నుద్భటునిఁ బ్రశంసించు సందర్భమునఁ జెప్పిన "క్రమమున నుద్భటుఁడు కవి। త్వము మెఱయఁ గుమారసంభవము

సాలంకారము గూఢవస్తుమయకా। వ్యముగా హరులీలచెప్పి హరుమె ప్పించెక్" అను పద్యమును సరిగా నర్థము చేసికొనక, ఉద్భటుని కుమారసంభవముతోను హరలీలాస్తవకృతితోను నన్నెచోడుఁ డుపయోగించిన గూఢవస్తుమయకావ్యవిశేషణమును శ్రీకృష్ణారెడ్డిగారు నన్నెచోడుని స్వంతగ్రంథమునకే యారోపించుట మిక్కిలి శోచనీయము. ఉద్భటుఁడు సంస్కృతమునఁ గావ్యాలంకారసంగ్రహమను నలంకారగ్రంథము రచించెను. అది ముద్రితమయినది. దానిలోని లక్షణములకు లక్ష్యములుగా నుండుటకయి కుమారసంభవకథలోని యేకదేశమగు పార్వతీపరిణయ సందర్భమందలి హరుని వటువేషధారణ లీలను గథావస్తువుగఁ గైకొని రమారమి నూఱు శ్లోకములను రచించినాఁడు. లక్ష్యలక్షణ శ్లోక సమన్వితముగనే యలంకారగ్రంథము కూర్పఁబడినది. లక్ష్యశ్లోకములలోఁ గథావస్తువుకూడ గూఢముగానున్నది. వీనిలోఁ జాలశ్లోకములను శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగా రుదాహరించినారు. కాళిదాస కుమారసంభవ శ్లోకములవలెనే నన్నెచోడుఁ డుద్భటకావ్య శ్లోకములఁగూడ గొన్ని తనగ్రంథమున ననువదించినాఁడు. నన్నెచోడుఁడు పూర్వోక్త పద్యమునఁ బయివిషయములనే ప్రశంసించి యుద్భటుని కుమారసంభవైకదేశమునకు గూఢవస్తుమయకావ్యవిశేషణము నుద్దేశించెనని శ్రీలక్ష్మీపతిశాస్త్రిగారు తమయభిప్రాయమును బ్రకటించిరి. అది సరియనియే యంగీకరింపవచ్చును. కాని మల్లికార్జునపండితుని శివతత్త్వసారమందలి "క." హారలీలాస్తవరచనా। స్థిరనిరుపమభక్తిఁదనను దేహముతోడన్। సురుచిరవిమానమునని। పురమున కుద్భటుఁడు ప్రీతిఁబోవఁడె రుద్రా" అను పద్యమునుబట్టి యుద్భటుఁడు హారలీలాస్తవమను ప్రత్యేకకృతి గూడ నొకటి రచించినట్లు గోచరించును.

నన్నెచోడుని పద్యమందలి క్రమమునుబట్టి గూఢవస్తుమయకావ్యవిశేషణము హరలీలతోనన్వయించుటసమంజసముగాఁ గానవచ్చును. పయి కారణములచే నీవిశేషణము ఉద్భటుని కావ్యములలోఁ గుమార

సంభవమునకో, హరలీలకో చెల్లునుగాని నన్నెచోడుని గ్రంథమునకుఁ గాదు. ఇఁక రెడ్డిగారి చిత్రప్రదర్శన మించుక పరామర్శింతము.

(1) తారకాసుర సంహారానంతరము శివుఁడు కుమారస్వామి నానందముతోఁ గుచ్చి యెత్తికొని లాలించుసందర్భమున,

గీ. "ద్వాదశార్ధార్ధనయను నాద్వాదశార్ధ
వదనుఁ డొగిఁజుట్టి నిజభుజద్వాదశమునఁ
నుదయ దశశతకిరణుఁ డయ్యుదయనగముఁ
గట్టి దశశతకరములఁ జుట్టినట్లు." (ఆ. 12 ప. 998)

మూఁడు కన్నులవానిని (శివుని), ఆఱు మోములవాఁడు (కుమారస్వామి) తన పండ్రెండు చేతులతోడను, వేయికిరణములుగల యుదయుఁ భానుఁ డుదయాద్రిని దన వేయికరముల (కిరణముల)తోఁ బొదివినట్లు కౌఁగిలించెనని దీనియర్థము. అనుప్రాసమను శబ్దాలంకారము, ఉపమయను నర్థాలంకారముతప్ప దీనిలో మఱే యలంకారములుగాని శ్లేషార్థములుగాని లేవు. మొదటి రెండుపాదములలోని సంఖ్యలను గలిపి $(3+6+12=21)$ దానిని మూఁడునాలుగు పాదములలోఁ గానవచ్చు వేయి (దశశత) యను సంఖ్యతో గుణించిన ఇరువదియొక్కవేయి యగునుగాన నట్టిసంఖ్యగల గ్రామములను గలిగిన పాకనాటికిఁ దా నధిపతిననియు నందలి యుదయనగము=ఉదయగిరి తన రాజధానియనియు నన్నెచోడుఁడు గూఢముగాఁ జెప్పెనని రెడ్డిగారి ప్రదర్శనము. గ్రంథావతారికలోనే తన తండ్రి పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధిపుఁడని తేటతెల్లముగఁ జెప్పిన నన్నెచోడునకు మరల నావిషయమునే చెప్పుట కీడొంక తిరుగుడుమార్గమేల? రాజధానినిగూడఁ జెప్పవలెననెడి తలంపే యాతనికిఁ గల్గినచోఁ బయిదానితోపాటు దానిని మొదటనే చెప్పియుండఁడా?

(2) (విష్ణుకాలనేముల యుద్ధవర్ణనాసందర్భము)

వ. కాలనేమి యిట్లు శతముఖదశశతకరపరిఘశోభితుండై యనేక విధా

యుధ వర్షంబులు గురియుచుం దెరల నెత్తివచ్చుట గని శార్ఙ్గపాణియు
వానికిం బ్రతిఘటించి నిలిచిన (ఆ. 13 వ. 872)

(3) (షణ్ముఖతారకుల యుద్ధవర్ణనము)

చ. కరిశిరమాడ షణ్ముఖుఁడు గైపునఁ ద్రేయుడుఁ గుంభవక్త్రకో
త్కరమసిధారఁ బొల్పెసఁగెఁ దారకు భంగముసూచి నవ్వ సం
గరజయకాంతకాంతరదకాంతియొ కాదని నాటుదీటి వి
స్ఫురదవదాతఖడ్గలతఫూఁచెనొ నా జయచైత్రసంపదన్.

(ఆ. 12 ప. 961)

(4) (తారకాసురుఁడు యుద్ధమున నిహతుఁడైనపుడు)

వ. ఇట్లప్రతిహతశౌర్యుండును, ననివార్యవీర్యుండును నఖిలభువనభవ
నాధీశ్వరుండును, సకలజగద్భయదానియు నామరణాంతాపరిత్యక్తా
భిమానియు నగు తారకాసురు నామాక్షరంబులు సకలదిక్తట
శిలాపట్టంబుల శక్తిధరుముఖవిజయప్రశస్తిశాసనలిఖితాక్షరంబులయ్యె
నంత. (ఆ. 12 వ. 970)

వీనిలోఁ గుమారసంభవరచనాపరిసమాప్తికాలమును నన్నెచోడుఁడు
గర్భితముగాఁ జెప్పినాఁడని శ్రీ రెడ్డిగారి యభిప్రాయము.

అవదాత, జయ, చైత్రశబ్దములలో సంవత్సర, మాస, పక్ష,
తిథివారము లిమిడియున్నవఁట. జయసంవత్సర చైత్రమాసములో అవ
దాత (శుక్ల) పక్షములో జయతిథి (శుద్ధ తృతీయ) తోఁగూడిన జయ
(మంగళ)వారమునాఁడు గ్రంథసమాప్తి యయ్యెనఁట. పంచాంగముల
గాలించినచో విక్రమశకముప్రకారము పదునొకండువందల పదునొకం
డవ సంవత్సరము (1111) జయసంవత్సర మగునఁట. దీనికిఁ దోడుగ ట
కయి 872 వచనములోని శతముఖదశ శతపదములను "గూఢవస్తుమయ
కావ్యలక్షణాంగీకారముగ" శతముఖదశ + దశశత. అని విఱిచికొని
యన్వయము చేసికొనవలెనఁట. అప్పుడు 110 + 1000 = 1110 సంఖ్య
యేర్పడునఁట. ఇప్పటికిని సరిపోవని వ్యత్యాసము 1111 minus 1110

స్వల్పమనగా నొక్కవత్సరమేకావున దానిని బరిహరించుకొనవలెనఁట. ఇట్లు తంటాలుపడి విక్రమశకగతవర్షము 1110 అగు జయసంవత్సర చైత్ర శుద్ధ తృతీయామంగళవారమునకు సరియగు క్రీ॥ శ॥ 15-3-1054 తేదిని కుమారసంభవరచనము పూర్తియయ్యెనని నన్నెచోడుఁడు వాచ్యముగాఁ జెప్పినట్లు తలంపవలెనఁట. పాఠకులు పయి వచనముల మధ్యనున్న వ్యవధిని నెడమును గమనింపవలెను. 872—961 మధ్య రమారమి నూఱుపద్యముల యెడమున్నను మన యూహల నిలువఁబెట్టుటకయి ముడిపెట్టి యిచ్చువచ్చినట్లు విఱువవలసినదేనా? తెలుఁగునాట శాలివాహనశకము పరంపరాగతముగ వ్యవహరింపఁబడుచుండ విక్రమశకము నేల యెరువుతెచ్చికొనవలెను? తారకాసుర నామాక్షరంబులు శక్తిధరముఖ విజయప్రశస్తశాసనలిఖితాక్షరంబులైనది యనఁగా నేయుగమునందో యెప్పుడో జరగిన తారకాసురసంహారముకూడఁ బూర్వోక్తజయ చైత్రమునందే సమాప్తమయ్యెనని తలంపవలసినదేనా? తాముద్దేశించిన గూఢభావమే లేకున్నచో 872 వచనములో శతముఖ దశశత అనుచో "దశశత"కు మాఱుగా "సహస్ర" అనుట సరిపోవునప్పుడు "దశశత" యని నన్నెచోడుఁ డేల వ్రాసెనని శ్రీ రెడ్డిగారు పెద్ద యుపపత్తినిగూడఁ జూపిరి. నన్నెచోడుని రచనములలోని యనుప్రాసలుబ్ధత్వము వీరు గుర్తింపలేదుకాఁబోలు. అనుప్రాసకొఱకే యాతఁడు శతముఖ, దశశతశబ్దములఁ బ్రయోగించెనుగాని వేఱొకభావమునఁ గాదు. 961 పద్యమునకు షణ్ముఖుఁడు తారకాసురుని గజమును గుంభస్థలము వ్రక్కలగునట్లు బలంబుతోఁ దన ఖడ్గమున వ్రేయఁగా నందుండి యా ఖడ్గధారవెంబడి వెడలెడు ముత్తెముల మొత్తమా రాక్షసునిభంగపాటును జూచి నవ్వెడి సంగ్రామజయలక్ష్మి మనోహరదంతకాంతియో లేక షణ్ముఖుని విజయమనెడి వసంతసంపద కలిమిచే నాతని ధవళఖడ్గలత పూఁచిన పూఁతయో యన మిగుల నొప్పారెనని సహజార్థము. ఇందెట్టి గూఢతకును నవకాశములేదు. ఇందలి జయచైత్రశబ్దముల నూఁత

గాఁగొని గ్రంథమున మఱెచ్చటనో యున్న శతమఃఖదళశతశబ్దములతో వానికి సంబంధము కుముడివెట్టి శ్రీ రెడ్డిగారాకాశహర్మ్యము నిర్మింపఁ బూనుట యాశ్చర్యము. ఇట్లే పూనుకొన్నచో నిచ్చవచ్చినట్లు లేగ్రంథమును గూర్చియైనను నెట్టి సిద్ధాంతములనైనఁ జేయవచ్చును. ఇట్టి వినోదపద్ధతులు చరిత్రకారుల సూటిదారు లెన్నఁటికిని గానేరవు. ఆముష్మిక దృష్ట్యేకపరులగు పూర్వకవులకుఁ జారిత్రక దృష్టిచాలఁ దక్కువ. నన్నెచోడునకు గ్రంథరచనాకాలమును దనరాజధానిని జెప్పఁగొనవలెననెడి తలంపే కల్గినచో వానినాతఁడు సహజ సరళ సక్రమమార్గములనే చెప్పియుండును. గూఢత్వము నెడనే యాతఁడు దృష్టిఁబఱపినచోఁదలిదండ్రుల నామములను స్వనామమునుగూడ నిగూఢములే చేసియుండును. గురునిఁగూర్చి యున్న విశేషవర్ణనము లొనర్పకయే యుండును. చక్రబంధాది పద్యములలోనే యెట్టి గోపనము చేయనివాఁడు కథాసందర్భప్రయుక్తములగు గ్రంథమధ్యస్థసాధారణపద్యగద్యములలో నసంగతములను నిట్టి గూఢభావముల నిమిడ్చియుంచెనని తలంచుట కెట్టి యవకాశమును లేదు.

ఇఁక నన్నెచోడుని గ్రంథముఁనఁ గానవచ్చు ప్రాచీనశబ్దములను బట్టియే కేవలమతఁడు నన్నయకంటెఁ బూర్వుఁడని చెప్పరాదని నా యభిప్రాయము. లోకోభిన్నరుచిః. పలువుర దృష్టి పలువిధములుగా నుండును. కొందఱకు వాడుకనుండి సన్నగిల్లిన ప్రాంతమాటలపయి రోఁత జనింపక వానిపయినే యెక్కువ మక్కువ యుండవచ్చును. అట్టిఁడు తొట్టి, నెట్టన, పొంటె మున్నగు ప్రాచీనరూపములను నిప్పుడుగూడఁ దమ గ్రంథములలో నుపయోగించువారు లేకపోలేదు. కావున నన్నెచోడుఁడు ప్రాంతపడ్డమాటల నెక్కువగ నుపయోగించినచో నది యూతని కందుపయి గల మక్కువనే సూచించును. నన్నెచోడునిఁగూర్చి కాకపోయినను నిట్టివారిని గొందఱఁగూర్చియే కాఁబోలుఁ దిక్కన నిర్వచనోత్తరరామాయణములో "పలుకులపొందు లేక రసభంగముసేయుచుఁ

ప్రాఁతవడ్డ మాటలఁ దమ నేర్పుసూపుచు..."అని వ్రాసియున్నాఁడు. పాల్కురికిసోమనాథుని గ్రంథములందును, నన్నయ తిక్కనల భారతమునం దునుగూడ వెదకిచూచిన నిట్టి శబ్దములు పరశ్శతములుగ లభింపఁగలవు.

నన్నయ భారతమును, నన్నెచోడుని కుమారసంభవమును సవిమర్శముగఁ దిలకించిన రెంటికిని గల వైలక్షణ్యము గోచరింపకపోదు. శైలిలోనే రెంటికిని భేదము గలదు. మొదటిది పురాణశైలిలోను, రెండవది కావ్యప్రబంధశైలిలోను నున్నవి. గర్భబంధకవిత్వములుగూడ నన్నెచోడుని గ్రంథమునఁ బ్రదర్శితములయినవి. నన్నయకాలమునాఁటికిఁ దెలుఁగురచనలలోఁ బ్రబంధశైలీవాసనలు నెలకొనినట్లు కానరాదు. నన్నయ భారతమును మన కుపలబ్ధములయిన తత్పూర్వశాసనములను దిలకించినచో సీసపద్యరచనమున నప్పటికొకవిధమయిన యతినియమము లున్నట్లు కానవచ్చును. తనకాలమునాఁటి కాచరణములోనున్న యా నియమములను నన్నయ తన సీసపద్యచరణములలో లెస్సగాఁ బాటించుటయేగాక మఱికొన్ని విశేషనియమములనుగూడఁ బ్రదర్శించినాఁడు. నన్నెచోడుని సీసములలోఁగాని నన్నయతరువాత బయలుదేఱిన మఱియే యితరకవుల సీసములలోఁగాని యిట్టి నియమములు కానరావు. మఱియు నన్నయకాలమునాఁటికి సీసపద్యపాదము లెచ్చటికచ్చటికిఁ దెగిపోవునట్లురచించు నాచారమంతగాఁ బ్రచారమందున్నట్లు కానరాదు. ఈ సంస్కారము తరువాతఁదరువాతఁ గ్రమక్రమముగ నేర్పడి మెఱుఁగు నొందినది. తిక్కనకాలమునాఁటికిఁగూడ నది సంపూర్ణసౌష్ఠవము నంద లేదు. పాల్కురికిసోమనాథుని యనుభవసారచతుర్వేదసారములలో నిట్టి సంస్కారము ప్రారంభమై తరువాతివారి కది మార్గదర్శకమైనది. ఇట్టి సంస్కారము నన్నెచోడుని సీసములలోఁగూడఁ జాలవఱకుఁ గాననగును. నన్నయకాలమునాఁటికి గ్రంథారంభము సంస్కృతశ్లోకముతోఁ బ్రారంభించు నాచార మున్నట్లు కాననగును. నిర్వచనోత్తరరామాయణములోఁ దిక్కనగూడఁ దానిని బాటించెను. కాని తరువాత గ్రంథాదినుండిగాక

చతుర్థపర్వముతోఁ బ్రారంభించి రచించిన భారతములో దానిని మాని వేసెను. కాని తిక్కనకుఁ బూర్వుఁడయిన పాల్కురికి సోమనాథుఁడే యీ మార్గమును బరిహరించెను. అతని యనుభవసారగ్రంథారంభము తెలుఁగుపద్యముతోనే యున్నది. నన్నెచోడుని కావ్యమునుకూడ నిట్లే యున్నది. కావున స్థూలదృష్టిని జూచువారికిఁగూడఁ బయికారణములఁ బట్టి నన్నయ ప్రాచీనత, నన్నెచోడుని యర్వాచీనత గోచరింపకపోవని నా యభిప్రాయము. షష్ఠ్యంతరచనమును మొదటఁ దిక్కనయే ప్రారంభించెననియు నన్నెచోడుని గ్రంథములోఁగూడ నిట్టి రచనముండుట కూడ నాతఁడు తిక్కనకుఁ దరువాతివాఁడనుటకు నిదర్శనమని శ్రీలక్ష్మీపతి శాస్త్రిగారు వ్రాసినారు. కాని యిదియొక గొప్పసంగతికాదు. తిక్కనకుఁ బూర్వము వెలసిన కొన్ని శాసనములలోని పద్యములలో షష్ఠ్యంతము లుండుట శాస్త్రిగారే యంగీకరించిరి.

ఇఁక ననుకరణములుగూడఁ గవుల కాలనిర్ణయమునకుఁ జాల వఱకు సాయముకాకపోవు. కాళిదాసోద్భటుల కుమారసంభవములను నన్నెచోడుఁడు పలుతావుల ననుసరించినాఁడని మొదటనే వ్రాసితిని. వారి నాతఁడు పేర్కొనుటవలనఁగూడఁ దద్గ్రంథముల నాతఁడు చదివి యనుకరించినాఁడనుట విస్పష్టము. కాళిదాసుని కుమారసంభవములో మొదటి యెనిమిదిసర్గలుమాత్రమే కాళిదాసరచితములను వాదము చాలఁ గాలమునుండి మన దేశమునఁ గలదు. ఎనిమిదవ సర్గముతోనే కుమారోదయము పూర్తియైనది. తరువాతఁ దారకాసురవధాంతము వఱకుఁ గల కథకూడఁ గాళిదాసరచితమేయనినచోఁ గుమారసంభవమను నామము కావ్యమున కుచితముగా నుండదని కొందఱ యాక్షేపము. అదియొక గొప్ప విషయముకాదు. అట్లే యయినచో నది మన నన్నెచోడుని గ్రంథమునకుఁగూడ వర్తించును. కాని సంస్కృతకుమారసంభవము మొత్తము గ్రంథము కాళిదాసుపేరనే యున్నను దొమ్మిదవ సర్గ మొదలు చివరఁ బదునేడవసర్గవఱకుఁ గల కావ్యశైలికిని మొదటి

యెనిమిది సర్గలలోని శైలికిని భేదమున్నదనియు నీ తరువాతిభాగములో మహారాష్ట్రదేశమందు వాడుకలోనుండు కొన్నిరూపములు కానవచ్చుటచే బదిరెండవ శతాబ్ది ప్రాంతమున మహారాష్ట్రదేశస్థుఁ డెవఁడో కాళిదాసుపేరట నీ కథాభాగమును వ్రాసియుండుననియుఁ గొందఱు తలంచుచున్నారు. నన్నెచోడుని గ్రంథమున సంస్కృతకుమారసంభవమందలి యీ తరువాతిభాగములోని కొన్ని శ్లోకములకుఁగూడ ననుకరణములున్నవనియు నిందువలనఁగూడ నాతఁడు పదిరెండవశతాబ్దికిఁ దరువాతివాఁడని యేర్పడుననియు శ్రీ శాస్త్రిగారు వ్రాసినారు. క్రీ॥ శ॥ 13, 14 శతాబ్దులందుండిన సుప్రసిద్ధ సంస్కృతకావ్యవ్యాఖ్యాతలు అరుణగిరినాథుఁడు, మల్లినాథుఁడు పూర్వోక్తములయిన 9-17 సర్గలకు వ్యాఖ్యానమొనర్పలేదనియు, అరుణగిరినాథుఁడు కుమారసంభవనామసామంజస్యమును గూర్చి కూడఁ గొంతచర్చయొనర్చెననియు నిందుచే నీగ్రంథభాగము పదుమూఁడవశతాబ్దికిఁ బూర్వము రచింపఁబడలేదనియు, లేదా దక్షిణహిందూస్థానమునఁ బ్రచారమునొందలేదనియుఁ దలంపవచ్చునని కూడ శ్రీశాస్త్రిగారభిప్రాయపడిరి. తరువాతికథతోనున్న గ్రంథభాగమప్పటికిలేకున్నచో నరుణగిరినాథునకు గ్రంథనామకరణమునుగూర్చినచర్చయొనర్చుటకుఁ దగినకారణమే కానరాదు. ఆగ్రంథభాగము రచితమయ్యునప్పటికి మనదేశమునఁ బ్రచారమొందకపోవుటచేతనే యావ్యాఖ్యాతలు దానికి వ్యాఖ్యానమొనర్పలేదని తలఁచినచో నది శాస్త్రిగారి సిద్ధాంతమునకు బాధకమే యగును. అట్టిసందర్భమునఁ బదునాల్గవ శతాబ్దివాఁడని శాస్త్రిగారుతలఁచు నన్నెచోడుఁడు మాత్రమాగ్రంథభాగమును జూచి యందలిశ్లోకముల నెట్లనుకరింపఁ గలఁడు? కావుననీగ్రంథభాగమప్పటికేయుండి కాళిదాసీయముకాదను తలంపుతోనే వ్యాఖ్యయొనర్పకవిడువఁబడెనని తలఁచుటయే సమంజసముగా నుండును. ఇంతకు నీగ్రంథభాగస్థ శ్లోకానుకరణము చాలస్వల్పముగా నున్నదని శాస్త్రిగారే యంగీకరించిరి. ఆగ్రంథభాగరచనాకాలమే నిర్వివాదముగ నిర్ణీతముకానప్పు

డు దీనినిబట్టి నన్నెచోడుని కాలనిర్ణయమొనర్పఁబూనుట సరియగుమార్గముకాదు. ఇఁకనాంధ్రకావ్యములందలి యనుకరణములఁ గూర్చి విచారింతము. కీ. శే. శ్రీ దేవరాజ సుధీమణిగారు "భారతకవులు—నన్నెచోడుఁడు" అను *వ్యాసమున నన్నయతిక్కనల భారతముతో నన్నెచోడుని కావ్యమునుబోల్చిచూచి దొరకినశాసనసామగ్రినిబట్టి నన్నెచోడుఁడు నన్నయతిక్కనలమధ్యకాలమున నుండియుండునని యంగీకరించుచుఁగవితాపరిపాకమునఁ దిక్కనకంటె మెఱుఁగులుచూపియుంటఁ దిక్కనకుఁ దరువాతివాఁడుకూడ నగునేమో యను ననుమానమును సూచించిరి.

దీనిమాత్రగాఁగొని శ్రీలక్ష్మీపతిశాస్త్రిగారు తిక్కనభారతముఁలో ద్రోణకర్ణపర్వములందలి కొన్నియుద్ధవర్ణనపద్యములను జూచియేనన్నెచోడుఁడు తనయుద్ధవర్ణనముల రచించెనని యుక్తిసహముగ నిరూపించిరి. మఱియుఁ దిక్కనకంకితమీయఁబడిన కేతనదశకుమారచరిత్ర మందలి కొన్నిపద్యములఁబట్టి కేతననుగూడ నన్నెచోడుఁ డనుకరించెనని వారు లిఖించిరి. నన్నయపద్యముల నన్నెచోడుఁ డనుకరించెననుటకుఁ గూడవీరు కొన్నియుదాహరణములనొసంగిరి. ఈయనుకరణములఁబట్టి యెవరినెవరనుకరించిరో యిదమిత్థమని నిరూపించుట కొంతవఱకుఁ గష్టసాధ్యమే. ఉదాహృతపద్యములకయి వారిగ్రంథమునుజూచునది. తిక్కనపద్యములు కొంతవఱకు మూలానుకరణములయిన సంస్కృతశ్లోకాంధ్రీకరణములవుటచేతను, నన్నెచోడుని పద్యములంతకన్న స్వతంత్రరచనములవుటవలనను దిక్కనపద్యములే నన్నెచోడుని పద్యములకు మాతృకలను నభిప్రాయము సమంజసమేయగును. కాని యీసందర్భమునఁ దమసిద్ధాంతమునకు బాధకమయిన యొక ముఖ్యవిషయమును శాస్త్రిగారు విమర్శింపక విస్మరించుట శోచనీయము. నన్నెచోడుని కుమారసంభవకళావిలాసములనుండి పద్యముల నుదాహరించిన లక్షణగ్రంథములలో అథర్వణచ్ఛందము ప్రాచీనతమమని శ్రీరామకృష్ణకవిగారు తమపీఠికలో వ్రాసియున్నారు.

* (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం 7 సంచిక 1)

నన్నెచోడుని మరణమునుదెలుపు "మగణమ్ము గడియ రగణము" అను పద్యముకూడ నందులోనిదనియే వారువ్రాసిరి.

నన్నెచోడుని కాలమువలెనే యథర్వణుని కాలముగూడ నిర్వివాదముగ నిర్ధరింపఁబడకుండుట శోచనీయము. అథర్వణచ్ఛందము నేఁటివఱకముద్రితమే. ఇదిగాక యథర్వణునిపేర భారతము, త్రిలింగశబ్దానుశాసనము, వికృతివివేకమను నామాంతరముగల యథర్వణకారికావళియను గ్రంథములు వినవచ్చుచున్నవి. వీనిలోఁగడపటిదిమాత్రమే ముద్రితమయినది. అదిచాలనూతనమని, అప్పకవికి సమకాలీనుఁడయి క్రీ. శ. 1700 ప్రాంతమున వెలసిన ప్రభంజనము అహోబలపతి (గాలినరసయ్య) యే వానినివ్రాసి యథర్వణునిపేరు వాని కారోపించెనని పలువురుపండితుల యభిప్రాయము. అథర్వణనామమే కల్పితమని కొందఱతలంపు. ఏది యెట్లున్నను మొదటికే మోసముతెచ్చుట తగినపనికాదు. అథర్వణచ్ఛందము తరువాతి లక్షణగ్రంథములు గొన్నిటిలో నుదాహృతమయినది. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరములో నన్నెచోడునిపద్యములు, అథర్వణభారతపద్యములుగూడ నుదాహృతములయినవి. అథర్వణభారతము తిక్కనభారతముకంటెఁ బూర్వపుదని కొందఱియభిప్రాయము. కావున అథర్వణచ్ఛందములో నన్నెచోడునిపద్యము లుదాహృతములయినమాట వాస్తవమే యయినచో, అథర్వణునికాలమును నిశ్చయించి యాతఁడు తిక్కనకుఁ దరువాతివాఁడని నిరూపించిననేగాని శ్రీలక్ష్మీపతిశాస్త్రిగారి సిద్ధాంతము నిలువనేరదు. ప్రాచ్యలిఖితపుస్తకాలయములో నథర్వణచ్ఛంద ప్రతులున్నచో వానినిబరిశోధించి శాస్త్రిగారిందుఁగూర్చి చర్చింతురుగాక. చిత్రకవి పెద్దనకూడఁ దన లక్షణసారసంగ్రహాములో నన్నెచోడుని పద్యముల నుదాహరించెనని శ్రీరామకృష్ణకవిగారు వ్రాసినారు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో లక్షణసారసంగ్రహాము ముద్రితమగుచున్నది. పరిషత్తువారికొకప్రతియే యీగ్రంథమునకులభించినది. పెద్దన తానుజెప్పిన లక్షణములకు లక్ష్యములుగా స్వంతపద

ములనే హనుమదంకితములుగా రచించి యుదాహరించినాఁడు. నన్నెచోడుని గ్రంథమునుండిగాని మఱి యేయితరకావ్యములనుండి గాని పద్యములేమియు నాతఁడు గయికొనలేదు. కావున శ్రీరామకృష్ణ కవిగారు మఱియొకలక్షణగ్రంథము దేనినయినఁ బేర్కొనుటకు మాఱు పెద్దనలక్షణసారసంగ్రహమని పొరపాటునవ్రాసిరా యనుట విచారణీ యము. అథర్వణచ్ఛందమునుగూడ వీరు సరిగాఁ బరిశోధించిరో లేదో? పాల్కురికి సోమనాథుఁడు నన్నయతిక్కనలకు మధ్యకాలమున క్రీ॥ శ॥ **1160-1240** మధ్య జీవించియుండెనని యస్మదాదులమొనర్చిన కాల నిర్ణయమును పలువురిప్పుడు నిర్వివాదముగ సంగీకరించుచున్నారు. అనుకరణములనే చూచినచో సోమనాథునిపండితారాధ్యచరిత్రమునం దును,నన్నెచోడుని కుమారసంభవమునందును సన్నిహితసాదృశ్యములు గల సంవిధానములు చాలవఱకుఁ గాననగును. శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారు తిక్కన కేతనాదులగ్రంథములనుండిచూపిన యనుకరణము లింత సాదృశ్య ముగలవికావు. సోమనాథ నన్నెచోడుల కావ్యములలోఁ గృత్యవతరణిక యందు గద్యయందుఁగూడ ననుకరణము లే. ఇరువురును శివకవులు. ఒకరి గ్రంథమును రెండవవారుచూచి యనుకరించిరనుట నిర్వివాదము. ఈ క్రిందిసంవిధానములఁ జూడుఁడు. సోమనాథునికావ్యములు భక్త్యావేశ ముతోరచించిన స్వతంత్ర గ్రంథములు-అవి వేనికి నాంధ్రీకరణములు గాని యనువాదములుగాని కావు. మహావేగముతో హిమవద్భూధరగు హాగ్రములనుండి దుముకివచ్చు గంగాప్రవాహముంబోలు సోమనాథ హుని సహజమహితవాక్ప్రపూరమున కితరకావ్యానుకరణములకుఁ జోటును ప్రసక్తియేకలుగనేరదని కొందఱు విజ్ఞులయభిప్రాయము. ఇత్యాదికారణ ములచేతను, సోముని ద్విపదపంక్తులనే సులువుగాఁ బద్యములోఁ బెట్టి నన్నెచోడుఁడు "నేలయునింగియు" యను పద్యమును వ్రాసియుండునని తోఁ చుటచేతను "సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకర ణప్రవృత్తయః" అను కాళిదాసోక్తినిబట్టి, ఆంధ్రపత్రిక దుందుభి (1922)

సంవత్సరాదిసంచికలో పాలకురికి సోమనాథునిఁగూర్చి వ్రాసిన వ్యాసములో నన్నెచోడుఁడు పాలకురికి సోమనాథునకంటె నర్వాచీనుఁడను నభిప్రాయమును బ్రకటించితిని. దీనిపయి నామిత్త్రులు కీర్తిశేషులు శ్రీ నడకుదిటి వీరరాజుగారు "కవిరాజశిఖామణి కాలనిర్ణయము" అను వ్యాసములోఁ గుమారసంభవమునందలి ప్రాఁతపదములఁ బట్టి నన్నెచోడుఁడు నన్నయకంటెఁ బూర్వుఁడను తమనిశ్చయమును దెలియఁబఱుచుటచే నావ్రాఁతలకు సమాధానముగా సోమనాథుఁడే నన్నెచోడుననుకరించెనని వ్రాసిరి. నన్నెచోడుఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁడో లేక సమకాలీనుఁడో యని బలవత్ప్రమాణములచే నిర్ణీతమయినప్పుడు శ్రీ వీరరాజుగారి యభిప్రాయము నామోదించుట కెట్టియభ్యంతరమును లేదు. అది పొసఁగనప్పుడు నన్నెచోడ సోమనాథులిరువురిలో నెవరు ప్రాచీనులనునది సందిగ్ధవిషయమే యగును. పూర్వోదాహృతమయిన రెండవమల్లిచోడుని పెదచెఱుకూరు శాసనమునఁ బ్రసక్తుఁడైన మొదటి నన్నెచోడుఁడే మనగ్రంథకర్తయైనచో నాతనికాలము క్రీ. శ. 1170 ప్రాంతమగును. అప్పుడు నన్నెచోడ సోమనాథు లించుమించుగ సమకాలీనులగుదురు. ఉభయులు వేర్వేఱు ప్రాంతములందుండినవారు. ఇరువురిమధ్యఁ దగినంత కాలవ్యవధి లేనిచో వారిగ్రంథములు వ్యాప్తమగుటకు నొకరికావ్యము మఱొకరు చూచుటకు నవకాశము కలిగెనా యనికూడ విచారింపఁదగును. కావున నిదమిత్థమని నన్నెచోడునికాలము నిర్ణయమగువఱకు సోమనాథుఁడే తిక్కనకువలె నీతనికిఁ గూడ నలువదియేఁబది సంవత్సరములు ముందుండెనేమో యని నేను దలంచెదను.

## సాదృశ్యములు.

కృత్యవతరణిక.

బసవలింగముకృతి పతి యఁటె కృతియు
రసికతఁ బండితారాధ్యచరిత్ర

మఁ జెపాల్కురికి సోమ నార్యుఁడు సుకవి
యఁ జె కథాశ్రోతసూ రామాత్యుఁడట్టి
కృతిపతి కృతికవి కృతికథాశ్రోత
క్షితిఁ జెప్పనొప్పదే శివభక్తసభల

(సోమనాథుఁడు)

వ. రవికుల శేఖరుండు కవి రాజశిఖామణి కావ్యకర్త స
త్కృవి భువి నన్నెచోడుఁడఁట కావ్యము దివ్యకథంగుమారసం
భవమఁట సత్కథాధిపతి భవ్యుఁడు జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁ డట్టి వినంగొనియాడఁ జెల్లదే.

(నన్నెచోడుఁడు)

గద్య.

ఇది యసంఖ్యాతమా హేశ్వర దివ్య
పదపద్మసౌరభ భ్రమరాయమాణ

(సోమనాథుఁడు)

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవదివ్య
శ్రీపాదపంకజభ్రమరాయమాణ.

(నన్నెచోడుఁడు)

వేశ్యమాతవర్ణన (మల్హాణునికథ)

నెట్టన నేలకు నింగికి నూత్ర
పట్ట మోఁకాళ్ళును బట్టికలయు
ముడివెట్టఁ దననీడఁ గడవంగఁ బాఱ
వడి నెండమావుల కడకాళ్లు గట్టఁ
బాయక రెండుగాఁ బాఱెడు నీరు,
వ్రేయఁ బుల్లున్నగో గోయనియమ్మ
తానార యొలువఁజ ట్రాతిపైఁ గ్రుం

నేనుంగు పురుడోయ నిసుకత్రాడ్వైన
లలి గొన దిశలు తాలములు వాయింపఁ
జెలఁగుచు రోఁకటఁ జిగురులు గోయఁ
గలివెన్న పుచ్చఁ గొండలు దొంతిఁ బేర్చ
నిల మంచు కుంచాలఁ గొలువ రేవగలు
సేయ నాకసమునఁ జిత్రరూపములు
వ్రాయ వాయువుఁ బట్ట వడగండ్లగుళ్లు
గట్ట వెన్నెలగుంపు గాఁ జేయఁ బుట్టి
పుట్టనప్పుడ నేర్చు బుద్ధుల ప్రోక
కోలాసక్తియు గొనములప్రోడ
యా లంజె తల్లి దా నల్లునిఁ జూచి

(సోమనాథుఁడు)

సీ. నేలయునింగియుఁ దాలముల్ వాయింప
　　నెండమావులఁబట్ట బండతలయు
మోఁకాలుముడివెట్ట రోఁకటఁజిగుళులు
　　గోయఁ జట్రాతిపైఁ గ్రుంకనిడుపు
లేకచిత్రమువ్రాయ నాకాశమునఁదాఁప
　　రములిడ మంచుఁగుంచములఁగొలువ
నేనుంగు పురుడోయ జానారఁగొనగాలి
　　గంటిడనిసుమునఁ గట్టుదాల్ప
నీరినడుము ద్రెంప ౯ నేలఁదెన్నుండిచే
వెల్పఁగలియుఁద్రచ్చి ౯ వెన్నగొనఁగఁ
గడవనేర్పుగలిగి ౯ కందువుమానఁడై
కత్తిగొంటులయిన ౯ యత్తగంతు.

(నన్నెచోడుఁడు ఆ. 8 ప 135.)

భంగిపోలె, కరణిపోలె మున్నగు సోమనాథుని ప్రయోగములు నన్నెచోడుని గ్రంథమున విరివిగఁ గానవగును. క్రియావిశేషణములలోఁ గర్త్రర్థమునఁగర్మణ్యర్థముల నుపయోగించుట సోమనాథునకుఁ జాలఁ బరిపాటి. మచ్చున కొకయుదాహరణము చూడుఁడు "నమస్కృత భావపరంపరావసానమహితదేశ" (అక్షరాంకపద్యములు). ఇచ్చట నమస్కరించు,అనుసర్థమున నమస్కరింపఁబడు అనుసర్థమిచ్చు"నమస్కృత" అను కర్మణ్యర్థరూప ముపయోగింపఁబడినది. ఇట్టిప్రయోగములు చేయుటలోఁగూడ నన్నెచోడుఁడు సోముని ననుసరించినాఁడు. చూడుఁడు.

అఖిలసుధీలోకాసందిత కల్పానోకహుఁడు.

(ఆ. 3 ప. 244)

నిఖిలకులాచల ప్రభావ విజిత రజత శిఖరిశిఖరమణి రమ్యహర్మ్య తలాలంకృతోత్తుంగసింహాసనాసీనుఁడు (ఆ. 3 ప. 245)

సీసపద్యరచనమునందు వలెనే కందపద్యరచనమునఁ బ్రతిపాదమునకుఁ బదము లెచ్చటి కచ్చట విడిపోవునట్లు కూర్పుచేయు సంస్కారముగూడ సోమనాథుని యనుభవసారమునఁ బ్రారంభమయ్యెనని "పాలకురికి సోమనాథకవి, అనుభవసారము" *అను వ్యాసమున వ్రాసియుంటిని. నన్నెచోడునికందములలోఁగూడ సీసంస్కారానుకరణము వ్యక్తమగును.

ఇఁక నన్నెచోడుని కర్ణాటక కావ్యానుకరణములఁగూర్చి విచారింతము-"హరహాసాకాశగంగాత్యమలజల" అను నన్నెచోడుని యంకితాంకపద్యము (ఆ. 4 ప. 475) క్రీ. శ. 1124 లోఁ త్రైలోక్యమల్లుఁడొకజైనమతమున వెలయించిన కన్నడశాసనములోనిపద్యమున కించుమించుగఁ బ్రతిబింబముగానున్నది. క్రీ. శ. 1100—1150 ప్రాంతమందుండిన నాగచంద్రుని మల్లినాథపురాణము, రుద్రభట్టుని జగన్నాథ విజయము ననుకర్ణాటకకావ్యములఁ దిలకించినచో నన్నెచోడుని పద్యములు కొన్నిటికి మాతృక లనఁదగిన పద్యములందుఁ గానవచ్చుచున్నవి. నవ

* ఆంధ్రసాహిత్యపరిషత్తు రజతోత్సవసంచిక.

మాశ్వాసమందలి "కరలతలందంద కామపాశంబుల నదిమిబంధించు చున్నట్లుబిగియ (ప. 348) అను పద్య మిందుకు దృష్టాంతము. జైనులు శబ్దార్థచౌర్యమునకు వెఱవరనియు నన్నెచోడుని పద్యములఁబట్టియే యాకర్ణాటకకవులు తమపద్యములరచించిరనియు శ్రీ రామకృష్ణకవిగారు వ్రాసిరి. పూర్వకవీంద్రారాధనరూపకమగు నిట్టి స్వల్పపద్యభావానుకరణ ములఁబట్టి కవులకు గ్రంథచౌర్యదోష మారోపించుట సరిగాదని నామ నవి. తెలుఁగు వచ్చునా రాదా యని సందేహింపఁదగిన రుద్రభట్టాది కర్ణాటకవులు నన్నెచోడుని గ్రంథమును జదివియే తమపద్యములవ్రాసి రనుటకంటె, ద్రావిడకర్ణాటకావ్యపరిజ్ఞానముగల నన్నెచోడకవిరాజ శిఖామణియే కర్ణాటకగ్రంథములనుండి యాభావములఁ గైకొనెనని తలంచుట సమంజసమని పలువురు సహృదయుల యభిప్రాయము.

పూర్వోక్తమయిన నాయభిప్రాయమునకు సాధకముగా నిదివఱకు విమర్శకులు తడవియుండని కొన్ని నూతనాంశములనిప్పుడు ప్రకటించు చున్నాను. నన్నెచోడుఁడు తనగురువు జంగమమల్లికార్జునునకు శివు నకు నాశ్వాసాద్యంతపద్యములఁలోనభేదాధ్యవసాయమొనర్చుటయేగాక కథామధ్యమునఁగూడ నాతనిని జిత్రముగఁ బ్రవేశపెట్టుట పాఠకు లెఱుంగనిదికాదు. పార్వతీకల్యాణమహోత్సవసందర్భమందలి యీ క్రిందిపద్యములఁ జూడుఁడు.

చ. ......వి భ్రమగతివచ్చిచూచెనొక భామినిజంగమమల్లికార్జునున్.
(ఆ 8 ప 61)

గీ. మగువ జంగమ మల్లయఁ దగిలిచూచి
(ఆ 8 ప 62)

ఇట్లే యీవివాహవైభవ వర్ణనాదికములలో నాకాలమునకుఁ జెందని నవనాథసిద్ధులను గూడ నన్నెచోడుఁ డీక్రిందిపద్యమునఁ బ్రవేశ పెట్టినాఁడు.

మ. శివు గౌరీసహితంబు సన్నుతుల నర్చించి ప్రేమెత్తించి భై
రవయోగీంద్రులఁ గొల్చి యోగినుల వీరవ్రాతముల్ దన్పి యా
నవనాథాదులనాదిసిద్ధులకు నానందించి వందిచ్చి యా
సవపాత్రల్ సతు లర్థినెత్తికొని యాస్వాదించి మోదించుచున్.

(ఆ 9 ప 327)

ఈనవనాథు లెవరు ? ఎప్పటివారు ? అనువిషయముల విచారించి నచో నన్నెచోడునికాలనిర్ణయమునకుఁ గొంతయవకాశము దొరకునే మో యని నాయాశయము. గౌరనామాత్యవిరచితమగు నవనాథచరిత్ర మను ద్విపదకావ్యమును నూతనముగా మదరాసు విశ్వవిద్యాలయము వారినడుమఁ బ్రకటించియున్నారు. ఇది శ్రీశైలమందలి వీరశైవభిక్షా వృత్తిమఠమున కధీశ్వరుఁడగు ముక్తిశాంతభిక్షావృత్తి యతీశ్వరుని యా జ్ఞానుసారముగఁ క్రీ॥ శ॥ 1430 ప్రాంతమున రచింపఁబడినది. శ్రీగిరికవి రచితమగు పద్యకావ్యమునుబట్టి తానీద్విపదకావ్య మొనర్చితినని గౌరన చెప్పికొనినాఁడు. ఈశ్రీగిరికవి యెప్పటివాఁడో సరిగా నిర్ణయింపరాకు న్నది. శ్రీగిరిరచితములని మఱిరెండుగ్రంథములు శ్రీగిరీశశతకము, శ్రీరం గమాహాత్మ్యము లక్షణగ్రంథాములలో నుదాహృతములయినవి. పాల కురికి సోమనాథునకుఁ బ్రత్యర్థిగానుండి తరువాత నాతనికి శిష్యుఁడయి వీరశైవమును స్వీకరించిన చక్రపాణిరంగనాథుఁడే మొదట శివదూష ణవలనఁ గనులుపోయినప్పుడు “నయనరగడ” “శ్రీగిరీశశతకము” ము న్నగుకృతులలో శ్రీగిరిని వర్ణించి నేత్రములు వడసినతరువాత శ్రీగిరినా మమును వహించెనేమోయని నాయనుమానము. ఇది పరిశోధింపఁ దగినవిషయము. నేనెఱిఁగినంతవఱ కాంధ్రకవులలోఁ బాలకురికి సోమనా థుని మొదటస్తుతించినవాఁడు పదునాల్గవశతాబ్దియుత్తరార్ధప్రాంతమం దుండి శివయోగసారమును రచించిన కొలనిగణపతిదేవుఁడు.

క. అసమ శివభక్తిరసమా
నసుఁడగు పాల్కురికిసోమ 5 నాథునిఁ గవిరా

జనసమున్నతయశస్సద్యః
ప్రసాదియగు చక్రపాణిశ్రీరంగనఁ గొల్తున్.

అని యొక్కపద్యమునందే సోమనాథరంగనాథుల నాతఁడు స్తుతించినాఁడు. కాని నన్నెచోడుని నాతఁడుగూడఁ బేర్కొనలేదు. గౌరనతన గ్రంథమును గేవలము శ్రీగిరికావ్యమును బట్టియే రచించినట్లు కాన్పించును. శ్రీగిరిగ్రంథమునకు వేఱొకమూలమున్నట్టులాతఁడు చెప్పలేదు. నవనాథులకాలమును జారిత్రకదృష్టితో నిర్ణయించుటకుఁ గొన్నియాధారములు గౌరన గ్రంథమునఁ గలవు. వారుసాధించిన సిద్ధవిద్యను బట్టి చిరజీవులై యీనవనాథు లెల్లకాలములందుఁండిన నుండవచ్చునను నీడి వాదముతో మనకుఁ బ్రసక్తిలేదు. వారు కేవలకల్పితపురుషులే కాని చారిత్రకపురుషులు కారను మిథ్యావాదులతో సంతకంటెఁ బ్రసక్తిలేదు. గ్రంథస్థాధారములఁ బట్టియు నితరప్రమాణములఁ బట్టియు మనము వారి కాలమును నిర్ణయింతము. ఈనవనాథసిద్ధులలోఁ బ్రథముఁడు ప్రసిద్ధుఁడు నయినవాఁడుమీననాథుఁడు.ఇతనికే మత్స్యేంద్రనాథుఁడని మఱియొకపేరు. నవనాథులలో నితనికిఁ బ్రియశిష్యులయిన సిద్ధులు (1) చౌరంగి (రాజరాజనరేంద్రుని పుత్త్రుఁడు సారంగధరుఁడు) (2) గోరక్షుఁడు. వీరిరువురు మాళవదేశమువారనియే గ్రంథమునఁగలదు. సారంగధరకథ యా దేశమునకుఁ జెందినట్లే యందువర్ణితమయినది. మీననాథుని శిష్యాగ్రగణ్యుఁడగు గోరక్షుని ప్రశంస, క్రీ॥ శ॥ 1165 ప్రాంతమువాఁడని కొందఱు, క్రీ॥ శ 1430 ప్రాంతమువాఁడని మఱికొందఱు తలంచు చామరసు రచించిన కన్నడప్రభులింగలీలయందును దానియనువాదమగు పిడుపర్తి సోమనాథుని తెలుఁగు ప్రభులింగలీలయందును గూడఁ గలదు. సిద్ధవిద్యయందెంత యుత్తీర్ణుఁడయినను మాయనుగెల్చు మోక్షవిద్యనాతఁడు, అల్లమప్రభునివలన గ్రహించి తరించినట్టులా గ్రంథములలోనున్నది. ఈయల్లమ గోరక్షుల సంవాదము మార్పంతగాలేకయే నవనాథచరిత్రమునఁ గూడఁ గూర్పఁబడినది. అల్లమప్రభువు క్రీ॥ శ॥ 1168 ప్రాంతమున

వెలసిన వీరశైవమతోద్ధారకుఁడగు కల్యాణబసవేశ్వరునకు సమకాలీనుఁ డయినట్లు బసవపురాణ ప్రభులింగలీలలవలన వ్యక్తమగుచున్నది. మఱియు నవనాథచరిత్రమున వర్ణితుఁడయిన వ్యాళిసిద్ధుఁడను మఱియొక సిద్ధుని కథలో నాతఁడు తనసిద్ధవిద్యాప్రకటనసందర్భమునఁ గల్యాణపట్టణమేలు*బల్లహుఁడను రాజొనర్చిన ద్రోహముకతనఁ బ్రాణములు గోల్పోయి ప్రాణావసానసమయమున నాబల్లహుఁడు నాతని సంతతియు నిర్వంశముగ నశింతురుగాకయని శపించినట్లు చెప్పఁబడినది. కల్యాణపట్టణము నేలిన యీబల్లహుఁడు బసవేశ్వరుని యేలికయగు బిజ్జలుఁడే (1145-1168) యని వేఱచెప్పనక్కఱలేదు. సోమనాథుని బసవపురాణపండితారాధ్యచరిత్రములందలి యీక్రిందిపంక్తులవలన నదివ్యక్తమగును.

"వీరువారన కెల్లవారునుగూడి ♦ ధారుణీశ్వరుసభాస్థలికేఁగి మ్రొక్కి-
బల్లహా! వినుము నీపట్టణంబునను ♦ బల్లదుండొకచాకి బత్తుండననుచు
(బసవపురాణము-మడివాలు మాచయ్యకథ)

కల్యాణమున కభిగమనంబుసేయఁ ♦ గల్యాణమునభక్తి గజిబిజిపుట్టె
బల్లహుబిజ్జలు భంజించిరంత ♦ బల్లిదుల్ జగదేవ మల్లబ్రహ్మయలు.
(పండితారాధ్యచరిత్ర-మహిమప్రకరణము)

సోమనాథుఁడు బసవపురాణమున బిజ్జలుఁడు శివద్రోహకారణమున బసవేశ్వరునిచేఁ ద్యజింపఁబడి యాతని శాపానలమునకు గుఱియై తత్ఫలముగ ననతికాలములో సపుత్త్రముగ నశించెనని చెప్పియున్నాఁడు. సోమనాథునకుసమకాలీనుఁడో యించుకతరువాతివాఁడో యగు శ్రీగిరికవి కూడఁ దన నవనాథచరిత్రమున బిజ్జలుని వంశనాశనమునకు మఱియొక సిద్ధశాపమును గూడ సిద్ధపఱిచెనని తెల్లమగుచున్నది. కావున నవనాథచరిత్రమునుబట్టి యాసిద్ధులలోఁ గొందఱయిన క్రీ। శ। పదిరెండవశతాబ్దియుత్తరార్ధమున బసవేశ్వరునికాలమున వెలసినట్లు కానవచ్చుచున్నది.

---

* గ్రంథప్రకాశకులు దీనిని "బల్లవ" యని ముద్రించినను దప్పొప్పులపట్టికలో "బల్లహా" అను పాఠము నొసంగిరి.

క్రీ. శ. 1275-1296 ప్రాంతముననుండి "దీపిక"యను సంస్కృతగ్రంథము ను రచించిన జ్ఞాననాథుఁడు గురుపరంపరయందు వర్ణించుచు మత్స్యేంద్ర నాథునకుఁ దనకుమధ్య గోరక్షనాథ, గగననాథ, నివృత్తినాథులను ముగ్గురను బేర్కొనినాఁడు. మత్స్యేంద్రుఁడను మీననాథున కీతఁ డయి దవతరమువాఁడని యిందువలన వ్యక్తమగును. దీనిని బట్టి కూడ మీన నాథగోరక్షనాథులు క్రీ. శ. 1150-1170 ప్రాంతమువారగుదురు. నవనా థచరిత్రమున వర్ణితులయినవారుగాక శైవసిద్ధులగు నవనాథులు మఱెవ రును గానవచ్చుటలేదు. మహారాష్ట్రభాషలో నొక నవనాథచరిత్రము న్నదనియు నందలి సిద్ధులు వైష్ణవసంప్రదాయమువారనియు వారు తరు వాత వెలసినవారనియుఁ దెలియుచున్నది. శైవసిద్ధులే మొదటివారని ప్రమాణబుద్ధిగలవారు నిర్ణయించుచున్నారు. ఈవిషయముల నెల్ల నాలో చింప శ్రీగిరినవనాథచరిత్రమును జూచియే నన్నెచోడుఁడు పయిపద్య మున నవనాథసిద్ధులను బేర్కొనియుండుననియు దీనినిబట్టికూడ నాతఁడు పాలకురికి సోమనాథునకు శ్రీగిరికవికిఁ దరువాతనే వెలసియుండుననియుఁ దోఁపకమానదు. విజ్ఞులీవిషయమును లెస్సగాఁ బరిశోధించి సత్యనిర్ణయ మొనర్తురుగాక.

అథర్వణుఁడుకూడఁ దన త్రిలింగశబ్దానుశాసనమునఁ క్రీ॥ శ॥ 1170 ప్రాంతమందు శబ్దశాసనమును రచియించిన హేమచంద్రునిఁ బలు మాఱులు స్మరించుటచేఁ బాలకురికి సోమనాథునకుఁ దరువాతివాఁడగు ట విస్పష్టము. ఆతఁడు భారతమును విరాటపర్వమునుండి రచించుటచేఁ దిక్కనకు సమకాలీనుఁడో లేక యించుక పూర్వుఁడో యగుననెడు నానుడియేగాని యందుకుఁ దగిన ప్రమాణములు కానరావు. ఆతఁడు తిక్కనకంటె నర్వాచీనుఁడే యని యెప్పుడుచో నాతఁడు రచించిన ఛంద మున నన్నెచోడుని పద్యములును "మగణమ్ము గదియరగణము..." అను పద్యమును గానవచ్చినను శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారు తలంచినట్లు తిక్కనయుద్ధవర్ణనములందలి యనుకరణములఁ బట్టి నన్నెచోడుఁడు తిక్కన

కుఁ దరువాత సమీపకాలమున నుండెనని తలంచుటకూడ సమంజసమే యగును. పాలకురికి సోమనాథునకుఁ దిక్కనకు మధ్య విశేష కాలవ్యత్యాసము లేదు. కాకతీయ గణపతిదేవుని సభకుఁ దిక్కన యేఁగినపుడు సోమనాథుఁడప్పటికి వృద్ధుఁడయ్యుఁ దానుగూడ నచ్చటి కేతెంచినట్లు కొన్ని ప్రమాణములున్నవి. ఇది నిజమయినను గాకున్నను నిరువురు సమీపకాలస్థులనుటకు సందియము లేదు.

మహాశయులారా! నన్నెచోడుఁడు నన్నయాదులకుఁ దరువాతివాఁడైనంతమాత్రమున నాతని గౌరవమునకు భంగము లేదు. మన మాతనిని బూజించునది యాతని కవితాతత్త్వమునుబట్టియే గాని కాలతత్త్వమునుబట్టి గాదు. "పురాణమిత్యేవ నసాధుసర్వం నచాపికావ్యం నవమిత్యవద్యం" అని కవికులగురుఁడు ఘోషించినాఁడు. "కాలోహ్యాయంనిరవధి ర్విపులా చపృథ్వీ" సత్యమెన్నటికయిన బయల్పడకమానదు. మాయ యెంత యావరించినను దానిని జీల్చికొని తన నిత్యసహజతేజమును బ్రసరింపఁ జేయుటయే దాని నైజము. కావునఁ బండితులు కేవలము చారిత్రకదృష్టితో సత్యముదెసనే మనముఁ బఱపి యథార్థనిర్ణయమునకై యత్నింతురుగాకయని సవినయముగఁ బ్రార్థించుచున్నాను.

ఓం తత్సత్.

---

# సుభాషితభూషణయుగళము.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

---

ప్రాక్తనకాలమందైనను, అద్యతనసమయమునందైనను ఘనజీవనబిందువులు స్వాతిని శుక్తిపుటములఁబడి, యాణిముత్తియములై వెలయునటుల, కవిఘనసూక్తులు సాహితినిఁ గృతిపుటములఁబడి, సుభాషితమౌక్తికములై తనరారుచున్నవి. ముక్తాపరిణామమునకు వలెనే సూక్తిపరిణతికిని కాలసరణికారణము కాదు.

అందుచేఁ బ్రాచీనకావ్యములకే విలువకలదు కాని, ఈనాటి కబ్బముల కట్టి సీటు రానేఱదని తలంపఁదగదు. కావుననే కాళిదాసవిద్వన్మౌళి "పురాణ మిత్యేవ న సాధుసర్వం నచాపికావ్యం నవమిత్యవద్యం" అని ప్రకటించియున్నాఁడు. ఇందుచే సారకోవిదులగు చదువరులు గుణములఁ బాటింతురు కాని ప్రాఁగ్రొత్తల గణింపరను సంగతి విదితమగుచున్నది.

నిజమాడవలసినచోఁ బ్రత్యూషమున నిద్రాముద్రితములై కాసారవారితరంగసంచారములచే నిలకడలేక యూగాడు సరసిజకోరకముల వర్ణానురాగసుందరములగు కరస్పర్శలచే వికసింపఁజేసి, సౌందర్యసౌరభ్యసౌకుమార్యాదిసంపదలఁ దక్కుకొల్లఁజేయువాఁడే దినకరుఁడు. వ్యాకులతాముకుళితములై సంసారసాగరభంగాఘాతములచే స్థిరత లేక డోలాయమానములుగానున్న మానవజీవితరాజీవముకుళముల మనోహరభావభాసురములగు కవితాకల్పనములచే వికసింపఁజేసి ధైర్యౌదార్యగాంభీర్యాదిగుణసంపదల నందఁజేయువాఁడే కవిభాస్కరుఁ డని పలుకవలయును.

అయనభేదములచే వేఱువేఱురోచులతో సలరారు రవిమండలములచాడ్పున సమయభేదముచే భిన్నభిన్నరుచులతో విరాజిల్లుచున్న

రెండు ఖండకావ్యమండనముల సహృదయులగు కవిసోదరు లుభయు లాదరముతో నాకొసంగియుండిరి. ఆకృతియుగళియం దొకటి ధీరలలితుఁడగు దేవకుమారుఁ డొకఁడు నిజప్రణయినికి నీరదద్వారమున నందఁజేసిన శ్రోత్రపేయమగు ప్రణయసందేశము. మఱియొకటి ధీరశాంతుఁడగు మానవనందనుఁ డొకఁడనురాగబద్ధయగు ముద్దియనుఁ దెలియఁజేసిన మనోహరమగు ప్రేమోపదేశము.

ప్రాథమికకావ్యరచయితలు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి మహాశయులు. ద్వితీయకృతినిర్మాతలు శ్రీరాయప్రోలు సుబ్బారాయ మహాదయులు. మొదటిగ్రంథమునకు "మేఘదూత" అని నామధేయము. రెండవ పుత్త్రమునకు "తృణకంకణము" అనిపేరు.

ఈ కబ్బంపుజంటలో మొదటిదానియందు నాయకుఁ డొకఁడే ప్రత్యక్షమగుచున్నాఁడు. ఈతఁడు శాపవశమున నిలువీడి యడవినిఁబడి నిజమనోరమానురాగవివశుఁడై క్రుమ్మరు కాముకుఁడు. రెండవదానియందు నాయికానాయకు లుభయులు సాక్షాత్కరించుచున్నారు. ఈయువతీయువకు లిరువురు నిజహృదయజనితములగు ప్రేమగంధము లొండొంటితో మేలవింపకమున్నె వీఁగిపోయిన బైరాగులు.

ఆదికావ్యమునందు నాయకుఁడు ముందేవిప్రవాసదినములు దారరిక్తప్రకోష్ఠముతో నడయాడుచున్నాఁడు. ద్వితీయకృతిని నాయిక, మొదటఁగట్టఁబడిన పట్టుదారంపుతోర మొదిగింపఁబడి యటఁగూర్పఁబడిన తృణకంకణముతోఁ జూపట్టు మణికట్టుతో నొప్పారుచున్నది.

మేఘదూతరచయితలు ప్రాచీనసాహితీమర్యాదాలోలురు. కావుననే పూర్వసాంప్రదాయానుసారము తమకు విద్యాప్రదానమొనర్చిన గురులఁ గావ్యాదినిఁ బ్రస్తుతించి యున్నారు. తృణకంకణస్రష్టలు నవ్యసాహిత్యసాంప్రదాయలోలుపురు. కావున నవీనరీతినిఁ గృత్యాదిని తమ కానందప్రదులగు కవికుమారుల నుతించియున్నారు.

మొదటికావ్యమునకుఁ గృతిపతులు సుప్రసిద్ధయశస్సాంద్రులగు శ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజావారు. రెండవగ్రంథమును గృతినందినది నీరదసుత. ఈమె నవీనోదిత యగుటచే నవిదితచరితగా నున్నయది. ఈ కావ్యద్వయమునందును నాద్యంతము లవిదితోదంతాంతములై వెలయుచున్నవి.

వైద్యశిఖామణి యోషధిమూలముల సంగ్రహించి చక్కని చక్కెరపాకముతోఁ జేర్చి, యారోగ్యప్రదమగు రుచ్యరసాయనమునుగా మార్చునట్లు శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు, 'మేఘ' మూలముల స్వీకరించి తెలుఁగుతేనెపాకముతోఁ జొనిపి లలితసుందరమగు ననువాదరసగోళకములుగా సమకూర్చియున్నారు. శ్రీ సుబ్బారావుగారన్నను పరమేష్ఠి నిజమేధామహిమచే నపూర్వవస్తుసృష్టిని జేయునట్లు స్వధీశక్తిచేఁ దృణకంకణకృతిని సొగసుమీఱ నిర్మించియున్నారు.

దూతను "పురుషుఁడొక్కరుఁ డొంటిగ్రుమ్మరుచునుండె......" అని యున్నటులనే కంకణమున "పడంతియొకర్తు కాల్నడకన బోవుచుండె ........." అని చూపట్టుచున్నది. దీనింబట్టిచూడ రాయప్రోలువారు కాళిదాసమేఘసందేశమును మనసున నిడికొని కంకణారంభము సాగించినటులఁ దోఁచుచున్నది. "కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః" అను మేఘపద్యఛాయనే వీరితెలుంగు పద్దెముకూడ నడచినది "కాచిత్కాంతా విరహగురుణా స్వాభిలాషేణ ముగ్ధా" అని వీరిపద్దెమును సంస్కృతములోని కనువదింపవచ్చును. కేవలము దూతకంకణములకుఁ గల సామ్యభేదవాదములతోఁ గాలముగడపుటకంటె పాఠకమహాశయులకుఁ గావ్యద్వయసాహితీమాధుర్యములఁ జవిజూపుట సమంజసమని తలంచి యుభయకావ్యములనుండి కొన్నిపద్యరత్నములఁ గ్రోడీకరింపనెంచితిని. అందు ముందు దూతయందలి పద్దెంపు పసంపుల వినిపించి, పిమ్మటఁ గంకణమునందలి నుడికారంపుసొంపులఁ బ్రకటింతును.

సీ. "లలితంబగు ప్రియంగులతఁ జూచి తలయూఁచు
గనులారఁ జిఱుతరంగముల నరయుఁ
బుష్పగుచ్ఛముల సొంపుల నెంచి పులకించు
బర్హిబర్హము సారె బాఱఁజూచుఁ
బరిపక్వబింబంబుఁ బలుమఱుఁబరికించు
నలికిన లేటి చూడ్కులను వలచుఁ
దలిరుటాకుల మెత్తఁదన మిచ్చఁగడు మెచ్చుఁ
జిలుకపలుకులకుఁ జెవియొసంగుఁ
బ్రకృతిసౌందర్యతత్త్వార్థపాఠపఠన
రీతియో; కాక, పూర్వానుభూతరమ్య
వస్తుసంస్మరణక్షణపరవశతయొ;
కవికుమారుఁడో, యాతండు కాముకుండొ !"

ఈపద్యము మూలానువాదముకాదు. అయినను శాపమునకుఁబూర్వము నాయకునకు ననుభూతములై యున్న మనోహరవిషయములు, క్రమవికసితంబు లగునట్టుల నిట నాటవికవస్తుసందర్శనవ్యాపారములు నీటుగాఁ జిత్రింపఁబడినవి.

ఉ. "అత్తఱి నొక్కవారిధర మంబరసీమ నలంకరించి యు
వ్వెత్తుగ నట్టిటుల్ మసలి యించుకయించుక దిగ్గవాఱి భూ
భృత్తటి నావరించెఁ దనియింపుల నెచ్చెలిఁ జేరవచ్చి రే
కెత్తిన ప్రేమఁ గౌఁగిటఁగదించెడు నెయ్యుని తియ్య మొప్పగన్.

సుమమంజరిని మనోహరమగు మధుబిందుసందోహసంపదయు మెత్తని నెత్తావిసిరియుఁ గలసియుండునట్లీ పద్యమున గంభీరమగు భావగుంభనమును సుందరమగు పదలాలిత్యమును వెలయుచున్నవి.

చ. "తమకృషికెల్ల మూలమగు దైవమ వీవని పల్లెతొయ్యలుల్
బొమలవిలాసముల్ నెఱపు పోఁడిమి నేరని ప్రేమచూడ్కులన్

గమికొనిచూడ, మాలమనఁగాఁదగు క్షేత్రముఁ జక్క నెక్కినే
గిమి తగ శీరకర్షణపరీమళ మచ్చట వెల్లిగొల్పుమా. ”

ఈపద్యగుంభనము పొగడపూలయల్లికవలె నామోదావహమై యున్నది.

గీ. ప్రీతి రణభూమి కసువు లర్పించి నట్టి
భరతపుత్రుల రక్తప్రవాహతతులు
పాఱి పాయలు గట్టిన పట్టులచటఁ
గన్పడును, నేటికిని మేను గగురుపొడువ.

గీ. వరుస నచ్చటఁ బొడకట్టు భారతీయ
కదనవీరకపాలకంకాళసమితిఁ
గన్నులారగఁ నొకపరి కన్నఁజాలు
బందకైన మగంటిమి పరిఢవిల్లు.

ఈపద్యఖనులఁ దళుకొత్తుచున్న శౌర్యగుణరత్నకాంతులు మనము మఱపొందిన పూర్వభారతవీరతేజోరూపములఁ గన్నులయెదుటఁ దాండవమాడించుచున్నవి.

సీ. లోకైకవందిత వైకుంఠపాదార
విందనిష్యంది మరందధార
సర్వసర్వంసహా పర్వతాధీశ్వర
సామ్రాజ్య పట్టాభిషవణజలము
స్ఫుటమహానటజటా జూటాటవీవాటి
కా వికస్వరమల్లికా సుమంబు
శాపాగ్నినిర్దగ్ధ సగరతనూభవ
స్వర్గాధిరోహ సోపానపంక్తి

తే. గీ. తుంగతరభంగరింగణోద్ధూత సకల
భువనకిల్బిషకర్దమ, దివిజగంగ

తత్సమాలోకనము సుఖదాయకంబు
తత్సమారాధనము భవతారకంబు.

ఈపద్యరాజము దీపాలవారి సహజానర్గళకవితామకరందధారావతరణ రామణీయకమును జాటుచున్నది.

ఉ. ఆఱని చింతచే నుడిగి, యాభరణంబులు లేక సారెకున్
సారెకు దుఃఖదుఃఖముగ, శయ్యఁగలంగు లతాంగి మేనిలీ
రారయ నీ వొగి న్నవజలాశ్రులరాల్చెద, వెట్లుచూడఁగా
నోరుతురయ్య ! ఆర్ద్రహృదయుల్ మిముబోంట్లు రులోంపుకష్టముల్.

ఈపద్యమునందలి ప్రశ్నంపునుడులజాడ చాలఁ జాలిఁగొలుపుచున్నయది. పెక్కేల; దూతకవితయందలి పద్యములెల్ల నక్లేశాస్వాద్యమాధుర్యభరితములగు కాశ్మీరద్రాక్షాఫలములవలె మనోహరములై యొప్పుచున్నవి. మఱియు, మూలమునలేని యమూల్యభావసంపద లెన్నియో యిందు వెలయుచున్నవి.

సీ. రమణీయభర్మ హర్మ్యములచేఁ గనులకు
విందుగొల్పెడు పుటభేదనములు
కమనీయకుసుమసుగంధమ్ముకలిమి మో
దమ్మునుగూర్చు నుద్యానతతులు
అలసినయపుడెల్ల నందందు విశ్రమిం
పఁగఁ దగు రమ్యపర్వతచయంబు
వలసినయెడలఁ ద్రావగ నగు పరిలఘూ
దకములనొలయు స్రోతస్వినులును
గలిగి గమనానుకూలమై వెలయు మార్గ
మును వచించెద ముందుగా వినుము సఖుఁడ
నేడ్చ మూమకసందేశ విషయమెల్ల
నవల వినియెదు శ్రోత్రపేయంబుగాగ.

ఈపద్యరాజము నిసర్గసుందరమగు భారతదేశనిస్తులవస్తుసంపదను గీర్తించుచున్నది.

ఇంతటితో శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి కవితామృద్వీకోద్యానవీథులనుండి శ్రీ సుబ్బారావుగారి కవిత్వమాకందోద్యానవాటికలోని కేగుదము.

వసంతాగమసమయమున సహజారుణమృదులములగు తీయమామిడి లేఁజిగురుల మెసవి, పికయువకము నిసర్గసుందరములగు నిజకూజితగానముల శ్రుతిసుఖదముగఁ బాడునట్లు శ్రీ రాయప్రోలు పుంస్కోకిలము ప్రశాంతముగఁ బ్రేమరసాలకిసలయరుచులఁజొక్కి నవ్యసాహిత్యకల్పతరుశాఖపై నెక్కి కర్ణరసాయనముగఁ దృణకంకణ వీణానాదములతో వీనులకు విందుచేయుచున్నయది. నవ్యనాగరికతావిలాసిని యగు సువాసినినుదుటఁగుంకుమతిలక ముండనట్లె నవ్యసాహిత్యకలాభిమానుల పద్యముల మొదట చిహ్నము లుండవు. అందుచే వారి కైతలలక్షణమును వెంటనే కనిపెట్ట వీలుకాదు. అందుకుఁ గొంత ప్రయాస మవసరము.

ఆ విపంచీపంచమస్వరముల నిటఁ గొంచెము వినిపింతును.

"పసినిమ్మపండుచాయల
గొనరెడి యాకుసుమగంధి కోమలపుటొడల్
కసుగందిన కవటా కన
వసివాడె నిదాఘతాప పరిపీడనచేన్.

ఈపద్యవిధానమాధురి తేఁటనీటియూట బాటసారుల కాహ్లాదము నొదవించునటులఁ బాఠకులకు హాయిని గలిగించును.

గీ. "గ్రీష్మ ఋతు వౌట వడగాలి కీలివోలె
వీచి ప్రాణికదంబంబు వేచుచుండె
గండశిలలు చెమర్చు నాయెండవేళఁ
బెండుపడియుండె నాతఁ డా కొండకోన."

మేఘదూతయందలి యీపద్యమును, తృణకంకణమునందలి మీఁదిపద్యమును, ఉష్ణమానవాళములవలె వేసఁగివేడిమిని సరిగాఁ జూపుచున్నవి.

"పదియు నాల్గు వసంతముల్ వదలనట్టి
వయసు సొగసుదనం బామె మెయినెసంగ
బాల్య మెడలిన మొలుచు జవ్వనపు నూఁగు
ఒడలియం దందముగ నుట్టిపడుచునుండె.

ఇందలిపదముల నూఁగు పారకశిరముల నూఁగాడించుననుటకు సందియములేదు.

"ముగ్ధమధురమైన లేడి ముగ్ధలాట
లోలపవనాకులలతావలోకనంబు
పొడుపుటేటిమెలపు, జారుప్రాగ్ధవలపు
నాయమ నొకానొక వికార మందఁజేసె."

ఈపద్యము ముగ్ధలొల్కు సుగ్ధలతో నొద్దికగా నున్నయది.

"చేలచెఱంగుసనన్ మొగముచెమ్మటలొత్తు, చెయిం బెసంచు, నీ
లాలకము ల్మొగమ్ము గవియన్ బయి కెడ్డముదిద్దు, మోవిపై
వ్రేలిడి యాలకించు, మురిపెంపు కనుంగవనిండ వాలికల్
దేలగజూచు, నెద్దియొ మదిం దలపోయు ననేకరీతులన్."

కవిశిఖామణి యీపద్యమున వ్యాకులచిత్తయగు మత్తకాశిని వ్యాపారముల ముచ్చటగాఁ జిత్రించియుండెను.

"కాలమా, యాస నడియాస గాఁగఁజేసి
వేసటలద్రోసి యాయాసపెట్ట దలతె!
వృంత మెడసేసి తింక లతాంత మొంత
తడవు కృశియించి సొబగులు చెడకయుండు."

ఈ గేయము భక్తావతంసుఁడగు త్యాగరాజుని కృతిలాలిత్యగరిమను సరిగ ననువదించుచున్నది.

"విడుపు లెఱుగని కోర్కుల, నెడలు గనని
భావపరిచయముల నింతవఱకు దనిసి
తనియని యభేదరాగబంధములు పెనచి
యేల త్రెంపంగ నిపుడు సుహృద్వతంస !"

ఈపద్యమునందు భగ్నాభిలాషిణియగు యువతీమణి యడిగిన ప్రణయార్ద్రమగు ప్రశ్నవైఖరి శిలామయహృదయులనుగూడ ద్రవింపఁ జేయఁజాలియున్నది.

"ఈ తృణకంకణంబు భరియింపుము నీమణిబంధమందు సం
ప్రీతిని నప్పుడప్డు వలపింపుల నెయ్యము జ్ఞప్తిఁగొన్న బ్రా
భాతికవేళ నీప్రణయబాష్పకణాంజలి నింత యిచ్చి, యే
రీతిని వాడకుండ నలరింపు, మిదే తుదివాంఛ సోదరీ !"

అనురాగకిసలయపోషకమగు నీ పద్యభావ మాలించినతోడనే పాపము మిడిమెండ నడుగులు బొబ్బలెత్తఁ బ్రణయవీథిని నోడలెరుంగక యొకయువతితోఁగూడి సుఖింపవలయునను పేరాసతో వనికిఁ బరుగిడి, తుదకుఁ దనయాస యాయాసమాత్రఫలక మాయెనుకదా యని ఖిన్నయైయున్న యాచిన్నదానిచందము పాఠకులకు విచార ముదయింపఁ జేయకమానదు.

"మనసుచే వాక్కుచేత గర్మంబుచేత
గలుషితములు కాదగిన నీవలపు లవని
తపసుచే తాల్మిచే ధ్యానధారచేత
లీనమై యైక్య మంద జాలినది ప్రేమ"

గీటురాతిగీత పసిఁడివిలువను విడఁబఱచిచూపునట్లు, ఈసీటుగీతిక ప్రేమమోహాముల వెలల వేఱుచేసి చూపుచున్నది.

శ్రీ సుబ్బారావుగారు నేటిభావకవితాసమితికిఁ జెందినవారైనను వీరికవితావాహినిలో నవ్యసాహిత్యపట్టభద్రులు కొందఱు చిత్రించెడి

యసభ్యశృంగారవికారములు కానరావు. వీరికవితాధార శరత్కాలవాహినీ నీరమువలె నిర్మలమై ప్రశాంతమై సుఖసేవ్యమై యున్నతమార్గమునఁ బ్రవహించుచున్నది. తృణకంకణమునందలి పద్యములన్నియు రాగమాధుర్యసుందరములగు నంటుమామిడిపండ్లవలె నోరూరుచీఁ నూగాడుచున్నవి. ఈకవిచంద్రు లుభయులును, ఇంకను నిట్టి సరసకవితాసుధామయచంద్రికల నాంధ్రదేశమునఁ బ్రసరింపఁజేసి విజ్ఞానసంపదల సమకూర్తురుగాక.

ఓం తత్సత్.

---

# గ్రంథస్వీకారము.

1. రాజసూయరహస్యము:—బ్రహ్మశ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే విరచితము. పిఠాపురము కౌండిన్యనిలయమున లభించును. వెల రు 1—0—0.

ఈగ్రంథమున మహాభారతమునందలి ధర్మజరాజసూయవృత్తాంతము చర్చింపఁబడినది. శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు గ్రంథకర్తల నభినందించుచు వ్రాసిన విపులమగు పీఠిక గలదు. ప్రథమభాగమున గ్రంథకర్త మహాభారతము పంచమవేదమనుటకు నది విధ్యర్థవాద మంత్రాత్మకమని నిరూపించియున్నారు. మొదట జయమనుగ్రంథము భారతమహాభారతములయినదని యంద అంగీకరింపవలసిన విషయమే. కాని వేదప్రతిపాదిత విషయములన్నియు మహాభారతమునఁగలవని విమర్శింపఁబూనుట సమంజసముకాదు. ప్రాచీనకాలమున రాజసూయమెటులజరిగెనో తెలియుటకై వీరు 'ఐతరేయబ్రాహ్మణ శుక్లయజుర్వేద' ములఁగల భాగములఁ గైకొనియున్నారు. శునశ్శేపునిగాథ రాజసూయమున కుదాహరణముగఁ గైకొనరాదని పీఠికలో శ్రీరామలింగారెడ్డిగారే వ్రాసియున్నారు. జరాసంధవధయు నట్టిదే. ప్రాచీనకాలములోఁగల నరమేధరాజసూయాదులకును, అర్వాచీనమహాభారతేతివృత్తమునకును ముడివెట్టుట సరికాదు. విమర్శకులు వేదపురాణయుగముల కాలవ్యత్యాసమును గమనించినటుల దోఁచుటలేదు. గ్రంథకర్తలు విశేషపరిశ్రమమొనర్చి జయాఖ్యాన మహాభారతములందలి రాజసూయగాథలకుఁగల మార్పులను జర్చించియున్నారు. ధర్మజరాజసూయము వైదికరాజసూయమనియు, శిశుపాలవధ కృష్ణునిచే నంపులకే జేయఁబడినదనియు వీరు గ్రంథాంతమునఁ దమయభిప్రాయమును వెలిబుచ్చిరి. వీరి విమర్శనము నూతనమార్గమును ద్రొక్కినది. విజ్ఞులిందలి విషయములఁ జర్చింతురుగాక. కృష్ణరాయల దండయాత్ర, అబిసీనియా యుద్ధము, మద్య

పాన నిషేధశాసనము మొదలగు కొన్ని యనవసర విషయములు గలవు. వేదకాలమునను దత్పూర్వమునను గల పశువధ, మాంసనిషేవణము, మద్యపానము, మొదలగునవి తరువాత నిషేధింపఁబడినవి. యజ్ఞయాగాదికములఁ బిష్టపశువును గైకొనుట యందుల కుదాహరణము. అటులనే సాంఘికవిషయములు, వివాహము, పుత్రస్వీకరణాదులలోఁ బెక్కు మార్పులు, కాలానుగుణములగు నిషేధములును వచ్చినవి. వానిని విమర్శకులు చారిత్రకదృష్టితోఁ గైకొనవలసియున్నది.

---

2. రామోపాఖ్యానము:—తద్విమర్శనము. బ్రహ్మశ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచియింపఁబడినది. పిఠాపురము వెల రు 1—4—0.

ఈగ్రంథమున భారతారణ్యపర్వాంతర్గతమును, ఎఱ్ఱాప్రగడ విరచితమునగు రామోపాఖ్యానమూలమును, నూటనలువదిరెండుపుటల విపులమగు పీఠికయుఁ గలవు. ప్రథమమున మూలకథ వచనరూపమున నొసఁగఁబడినది. అందు వాల్మీకిరామాయణము, సంస్కృతభారతము, భాస్కరరంగనాథుల యాంధ్రగ్రంథములకును, ఎఱ్ఱాప్రెగడ రచనమునకును భేదము లీయఁబడినవి. తరువాత నెఱ్ఱాప్రెగడ రచించినది నష్టభాగపూరణముగాదనియు నారణ్యపర్వశేషమనియు నిరూపింపఁబడినది. పీఠికాంతమున నన్నయతిక్కనయెఱ్ఱాప్రెగడల కవిత్వధోరణిని గూర్చి పెక్కు విషయములు చర్చింపఁబడినవి. ద్రౌపదీకీచకఘట్టమున తిక్కనమూలాతిక్రమణ మొనర్చుటయేగాక రసాభాసమను దోషమునకు గుఱియయ్యెననియు నప్పటికి ద్రౌపది కలువదియేండ్లనియు వీరు నిరూపింపయత్నించిరి. వీరివాద మీసందర్భమునఁ బండితజనాదరణీయము కాదని తెలుపవలసియున్నది. మఱియు నెఱ్ఱాప్రెగడకుఁ బ్రబంధపరమేశ్వరబిరుదముండుటచే, రామోపాఖ్యాన మొక మహాప్రబంధమని యష్టాదశవర్ణన నవరసాదుల కుదాహరణము నొసఁగుటకై

ప్రయత్నించుటనవసరము. గ్రంథకర్తలు లాంధ్రులు, వారిభాషను (పు 51-82) గూర్చి పెక్కువిషయముల వ్రాసిరి. అవి వివాద గ్రస్తములగుటయేగాక నేటి భాషాశాస్త్ర చారిత్రకపరిశోధనలకు భిన్నముగ నున్నవి. ఆపస్తంబుఁడు సాల్వదేశీయుఁడని వీరి యభిప్రాయము. ఆర్యావర్తమునుండి యపుడపుడుచేరిన యార్యులసంస్కృతము, దండాదుల ప్రాకృతము, భోజకాకతీయాదుల శౌరసేని, ఖరాదుల పైశాచి (ప్రాచీనద్రావిడము) కాలాంతరముల మిళితమై యాంధ్రమైనదట. కాకతీయులు యెపుడో, యెట్లో యాంధ్రావనిఁ జేరిరట. వారితో శౌరసేని దక్షిణాపథముఁ జేరెనట. ఆంధ్రకర్ణాటమళయాళభాషలు ప్రాకృతప్పట్టములోనివని వీరియభిప్రాయము. పోలమూరు, కొండనూగూరు, మాలెపాడుశాసనము లీయఁబడినవి. ప్రస్తావవశమున భోజునికథలును గలవు. ఐతరేయబ్రాహ్మణమునఁగల యాంధ్రులప్రశంసకును, తైత్తిరీయమునఁగల 'ఆంధని'కిని ముడివెట్టఁబడినది. ఇట్టివిషయములు పెక్కులు గలవు.

---

3. అభిషిక్తరాఘవము:—శ్రీ వాడ్రేవు సీతారామస్వామిగారిచే సుప్రసిద్ధమగు శ్రీ రామేతివృత్తముతో రచింపఁబడిన యేడంకముల నాటకము. ఈనాటకము ప్రాచీనకవిపుంగవుల గ్రంథముల ననుసరించుచున్నదనియు, 'కూరుపుభంగి క్రొత్త' యనియు వ్రాయఁబడినది. పెక్కుతావుల భాసాదులనాటకములకుఁ గేవల మనువాదముగనే యున్నది. ప్రతిమానాటకమునఁ బ్రథమపంచమాంకము లిందలి ప్రథమద్వితీయాంకములతోఁ బోల్చిచూడనగును. ఇది స్పష్టముగ నెచటను దెలుపకపోవుటచే గ్రంథమునందలి విషయములు కవిగారిచేఁ గల్పితములని పీఠికలోఁ బ్రమాదమున వ్రాయఁబడినది. భవభూతి రాజశేఖరాదులు రామాయణేతివృత్తమును నాటకమునఁ బ్రదర్శింపఁబూని విధ

లు లైరనియు, కవిగారు కృతకృత్యులైరనియు వ్రాయుట యతిశయోక్తి. శ్రీరామేతివృత్తము నెందరెన్ని విధముల రచించినను హృద్యముగనుండు నని చెప్పనవసరము లేదు. శైలి సరళము. మృదుమధురపదభూయిష్ఠము. విజయనగరవాస్తవ్యులగు రావుసాహేబు వి. జి. సుబ్బయ్యపంతులు గారి కంకితము వెల రు 1—0—0.

---

4. శ్రీమదాంధ్రమహాభారతసంశయవిచ్ఛేదము:—వఝు సూర్యనారాయణగారు ధూళిపూడి. మహాభారతమునందలి 'ధర్మముఖ్యవిషయాంతరభావపదార్థసారము'ల గ్రహింపలేక భారతమునకుఁ గొందఱపార్థము వ్రాసి కుక్కలు చించిన పుల్లెఁ జేయగాఁ దొడగుటచే నీగ్రంథమును రచించితిమని గ్రంథకర్తలు దెలిపియున్నారు. ఇందు ప్రశ్నోత్తర దృష్టాంతములుగఁ బద్యరూపమున మహాభారతమునందుఁ గల పెక్కు విషయములు చర్చింపఁబడినవి. ప్రతియంశమునుగూర్చియు భారతము నుండి ప్రమాణములీయఁబడినవి. గ్రంథకర్తల యభిప్రాయము లెటులున్నను విషయము మిగులఁ బ్రధానము నుపయోగకరమైనదనుట నిస్సంశయము. వీరీ పద్యరచనను విడచి గద్యమున నీగ్రంథమును రచించినచో వీరి ప్రయత్న మింకను శ్లాఘనీయముగ నుండి యుండును.

వెల రు 1—0—0.

---

5. ఆంధ్రకథాసరిత్సాగరము ౧౩ వ లంబకము:—ఇది శ్రీపీఠికాపురమహారాజాస్థానకవీశ్వరులగు బ్ర॥ శ్రీ॥ ఓలేటి వేంకటరామశాస్త్రులు గారు రచించిన కథాసరిత్సాగరములోని పదమూడవలంబకము. దీనికిఁ జతుర్దారికాలంబకమని పేరు. ఈలంబకమున మూఁడుతరంగములుకలవు. ఇంచుమించుగా ౮౦౦ పద్యము లున్నవి. ౧౫౮ పుటలు. శాస్త్రిగారి కవిత్వధారను బరిషత్పత్త్రిక లోకమున కిదివఱకే వెల్లడిచేసియున్నది. ఈసంపుటమునందలి పద్యములు నిర్దుష్టములును హృద్యములునై యున్నవి.

ఆంధ్రీకరణవిధానము.

శ్లో. కిరీటీ కుండలీ దివ్యః ఖడ్గీ చావాతర త్పుమాన్
ప్రణతం కల్పితాతిథ్యం తుణా ద్వత్సేశ్వరోఽథ తమ్
క స్త్వం కిమిహ తే కార్య మిత్యపృచ్ఛ త్సకౌతుకమ్
సో ప్యవాదీ దహం మర్త్యో భూత్వా విద్యాధరాధిపః
సమ్పన్న శ్శక్తి వేగాఖ్యః ప్రభూతాశ్చ మమారయః.

గీ. అనుచునిట్లు యౌగంధరాయణుఁడు దెల్పు
చుండఁ గుండలియును ఖడ్గియునుగిరీటి
యునగు నొకదివ్యపూరుషుండుప్పరమున
నుండి చయ్యన డిగి నృపునొద్ద నిలిచె.

క. నిలిచిన నచ్చెరుపడి భూ
తలనాథుఁడు భక్తివినయతత్పరుఁ డై యం
జలి ఘటియించి నమస్కృతి
సలిపి తనిపె నతని నతిథి సత్కారములన్.

చ. పదపడి యాతనింగని నృపాలకుఁ డిట్లనెనో మహాత్మ యే
పదముననుండి నీవిటకువచ్చితి వెవ్వఁడవీవు కార్యమె
య్యదియిటనీకుఁ దెల్పఁదగునేని వచింపఁగఁ గోరువాఁడ నా
కది విన కౌతుకంబు హృదయంబునఁ దద్దయు నుప్పతిల్లెడున్.

క. అనుటయు నతఁడిట్లనెనో
జననాథా నేను మర్త్యజన్ముఁడ నట్ల
య్యును విద్యాధరవిభుతన్
గనినాఁడను శక్తివేగనామాంకితుఁడన్.

వ. నాకుఁ బెక్కండ్రు శత్రువులు కలరు.

ఏలాకో వీరు ప్రకటించు భాగములకు వెలలు తెల్పుటలేదు.

---

# పత్త్రికాస్వీకారము.

1. విభూతి. సికింద్రాబాదు పట్టణమునఁ బ్రతిమాస శివరాత్రిని వెలువడు పత్త్రిక. ప్రథమపుండ్రమునందుఁ బ్రథమ రేఖాంకిత మగు సంచిక యీసంవత్సర మహాశివరాత్రికిఁ బ్రచురింపఁబడినది. కేవలము వీర శైవ మతవిషయములను గూర్చిన వ్యాసములే గాక సారస్వతవిషయములకు సంబంధించిన వ్యాసములు, భారతదేశమునందలి భాషాసమస్య, శుద్ధబోధిజాతకము, మేఘదూతకథకు మూలము మొదలగునవి కలవు. నిజాము రాష్ట్రమునఁ బ్రకటింపఁ బడుచున్న యీపత్త్రిక యచటి యాంధ్రుల విజ్ఞానమునకుఁ దోడ్పడి యభివృద్ధిని గాంచు గాక.

సంవత్సర చందా రు 2-8-0 వలయువారు 4298 సజన్‌లాల్‌వీధి సికింద్రాబాదు, దక్కన్ అని వ్రాయవలయును.

2. ఆంధ్రి. ఇది కాకినాడ తాలూకా పల్లిపాలెములో శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారిచేఁ బ్రకటింపఁ బడుచున్న మాస పత్త్రిక. ఈపత్త్రిక వైశాఖసంచిక మూఁడవ సంవత్సరమును జేరినది. గ్రామవాసులలో విద్యావిజ్ఞానవ్యాప్తికై యుదయించినటుల సంపాదకులు వ్రాసియున్నారు. ఇందు ఆంధ్రనాటకోత్పత్తి, కళావిష్కరణము మొదలగు వ్యాసములుగలవు. వ్యాసముల చివరసంపాదకులయభిప్రాయములుగలవు. అవి గమనింపఁదగినవి. సంవత్సరచందా యొక రూప్యముమాత్రమే. వీరలు యువకులయ్యు నేకాగ్రతతో నిట్టి యమూల్యభాషాసేవకులగుట మిక్కిలి శ్లాఘనీయము. ఆంధ్రీకుటీరమునుండి వెలువడుచున్న నీ యాంధ్రిని యాంధ్రు లాదరింతురుగాక.

3. నవశక్తి. బెజవాడలో నాంధ్రరాష్ట్రకాంగ్రెసు సోషలిస్టుపార్టీ వారిచేఁ బ్రకటింపఁ బడుచున్న వారపత్త్రిక. సోషలిస్టు సంఘమువారి యాశయములతో రాజకీయవిషయములు విమర్శింపఁబడును. కార్మిక, కర్షకజీవనముల నూతనశక్తిని, యుత్సాహమును గలుగఁ జేయుటయే యీపత్త్రికముఖ్యోద్దేశము. సంవత్సరచందా రు 3-0-0.

4. ఆంధ్రవాణి. ఈపత్త్రిక బెజవాడలో వారమునకు రెండుసారులు ప్రకటింపఁబడుచున్నది. ఇందు రాజకీయ, ~~సాంఘిక~~ విషయములు జర్చింపఁబడును. సంవత్సరచందా రు 6-0

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు, పరిషద్వ్యవస్థీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ, బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు(కోశాధ్యక్షులు)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ,. ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ., బి. ఎల్.

ఆకెళ్ల వేంకటరామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావునాయుఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయుఁడుగారు.

# సగము వెల.

ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడిన శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువుతప్ప తక్కిన గ్రంథములును, ఇరువదియేడు సంవత్సరములనుండియుఁ బ్రకటింపఁబడిన పరిషత్పంచికలును ది 1-7-39 మొదలు 31-10-39 వఱకు సగము వెలలకీయఁబడును. విమర్శకులకు, విద్వాన్ శిరోమణి పరీక్షార్థులకును నుపయోగించెడి వ్యాసరాజము లీసంచికలందుఁ బెక్కులుగలవు.

వలయువారీ క్రిందిచిరునామాకు వ్రాయుఁడు.

ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యదర్శులు.

సూర్యరావుపేట,

కాకినాడ.

Printed by N. Achutaramiah at the Cocanada Printing works Cocanada and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము ౨౮ | ప్రమాధినామసంవత్సరము. జ్యేష్ఠాషాఢ మాసములు. | సంచిక ౨.





కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక, రు. ౦-౮-౦.

1939 ఏప్రెల్, మే.

# విషయసూచిక.



# శ్రీ
# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౭. { ప్రమాధినామసంవత్సరము. జ్యేష్ఠాషాఢ మాసములు. } సంచిక ౨.


## మనవి.

---

ఈ సంచికలో "చిత్రకవి పెద్దనార్యుని" లక్షణసారసంగ్రహము పూర్తిగఁ బ్రకటింపఁబడినది. పీఠిక క్రముముగఁ బ్రకటింపఁబడును. శ్రీయుత మానవిల్లి రామకృష్ణకవి ఎం. ఏ. గారు దయతో మాకొసంగిన, సూరయకవి కృతమగు ఉదయనోదయము తరువాతి సంచికనుండి ప్రకటింపఁబడును. దీనికి మఱియొక ప్రతి మాకులభించియుండలేదు. ఎవరియొద్దనైన వ్రాతప్రతిగాని తాళపత్రగ్రంథముగానియున్నచో దానినిబంపిన సరిచూచి వెంటనే పంపివేయుదుము. పత్రికాపాఠకులును చందావారులును నెప్పటివలెనే పరిషత్తునందు గౌరవాభిమానములుంచి పరిషత్కార్యనిర్వహణమున మాకుఁ దోడ్పడుదురని యాశించుచున్నాము. నిశ్శంకకొమ్మన శివలీలావిలాసమునకుఁ బ్రతులెచ్చటనైన నున్నచోఁ దెలుపఁగోరుచున్నాము.

కార్యదర్శులు.

---

# వ్యాకరణశాస్త్రప్రశంస.

మల్లాది సత్యనారాయణశాస్త్రిగారు.

---

బాగుగనాలోచించినచో వ్యాకరణశాస్త్ర మొక సూక్ష్మీకృత నిఘంటువని తెలియఁగలదు. ఆయంశమునకు ముందు నిఘంటువిషయ మాలోచింతము. నిఘంటువునందు శబ్దస్వరూపము ప్రతిపదోక్తముగ నిర్దేశింపఁబడి ప్రథమాంతముగఁ గనఁబడుచుండును. అర్థనిర్ణయము గూడ వెంటనే చేయఁబడును. నానార్థములఁ దెలుపుటగూడఁ గలదు. మఱి యాశబ్దముల విశేషాంశములు సాధారణముగఁ జెప్పఁబడవు. సాధారణముగఁ గ్రియారూపములన్నియుఁ, గృత్తద్ధితాంతరూపములు కొన్నియు, నవ్యయములు గొన్నియు, మఱి యనేకశబ్దముల సంయోగ కాలికరూపవిశేషములన్నియుఁ, దెలియఁబడవు. అట్టి గ్రంథములు పండితులచేఁ దఱచు చేయఁబడకపోవుటకుఁ గారణము, వారికి గ్రంథవిస్తరభీతియే యని తలఁతును. అనంతమగు పదజాలము నట్లు చూపుటకూడఁ గర్తలకు విసుగుగ నుండును. పాఠకుల కుపయోగముగూడ నంతగ నుండకుండుటచే విడువఁబడి యుండవచ్చును. కాని వారట్లు ప్రతిపదోక్తములనే చెప్పియున్నచో నధునాతనవిమర్శకుల యభూతకల్పనలకు నంతగఁ దావులేకుండెడిదేమో. లేదా, గుణవంతులైనను నిరుక్తినిఘంటువునువలె వానినిగూడ నూటికొకఁడు కోటికొకఁడు చూడఁగల్గునేమో. ఎట్లయిన నింత ప్రమాదస్థితి రాకపోయెడిది.

ఈవ్యాకరణశాస్త్రమున్ననో భాషావిషయక విషయములన్నియుఁ గరతలామలకముగ నొనర్చి యభ్యాసకునకు స్వాతంత్ర్యమును దెచ్చియిచ్చును. నిఘంటు వట్లు చేయక సాధకుని నిద్రపుచ్చును. అదియే కావచ్చును వ్యాకరణము చేసికొనిన పాపము.

వ్యాకరణము శబ్దస్వరూపమును లాక్షణికముగఁ జూపుచు, నేవిషయమునను సందేహమును నిలువనీయక నిద్రించిన సాధకుని బ్రబోధించును. ఈతారతమ్యమును బట్టియే కాఁబోలు చాలమంది పండితులు వ్యాకరణము కొఱకే తమ జీవితకాలమంతను వినియోగించి యున్నారు. ఆవ్యాకరణము వేదపురుషునకు శిరస్సుగా నెన్నఁబడుచుండుట కూడ దాని ప్రాధాన్యమును వ్యక్తపఱచుచున్నది. ఇచట వేదమనఁగ జ్ఞానమని యర్థము చెప్పవలెనేమో. అట్లయిన వ్యాకరణము జ్ఞానసాధనమని యర్థము రాఁగలదు. కనుకనే "శక్తిగ్రహం వ్యాకరణోపమాన" మ్మని వ్యాకరణమునే ముందుగఁ జెప్పియున్నారు. దీనియందలి సౌకర్యమును గనుఁగొనియే వారు నిఘంటుగ్రంథసంఖ్యను బెఱుగకుండఁజేసియుందురు. ఆ వ్యాకరణము శబ్దస్వరూపనిర్ణయమునఁ బ్రత్యంశమును సందేహముకలుగకుండ విశదీకరించుననుమాట నిర్వివాదముగదా. అర్థవిశేషముకూడనుండనే యున్నది. శబ్దస్వరూపప్రదర్శనము నిఘంటు వ్యాకరణములయందుఁ గొంతవఱకు సమానమైనను నిర్మాణసూత్రములు మాత్రము వేఱువేఱు, కనుక నిఘంటువును జూచి వ్యాకరణమును వ్రాసిరో, వ్యాకరణమును జూచి నిఘంటువును వ్రాసిరో యనుటకు నిర్ణాయకసహాయము లేదుగాని, రెండును మొదటఁ బరస్పర సాపేక్షములై బయలువెడలి యుండునని నాకుఁ దోఁచుచున్నది. మఱియొక్క విషయమేమనఁగ నిప్పటి కాగితములు,ఇప్పటి రాకపోకలును లేని యాదినములలో, నెంతజాగరూకతతోఁ గాపాడినను గ్రంథము లగ్నికృములమూలమున స్వరూపనాశమందు నాదినములలో, నిఘంటువువంటి ప్రతిపదోక్తపాఠముగల కోశములు సంశయములను బోఁకార్చునవి కాకపోయెనేమో. అవియు నమలిబుగ్గనుంచుకొనుటకు వీలులేనివని యాపద్ధతిమాని యంతకంటె సూక్ష్మరక్షణపద్ధతి యవసరమైనదేమోవారికి. కనుకఁ బ్రతిపదోక్తపాఠపద్ధతిని వీడి లాక్షణికపాఠపద్ధతిని జాకరూకతకొఱకు నవలంబించియుందురని నా తలంపు.

మఱియు నారెండువిధముల గ్రంథములు నున్నచో నొకదాని రూపము నొకటి సంవదించునుగాన సాధకునకు శబ్దస్వరూపనిర్ణయములో సందేహము గలుగదు. అట్టి పరమోపకృతి యొనర్చు గ్రంథములలో వ్యాకరణము మహాభారమని తలఁచువారికి నిఘంటువుకూడ భారాతిభారమై యుండవలదా? అందొకదానిని వీడుట, యొకదానిని గ్రహించుట, నవీనపద్ధతి కనువగు త్రోవకాదుకదా. రెండును శబ్దస్వరూపము నసియాడకుండఁజేయుచున్నప్పుడు పై వారి స్వేచ్ఛకు నడ్డంకు కావుటలేదా? కనుక వారారెండుగ్రంథములను దగ్గఱఁ జేరనీయరాదనియే నాతలఁపు, మఱియు భాషలోని సమస్తపదములనఁగ, నవ్యయములు, క్రియాపదములు సంయోగ వియోగకాలికశబ్దరూపవిశేషములుమిగిలిన కృత్తద్ధితోణాది ప్రత్యయాంతరూపములు మఱికొన్ని యవ్యుత్పన్నప్రాతిపదికలు నొకగ్రంథమందు సంపూర్ణముగ వ్రాయఁబడియే యున్నవను కొనుఁడు. ఇప్పటి యీవ్యాకరణము లేదనియే యనుకొనుఁడు. అప్పుడు మాత్రము భాషాప్రవాహ మరికట్టఁబడి యుండదా? కనుక వారిమతములో నట్టి గ్రంథమే యుండరాదని తేలఁగలదు, గాననట్టివారెంత భాషా సంరక్షకులగుదురో విమర్శకులు పరిశీలింతురు గాక.

యద్యపి బహు నాధీషే తథాపి పఠ పుత్ర వ్యాకరణమ్.
సకలం శకలం మాభూ త్సకం శాకం సకృ చ్ఛకృత్.

---

# ఉపాయనము.

మోచర్ల రామకృష్ణయ్యగారు.

---

చ. ప్రణుతచరిత్రయై పరమపావనియైన పినాకినీ పయ
స్విని మధురప్రసన్నజలశీకరముల్ చిలికించుచోట మొ
ల్చిన యెలమావి మొక్కయిది లేఁబరువమ్మునఁ గ్రొత్తచోట నా
టినను ఫలించె పేర్చి పురడించి కడల్కొని వృక్షరాజమై. ౧

చ. ఋతు వెదియైనఁగాని యొకరీతి రుచిప్రచుర ప్రసాద భో
గ్యతకుఁ గొఱంతలేని యొడికంపు టఖండపుఁ గాపుగాచి, క
ణ్యతగల ప్రాక్ప్రతీశ్వర గణమ్ముల సృష్టిని జ్ఞప్తి చేయు ని
శ్రితికి నిదానమయ్యెను జుమీ ఫలగౌరవసిద్ధి పెంపునన్. ౨

చ. జిలుఁగు తెలుంగు వాఙ్మయ విచిత్ర వనస్థలులందు సిద్ధహ
స్తులు మును సంతరించిన విశుద్ధపథమ్మున వృద్ధినొంది పె
ద్దలవశమయ్యె, నిప్పటి యుదగ్రపు టుప్పెనకున్ దుపాను గా
డ్పులకును సంచలింపని పటుద్రుమమయ్యె దృఢప్రకాండమై. ౩

మ. విజయశ్రీకులు తొంటి రెడ్డినృపతుల్ విద్యా వినోదాఢ్యు లీ
ప్రజఁ బాలించెడివేళ నాంధ్రకవితా రాజ్యేందిరా సుందరీ
భజనానందపరాయణప్రవణులై వర్తించునాఁ డిట్టి యా
రజపున్ భూజము లెన్నొ తెచ్చి తమ యారామంబులన్ బెంచరే!

ఉ. ఆ రసికావతంసుల జయాంకము లచ్చుపడన్ దదీయ శో
భా రమణీయ రక్తికి నవన్యతికిన్ నెలవై శుభోజ్జ్వలా
కార రసోప శోభిత వికస్వరమూర్తి ధరించినట్టి యీ
ధీరవరేణ్యుఁడీ యధిపతిత్వము నూనుట యెంతభాగ్యమో! ౫

మ. సుమనస్సేవిత సింహపట్టణ నివాసుల్ చిత్పురద్వారదే
శమునన్ జేరిన మంగిటింటికడపన్ సారస్వతస్వాపతే
యము వీక్షించి యెలర్చి పండువులు సేయంబూనఁగా సౌమన
స్యమునన్ నీవిటువచ్చు టక్కమొకదయ్యా రామలింగాగ్రణీ! ౬

మ. వెలిగెన్ స్కాందపురాణసాగర సమావిర్భూత గంభీర వా
గ్విలస ద్దివ్యచిరత్నరత్నము పినాకిన్యాపగా తీర మం
డలమందే యల పాండురంగ కవిరాట్కల్యాణకావ్యాకృతిన్
గలిగెన్ నేఁటి కిదే నదీతటమునన్ గామారికాఖండమున్. ౭

శా. కామాక్షీకరుణాకటాక్షసుఖ రేఖల్ నీపయిన్ సోఁకి, ని
త్యామోదంబు ఘటించి, యచ్యుతపద వ్యాసంగ సంసిద్ధికిన్
భూమానంద విభూతికిన్ దగిన ప్రాపున్ గూర్చి నిర్వ్యాజ ని
స్సీమాయుర్విభవమ్ము నీకొసఁగుతన్ శేషాద్రివిద్వన్మణీ! ౮

మ. స్థిరకీర్తిన్ జరితార్థజన్ము జనమంచిన్ సాధుసంపూజ్య ని
ర్భరసౌజన్యనిధిన్ బృహత్కృతి శతప్రఖ్యాతునిన్ గౌరవిం
చిరి సౌవర్ణ పరిష్క్రియాంచిత సమీచీన ప్రబంధమ్ముతో
సద్బుద్ధారంగ నిదంవిధమ్ములరఁ గామాక్షీనిశాంతాధిపుల్. ౯

---

కళాప్రపూర్ణ, జనమంచి శేషాద్రిశర్మగారు రచించిన "కామారికా ఖండము" జన్నవాడ కామాక్షిదేవికి సమర్పించిన సందర్భమున మోచర్ల రామకృష్ణయ్యగార అర్పించిన పద్యావళి. ఈ సభకు ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులగు డాక్ట కట్టమంచి రామలింగారెడ్డిగారు అధ్యక్షులుగ నుండిరి.

# ప్రాచీనకన్నడశాసనములు.

---

ప్రాచీనశాసనములు భాషాస్వరూపనిర్ణయమునకే గాక యన్యభాషలతోడి సంబంధమునుగూడ నిరూపించుట కుపయుక్తములగుచున్నవి దక్షిణదేశభాషలగు తమిళ కన్నడ మళయాళాంధ్రములు దక్షిణభాషాకుటుంబమునకుఁ జెందినవను 'రవరెండు కాల్డ్వెలు'గారి సిద్ధాంతమును బలువురు విశ్వసించుచున్నారు. 'ఆంధ్రము కేవలము ప్రాకృతభాషాజన్యమే'యను వాదమును గలదు. కన్నడభాష రెండువేలసంవత్సరముల క్రిందట, తల్లియగు ద్రవిడభాషనుండి విడిపోయినదని సామాన్యముగ నంగీకరించిన విషయమే. శాతవాహనరాజుల నామములలోను బిరుదావళులలోను గన్పడు 'పులిమాయి, విళివాయకుర' మొదలగుపదములు ద్రావిడభాషాపదములని యంగీకరించినను, కన్నడపదములే యనుటకుఁ దగినయాధారములు లేవు. క్రీ. శ. 2 వ శతాబ్దమునాఁటిదని నిర్ధారణమొనర్పఁబడిన గ్రీకుప్రహసనమొకటి యిటీవల దొరకినది. దానికి 'ఆక్సిరింఖస్ పాపిరసు' అనిపేరు. ఈప్రహసనమున భారతదేశీయపాత్రలు మాట్లాడుభాషను గూర్చి విమర్శకులు చర్చించియున్నారు. దానిని బాగుగఁ బరిశోధించిన డాక్టరు హుల్ష్లు, శ్యామశాస్త్రిగారును నందలిభాష ప్రాచీనకన్నడమని నిర్ధారణచేసిరి. పాఠకులందలి విశేషములఁ దెలిసికొనఁగోరుచో 1926 సం॥రం మైసూరు శాసనపరిశోధకసంఘమువారి నివేదిక (పుటలు 11-21) ను జూడఁదగును. అందలిభాష క్రీ. శ 2 వ శతాబ్దమునాఁటి కన్నడభాషయని యంగీకరించినను కన్నడవిద్వాంసుల కీసందర్భమునఁ గలిగిన సందేహములింకనునివృత్తములుకాలేదు. అందలి భాష కన్నడముకాదని వారిలోఁ గొందఱ యభిప్రాయమైయున్నది.

కన్నడభాషయందు బహుప్రాచీనములని యింతవఱకు విశ్వసింపఁబడిన గాంగవంశజులశాసనములు, తగరె తామ్రశాసనము మొదలగు

నవి నిజముగఁ బ్రాచీనములు కావనియు, కల్పితములనియుఁ బలువు రూహించుచున్నారు. కాని నిస్సందేహముగఁ బ్రాచీనకన్నడశాసనము లను నవి క్రీ. శ. 570, 580 నాఁటివగు కీర్తివర్మ, మంగళేశుల బాదామి చాళుక్యశాసనములే. అంతకుఁ బ్రాచీనముగ నుండునవి యింతవఱకుఁ గన్పడియుండలేదు.

ఇటీవల మైసూరుశాసనపరిశోధకశాఖోద్యోగులు బేలూరు హాోబళియందలి హల్మిడిగ్రామములోని వీరభద్రాలయమున దొరకిన కదంబవంశజుఁడగు కకుత్స్థవర్మశిలాశాసనమును ప్రకటించియున్నారు. ఇందలిభాషను లిపిని గన్నడభాషావేత్తలగు రైసు, నరసింహాచారి మొదలగువారు ప్రాచీనకన్నడములేక 'పూర్వదహళ కన్నడ'మని నిర్ణయించిరి. ప్రాచీనకన్నడభాషాలక్షణము లిందుఁ బెక్కులు కన్పించు చున్నవి. శాసనలిపి అణాజి, వస్తరె, శిలాశాసనములకును బ్రాచీన కదంబశాసనమగు హాల్సీతామ్రశాసనమునకును జేరువుగనున్నది. ప్రథ మమున నొక సంస్కృతశ్లోకమును, తరువాతఁ గన్నడశాసనభాగమును గలవు. కదంబకకుత్స్థవర్మకాలమగుటచే క్రీ. శ. 450 ప్రాంతమునాఁటిదని నిశ్చయింపనగును. రెండు ముఖ్యవిషయము లీశాసనమున మనము గమ నింపవలసియున్నవి. శాసనకాలమునాఁటికే కర్ణాటభాష సంస్కృత సంబంధమును బూర్తిగఁబొంది ప్రాచీనప్రబంధభాషగ నేర్పడినదనుట మొదటిది. ఈశాసనభాష చాలకాల ముపయోగింపఁబడి వృద్ధిపొం దిన ప్రాచీనకన్నడభాష యగుట రెండవది. శాసనమందలి విషయము పల్లవకదంబుల చరిత్రమున మిక్కిలి యుపయోగకరము. తఱచు వీరికి యుద్ధములు జరగుచుండెను. అణాజిశాసనమున కృష్ణవర్మ కదం బుఁడు పల్లవులచే నోడింపఁబడెనని తెలియుచున్నది. ఈశాసనమున కదంబులవిజయము వర్ణింపఁబడినది. ఈయుద్ధమున కేకయులు పల్లవు లకు సహాయమొనర్చిరనియు, సేంద్రకులు, బాణులు, అలూపులు కదంబులపక్షమున నుండిరనియుఁ దెలియుచున్నది.

ఈశాసనము మైసూరు శాసనపరిశోధకసంఘమువారి 1936 సంవత్సరపునివేదికలో 72-81 పుటలలోఁ బ్రకటింపఁబడినది.

ప్రాచీనకన్నడభాషాలక్షణము లీ శాసనమునఁ గొన్ని కానవచ్చుచున్నవి.

(1) క్రియాపదములయందలి ప్రథమపురుష ప్రత్యయముల స్వరములు దీర్ఘములుగనుండుట—కళ్దోన్, అఱివోన్, కొట్టాన్, విట్టాన్.

(2) పదాంత్యమున 'అ' కారమునకు బదులు ఓ కారముండుట అప్పోర్, భరితోన్ ...

(3) ద్వితీయా,షష్ఠీవిభక్తిప్రత్యయస్వరములు దీర్ఘములుగనుండుట—అదాన్, భటరియా, కలభోరనా,

(4) అనుస్వారమునకు న కారమును వాడుట—సుతన్గె, అరసన్గె.

(5) 'ఉళ్' సప్తమీవిభక్తి ప్రత్యయముగ వాడఁబడుట—నాడుళ్, ఆహవదుళ్ ...

(6) బకారమునకు వకారమును, ఇ కారమునకు ఎకారమును బదాదిని వాడుట—విట్టాన్, ఎఱుసు.

(7) వ్యంజనములు ద్విత్వమును బొందుట—భ్భటహ, ఇప్పోరుం పొప్పొట్టణ.

నిషేధార్థప్రత్యయముల స్వరములు దీర్ఘముగ నుండుటయు, అమహదర్థకప్రత్యయములుగ అళు,ఒళు వాడఁబడుటయు నీశాసనమునఁ గన్పడును. ప్రాచీనాంధ్రశాసనములందును బలగవ్వెంబొప్పంగ; వేణ్డు, దుగ్గఱాబు, గావిఞ్చి (పండరంగుని శాసనము)మున్నగు ప్రయోగములు మనకుఁ దెలిసినవే.

ప్రాచీనాంధ్రకన్నడభాషాస్వరూపమును దెలిసికొనగోరువారి కిందలి విషయము లుపయుక్తములగుటచే నీశాసనములోని ముఖ్యవిషయములఁ గన్నడపత్రికలనుండియు, మైసూరు దొరతనమువారి శాసనపరిశోధకసంఘ నివేదికనుండియుఁ గైకొని ప్రకటించితిమి.

## శాసనమూలము.

1. జయతి శ్రీ పరిష్వఙ్గ శార్ఙ్గ [వ్యానతి] రచ్యుతః దానవాక్ష్ణో
ర్యుగాన్తాగ్నిః [శిష్టానాన్తు] సుదర్శనః
2. నమః శ్రీమత్కదంబప న్త్యాగసంపన్న స్కలభోర [నా] అరిక
3. కుస్థభట్టోరనాళె నరిదావి [ళె] నాడుళ్ మృగేశనా
4. గేన్ద్రాభీళ భ్భటహరప్పెన్ శ్రీమృగేశ నాగాహ్వయ
5. రివ్వరా బటరికులామలవ్యోమతారాధినాథ న్నళప
6. గణపశుపతి మాదక్షిణాపథబహుశతహవనా
7. హవదు (ళ్) పశుప్రదానశౌర్యోద్యమభరితో [ద్దానప]
8. శుపతి యెన్దు పొగళ ప్పెట్టణపశుపతి
9. నామధేయనా సర క్కెల్లభటరియా ప్రేమాలయ
10. సుతన్గె సేన్ద్రకబణోభయదేశదో పీరాపురుషసమక్ష
11. దె కేకయపల్లవరం కాదెఱిదు పెత్తజయనా విజ
12. అరసన్గె బాళ్గఱ్చు పల్మడిపుం మూఱివల్లిఉం కో
13. ట్టాన్ బటారికులదో నళుఽదప్పు న్కల్దోన్ మహాపాతకన్
14. ఇవ్వరుం సఱ్బిజ్జదన్ విజారసరుం పల్మడిగె కుఱు
15. మ్బిడి విట్టాన్ అదా నళివోన్గె మహాపాతకమ్ స్వస్తి
16. భట్టర్గ్గెగత్ద ఒడ్డలి ఆపన్ఱోన్ది విట్టా రకర

## అర్థము.

లక్ష్మీపరిష్వంగుఁడయ్యు నెక్కిడిన శార్ఙ్గముకలవాఁడును శిష్టులకు సుదర్శనుఁడయ్యుఁను దానవనేత్రములకు యుగాంతాగ్నియైన యచ్యుతునకు విజయమగుఁగాక. నమః. (1)

కదంబవంశజుఁడును, త్యాగసంపన్నుఁడును, కలభోరుని శత్రువు నగు కకుస్థభట్టరుకాలమున నరిదావిళెరాష్ట్రమున మృగేశనాగేంద్రుల

వలె భయంకరులగు మృగేశనాగాహ్వయులగు 'రాజప్రతినిధు' లిరువురు (2-4.)

భటరికులామలవ్యోమతారాధినాథుఁడును, అళపగణపశుపతియు, దక్షిణాపథ బహుశతహవనాహవములఁ బశుప్రదానశౌర్యోద్యమభరితుఁడును, దానపశుపతిబిరుదాంకితుఁడునగు పశుపతియాజ్ఞచే సేంద్రక, బాణదేశ వీరపురుషుల సమక్షమున 'కేకయపల్లవులతోఁ బోరాడి విజయమునొందిన మెల్లభటరిప్రియసుతుఁడగు విజయరసునకు పల్మడియు మూలివళ్ళి యనుగ్రామముల దానమిచ్చిరి (4-13) భటరికుల అళుకదంబుఁడు. దీనినపహరించినవాఁడు మహాపాతకుఁడు. (13) వీ రిరువురును సల్బంగనివాసియగు విజయరసును పల్మడిగ్రామస్థులకు 'కుఱుమ్బిడిని' వదలిపెట్టిరి. దీనిని నాశనముచేసిన మహాపాతకము. స్వస్తి ఈభూమిపంటలో పదియవభాగపు ఆదాయము బ్రాహ్మణులకు దానమివ్వఁబడినది.

పణ్మోన్ది, కుఱుమ్బిడి, యొకవిధమైనపన్నులని శాసనశోధకులు వ్రాసియున్నారు. 13 వ పంక్తివఱకు ముఖ్యశాసనము. అటుతరువాత రెండు చిన్నదానములు పేర్కొనఁబడినవి. 1 వ పంక్తియందు వ్యానతియనియు,3 వ పంక్తిలో భట్టారనాళె అనియు,5 వ పంక్తిలో భటారియనియు నుండవలెను. 14 వ పంక్తిలో విజయ అరసు అనుటకు విజారస అను ప్రయోగము చింత్యము.

# భరతగుణప్రశంస.

—శ్రీ మత్తిరుమల పెద్దింటి రాఘవాచార్యులుగారు. కాకినాడ.—

---

మ. హరివేదండవరాహవాహినులతో వ్యాకీర్ణమౌ కానలన్
హరి రాముండు జటాజినావృతులను రాజ్యభ్రష్టుఁడై తాల్ప నా
సురి తల్లీ భువి నేగతి న్సుఖములన్ శోభింతు నేనంచు సో
దరవిజ్ఞానముఁ జూపితయ్య భరతా తత్త్వార్థ సందీపకా. ౧

చ. కవచము ఖడ్గముం గదయుఁ గార్ముకము న్వహియింపు, వచ్చెవాఁ
డవినయమార్గుఁడై భరతుఁ డాగ్రహవృత్తిని నిన్నుఁ జంపఁగా
నవమతి నంచుఁ దమ్ముఁ డన నాది విరాట్టగు నాతఁ డప్డు సం
స్తవమును జేసెఁగాదె భరతా భవదీయగుణానురాగముల్. ౨

గీ. తండ్రివాక్యంబుచెల్లింపఁ దలఁచియున్న
రఘుకులోద్ధారకు పటిమప్రాఁక మదిని
దర్భసంస్తరస్థండిలస్థలిని నుండు
నంటి వన్నప్రసన్నత నందుదాఁక. 3

గీ. అటవిరాఘవు దర్శించి యడలుచుంట
యతని యంఘ్రులందకయె సాష్టాంగపడుట
యార్యయని మాటరాకుంట యరసిచూడ
గుండెనీరు కాకుండునె మొండికైన. ౪

సీ. సర్వయోగక్షేమ సంధాతలగునట్టి
పాదంబు లుంచు మీపావలందుఁ
బదునాల్గువర్షముల్ ఫలమూలభోక్తనై
జడదారివ్రతములఁ జల్పుచుందు

సవధికడచన నే వ్యవధికోర్వక చొత్తు
నెఱగల్గి దర్శనమీయకున్న
గైకేయి సర్వదా గారవంబునఁగాంచి
నీయొట్టుచెల్లింతు నిక్కముగను

ననుచుఁ బాదుకలనుగొని యరిగితయ్య
యాగమన కాంక్ష రామునికనువు పడఁగ
ధర్మదానదయావీర తరణివంశ
భరత కీర్తివల్ల్యాకర భరతవీర ౫

గీ. క్షత్రియాన్వయమందున సంభవించి
బ్రహ్మనిష్ఠాగరిష్ఠతఁ బ్రబలినాఁడ
వకట యిది నీదు పూర్వపుణ్యార్జితంబొ
రాము పదపద్మ మధుపాన రమ్యబలమొ.



# ఆంధ్రదేశీయ వైద్యవాఙ్మయము.

డి. వి. సుబ్బారెడ్డిగారు.

---

ఇంచుమించు నాలుగువేల తెలుఁగువ్రాత గ్రంథములుండు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలోఁ గొలఁది మాత్రము వైద్యగ్రంథములున్నవి. ఈ వైద్యగ్రంథములపేర్ల నాయాగ్రంథములయొక్క ప్రతుల సంఖ్యను నితరవివరములను గొంత బరీక్షించిన వైద్యవిజ్ఞానచరిత్ర కుపయోగించు సారాంశములు కొన్ని తేలవచ్చును.

ఈ వ్రాతగ్రంథములలోఁ గొన్ని తాళపత్ర గ్రంథములు; తక్కినవి కాగితపుఁబ్రతులు. వీనిలో నేవియు నతిప్రాచీనములని చెప్పఁబడఁదగినవి లేవు. పదునెనిమిదవ శతాబ్దఁపు వ్రాతప్రతులు కొన్ని యుండవచ్చును. కాని పదునేడవశతాబ్దపు ప్రతులున్నట్లు రూఢిగఁ జెప్పలేము. సంస్కృతభాషాపాండిత్యము లేనివారును, సంస్కృతగ్రంథావలోకనముఁ జేయలేనివారును నీ గ్రంథసంచయము నాధారముగ నుంచుకొని వీనినిఁ బఠించియో వీనిని దమగురువులయొద్ద నర్థతాత్పర్యసహితముగ నేర్చికొనియో వివేకమును గడించుచుండిరి. ఈ యాయుర్వేదజ్ఞానము నార్జించుటలో గొందఱి యాశయము, శాస్త్రజ్ఞానాభివృద్ధిమాత్రమే. అధికసంఖ్యాకుల యాతురత యుదరపోషణార్థము మాత్రమే.

ఈ గ్రంథసంచయములోఁ జరకసుస్రుతము లసలే లేవు. అనఁగా సమగ్రముగ- సంపూర్ణముగ గ్రంథరూపమున లేవు. ఒకటి రెండధ్యాయములో, లేక కొన్ని యోగములో, యెచ్చటనైన వ్రాయఁబడియుండు నేమో! ప్రాచీనాయుర్వేదీయగ్రంథమని గణింపఁబడు బాహటము (వాగ్భటుని యష్టాంగహృదయము) మూఁడు ప్రతులు కలవు. అందులో నొకటి సటీకము. భరతఖండమందంతటను బ్రశస్తిగల యాయుర్వేదగ్రంథములలో రసరత్నాకరము, భేషజకల్పము, యోగసంగ్రహము ననునవి సటీ

కములుగా నున్నవి. శతశ్లోకి, వృషభరాజీయము సటీకముగ నేయున్నవి. సకలరోగచికిత్స యను పేరుగల గ్రంథమునకు రెండుప్రతులున్నవి. అందులో నొకటి సటీకముగ నున్నది. రెండవప్రతి; రామదాసకృతియని పేర్కొనఁబడియున్నది. వైద్యచింతామణికి సటీకముగ నెనిమిది ప్రతులున్నవి. కవిపేరు కానరాదు. చింతామణి యనుపేరుతో నొకప్రతి యున్నది. ఈ చింతామణులమీఁదను, ఆంధ్రచింతామణిమీఁదను ధ్వజమెత్తుటకో యన, నెవ్వరో "త్రైలోక్యచింతామణి"ని రచియించినారు. ఈ గ్రంథ మొకప్రతిమాత్రమున్నది. సర్వేశ్వరకవికృత వైద్యదర్పణ గ్రంథ మొకటి టీకతో నున్నది. విషవైద్యమను గ్రంథమునకుఁగూడఁ డీక కలదు

టీక గ్రంథముయొక్క భాషాకాఠిన్యము సూచించునా? లేక గ్రంథముల సేకరించినట్టివారియొక్క గాని యుపయోగించునట్టివారియొక్కగాని పాండిత్యహీనతను సూచించునా?

ఇఁక టీకలేని గ్రంథములఁ బరిశీలింతము. వీనిలోఁ బ్రథమస్థానము నీయఁదగినది "వైద్యవిషయ"మను గ్రంథము. ఈ గ్రంథకర్తపేరు తెలియదు. ప్రతులు మాత్ర మిరువది కలవు. ఈ సంఖ్యవలన జనులలో నీగ్రంథమునకుండిన యాదరణ మూహింపనగునా? వైద్యయోగసంగ్రహము, నాయుర్వేదోపదేశము నను గ్రంథములొక్కొకటి యొక్కొక్క ప్రతిమాత్రమున్నవి. పై గ్రంథముల రచయితల పేళ్లు తెలియవు. ఇవి బహుశః కలగూరగంపలు కావలెను.

గ్రంథకర్తల నామముండు ప్రతుల విమర్శింతము. వెంకటనరసయ్యగారి యాంధ్రచింతామణి రెండుప్రతులున్నవి. అరుణాచల పండితుని వైద్యసార మొకప్రతి, తాడేపల్లి పానకాలరాయుని వైద్య శాస్త్రార్థ సార సంగ్రహము, బసవరాజరచిత "ఆర్యోరోగనిదాన" మొక్కొక్క ప్రతియుఁ గలవు. ఆంధ్రదేశమున నాదరింపఁబడు సద్వైద్యజీవనము, శరభరాజీయము లొక్కొక్కప్రతియు, రసప్రదీపిక యైదుప్రతులు నున్నవి. నీల

కంతుఁడు రచియించినదనఁబడు బసవరాజీయమునకు మూఁడు ప్రతులున్నవి. గదసంజీవని యొకప్రతియు, పేరయకృత నవనాథ సిద్ధప్రదీపిక రెండు ప్రతులు, సర్వేశ్వరకవికృతమైన భిషక్సారము, కంభంపాటి వెంకటభట్టు వ్రాసిన భిషక్సుధార్ణవమును నొక్కొక్కప్రతియునున్నవి.

ప్రత్యేకగ్రంథములలో వైద్యనిఘంటువు రెండుప్రతులు, షడ్రసనిఘంటువొకప్రతి, పదార్థగుణచింతామణి యొకప్రతియుఁ గలవు. ఈ మూఁడింటిని నిఘంటువులుగ నెంచవచ్చును. నిదానమునకుఁ బ్రాధాన్యమిచ్చు గ్రంథములు నిదానముక్తావళి రెండుప్రతులును, రక్తపిత్తనిదానచికిత్స యొకప్రతియు నున్నవి. అష్టాంగము లన్నియు లేక, చికిత్సయు నౌషధయోగములు మాత్రము, వైద్యులకుఁ గావలసినంతమట్టుకుఁ గ్రోడీకరించి వ్రాయఁబడిన గ్రంథములు కొద్దిపాటివికలవు. వానిలో నౌషధయోగము లను గ్రంథమునకు నేడు ప్రతులును, చికిత్సాసారసంగ్రహ మనుపుస్తకమునకుఁ దొమ్మిదిప్రతులు నుండుట గమనింపఁదగియున్నది. సిద్ధౌషధక్రియ లనునది యొకప్రతియును, ఔషధగ్రంథమనునది యొకప్రతియుఁ "నౌషధము"లను పేరుగల గ్రంథము మూఁడుప్రతులును, జికిత్సలను వివరించుగ్రంథము మూఁడుప్రతులును, "చికిత్సలు - అంజనము"లను గ్రంథ మొకటియుఁ, "కాటుకఁజేయుపద్ధతి" యను చిల్లరగ్రంథ మొకప్రతియు నున్నవి.

దూతాధ్యాయ మనునది యసమగ్రముగ నున్నది. కాంతపరీక్ష, గర్భిణీశూలచికిత్స, స్త్రీజనపరీక్షచికిత్సలకుఁ, బ్రత్యేకగ్రంథము లొక్కొక్కప్రతి గలవు.

వైద్యము, వైద్యవృత్తియొక్క హేళనకూడ గ్రంథరూపమున వెలసి నిలిచియుండుట గొంత చిత్రమైనను నానందదాయకముగ నున్నదికదా ! అట్టిగ్రంథములు రెండున్నవి. "వైద్యహాస్యము," "కడుపునొప్పి వైద్యము" అను హాస్యగ్రంథములు. ఇవి యొక్కొక్క ప్రతిమాత్ర మున్నవి.

పై విమర్శనముఁ జరుపునపుడు రెండు విషయములు జ్ఞాపకము సంపించుకొనవలెను. మొదటిది: ఈ గ్రంథము లేమండలముల, తాలూకాల, గ్రామముల, నేకుటుంబములలోనుండి స్వీకరింపఁబడినవో సంపూర్ణ వివరములు లభించలేదు. రెండవది: ఆయామండలములలోను, నాయా పండితవైద్యకుటుంబములలోను వంశపరంపరగ వచ్చుచుండు జ్ఞానధన మగు గ్రంథభాండాగారము లన్నియు మద్రాసునకుఁ జేరినవని తలంచుట చాల పొరపాటు.

వ్రాత ప్రతులపట్టికఁ బరీక్షించిన మూఁడంశము లూహింపవచ్చునేమో.

(౧) పదునేడు-పదునెనిమిది-పందొమ్మిదవ శతాబ్దములలో సామాన్యవైద్యులు-అనఁగా-సంస్కృతవిద్యారణ్యులును లేదా పొట్టఁబొడిచినను నక్షరమురాని చిల్లరవైద్యులు తప్ప మిగిలినవారి కాయుర్వేద విజ్ఞానార్జనమున, సద్వైద్యజీవనమునఁ దోడ్పడుచుండిన గ్రంథములలోఁ బైనఁ బేర్కొనఁబడినవి ముఖ్యములు. ఆంధ్రలిపిలో వ్రాయఁబడి సంస్కృతగ్రంథములు సటీకములుగఁ గొన్నియు, నాంధ్రులగు పండితవైద్యులచే వ్రాయఁబడిన చక్కని తెనుఁగుగ్రంథములును, వంశపారంపర్యముగ వైద్యవృత్తి నవలంబించువా రుద్గ్రంథములనుండియు, నితర పండితుల శుశ్రూషవలన నేర్చుకొనియు వ్రాసియుంచుకొన్నట్టి యుపయోగమగుయోగములు, ననుభూతప్రక్రియలతో నిండినగ్రంథములును నాంధ్రదేశమున మెండుగ నుండె ననవచ్చును.

(౨) వైద్యచింతామణి, వైద్యవిషయము, చికిత్సాసారసంగ్రహము, ఔషధయోగములు, వైద్యులకు ముఖ్యగ్రంథములుగా విరివిగా నుపయోగింపఁబడుచుండెను.

(3) మంత్రవైద్యము, గ్రహవైద్యము, దిగదుడుపులు, దేవతలకు మ్రొక్కుఁబడులు, యూనానివైద్యము, పాశ్చాత్యవైద్యము మొదలగు నంశములుగల పుస్తకములు లేకుండుట కొంతచోద్యము.

విశాఖపట్టణములో మెడికల్ కాలేజి పుట్టువఱకు నాంధ్రదేశమున వైద్యసాంప్రదాయముగాని వైద్యవిజ్ఞానముగాని లేదను విపరీతాభిప్రాయములు వ్యాపింపకుండఁజేయుటకు నాంధ్రాభిమానులు పూనుకొనవలయును.

పైఁజెప్పిన గ్రంథముల నొక్కొక్కదానిని సమగ్రముగఁ జదివి లైబ్రరీలోని ప్రతులనన్నిటిని బోల్చి సరిచూచి మనదేశమున నితర కేంద్రములలోని తాళపత్త్రగ్రంథాలయములలోనుండు ప్రతులతో నిచ్చటి గ్రంథములను సరిపోల్చి సవరించి ప్రతిగ్రంథముయొక్క విషయసూచికల, నితరవివరములను విపులముగ వివరించి వ్రాయుట యాంధ్రపండితులయొక్కయు, నాంధ్రవైద్యప్రకాండులయొక్కయు విధ్యుక్తధర్మము.

---

# కవితావిలాస విజృంభణము.

కర్రా అచ్యుతరామశర్మగారు.

---

విశ్వమానవకల్యాణమునకు నాధారభూతమై సర్వమానవసౌభ్రాతృత్వమున కాలవాలమై, ఆనందమయవిశాలమనోభావప్రకటనకు రాచబాటయై ప్రకాశించునది కవిత్వము. ఇట్టియది యుత్పద్యమానమగుటకు మానవప్రవృత్తియే మూలక్షేత్రమని విశ్వసింపనగును. సుఖదుఃఖాది ద్వంద్వములకు వశుఁడైన మానవుఁడు తనమనోభావములను వ్యక్తముఁజేయునపుడే కవిత్వ మపరిష్కృతయోగ్యతారూపమున నైనను, బరిష్కృతయోగ్యతారూపముననైనను, వెలువడుచుండుట సహజము. ప్రతివాఁడును తన కుత్పద్యమానమగు భావమును వెల్లడిచేయుటకుఁ బ్రయత్నించునుగాని యందొక్కఁడు మాత్రమే కృతకృత్యుఁడగును. అందును వేటొక్కఁడు మాత్రము కవితారూపమున భావప్రకటనఁజేయఁగలఁడు. అట్టివాఁడే కవియు సంస్కర్తయు ననఁబడును.

కావుననే జైనబౌద్ధచార్వాకాది మతప్రచార ప్రహారములచేఁ గుంటువడి ప్రసరించుటకు వీలులేక ముసుఁగు తొడిఁగి మూలనణఁగి యున్న వైదికమతమును నన్నయ పునరుద్ధరించువాఁడయ్యెను. ఆంధ్రదేశమును బరిపాలించిన రాజులందు సాటిలేనిమేటియై తెలుఁగువారికినిఁ దెలుఁగునకును, తొలుదొలుత నాశ్రయమిచ్చిన మహానుభావుఁడు రాజరాజనరేంద్రుఁడు. అట్టివాని ప్రోద్బలమున వైదికధర్మకర్మ సర్వస్వమనఁదగు మహాభారతము నాంధ్రమున

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థ యుక్తిలో
నారసిమేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచనబంధురుఁడయ్యె జగద్ధితంబుగాన్.

అనినట్లు ప్రసన్నకథాకలితార్థయుక్తితో మహాభారతమును రచియించి వైదికమతప్రతిష్ఠగావించి నన్నయ మతసంస్కర్తయయ్యెను.

నన్నయ తరువాతివాఁడగు నన్నెచోడుఁడు వైదిక కర్మలయు వర్ణాశ్రమాచారములయు నాచరణమున నగు వ్యవస్థ యగ్రజాతులకేకాని తదితరుల కననుకూలమగుటయుఁగాలక్రమమునఁగల్గిన మతవ్యావహారిక సంక్షోభమునం జేసి వ్యక్తిగతాభిమానమును లూనమొనర్చునదై, యావ్యవస్థ దుష్కరమై దురభిగమ్యమగుటయు, క్రిందిజాతులవారికి వైదిక కర్మాచరణార్హతలేమిని నాముష్మికము దురభిగమ్యముగాఁ దోఁచుటయు, సర్వశక్తిసంపన్నుఁ డీశ్వరుఁడు, శివుఁడు, శంకరుఁడు, మున్నగు నామములతో శ్రుతులందు వ్యవహృతుఁడగుట నీశ్వరత్వమే వేదప్రతిపాదితమను సంశయమును విశదపఱచుచు గురుమార్గమునుబట్టి సర్వానుకూలముగా భక్త్యుపాసనాత్మకసగుణశైవము నుద్బోధింప బీజమగునట్లు తాత్కాలికచంపూపద్ధతిని విడనాడక జైనబౌద్ధాదులందలి యహింసాసిద్ధాంతమున కవిరోధమును సంఘుబలైక్యసంపాదన ఫలకమునగు మతవ్యాప్తికిఁజూపి నన్నయవైదికమార్గమునకు లోకానుగుణసవరణముగ భావములు వర్ణనలు నర్థములు నొత్తగిల్లునట్టియు జానుతెలుఁగు నిలుపు

పెంపుతో "మార్గకుమార్గమెదేశియ" యనినట్లు ప్రాణిబాహ్యాంతరంగిక ప్రవృత్తులకు శబ్దరచనాశరీరము మూలము అను దండ్యాద్యాలంకారికుల మతము ననుసరించి వర్ణనాభూయిష్ఠముగ ద్వాదశాశ్వాసపరీతమగు కుమారసంభవమును రచియించి కృతకృత్యుఁడయ్యెను.

తిక్కన హరిహరాభేదరూపమున భారతమును దెనిగించి నాఁటి దేశీయకవితాకన్యకకుఁ బ్రౌఢత్వముఁగల్పించి, రూపచిత్రణమునఁ బాత్రచిత్రణముననను రెండవ విరించియై రసానందజనకమగు వాక్యసరళిమచే సహృదయ హృదయానందమును గల్పించుచు, సమస్తశాస్త్రనిపుణతయు, సర్వవ్యవహారదక్షతయుఁగల్గించి సాహితీసంపదను వైదికధర్మజ్ఞానమును లోకజ్ఞతను నుపదేశించి కవితాకన్యకను దీర్చి దిద్దినాఁడు.

ఎట్టిన నన్నయ తిక్కనలచే రచింపఁబడిన భారతమును నిపుణముగఁ బరిశీలించి, పదములసొరు, వాక్యగుంఫన, దేశీయరచన, తత్సమబహుళప్రయోగము, కావ్యకళానిపుణత మున్నగువానిని బాటించి, సత్వగుణప్రధానముగఁ గావ్యరచనను గావించి, తదనంతరకవులకుఁ బ్రబంధరచనాపాటవమును నీటుగబోధించి కవిద్వయముప్రక్క మూఁడవవాఁడై నిలచియుండెను.

ఇట్లీవిధముగఁ గవిత్రయము తమ యనన్యసామాన్యప్రతిభతో గ్రంథరచనఁగావించి తెనుఁగునకును తెనుఁగుదేశీయులకు నద్వైతమతమునకు నమూల్యమగు ప్రకాశమునుగల్పించి, హృదయంగమమగు వాక్యవిన్యాసమును, శబ్దమాధుర్యమును రీతులను వృత్తులను గుప్పించి ప్రతిభావంతులైరి వీరిమార్గము ననుసరించి శ్రీనాథుఁడు సులభమై నిరాడంబరమై సహజమనోజ్ఞతగలభాషలో స్వభావరమణీయమగు భావములను భాసింపఁజేసియు గ్రంథరచనఁగావించియుఁ దెలుఁగుకవిత కింతంతనరాని శోభనుగలుగఁజేసి కృతకృత్యుఁడయ్యె.

రాజరాజనరేంద్రుఁడు తెలుఁగుకవితాకన్యక బాల్యక్రీడలనే చూచి యానందించెను గాని, కృష్ణదేవరాయలు తత్కవితాకన్యక ప్రౌఢ

త్వముఁజూచి యానందించినవాఁడయ్యెను. ఈతఁడు తనప్రాభవముకంటె కవిమన్ననయే ముందని గ్రహించినమేటిరాజు. తనచక్రవర్తిత్వముకంటెఁ గవిత్వమేస్థిరతరమని గ్రహించినపారమార్థి. సామ్రాజ్యపరిపాలనము కంటెఁ గవితాసామ్రాజ్య పరిపాలనమే యానందవియత్సభాపరిపాలనమని గ్రహించిన యాంతరతత్త్వవేది. కావున నే పెద్దనాదికవిపుంగవులచే స్థిరతరములగు గ్రంథరచనలను గావించి కృతినొంది, తెనుఁగుభాషాయోష నుద్ధరించిన వాఁడయ్యెను.

ఇట్లు నన్నయ హిమవచ్ఛిఖరినుండి ప్రవహించిన యాంధ్రకవితా స్రవంతి యనేకశాఖలై విశేషప్రచారముగల్గి "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను నానుడిని సంపాదించి స్థిరతరయశస్సును బొందినది. రాను రాను కాలమహిమచే కవితాస్రవంతి యొకవంక, కుకవిబృందమనెడు సూర్యకరతాపతప్తమై స్వల్పావశిష్టరసపూర్ణమై చిక్కి ప్రవహించుచున్నది. పాశ్చాత్యసాంప్రదాయవేత్తలగు విమర్శకమ్మన్యుల కశాఘాతములచే నొకవంక మూర్ఛిల్లి వసివాడి వన్నెదఱిఁగియున్నది. రసహీనమగు కవిత్వమునుగూర్చి యానందించువారేగాని, ప్రాచీనకవితామతల్లిని మెచ్చువారు కన్పడరు. వారిని ఛాందసులనియును, పచ్చిశృంగారవర్ణనాకుతూహలురనియును నిందించుచు నుపన్యాసవేదికలపైఁ దమపాండిత్యముఁ బ్రకటమైనట్లుపన్యసింతురు. లిరిక్కు కవిత్వము ననుసరించి కొన్నికవిత్వములు బయలుదేరినవి. అవి బయలుదేరుటలోఁ బ్రథమమున యుక్తియుక్తముగనుండి, రానురాను "సూచీప్రవేశే ముసలప్రవేశః" అనునట్లు కవితాలక్షణముల నన్నిటిని విడనాడి భావప్రాధాన్యమ్మని పేరిడికొని భావశూన్యములై ప్రబలుచున్నవి.

కవిత్వమనునది తెచ్చిపెట్టుకొనిన యెఱువువస్తువుగాదు. స్వతస్సిద్ధముగఁ బర్వత శిఖరమునుండిజారు సెలయేటివలె, నిర్మలమై, మధురమై, సర్వాలంకారశోభితమై రసానందజనకమై యొప్పునదియే కవిత్వము. దీనికి భావావేశము, రూపచిత్రణకుశలత, స్వభావచిత్రణము, భాషా

ప్రాభవము, కవితాగురుత్వము, రచనానుకూలచిత్తవృత్తి, మున్నగునవియే ప్రధానములు. కవియనువాఁడచ్చుటక్షరములను గూర్చునట్టి పురుషునివంటివాఁడు (Composer) కంపోజరు, ఏయక్షరమేగడియందున్నదో తెలిసికొని కావలసిన యక్షరమును గూర్చుటయు ననవసరమగు నక్షరమును విడుచుటయు నెట్లుగావించుచుండునో కవియు నట్లేకావలసిన పదములనుఁ బ్రయోగించుచునక్కఱకురానివానినివిడుచుటయందు నేర్పరియై యుండవలయును. కావున నట్టిసామర్థ్యముకలవాఁడే కవియనఁబడును.

కవి ఋషితుల్యుఁడు "నానృషిఃకురుతే కావ్య"మ్మను నుడిప్రకారము ఋషికానివాఁడు కవికాఁడు. కవిత్వమనునది రజస్సుయొక్కలీల. కవిత్వము సృష్టి కాన రజోవర్తన మావశ్యకమయ్యెను. కవిఋషితుల్యుఁడు కానఁ దదతీంద్రియవస్తుదర్శనమునకు సత్త్వవర్తన మావశ్యకమయ్యెను. కవితాప్రపంచమున నీరెంటికిని రథ్యసారథిసామ్యముకలదు. కావుననే సారథివంటి సత్త్వము రథ్యమువంటిరజస్సునుఁ దనవశమున నుంచుకొని యుత్తమమార్గమున నడపవలయును. ఇట్టికవితాతత్త్వమును దెలిసినవారు కవిత్రయమువారు. వీరిచారములననుసరించినవారిలో నగ్రేసరుఁడు సూరన. కావుననే వీనికవితామాధుర్యము నేఁటివఱకాంధ్రులచేఁ గ్రోలఁబడుచున్నది అధునాతనులన్ననో కవితాలక్షణములను బాటింపక పాటించుటకుఁ బ్రయత్నమైనఁజేయక, నిందాస్తవమును జేయుటయం దధికమైననేర్పును సంపాదించుచున్నవారని మనము కన్నారఁగాంచున్నారము గదా? పక్షపాతపూరితమగు విమర్శనలు వేనకువేలు వెలువడుచున్నవి. సుకరముగముద్రణయంత్రములుండుటచే నేవేనికొన్నిపద్యములను ముద్రింపించి తానునుఁ గవియగుచున్నాఁడు. పద్యరచనఁజేసినంతమాత్రమునఁ గవియగునా? అట్టివానిని మన్నింతురా? లేకేమి మన్నించుచునే యున్నారు. వెఱ్ఱిమొఱ్ఱివ్రాతలుగల గ్రంథములను ప్రాచ్యవిద్యాభ్యాసకుల నెత్తిపై రుద్దుచున్నారు. అట్టివారికిఁ దెనుఁగుసాహిత్యజ్ఞాన మెట్లలవడును? ఇట్టిగ్రంథములు సంస్థలు ప్రాచ్యవిద్యాభ్యాసకుల యభివృద్ధికై

జనించినవా ? ఒక్కరైన నిట్టివి పఠనావశ్యకములై యుండఁగూడదని యనెడువారున్నారా ? కావుననే ప్రాచ్యవిద్య లవాచ్యవాక్యరచనా పూరితములై క్షీణదశకువచ్చుచున్నవి.

ఆంధ్రభాషయం దిరువది ముప్పది వత్సరములు కృషిచేసి, అద్దానివలన ననంతమగు పటిమను సంపాదించియు గౌరవస్థానము నొందలేక మూలనున్న మూలపుటమ్మవలెఁ గొణిగికొనుచు తమవిద్యా ప్రాభవమునుఁ బ్రదర్శించుటకు వీలులేనివారై విరక్తిమార్గము ననుసరించు వారు వేఁకువేలుగలరు. నిష్పక్షపాతబుద్ధితో ననుభవశీలురగు ప్రాచ్య విద్యాధ్యాపకుల విద్యాధిక్యమును బరిశీలించుచు, వారిభాషాసేవను దెలిసికొని, యేనాఁడువారిని మన్నింతురో యానాఁడే ప్రాచ్యవిద్యాసం స్థల కగ్రస్థానములభించునని యూహింపకతీరదు.

కవియనువాఁడు తాను స్వతంత్రమైనభావముతోఁ గవిత్వముఁ జెప్పుచున్నానని విఱ్ఱవీఁగునుగాని, వీరికంటెఁ బ్రాచీనులే యాభావము లనువ్రాసియున్నారు. అట్టివ్రాతలు గ్రహించు పాటవములేక పోవుటచేనిట్టి కవిత్వము లారంభింపఁబడినవి. ప్రాచీనకవివరులు తమబుద్ధిసూక్ష్మత నను సరించి పూర్వోక్తకవిమార్గములనే యాదర్శముగానిడుకొని గ్రంథరచనఁ జేయుచుండెడివారు. వీరెంత స్వతంత్రత నవలంబించినను వీరికి నవ్యత యనునది తమగ్రంథములఁగలదని విశ్వాసములేదు. కావుననే సంకుసాల నృసింహాకవి "హృదయగతిం బురాతనకవీశ్వరులేగని వీథిలేదు, నేఁడను మతిన్ రచించు కృతి తాత్వికులం గరఁగింపకుండునే" యని తనగ్రంథాదిని వ్రాసికొనియున్నాఁడు. మఱియునీతఁడు

ఉ. సాంతముగాఁగ శబ్దహృదయజ్ఞులుగా రుచితప్రమోక్తలై
వింతలుగాఁ బ్రబంధముల వీథులు ద్రొక్కఁగలేరు శక్తులై
దొంతర జల్లిబొంత వెడదూర్చి గతార్థము కూర్చు దుష్టవి
భ్రాంతుల సందడిం దడవఁ బాసె రసజ్ఞులకున్ కవిత్వముల్.

“తడవ బాసెరసజ్ఞులకున్ కవిత్వముల్” అని కుకవులను వారిచే పరివేష్టింపఁ బడినవారిని సయుక్తికముగ విమర్శించి వ్రాసినాఁడు. ఇప్పుడు తిరుప్పుకవిత్వమువలె బయలుదేరినకవిత్వము, నాఁడు ధూర్జటికవిత్వము ననుగలదు: అన్యూది సర్వలక్షణలక్షితమై సర్వజనహృదయంగమమై ద్రాక్షాపాకవిలసితమై విలసిల్లియున్నది. నాఁడు కవివరు లుపమాన స్వభావోక్త్యాద్యలంకారములను సరసముగఁ బ్రయోగించి కవితావిలాసము జూపియున్నారు.

“తూనిగలాడె తోయనిధి తోయముప్రొత్త జనించె పంక్తులై
కానఁబడెన్ బలాకములు కప్పయెలుంగు చెలంగె నిర్జల
స్థానములందు కుంజముతుదన్ గృకలాసము నిల్చి నింగికై
యానసమెత్తె భూమిరజ మంగములం బెరయించె బిచ్చుకల్”

ఈపద్యమున స్వభావోక్తి ద్యోతితమగుచున్నది. ప్రకృతివర్ణన కండ్లకుఁగట్టిన ట్లగపడుచున్నది. భావము ప్రస్ఫుటమగునట్లుకవనముఁజేసి, హృదయమునుఁ గదలించుచో నాకవిత్వమేగణనార్హము.

# సంస్కృతవాఙ్మయమున రెండపూర్వవృత్తములు

ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు, యం. ఏ.,
పిఠాపురరాజకళాశాల, కాకినాడ.

సంస్కృతవాఙ్మయమున 'చంపకమాల' యనువృత్తము కలదా, లేదా యను విషయమునుగూర్చి పదునైదుసంవత్సరముల క్రిందట నాంధ్రదేశమునందలి వాఙ్మయపరిశీలకులు పత్త్రికలలో వివదించుకొను చుండిరి. సంస్కృతసారస్వతమున చంపకమాల విరళప్రచారము కలదైనను, నాపరిశీలనకు ఫలముగా లభించిన మొత్తము ఎనిమిది చంపకమాలాశ్లోకములను గూర్చియు, నిట్టులే సంస్కృతవాఙ్మయమున నిదివఱకుఁ గని వినియెఱుఁగని రెండు మత్తేభశ్లోకములను గుఱించియు నిట వివరింపఁబడును.

—చంపకమాల—

తెలుఁగునాట వాఙ్మయపరిశీలకాగ్రణులలో నొకరగు స్వర్గత కోమటిరాజు వేంకటలక్ష్మణరావు (యం. ఏ.,) గారు 'తృతీయగుణగ విజయాదిత్యుని సాతలూరు తామ్రశాసనము'ను బరిష్కరించి, దైవదుర్విపాకమునఁ దిరిగి దానిని సరిచూచి ప్రకటింపకపూర్వమే కాలధర్మము నొందిరి. దీనిని దిరిగి సంస్కరించి, ప్రచురించు భారము వాఙ్మయపరిశీలనమున వారి కనుచరులగు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిపైఁ బడినది. వీరీశాసనమును టీకాన్వితముగ శ్రీ లక్ష్మణరావుగారిపేరనే 'భారతి'† లోఁ బ్రకటించియున్నారు. ఈశాసనము తి. గి. శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు (బి.యే., బి. యల్.,) గారిచే నాంగ్లోపోద్ఘాతముతో 'ఆంధ్రదేశీయేతిహాసకపరిశోధకమండలి' వారి త్రైమాసికపత్రికలోఁ బ్రకటింపఁబడెను.††

† జనవరి, 1924.

†† Journal of the Andhra Historical Research Society, Vol. V, part 2. pp. 101—116. October, 1930.

ఈశాసనమంతయు సంస్కృతమయము, గద్యపద్యాత్మకము. ఇందొకవిశేష మేమన దీనిలోఁ బ్రాసతోఁగూడిన చంపకమాలావృత్తము గలదు. సంస్కృతమునఁ జంపకమాలావృత్తము కలదా లేదా యను విషయమునుగూర్చి శ్రీ చిలుకూరి నారాయణరావుగారు (యం. ఏ., యల్. టి., ఇప్పుడు పిహెచ్. డి.,), 'విమర్శకాగ్రేసర' కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారును* పత్రికలలో వాదప్రతివాదముల జరపిరి. నారాయణరావుగారు † సంస్కృతమునఁ బ్రసిద్ధకవులెవరును జంపకమును వాడియుండలే దని లక్ష్మణరావుగారి యభిప్రాయమును బలపఱచిరి. శ్రీ బ్రహ్మయశాస్త్రిగారు మాఘునివంటి ప్రౌఢసంస్కృతకవి రచించిన చంపకము నుదాహరించి, వారివాదమును ఖండించి యీవృత్తమునకు సంస్కృతవాఙ్మయమునఁ బ్రచురప్రచారము కలదని నుడివిరి.

వీరి వాదోపవాదములతో నా కంతగాఁ బ్రసక్తిలేదు. కాని యీ వ్యాసమునఁ జూపఁబడిన యుదాహరణములఁబట్టి నారాయణరావుగారు చెప్పినట్టులు గాక, ప్రసిద్ధసంస్కృతగ్రంథములలోనే కొన్ని చంపకములు లభించుచున్నవనియు, నయినను బ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాసినట్టులు గాక, యీవృత్తమునకు సంస్కృతవాఙ్మయమునఁ బ్రచురప్రచారము లేదనియు నాయభిప్రాయము; ఏలన ననేకవత్సరములనుండియు గవేషణము చేయఁగాఁ జేయఁగాఁ గొలఁదిగాలము క్రిందటనే శాస్త్రివర్యులుదాహరించిన చంపకములు గాక మైఁమాత్రమే నాకు లభించినవి. ఇట్టియెడ నీవృత్తమునకు సంస్కృతసారస్వమున విశేషప్రచారము గలదని యెట్లు నుడువఁదగును? శాస్త్రిగారు గ్రంథములనుండి చూపిన రెండు చంపకమాలలలో మాఘునిదొకటి. దీనిని వామనశివరామ ఆప్తేపండితుఁడు, యల్. ఆర్. వైద్యపండితుఁడును దమతమ సంస్కృ

† శారద, II సంపుటము.

* శారద, II సం. ఆంధ్రపత్రిక—'సారస్వతానుబంధము'-క్రోధన, ఆషాఢ బహుళ ౧౨, శుక్రవారము 3-౮ పు. (1925).

తాంగ్లేయనిఘంటువులయందలి ఛందోఽనుబంధములయందుఁ జూపి యున్నారు. రెండవది కాళేపండితుఁడు తన 'సంస్కృతవ్యాకరణము' ననుబంధమున నుదాహరించుకొనెను.

అ. సాతలూరు తామ్రశాసనము. [క్రీ. 9 వ శతాబ్ది]

౧. శ్లో. 'అరిన్నృపవాజివారణపదాతిమహాభ్రవిరామమారుతః
పరకరిసుస్థితాసిధరుచిప్రవినాశనభానుసన్నిభః
గురుతరదీనభాగవతమానవమానితకల్పపాదపః
శరకరికల్లభూమిపభుజాసిరిహాజిభువి ప్రహాసతే.'

శాసనపరిశీలకులచేఁ బరిష్కృతమగుపాఠమే యిట స్వీకరింపఁబడెను.

భారతిలో శ్రీ లక్ష్మణరావుగారిపేరఁ బ్రకటితమైన సాతలూరు తామ్రశాసన-విమర్శమునుండి ప్రకృతములగు కొన్నివాక్యము లిట నుదాహరింపఁబడును.

'గుణగవిజయాదిత్యుఁడు క్రీ. శ. తొమ్మిదవశతాబ్ద-ద్వితీయభాగమున [క్రీ. 850-900] నున్నవాఁడని పూర్వచాళుక్యశాసనముల ననుసరించి స్థిరపఱుపఁబడినది. ఇందునఁబట్టి చూడ తొమ్మిదవశతాబ్దమునాఁటికే తెలుఁగుకవిత్వ ముండెననియు, శాసనములలోఁగూడఁ దెలుఁగుపద్యములు చెప్పుచుండిరనియుఁ దెలియుచున్నది. గుణగవిజయాదిత్యుని నాఁడు తెలుఁగుకవిత్వము బాగుగ వృద్ధిలోనుండుటచేతనే సంస్కృత కవులకుఁ దెలుఁగునందువలెఁ బ్రాసయుక్తముగఁ బద్యములు చెప్పుటకుఁ బ్రోత్సాహము కలిగెనని మనము నిశ్చయింపవచ్చును. [భారతి, I సం. 1 సంచిక, ౯౭ పు. జనవరి 1924.]

'ఇందలిపద్యములలో నొకదానిలో విశేషము కలదు. కలివిట్టరుఁ డనఁబడు విష్ణువర్ధనుని వర్ణించుచు సంస్కృతమున నొక చంపకమాలావృత్తము చెప్పఁబడినది. దాని నాలుఁగుచరణములందును ప్రాసకలదు. యతిమాత్రము సంస్కృతసంప్రదాయము ననుసరించియే యున్నది. ఆంధ్రసంప్రదాయము ననుసరించిలేదు.

చంపకమాలావృత్తము సాంస్కృతికమైనను దానికి సంస్కృత వాఙ్మయమునందు విశేషప్రచారము లేదనుట యందఱకుఁ దెలిసినవిష యమే. సుప్రసిద్ధకవు లెవ్వరు దానిని వాడియుండలేదు. కర్ణాటాంధ్ర భాషలయందు నీవృత్తము విశేషముగఁ గాన్పించుచున్నది. అట్లే ద్వితీ యాక్షరప్రాసవిషయమును. ఈరెండును దేశభాషలందుఁ గలవు. సం స్కృతమునందు లేవు. కావున పై పద్యము సంస్కృతమునందున్నను, అది దేశభాషాసంప్రదాయము ననుసరించి వ్రాయఁబడెననుటకు సంది యము లేదు. అనఁగా తొమ్మిదవశతాబ్దమునందుఁ గుద్రవారవిషయము లో, అనఁగా గుడివాడప్రాంతమునందుఁ దెనుఁగుకవులు ప్రాసయుక్తమైన చంపకమాలావృత్తమును రచించుచుండిరని మన మీసంస్కృతశ్లోకము వలన నూహింపవచ్చును. అప్పటికి వృత్తములలో యతి పాటింపఁబడు చుండెనో లేదో ఈపద్యమును బట్టి మనము నిశ్చయముగఁ జెప్పలేము. కన్నడమునందువలెనే యతినియమము తెనుఁగునందు మొదట లేక యుండెనేమో? భావిపరిశోధనలవలనఁగాని యీసంగతి తేలనేరదు'.

—భారతి ౯౧-౯౨ పు. (జనవరి 1924.)

ప్రాస, యతులనుగూర్చి యొకమాట. † సంస్కృతపద్యములలోఁ బ్రాసను బాటించుట యెక్కడనో లేకపోలేదు గాని ప్రాసనియమమును గీర్వాణకవులు పాటింపలేదనియే చెప్పవచ్చును. ఆంధ్రకవులకన్ననో యతిప్రాసలు నికషోపలములు. కష్టమో నష్టమో, తెనుఁగుపద్యముల నల్లుటకు నాంధ్రకవులు, వారినిబట్టి లక్షణకర్తలు నియమబాహుళ్యము నేర్పఱచిరి. సంస్కృతపద్యరచనమున కిట్టిచిక్కులు లేవు. సంస్కృతశ్లోక ములలో యతిస్థానమునుండి నూతనపదము ప్రారంభము కావలెను. పదమధ్యయతి తెనుఁగుపద్యముల కలంకారప్రాయముగా నెంచఁబడును.

---

† ఈవిషయము కె. వి. యస్. దీక్షితులుగారు రచించిన 'యతిప్రాసములు' అను వ్యాసరాజమునఁ జక్కఁగ వివరింపఁబడెను. (భారతి, 8 సంపు. 2 సంఖ్య. ౩ ౼ ౫ జూలై-1931)

సంస్కృతమునఁనో, పదమధ్యయతి యతిభ్రంశము, అపస్థయతి యను దోషముగాఁ బరిగణింపఁబడును.

సంస్కృత శ్లోకములలోఁ బ్రాసనియమము లేకపోలేదనుటకీ క్రింది యుదాహరణములం గనునది. కాని ప్రాసనియమము సంస్కృతమున లేదనియో లేక బహువిరళమనియో చెప్పనగును.

భోజరాజకృత 'చంపూరామాయణము'—

1. 'ఖణ్డనాయ వసుధాధరధామ్నః
పుణ్డరీకతుహినత్విషాం ద్విషామ్
దణ్డకావన మవాప రాఘవ
శ్చణ్డభానురివ మేఘమణ్డలమ్.'
—అయోధ్యా. 86 ప. (౧౫౫ పు. నిర్ణయసాగరప్రతి. 1917)

2. 'రక్షః సంఘుష్టమార్గే కృతకనకమహాభిత్తిచిత్రోర్ధ్వధామ్నా
చక్రేణా మకాలే సరణిమరుణయన్ వీరలక్ష్మ్యాస మేతః
రక్షః శూరాఖ్యశారాన్ క్షితితలఫలకే క్షేపణీయాం హనూమా
నక్రీడాం విధాతుం దశముఖనగరీచత్వరే లత్వరేఽసౌ.'
—సున్దర. 38 ప. (౨౮౧ పు.)

మఱియు యుద్ధకాండమున (30 శ్లో, 3౨౩ పు.)

3. 'రక్షోఽవరోధవసతిమ్'

అను పద్యమున మొదటి రెండుపాదములలో నొకప్రాసయు,తుది రెండుపాదములలో వేఱొకప్రాసయుఁ బాటింపఁబడెను.

ఇఁకఁ దెనుఁగునందుఁ బాటింపఁబడు యతికంటె విలక్షణముగ సంస్కృతమునఁ జూపట్టు యతికి, యతిభ్రంశమున కుదాహరణముగ భర్తృహరి సుభాషితత్రిశతియందలి

'లభేత సికతాసు తైలమపి యత్నతః పీడయన్' —నీతిశతక-4 ప.

అనుపద్యమును జూడనగును. ఇట, ౧, ౨, ౪ వ పాదములలో యతిభ్రంశము కానవచ్చును. 3 వ పాదమున యతిదోషము లేదు.

ఆ. శిశుపాలవధ—మాఘుఁడు. [క్రీ. శ. 750 ప్రాంతము]

౨. శ్లో. 'తురగశతాకులస్య పరితః పరమేకతురంగజన్మనః
ప్రమథితభూభృతః ప్రతిపథం మథితస్య భృశం మహీభృతా
పరిచలతో బలానుజబలస్య పురః సతతం ధృతశ్రియ
శ్చిరవిగతశ్రియో జలనిధేశ్చ తదాభవ దన్తరం మహత్.'

—III స. 82 శ్లో.

మొదటి మూఁడుసర్గములకుఁ దెనుఁగుటీక తాత్పర్యములతో వావిళ్లవారు (1914 లో) ప్రకటించిన ప్రతిలోఁ బై శ్లోకమునకు మల్లినాథవ్యాఖ్యలో నిట్లులున్నది—(3౯3 పు.)

"చమ్పకావళీవృత్తమ్. 'నజభజజా జరౌ హారయతిః కథితా భువి చమ్పకావళీ'—ఇతి లక్షణాత్. రచితేతి కేచిత్. 'నజభపురస్కృతా జజజరా రచితా భువి రుద్రదిగ్యతిః' ఇతి లక్షణాత్."

నిర్ణయసాగరముద్రణమున (క్రీ. 1917) నీభాగమిట్లులు గలదు :—

"పఞ్చకావళీవృత్తమ్. 'నభజ (జభ ?) జజా జరౌ నరపతే కథితా భువి పఞ్చకావలీ' ఇతి లక్షణాత్. ధృతశ్రీవృత్తమితి కశ్చిత్. 'నభజ (నజభ ?) పురస్కృతా జజజరా రచితా భువి రుద్రదిక్పతిః' (గ్యతిః ?) ఇతి లక్షణాత్.' దీనిని బట్టి యీవృత్తమునకు-పంచకావళి ధృతశ్రీ, రచిత-అను నామాంతరములు గలవని తెలిసెడిని. కాని పంచకావళి యను పదమున కర్థము దుర్బోధముగానున్నది. ఈవృత్తమునకు సరసీవృత్త మనియు సంజ్ఞ యని మోరేశ్వరకాళేపండితుఁడు వ్రాసియున్నాఁడు.

ఇ. కావ్యాలంకారసూత్రవృత్తి—వామనుఁడు. [క్రీ. శ. 750—800]

3. శ్లో. 'మలయజరసవిలు(లి)ప్త (ప్తజులిప్త?) తనవో నవహారలతావిభూషితాః
సితతరదన్తపత్రకృతవక్త్రరుచో రుచిరామలాంశుకాః
శశభృతి వితతధామ్ని ధవలయతి ధరా మవిభావ్యతాం గతాః
ప్రియవసతిం ప్రయాన్తి సుఖమేవ నిరస్తభియోఽభిసారికాః.'

—పూనాప్రతి. IV. 3. ౧౦ సూత్ర. 68 పు. 'కవీంద్రవచన సముచ్చయము,' 525 శ్లో. (కవినామము పేర్కొనఁ బడలేదు.) శ్రీధర దాసుని 'సదుక్తికర్ణామృతము'న (112 పు.) బాణకృతముగా నుదాహృతము. మమ్మటుని 'కావ్యప్రకాశము', X. 557 శ్లో. 739 పు.(భట్టవామనాచార్య ఝలకీకర రచిత బాలబోధినీ-టీకతో. భాండార్కర్ ప్రాచ్యవిద్యాసంశోధనమందిరప్రచురణము, 1933.) రుయ్యకుని 'అలంకార సర్వస్వము,' 139 పు. గోవిందఠక్కురుని 'కావ్యప్రదీపము.' X. 48. 'అలంకారకౌస్తుభము,' 398 పు. (కావ్యమాలాప్రచురణము.)

పై పద్యమున మూఁడవచరణమున గణదోషము గలదు. వామనుని గ్రంథమునకు పూనాప్రతి, వాణీవిలాసప్రచురణము, నిర్ణయసాగర ముద్రణమును, కావ్యప్రకాశమునకు మైసూరుప్రతి, వామనాచార్య ఝలకీకరప్రతి, హరదత్తశర్మసంపాదితమగు పూనాప్రతిని బరిశీలించితిని. కాని యీప్రతులం దెందును బైశ్లోక మేవృత్తమో, యందు గణభంగము కలదేమో యను విమర్శయే లేదు. మఱియుఁ బైని బేర్కొనిన 'కవీంద్రవచనసముచ్చయము,' 'సదుక్తికర్ణామృతము,' 'అలంకారసర్వస్వము', 'కావ్యప్రదీపము,' 'అలంకారకౌస్తుభము'లలోఁ గూడ నీచర్చ యేమియుఁ గానరాదు. మొదటిచరణమున 'ప్రజ్వలిప్త' యనుపాఠము గలదు. ఈపాఠ మంగీకరించిన నిందు గణదోషము తొలఁగును. 3,4 వ చరణములలో గణదోషము గలదు. పండితులు పరిష్కరింతురు గాక!

శ్లో. 'రజనిపురఁధ్రిరో(లో?)ధ్రతిలకః.'

—కా. సూ. వృ. IV. 3. 3౧ సూ. 76 పు.

పైశ్లోకముయొక్క ప్రతీకమాత్రము వామనునిచే నుల్లేఖింపఁ బడెను. శ్లోకమంతయు రాజశేఖరుని 'కావ్యమీమాంస' లో నున్నది.

ఈ. కావ్యమీమాంస—రాజశేఖరుఁడు. [క్రీ. 880-920.]

౪. శ్లో. 'రజనిపురన్ధ్రిరోధ్రతిలకస్తిమిరద్విపయూథకేసరీ
రజతమయోఽభిషేకకలశః కుసుమాయుధమేదినీపతేః

అయముదయా చలైకచూడామణి (?) రభినవదర్పణోదిశా
ముదయతి గగనసరసి హంసస్య (?) హాసన్నివ విభ్రమం శశీ.'
—కా. మీ. XIII. 74 పు.

పై శ్లోకమున గణభ్రంశము 3, 4 వ పాదములలోఁ గానవగును.

౫. శ్లో. 'వియతి విసర్పతీవ కుముదేషు బహూభవతీవ యోషితాం
ప్రతిఫలతీవ జరఠశర కాణ్డవిపాణ్డుషు గణ్డభిత్తిషు
అమ్భసి వికసతీవ లసతీవ సుధాధవలేషు ధామసు
ధ్వజపటపల్లవేషు లలతీవ సమీరచలేషు చన్ద్రికా'.

—కా. మీ. XIII 74 పు. హేమచంద్రుని 'కావ్యాను శాసనము.' VI. 297 పు. (కావ్యమాలాప్రచురణము 1934.)

ఇందు 2, 3 వ చరణములలో గణభ్రంశము గలదు. 'కావ్యానుశాసనము'న గూడఁ బై శ్లోకము గణదోషదూషితముగానే కానఁబడు చున్నది. మూఁడవపాదమున 'అమ్భసి వికసతీవ' అనుటకు 'పయసి విరాజతీవ' అనుచో గణములు సరిపడును.

ఉ. సుభాషితరత్నసందోహము—అమితగతి [క్రీ. 994.]

౬. శ్లో. 'గిరిపతి రాజసాను మధిరోహతు యాతు సురేన్ద్రమన్దిరమ్
విశతు సముద్రవారి ధరణీతల మేతధియా ప్రసర్పతు
గగనతలం ప్రయాతు విదధాతు సుగుప్తమనేకధాయుధై
స్తదపి న పూర్వకర్మ సతతం బత ముఞ్చతి దేహధారిణమ్.'

—౧౮ దైవనిరూపణము, 374 శ్లో. 48 పు.

౭. శ్లో. 'శుభసం (పరి?) తోషవారిపరిషేకబలేన యతిః సుమనస్సహం
శమయతి యః కృతాన్తసమచేష్టిత ముత్థితమాదరాఽలమ్
వ్రజతి స రోగశోకమదమత్సరమఃఖవియోగ వర్జితం
విగలితమృత్యు జనన (జన్మ?) మపవిఘ్న మనఘ్న మనన్తమాస్పదమ్'.

—౧౯. జఠరనిరూపణము, 400 శ్లో. 50 పు.

పై శ్లోకములో 1,4 వ పాదములలోఁ బైఁజూపిన చిన్నమార్పులు చేసిన గణదోషము పరిహరింపఁబడును.

ఊ. ప్రౌఢసంస్కృతవ్యాకరణము† ['Higher Sanskrit Grammar']

ఇందు మొదటియనుబంధమునందు మోరేశ్వరరామచంద్రకాళే (బి. యే.,) పండితుఁడు 'పంచకావళి' 'ధృతశ్రీవృత్తము'- అను నామాంతరములు గల 'సరసీవృత్తము'ను విశదీకరించుచుఁ బట్టున—

'న-జ-భ-జ-జా జరౌ యది తదా గదితా సరసీ కవీశ్వరైః.'

అని లక్షణమును గ్రోడీకరించి, కవిపేరును గాని కృతిపేరును గాని పేర్కొనకయే యీక్రిందిపద్యము నుదాహరించెను-

ఉ. శ్లో. 'చికురకలాపశైవలకృతప్రమదాసు లసద్రసోర్మిషు
స్ఫుటవదనామ్బుజాసు విలసద్భుజబాలమృణాలవల్లిషు
కుచయుగచక్రవాకమిథునానుగతాసు కలాంకితాః క్రీ
వ్యరచయ దచ్యుతో వ్రజమృగీనయనాసరసీషు విభ్రమమ్.'

పై పద్యమున గణదోషము లేదు.

—మత్తేభవిక్రీడితము.—

చంపకమాల, ఉత్పలమాల, మత్తేభవిక్రీడితము, శార్దూలవిక్రీడితము సంస్కృతవృత్తములు, వీనిని దెనుఁగుకవులు తమ కృతులయందనుకరించి, యాంధ్రచ్ఛందోవిలక్షణములగు ప్రాసను యతినిగూడఁ బాటింపఁజొచ్చిరి. పై వృత్తములలో నొక్క శార్దూలము మాత్రము సంస్కృతకృతులలోఁ బ్రచురప్రచారము గలది. గీర్వాణకావ్యములలో నింతవఱకు నుత్పలమాల యశ్రుతదృష్టచరము. చంపకమాలను సంస్కృతకవులలో నే యేడెనమండుగురుమాత్రమో వాడియుండిరి. మత్తేభమును మొదట నడపించిన నిరంకుశుఁడు రవికీర్తికవి. మన మశ్వధాటీవృత్తమని వ్యవహరించుదానికి వృత్తరత్నాకరమునఁ గావలయు మత్తేభమని నామాంతరము గలదు. సమయమునకు వృత్తరత్నాకరము దుర్లభమైనది; కుతూహలముగలవారలు లాగ్రంథమును బరిశీలించుకొనఁదగును. (వావిళ్లవారిప్రతి. ౮౫ పు. 1898 సం.)

†ప్రస్తుతసంస్కరణము—౨౦-౨౧ పు. (1931).

౧. రెండవ పులికేశి ఐహోల్ శిలాశాసనము—రవికీర్తి. [క్రీ. 634]

మ. 'వరదాతుఙ్గతరఙ్గరఙ్గవిలసద్ధ్వంసావలీమేఖలాం
వనవాసీమవమృద్నతః సురపురప్రస్పర్ధినీం సమ్పదా
మహతా యస్య బలార్ణవేన పరితః సఞ్ఛాదితోర్వీతలం
స్థలదుర్గం జలదుర్గతామివ గతం తత్తత్ క్షణే పశ్యతామ్.'— ౧౭ ప.

౨. లక్ష్మీసహస్రము-వేంకటాధ్వరి [క్రీ. శ. 1634.]

మ. 'క్షిపతు క్షిప్ర మనల్ప మప్రతిహత స్తాపత్రయం మామకమ్
భవదావాగ్నిభయావహ స్తవకృపావీక్షాసుధానిర్ఝరః
వ్యథయన్ సాధుకదమ్బ మమ్బ! విహితప్రౌఢాగమవ్యాహతిః
శశిసోదరి! హా నిదాఘవిభవ శ్శాన్తిం యతో విన్దతి'.

XV. నక్షత్రమాలా స్తబకము, 13 శ్లో. (263 పు.)

మ. 'మయి సర్వాపకృతిక్షమేఽపి కలయస్వాలీకశీతాం దయామ్
హరికాన్తే! భువనోపకారనిరతేష్వన్యేషు ధన్యేష్వివ
పనసామ్రాదిమహీరుహేషు దదతీ భూరీణి వారీణి సా
విషవృక్షేఽపి ముహుః ప్రవర్షతి న కిం విశ్వామ్బ! కాదమ్బినీ.'

ల. స. XV. 15 (264 పు. కార్వేటినగరప్రచురణము. 1890)

3. వృత్తమణికోశము † శ్రీనివాసకవి (కాలము ?)

శ్రీనివాసకవి పై గ్రంథమున (౧౭పు.) మత్తేభవిక్రీడితము, మదకలభ-యను రెండువృత్తములకు లక్ష్యలక్షణముల నొసంగియున్నాఁడు. అందు మత్తేభవిక్రీడితము.

"బహుమేనే త్రిదశేశ్వరోఽపి మఘవా మత్తేభవిక్రీడితం।
సుభగాజాస్తు గరిష్ఠ ఏవ నృపతి ర్యత్ పృష్ఠమాతిష్ఠతి."

---

† శ్రీ వాణీవిలాస ముద్రణాలయము, శ్రీరంగము.

# —అనుబంధము—

ఇట సంస్కృతమునఁ బ్రాస పాటింపఁబడిన పద్యములు
కొన్ని యుదాహరింపఁబడును.

I శ్రీభాగవతము-వేదవ్యాసులు.(వావిళ్లవారిప్రతి II సంపు 1927)

౧. 'జయతి తేఽధికం జన్మనా వ్రజః, శ్శ్రయత ఇందిరా శశ్వదత్ర హి
దయిత దృశ్యతాం దిక్షు తావకా, స్త్వయి ధృతాసవస్త్వాం విచిన్వతే.'
—10 స్కం. 3౧ అ. ౧ ప. (3౧౭ పు).

౨. 'శరదుదాశయే సాధుజాతస, త్సరసిజోదర శ్రీముషా దృశా
సురతనాథ తేఽశుల్కదాసికా, వరద నిఘ్నతో నేహ కిం వధః'. ౨ ప.

3. 'విషజలాశయాత్'-3 ప. ఇట 3 పాదములలోనే ప్రాస కన్పట్టును.

౪. 'నఖలు గోపికానందనో'-౪ ప ఇక్కడను 1 చరణమునఁ బ్రాస తప్పినది.

౫. 'విరచితాభయం వృష్ణిధుర్య తే, శరణమీయుషాం సంసృతేర్భయాత్
కరసరోరుహం కాంత కామదం, శిరసి ధేహి నః శ్రీకరగ్రహమ్'-౫ ప.

౬. 'వ్రజజనార్తిహన్'-౬ ప. ఇందొకపాదమునఁ బ్రాస పోయినది.

౭. 'ప్రణతదేహినాం పాపకర్శనం, తృణచరానుగం శ్రీనికేతనం
ఫణిఫణార్పితం తే పదాంబుజం, కృణు కుచేషు నః కృన్ధి హృచ్ఛయమ్.'-౭ ప.

౮. 'మధురయాగిరా.'-౮ ప. ఇట నొక చరణమునఁ బ్రాసలేదు.

౯. 'తవకథామృతం తప్తజీవనం, కవిభిరీడితం కల్మషాపహం
శ్రవణమఙ్గళం శ్రీమదాతతం, భువి గృణన్తి యే భూరిదా జనాః.'-౯ ప.

౧౦. 'ప్రహసితం ప్రియప్రేమవీక్షణం, విహరణం చ తే ధ్యానమఙ్గళం
రహసి సంవిదో యా హృదిస్పృశః, కుహక నో మనః క్షోభయన్తి హి.'-౧౦ ప

౧౧. 'చలసి యద్వ్రజాచ్చారయన్పశూన్, నళినసుందరం నాథ తే పదం
శిలతృణాంకురైః సీదతీతి నః, కలిలతాం మనః కాన్త గచ్ఛతి.'-౧౧ ప.

౧౨. 'దినపరిక్షయే నీలకున్తలై, ర్వనరుహాననం బిభ్రదావృతం
ఘనరజస్వలం దర్శయన్ముహు, ర్మనసి నః స్మరం వీర యచ్ఛసి.'-౧౨ ప.

౧3. 'సురతవర్ధనం'-౧౪ ప.
ఇటఁబూర్వార్ధమున నొకప్రాస, యుత్తరార్ధమున వేఱొకప్రాస

౧౪. 'అటతి యద్భవాన్'-౧౫ ప. ఇట నొకపాదమునఁ బ్రాస తప్పినది.

౧౫. 'పతిసుతాన్వయభ్రాతృబాన్ధవా, నతివిలంఘ్య తే హ్యచ్యుతాగతాః
గతివిదస్తవోద్గీతమోహితాః, కితవ యోషితః కస్త్యజేన్నిశి'-౧౬ ప.

౧౬. 'రహసి సంవిదం హృచ్ఛయోదయం, ప్రహసితాననం ప్రేమవీక్షణం
బృహదురశ్శ్రియో ధామ వీక్ష్య తే, ముహు రతిస్పృహా ముహ్యతే మనః'.
-౧౭ ప.

౧౭. 'వ్రజవనౌకసాం వ్యక్తిరంగ తే, వృజినహన్త్ర్యలం విశ్వమంగళం
త్యజ మనాక్చ న స్త్వత్ స్పృహాత్మనాం, స్వజనహృద్రుజాం యన్నిషూదనమ్.'
-౧౮ ప.

II శ్రీకృష్ణకర్ణామృతము†-లీలాశుకకవి (క్రీ. శ. 11 వ శతాబ్ది).

౧ 'అస్తి స్వస్తరుణీకరాగ్రవిగలత్కల్పప్రసూనాప్లుతం
వస్తు ప్రస్తుతవేణునాదలహరీనిర్వాణనిర్వ్యాకులమ్
స్రస్తస్రస్తనిరుద్ధనీవివిలసద్గోపీసహస్రావృతం
హస్తన్యస్తనతాపవర్గ మఖిలోదారం కిశోరాకృతి.'-1 ఆ. ౨ ప.

౨. 'పల్లవారుణపాణిపఙ్కజసఙ్గివేణురవాకులం
ఫుల్లపాటలపాటలీపరివాదిపాదసరోరుహమ్
ఉల్లసన్మధురాధరద్యుతి మఞ్జరీసరసాననం
వల్లవీకుచకుమ్భకుఙ్కుమపఙ్కిలం ప్రభు మాశ్రయే.'-1 ఆ. ౯ ప.

౩. 'లీలాయతాభ్యాం రసశీతలాభ్యాం, నీలారుణాభ్యాం నయనామ్బుజాభ్యామ్
ఆలోకయే దద్భుతవిభ్రమాభ్యామ్, బాలః కదా కారుణికః కిశోరః.'-1 ఆ. ౪౫ ప.

౪. 'పుష్ణాన మేతత్పునరుక్తశోభ, ముష్ణేతరాంశో రుదయం ముఖేన్దోః
తృష్ణామ్బురాశిం ద్విగుణీకరోతి, కృష్ణాహ్వయం కిఞ్చన జీవితం మే.'-1 ఆ. ౪3 ప.

(ఇంకను ప్రథమాశ్వాసమున 91, 94 పద్యములలోఁ బ్రాస పాటింపఁబడెను.)

౫. అమునాఖిలగోపగోపనార్థం, యమునారోధసి నన్దనన్దనేన
దమునా వ సమ్భృతః పపే నః, కిము నాసౌ శరణార్థినాం శరణ్యః.'
2 ఆ. ౧౬ ప.

౬. 'అరణ్యానీ మార్ద్రస్మితమధురబిమ్బాధరసుధా
సరణ్యా సంక్రాన్తై స్సపది మదయ న్వేణువివరైః
ధరణ్యా సాన్ద్రోత్పులక ముపగూఢాఙ్ఘ్రికమలః
శరణ్యానా మాద్యః స జయతు శరీరీ మధురిమా.' 2 ఆ. ౪౯ ప.

---

† ఆంధ్రపద్యటీకాతాత్పర్యములతో-వావిళ్ల వారిప్రతి. (1918.)

(రెండవ యాశ్వాసమున నింకను 76, 77 శ్లోకములఁ బ్రాస గన్పట్టును.)

౭. అస్తిస్వస్త్యయనం పరస్తజగతా మధ్యస్తలక్ష్మ్యస్తనం
వస్తుధ్వస్తరజస్తమోభిరనిశం న్యస్తం పురస్తాదివ
హస్తోదస్త గిరీన్ద్రమస్తకతరప్రస్తారవిస్తారిత
ప్రస్తస్వస్తరసూనసంస్తరలసత్ప్రస్తావిరాధాస్తుకమ్.' 3 ఆ. ౧ ప.

౮. 'కన్దర్పప్రతిమల్లకాన్తినిభవం కాదమ్బినీబాన్ధవం
బృన్దారణ్యవిలాసినీవ్యసనినం వేషేణ భూషామయమ్
మన్దస్మేరముఖామ్బుజం మధురిమవ్యామృష్టబిమ్బాధరం
వన్దే కన్దళితార్ద్రియౌవనవనం కైశోరకం శార్ఙ్గిణః.' 3 ఆ. ౫ ప.

౯. 'తృష్ణాతురే చేతసి జృమ్భమాణం, ముహుర్ముహుర్మోహమహాన్ధకారమ్
పుష్ణాతు నః పుణ్యదయైకసిన్ధోః, కృష్ణస్య కారుణ్యకటాక్షకేళిః.' 3 ఆ. ౯ ప.

౧౦. 'ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం
ముదా మహురుదీర్ణయా మునిమనోమ్బుజామ్రేడితమ్
మదాలసవిలోచనవ్రజవధూముఖాస్వాదితం
కదా ను కమలేక్షణం కమపి బాల మాలోకయే.' 3 ఆ. ౧౧ ప.

౧౧. 'లీలయా లలితయావలమ్బితం, మూలగేహమివ మూర్తిసమ్పదామ్
నీలనీరదవికాసవిభ్రమం, బాలమేవ వయ మాద్రియామహే.' 3 ఆ. ౧౪ ప.

౧౨. 'అరుణాధరామృతవిశేషితస్మితం, వరుణాలయానుగతవర్ణవైభవమ్
తరుణారవిన్దదళదీర్ఘలోచనం, కరుణామయం కమపిబాల మాశ్రయే.' 3. ౧౭.

౧౩. 'కన్దర్పకణ్డూలకటాక్షబన్దీ రిన్దీవరాక్షీ రభిలాషమాణాన్
మన్దస్మితాధారముఖారవిన్దాన్, వన్దామహే వల్లవధూర్తపాదాన్.' 3. ౨౧.

౧౪. 'మునిశ్రేణీవన్ద్యం మదభరలసద్వల్లవవధూ
స్తనశ్రోణీబిమ్బస్తిమితనయనామ్భోజసుభగమ్
పునః శ్లాఘాభూమిం పులకితగిరాం నైగమగిరాం
ఘనశ్యామం వన్దే కమపి కమనీయాకృతి మహః.'-3 ఆ. ౪౦ ప.

౧౫. 'కిశోరవేషేణ కృశోదరీదృశాం, విశేషదృశ్యేన విశాలలోచనమ్
యశోదయా లబ్ధయశో నవామ్బుధే, ర్నిశామయే నీలనిశాకరం కదా.'
3 ఆ. ౪౨ ప

(ఇఁక నిందుఁ బ్రాసగలశ్లోకములు: 43,50,52,60,66,68,81,89.)

III యతిరాజవింశతి - వరవరముని.

౧. 'శ్రీమాధవాంఘ్రిజలజద్వయనిత్యసేవా
ప్రేమావిలాశయపరాఙ్కుశపాదభక్తమ్
కామాదిదోషహర మాత్మపదాశ్రితానామ్
రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా.'—1 ప.

IV రామానుజాష్టకము.

౨. 'రామానుజాయ మునయే నమ ఉక్తిమాత్రం
కామాతురోఽపి కుమతిః కలయన్నభీక్ష్ణం
యామామనన్తి యమినాం భగవజ్జనానాం
తామేవ విన్దతి గతిం తమసః పరస్తాత్.'—1 ప.

విస్తరభీతిచే నీయష్టకమునఁ బ్రాస పాటింపఁబడిన తక్కిన పద్యము లిట సూచింపఁబడుచున్నవి.

3. రామానుజాయ-(3 ప.) ౪ వామాలకా-(4 ప.) ౫. రామానుజేతి-(5 ప.)
౬. నామానుకీర్త్య-(6 ప.) ౭. సీమామహీధ్ర-(7 ప.) ౮. మామానునోతి-(8 ప).

V శ్రీయదుగిరిశసుప్రభాతము. (స్తోత్రార్ణవము- ద్వితీయతరంగము ౨౦౫-౨౦౮ పు. ఆనందముద్రణాలయము, చెన్నపురి, 1925)

౯. 'అతీవ విశదాఽధునా హరిదిగన్ధకారో గత
స్సునిర్ధృతమజ్జనాః సుకృతినస్త్వదారాధకాః
యతీన్ద్ర! వరద! ప్రభో! యదుగిరీశ! నారాయణ!
ప్రతీహార విశ్రవ్య ద్భవతు సుప్రభాతం తవ.'-(3 ప.)

ఈ స్తోత్త్రమునఁ బ్రాసయుక్తములగు నితరపద్యము లిఁక సూచితములగును.

౧౦. ఉదేతి సవితా శనైః (4 ప.) ౧౧. సుశోభనం (5 ప.) ౧౨. నభోవిమలం (6 ప.) ౧3. ఇమే సురగణా (7 ప) ౧౪. ప్రవీపకతి (8 ప.) ౧౫. స్తుతిశ్చ

రవతీహ (9.) ౧౬. మృదు స్వరళితోటీలో (10 ప). ౧౭. ప్రతాపవాతవైరిణః (11 ప.) ౧౮. సుధానిధివివాహ్యృధిం (12 ప.) ౧౯. త్వదీయపద (14 ప.) ౨౦ జయజయ (15 ప.) ౨౧. యతిపతికలనాభ్యాం (17 ప.)

## VI వరదాభ్యుదయము-† వేంకటాధ్వరి (క్రీ. 17 వ శతాబ్ది)

ఆశ్వధాటీవృత్తము: 'కన్దాపహే తదరవిన్దాసనప్రవదనందాయి పద్దహసితే
కున్దాభదన్తమణిమందారపల్లవవినిన్దాకరం తవపదం
సన్దామహి వైరిముఖబృన్దారకప్రజనుతం దారితాన్తరతమో
వన్దారుదర్వ్యసనబృన్దాని ధాతృసఖి భిన్దాన మిన్దువదనే!'

1 విలాస. ౬౭ ప (౧౬ పు.)

## VII విశ్వగుణాదర్శము‡- వేంకటాధ్వరి.

౧. అశ్వధాటి. 'కామాదివైరిగణభీమానవద్యనిజనామాభిలాషగరిమా
వైమానికార్యపదభూమా పతా వదనసీమాతిలఙ్ఘిమహిమా
శ్రీమాననూనకలసోమాననో విమలధామావమానితరవిః
క్షేమాణి జృమ్భయతు భూమా వమత్ర చ స రామానజో యతిపతిః'

224 ప. (౧౨౭ పు.)

౨. అశ్వ. 'శ్రీదాభిదాపివయవాదాపదుర్పరపాదార్థసాధకమదో
త్పాదావహోద్భతమ ఖాదాపగాన్యపవినోదాభిజాతభణితిః
పాదారవిన్దనతఖేదాపహోరచతురోదారమాధవగుణా
స్వాదాభితుష్ట ఇహ మోదాయ వోభవతు వేదాన్తదేశికమణిః'.

290 ప. (౧౬౪ పు).

## VIII శతవృత్తలక్ష్మీస్తుతి§ అల్లమరాజు సోమకవి (ఆధునికులు)

అశ్వ. 'రాజానుజావితరాజాదినిర్జరసమాజావనవ్రతయుతా
రాజాధిరాజ గృహరాజాంతరాచరితపూజాప్రమోదభరితా
వ్యాజాజహద్గతితనూజాహితావరశిరోజాన్వితా సుచరితా
మాజాయమానకరుణాజాగ్రదక్షిసరసీజా జయం వితనుతామ్.' 12 ప.

---

† విద్యాతరంగిణీముద్రాశాల—మైసూరు (తెనుఁగులిపి, ద్వితీయముద్రణము, 1908)

‡ నిర్ణయసాగరముద్రణము, 1923.

§ కోహినూర్ ముద్రాక్షరశాల, పెద్దాపురము, 1939.

VI శ్రీవేఙ్కటేశసుప్రభాతము† (కవి ?)

'గోపాఙ్గనేన వరదధ్ని విమథ్యమానే
ఘోషాలయేషు దధిమన్థనతీవ్రఘోషాః
రోషాత్కలిం విదధతే కకుభశ్చ కుమ్భాః
శేషాద్రిశేఖరవిభో ! తవ సుప్రభాతమ్'. ౬ ప.

విస్తరమగునని యింతటితో విరమించుచుంటిని గాని ప్రాచీనులు నాధునికులు రచించిన ప్రాసాన్వితములగు నశ్వధాటీవృత్తములును, మూఁడుచరణములలోఁ బ్రాస పాటింపఁ బడినశ్లోకములు పరశ్శతము గలవు.

చంపకమాలనుగూర్చి యొకమాట.

వృత్తరత్నాకరమున (వావిళ్లవారిప్రతి, 1898) చంపకమాల (3 అ. ౫౨ పు.) చంపకమాలిక (4 అ. ౯౯ పు.) యను రెండువృత్తములు వివరింపఁబడినవి. కాని వీనిరెండిటి లక్షణము నీవ్యాసమునఁ జర్చింపఁబడిన చంపకమాలాలక్షణముకంటె భిన్నముగానున్నది.

---

† స్తోత్రార్ణవము- ద్వితీయతరంగము, ౧౯౭-౨౦౩ పు. (1925.)

# అనువాదామోదము.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

---

మానవలోకమునకుఁ గవిగాయకచిత్రకారులు సహజరచనానైభవములచే నసమానానందసంపదను సమకూర్పఁ జాలి యున్నారు. సత్యము. కాని కవి రసవిశారదుఁడైన నాఁడే కృతికి మోహనతను గొని రాఁగలఁడు. గాయకుఁడు సునాదసంపన్నుఁడైన యపుడే గేయమునకు హాయిని గూర్పఁగలఁడు. చిత్రకారుఁడు మేధాశాలియైనతఁడే యాకృతికి మనోహరతను దీసికొనిరాఁగలఁడు. వా రంతటి ధీమంతులు కాకున్నచోఁ గవిత సికతగను, పాట మోటుగను, బొమ్మ దిమ్మగను బరిణమించుట తథ్యము.

ఈ లలితకలాకోవిదులు మువ్వురిలోఁ గవివరుఁ డగ్రగణ్యుఁడు. ఈ మహనీయుని రచనల కున్న శాశ్వతానందసంధానశక్తి యితరనిర్మితులకుఁ గానరాదు. నిజ మారయ సాహితీసుమసౌరభరమ్యతను సమకూర్చునది శబ్దకోశాదిపుస్తకవస్తుబాహుళ్యము కాదు. అందుకుఁ బ్రాక్తన సుకృతపరిపాకపరిణతమగు నిర్మాణచాతురియే కారణము.

నిసర్గనిపుణుఁడగు కృతిరచయిత కోశరాశి తనకడ లేకున్నను, ఏ కతిపయపదములనో యూతగాఁగొని, యమృతాతిరుచ్యములగు కవితలనల్లి యుల్లముల రంజిల్లఁజేయఁగలఁడు. అట్టి మెదడు లేని మట్టితలవాఁడమేయకోశసముదయమును సమీకరించుకొని యున్నను, కవితను గటుతాపూరితముగాఁ జేయునేకాని, తీయని తేనెకైతగా నిర్మింపనేరఁడు.

మొదటఁ గవితాతనయమునకుఁ దండ్రియైన యాతఁడు తన కవితాకన్నియననుపమానరసభావాలంకారశోభితనుగాఁ జేయుటకుఁ గారణము కోశాద్యుపకరణసమితియా? కాదే. అట్టి సాయ మున్నట్లు వినరాదే! ఏ తెలుఁగునాటి కాఁపుబోటినోటిపాటలో వినఁబడుచుండెను గాని, కోకిలకా

కలీరవమాధురి సరికట్టించు తెలుఁగు నుడికారముతో నొయ్యారముగాఁ జూపట్టు పద్య మొక్కటియుఁ గానరాకుండెనే !

అట్టిసమయాన మోటుగంటముతోఁ జీకుతాటాకులపైఁ గాళిదాసాది గీర్వాణకవిసార్వభౌముల కవితలనుగూడఁ ద్రోసిరాజనఁ దగు మోహనకవనమును సృజించి "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అను దిగంతవిశ్రుతమగు ప్రాంద్రయశమును మన యాంధ్రభారతమాతకు సమకూర్చియుండలేదా !

ఇఁక నొక వింత. కవిత్వానుకూలమగు వస్తుసామగ్రి యుందఱు లేకున్నను, ఆకటిబాధచే నాగటి మేడికోలను జేత నిడికొని జోడు కలియని బక్కసుక్కిపూసలఁ బప్పుప్పదములతోఁ దోలుచు మడి దున్నుచున్న పోతన్నకు శ్రీనాథుని హేలనపుమడి చెవినిఁ బడినతోడనే యాసాగుబడిదారుని నోటినుండి వెలువడిన తేటతెనుఁగు తేనెయూట యెట్లు త్రిలింగధాత్రిని జరామరణవర్జితమగు జీవకళకలదానినిగాఁ జేసెనో యా పద్యపదమార్దవమును దిలకింపుఁడు.

ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁ గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి ? గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైననేమి? నిజదారసుతోదరపోషణార్థమై.

మఱియొక చమత్కారము. భటులు లేలికనుడి వడువునఁ దన్ను బట్టుకొని యుత్రాడు మెడకుఁ జుట్టి ప్రాణము లూడదీయనున్నపుడు కూడ బిల్హణకవికోకిలము హృద్యపద్యగానమును జేసియుండెను. వినుఁడా ప్రణయగేయము.

శ్లో॥ అద్యాపి తాం రహసి దర్పణ మీక్షమాణాం
సంక్రాంతమత్ప్రతినిధిం మయి పృష్ఠలగ్నే
పశ్యామి వేపథుమతీం చ ససంభ్రమాం చ
లజ్జాకులాం చ సముదంచితమన్మథాం చ. (బిల్హణచరితము)

శా. ఏకాంతంబున నొక్కనాఁడు గృహమం దెవ్వారు రాకుండఁగా
నా కంజేక్షణ దర్పణంబుఁ గొని వీక్షాసక్తి నుండంగ నే
జోక న్వెన్క వసింప మత్ప్రతినిధిం జూ చెంతయు న్సిగ్గుతోఁ
దాఁ గంపించి భ్రమించి మించె మదనోద్యన్మానసాంభోజమై.

(పండిపెద్ది కృష్ణస్వామికవి)

ఇట నీకవికి నూఁటట కాని కవిత్వోపకరణముల మూటకాని చేకూరియుండెనా? కావున లలితసుందరములగు కవితాకలావిలాసములు పరమేశ్వరకృపావలోకనలీలాలభ్యములు కాని పరాశ్రయప్రాప్యములు కావు.

కోకిలము నిజకంఠనాదమునకు మోహనత నెవరినుండి గడించినది? రసాలభూరుహ మేమధురరసములఁ గ్రోలి నిజఫలములకు మాధుర్యమును సమకూర్చినది? అటులనే సహజసుందరములగు కవిత్వసుధలు కవివరహృదయారవిందములనుండి యప్రయత్నముగా నావిర్భవించుచుండునే కాని, పరులయండనుండి గడింపఁ దగినవి కావు.

కలాసౌందర్యనిర్మితికి మేధాశక్తియే ప్రధానసాధనము. లేఖిన్యాది వస్తుసంపత్తి కాదు. మేధ యున్నవాని కిది సహకార మగును. అది లేనివాని కిది వ్యర్థమగును. నిజముగా నాదపదార్థభావముల మేలవించి, కవితావిపంచీగానమును మనోమోహనముగా నాలాపించువాఁడజుఁ డనఁదగును. సందియము లేదు.

కాని వేఱొక సంగతి. లోకము నంత నొక్కరీతిని సంతసింపఁ జేయఁజాలిన కలాప్రవీణుఁ డెంతయు నరుదే. మానవమనోలీనమైయున్న రాగద్వేషములు కళలకు విపరీతపరిణామములఁ గలిగించుచుండును. శ్రీకృష్ణుని మనోమోహనమగు వేణుగానము గోపకాంతలను సంతోషస్వాంతలనుగాఁ జేయఁగలిగెను. కాని కంసాదికుహృదయుల మెప్పింపఁ జాలదాయెను. ఇందుకుఁ గారణ మాగోపకుమారుని వేణునినద మామోద

ప్రదము కాకుండుటయా? కాదు. గోపవనిత లనురాగపూరితలగుటయుఁ గంసాదులు ద్వేషదూషితులగుటయు హేతువులు.

పాఠకమహాశయులారా! దేనినో ప్రశంసింపఁ బూని మఱిద్దానినో వివరింప మొదలిడితిని. మన్నింపుఁడు. అసలీ వ్యాసలేఖనమునకుఁ గారణ మేది యన ముువ్వురాంధ్రకవిరాజులు వేఱు వేఱు బట్టీలఁ బెట్టి, పండితరాయనిర్మితమగు భామినీవిలాసోద్యానవాటికలోని యమూల్యభావామోదభరితములగు పద్యసుమముల నుండి ప్రశస్తములగు క్రొత్త యత్తరవులఁ దీసి తెలుఁగు బాసాసీసాలలో నింపి వానినాదరముతో నా కొసంగియున్నారు.

వారిలో మొదటివారు సుందరతరకవితానిర్మాణమునఁ బ్రసిద్ధినందిన సత్యవోలు సోమసుందరకవిగారు. రెండవవారు కవితాప్రసక్తి రా వెంటనే పద్యమౌక్తికసరుల గుప్పించు దంటు సుబ్బావధానిగారు. మూఁడవవారు కవితాసుధామయచంద్రికల ననాయాసముగాఁ బ్రసరింపఁ జేయఁ జాలిన కాకరపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు. ఈ మువ్వురును సాహిత్యకలయందే గాక వైద్యవిద్యయందుఁ గూడ నెన్నికఁ గన్న ప్రోడలు.

స్వతంత్రకావ్యనిర్మాతల కుండు స్వేచ్ఛ, యనువాదకావ్యకర్తల కుండఁ బోదు. అనువాద్యమునందలి కవితాధార యున్నతజలపాతము వలె ననర్గళవేగముతోఁ బ్రవహించుచుండును. ఇఁక ననువాదమునందన్నో పంటకాలువ నీటివడివలె గట్టులకులోనై పైవారి రాకలఁ గనిపెట్టుచు నెమ్మదిగ నడువవలయును.

మఱియు స్త్రీవేషధారియగు నటుఁ డెంతటినిపుణుఁడైనను తన వేషములోనికి నిసర్గసుందరములగు కొన్ని యోషావిలాసములఁ గొని రాఁజాలఁడు. అట్టి ప్రత్యేకకళలు కాంతలయందే నిలిచియుండును; కాని కామినీవేషధారియగు పురుషునియందుఁ బ్రసరింపవు. అటులనే యనువాదకారియగు కవి యెంతటి నేర్పరియైనను నిజకోషములోనికి సహజ

సుందరములగు కొన్ని భాషావైభవముల నవతరింపఁ జేయ సాధ్యము కాదు. ఆరీతి భారతీగతులు మూలభాషయందే చూడనగును.

కాని వేషధార్యనువాదకు లుభయులును ధీశాలురగుచో నసలు వనితా కవితలు ప్రకటింపని క్రొత్తసందుల నిజాకృతికృతుల నింపుగాఁ బ్రదర్శింపఁ గలరు. మూలామోదముల నాస్వాదించినవారికిఁ గాని య నువాద సౌరభముల నాణెము తెలియ రాదు. మొదట వకుళసుమగంధముల నాఘ్రాణించిన వారికిఁ గాని పొగడ యత్తరువు దానితో సరియగు నెత్తావి కలదిగా నున్నదియో లేదో తెలియదు. ఆరీతినే యసలు మూలపద్యమాధుర్యము నాస్వాదించినవారికిఁ గాని యనువాదపద్యపురుచి సరిగనున్నదియో లేదో విదితముకాదు. కావున మూలశ్లోకముల ను వానియనువాదములను బ్రకటింతును.

పండితరాయకవివరులనుగూర్చి శ్రీ దంటు సుబ్బావధానిగారు తమ యాంధ్రభామినీ విలాసాదిని విపులముగాఁజర్చించియున్నారు. దాని నిటఁ దిరుగ వ్రాయుటచే వ్యాసము దీర్ఘతరమగు నను కారణమున విడిచితిని.

పండితరాయుని యాప్తమిత్రుఁ డొకఁడు నీవు రసికవరుఁడవగు నాయకుఁడవు. ఆ లవంగి నీయెడ గాఢానురాగముగల లతాంగి. ఇట్లుండియు మీరుభయులు కలిసి సుఖింపకుండుటకుఁ గారణమేమి? అని ప్రశ్నింప నందుకు షాజహానుచక్రవర్తియొక్క వక్రశాసనమే కారణమని తెలుపుటకా కవిరాట్టీ క్రిందిశ్లోకము నన్యాపదేశముగఁ జెప్పెను.

శ్లో. చర న్వనాంతే నవమంజరీషు న షట్పదో గంధఫలీ మజిఘ్రత్
సా కిం న రమ్యా స చ కిం న రంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా.

గీ. మహితవనమధ్యమున మంజుమంజరులను
గడుఁ జరించుచు మధుపంబు గంధఫలిని
గొన దదియు రమ్య గాదా! తానును రమింప
నదియొ! కేవల మది యీశ్వరాజ్ఞ గాదె.		(సత్యవోలువారు)

గీ. క్రొత్త పూగుత్తులఁ జరించు మత్తభృంగ
మార ! సంపంగి మూర్కొన, దది మనోహ
రంబు గాదొకో ? తావిహారం బెఱుఁగదో?
యింత బలవంత మానొకో ! యీశ్వరాజ్ఞ. (దంటువారు)

తే. పుష్పవని మంజుమంజరీపుంజమందు
మసలు నళి గంధఫలి సంట మాను టేల ?
రంత దాఁ గాఁడొ? యయ్యది రమ్య గాదొ ?
ఎంత బలవంతమైనదో యీశ్వరాజ్ఞ ! (కాకరపర్తివారు)

ఈ యనువాదకర్తలు కాకరపర్తివారైనను పద్దెము మాత్రము ద్రాక్షగుత్తివలె రుచు లొలికించుచున్నది.

మహమ్మదు మాల్వీయను కొండెగాఁడు షాజహానుతోఁ బండి తరాయలు లవంగిపై మక్కువఁజూపు పద్దెములు వ్రాయుచున్నాఁడని యు హిందువులు మొగలు యువతులఁ గామించుట యవమానహేతు కమనియుఁ దెలిపి యాతఁడు విరచించిన

శ్లో. యవనీ నవనీతకోమలాంగీ శయనీయం యది నీయతే కదాచిత్
అవనీతలమేవ సాధు మన్యే న వనీ మాఘవనీ వినోదహేతుః. మొదలగు శ్లోకముల వినుపింప నా సార్వభౌముఁడమిత్రాగ్రహావేశపరవశుఁడై యాకవీంద్రుని తన నగరునకు రాఁ బిలిపించి నీకుఁ గారాగారశిక్ష విధించితి నని తెలిపెను. అపుడట మేడవసారాలోఁ బంజరబద్ధమై ముద్దుగా మాటలాడుచున్న చిలుక నుద్దేశించి యీ క్రింది పద్యమును బఠించెను.

శ్లో. నిఖిలేషు విహంగేషు, హన్త! స్వచ్ఛందచారిషు
శుక ! పంజరబంధస్తే, మధురాణాం గిరాం ఫలం

క. వరసర్వవిహంగములున్, మురియుచు స్వేచ్ఛానుసారముగ నేఁగఁగఁబం
జరబంధము నీ కిది తగ, వరమధురమృదూక్తులకు ఫలమో శుకమా!
(సత్య)

గీ. నింగి విహరింప నిఖిలవిహంగకులము
లిచ్చవచ్చిన తావుల నెల్లకడలఁ
జిలుక ! పంజరబంధంబు గలిగె నీకు
మంచి మాటల ఫల మిదే ! యెంచి చూడ. (దంటు)

ఇట దంటువారి భావవివరణము నిపుణముగాఁ జూపట్టుచున్నది.

ఆ. సకలవిహగరాజి స్వచ్ఛందవృత్తిమై
దశదిశాంతములకుఁ దఱలుచుండ
రాజకీర ! పంజరమునఁ బంధమే నీకుఁ
గ్రమసూక్తివలనఁ గలుగు ఫలము. (కాక)

ఇటుఁ గాకరపర్తి వారి సూక్తులు మౌక్తికసరములవలె వెలయుచున్నవి. తనపై సాడీలుచెప్పి తన్ను శిక్షింపఁజేసి యటు నిలిచి సంతసించుచున్న మహమదు నుద్దేశించి యన్యాపదేశముగా నీక్రింది పద్యములను బఠించెను.

శ్లో. కస్తూరికాం తృణభుజా మటవీచరాణాం
విన్యస్య నాభిషు వధాయ వృథా చకార
మూఢో విధిః స కిల దుర్జనలోలజిహ్వా
మూలేషు నిక్షిపతి చేత్సకలోపకారః.

ఉ. కానలలోన వర్తిలుచు గడ్డిని మేయు మృగాళిబొడ్డులం
దాను విధించె మూఢవిధి తద్వధకై వృథగాఁగఁ గస్తురి
న్మానుగ నల్ల దుర్జనుల నాలుకమూలములందు నుంచినన్
లూనత నెల్ల రీతులను లోకములో సకలోపకారమౌ. (సత్య

ఉ. కానలసంచరించుచును గడ్డిని మేసెడు లేళ్ళబొడ్డులన్
దా నిడు నంట కస్తురి విధాత వృథా వధకై విమూఢతన్
దానిని దుష్టులౌ జనుల నాల్కల మూలములందు నుంచినన్
దాను మహోపకారి యగు ధారుణిలోపల నెల్లవారికిన్. (దంటు)

ఇట దంటువారి యనువాదముతీరు సూదంటుతాయి యినుము నాకర్షించునట్లు మనముల నాకర్షించుచున్నది.

చ. వనులఁ జరించుచుꣳ గరముఁ బచ్చికమేయు మృగాళి నాభి యం
దునిచెను గమ్మ కస్తురి నయో ! వృథగా విధి తద్వ్యధార్థమై
యనుపుగ దుర్జనోగ్రరసనావళిమూలములందు దాని నుం
చినయెడలోకసంచయ మశేషము గాంచుమహోపకారముꣳ. (కాక)

ఈపద్యము మూలభావంపుసొంపును బసందుగాఁ బ్రకటించుచున్నది. యవనకవి యొకఁడు పండితరాయుని కవిత నాకవిత్వముముందెందునను బనికి రాదని, ప్రగల్భములు పలుక షాజహానుఁడట్లులైన నొక శ్లోకమును రచింపుమని యాకవిని నియమింప, వాఁడొక పద్యమును వ్రాసి తీసికొనివచ్చి చక్రవర్తికీయ నాప్రభువరుఁడాపద్దెములను బండితరాయని కిచ్చి యెట్లున్నదో తెలుపుమనెను. అపు డాపద్యమును జూచి పండితుఁ డిట్లు పలికెను.

శ్లో. కుసుమాని లిఖంతు నామ చిత్రే కతిచి త్కాలవిశేషరూఢశిక్షాః
సురభిత్వమమూని కింలభంతే కథ మేతేషు రసం పిబంతి భృంగాః॥

క. శ్రమఁగొని నేర్చిన లేఖరు,
లమితమతిం జిత్రపటముల నమరఁగ సుమముల్
గ్రమమున వ్రాతురు గాకటఁ,
గొమ రొందునె తావి మధువుఁగొనునె మధుపముల్. (సత్య)

ఆ. వె. చిరవిశేషరూఢశిక్షచేఁ జిత్రానఁ,
గుసుమములను వ్రాసికొంద్రు గాక
వానికెటుల వచ్చు ? వాసన వానిలో
భ్రమరకుల మదెట్లు ద్రావు రసము ?. (దంటు)

తే. క్రమసుశిక్షితులౌ చిత్రకారు లెల్లఁ,
జిత్రమునఁ బుష్పములను విచిత్రలీల
వ్రాయుదురు గాక కలుగునే ? పరిమళంబు
వీనిలో భంభరము లెటు తేనె లాను ?. (కాక)

సరసకవితాచాతుర్యములేని యొక సామాన్యకవిని బెద్దగాఁ జేసి షాజహానాదరించుచుండుటచే వాఁడుమహాకవుల సరకుసేయక ప్రగల్భములఁ గొట్టుచుండుటనుగాంచి కాకాపదేశముగాఁ బండితుఁడుచెప్పిన పద్యము.

శ్లో. విధి రేవ విశేషగర్హణీయః కరట త్వం రట క స్తవాపరాధః
సహకారతరౌ చకార యస్తే సహవాసం సరళేన కోకిలేన.

క. కేకలు వేయుము దోషము,
కాకీ! నీ కేమి విధియె కడు నింద్యుఁడగున్
కోకిలతో సహవాసము,
నీకెప్పుడు రసాలమందు నెఱపుటచేతన్. (సత్య)

గీ. సరళపికముతోడ సహకారములఁ గూడి
యుండఁ జేసి మంచి యోగమీని
ధాత చేత రోఁత దానిదా? యీతప్పు
కాకి కూయుఁగాతఁ గాఱుగూఁత. (దంటు)

తే. సరళమగు కోకిలముతో రసాలమందు
నీకు సహవాస మొనరించి నింద్యుఁ డయ్యె
నావిధియె నీమనేర మావంత లేదు
వాయసమ! ప్రేలుకొను మిచ్చవచ్చినట్లు. (కాకర)

ఈ యాంధ్రీకరణము చాల ముచ్చటగా నున్నయది.

షాజహానునకు నర్మసచివుఁడగు నొకకవి యామహారాజుమందిరములయందు విందారగించుచు నెల్లపు డంతఃపురాంతరముల సంచరించు నాకు రాజనగరునఁ జేకూరుచున్న గౌరవములు మీకు సమకూడ నేరవని విఱ్ఱవీగుచుండుటను గాంచి పండితుఁ డిట్లు పిల్లిని సంబోధించి చెప్పెను.

శ్లో. మా గర్వ ముద్వహ బిడాల మహీపతీనా
మంతఃపురం మణిమయం నిలయం మ మేతి

పట్టాభిషేకసమయే పృథివీపతీనాం
బాహ్యస్థితస్య కలభస్య హి మంగళశ్రీః.

చ. మణిగణభర్మనిర్మిత రమాయుత భూపతి కేళిసద్మమే
ఘనమగు నా నివాసమని గర్వము నందకుమా బిడాలమా!
పనిగొని యామహీశులకుఁ బట్టముఁగట్టెడు వేళఁ బైపయిన్
మను కలభంబె గాంచుఁగద మండనసంపద లింపుమీఱఁగన్. (సత్య)

ఈ పద్యగతి చాలసొంపుగా నమరియున్నది.

శా. పిల్లీ! గర్వముఁ జెందఁ బోకు మెద భూభృద్రత్నగేహాంతరం
బెల్ల న్నీదని స్వేచ్ఛగాఁ దిరుగు చుర్వీశాలి పట్టాభిషే
కోల్లాసంబుల నూరికిం బయటగా నున్నట్టి గున్నేనుఁగే
చెల్లున్ మంగళమండనంబునకుఁ జీ చీ నిన్నెవం డెంచునే. (దంటు)

ఇట మేధానిధులగు నవధానిగారు మార్జాలమును శార్దూల
గతిచే సభఃకరించి యున్నారు.

చ. నిరుపమసన్మణీగణఘృణీరమణీయనృపావరోధనాం
తరమున నేవసింతునను దర్పముఁబూనకుమా! బిడాలమా!
స్థిరగతి రాజవర్యు లభిషేకమునందుతఱిన్ బహిర్వస
త్కరివర పోతమే మివ్వులఁగాంచు నలంకృతి భాగధేయముల్. (కాక)

ఈ చంపక సుమామోదము విబుధామోద ప్రదముగానున్న
యది.

అల్ప విద్వాంసు డొకఁడు రాజాశ్రయఃధైర్యముచే మహాపండి
తులతో డీకొనుటనుగాంచి గజాపదేశముగాఁ బండితరాయలు నుడివిన
శ్లోకము.

శ్లో. కేళిం కురుష్వ పరిభుంక్ష్వ సరోరుహాణి
గాహస్వ శైలతట నిర్ఝరకాననాని
గాఢానురక్తకరిణీకరలాలితాంగ!
మాతంగ ముంచ మృగరాజరణాభిలాషం.

చ. నిరతదృఢానురక్త కరిణీకరలాలితలాలితాంగివై
గిరులను వప్రకేళిఁగొని కేరుము సారసముల్ భుజింపుమీ
సరసఝరంబులన్ వనులశైలతటంబుల నొందుమెన్నఁడున్
మఱిని మృగేంద్రుతో నెదిరిపోరఁగఁగోరకుమా! మదేభమా!(సత్య)

పండితరాయుని భావనాభాగ్యము నీపద్యము కరతలామలక మట్లు ప్రత్యక్షముసేయుచున్నది.

శా. క్రీడల్సల్పుము, స్వేచ్ఛగాఁదినుము నీరేజంబులన్ముద్ది నీ
రాడన్బొమ్మిక శైలనిర్ఝరముతోయంబందు, నెంతేదమిన్
జోడుంగూడు కరేణులన్గరములన్ ముద్దార లాలింపు పో
రాడన్ మాత్రముగోరకుండుమెదసారంగంబసింగంబుతోన్.(దంటు)

ఈ యాంధ్రానువాదము గీర్వాణమూలమును మించిన సోయగముతో విరాజిల్లుచున్న దనవచ్చును.

చ. నిరతదృఢానురక్తకరిణీ కరలాలితవై మతంగజా !
నిరుపమలీల శైలతటనిర్ఝరకానన చారుసీమలన్
జఱపుము వప్రకేళుల నవారిగ వారి మునింగి తేలుచున్
సరసిజముల్ భుజింపు మృగనాథు నెదుర్కొనఁబోకుమెన్నఁడున్.

వారాణసీ పట్టణమునంగల గొప్పగొప్ప విద్వాంసులు పండితరాయునితో వాదమొనర్పఁజాలక సిగ్గుచెంది దారపుత్రాదుల విడచి వెడలిపోయిరి. అపుడు కాశీపురాధీశుఁడా సంగతినివిని కొందఱుపండితులతో సభఁదీర్చి, అందుఁబండితరాయుని వారితోఁ బ్రసంగింపుఁడని కోరగా

శ్లో. దిగంతే శ్రూయంతేమదమలినగండాః కరటినః
కరిణ్యః కారుణ్యాస్పద మసమశీలాః ఖలు మృగాః
ఇదానీం లోకేస్మి న్ననుపమ శిఖానాంపున రయం
నఖానాం పాండిత్యం ప్రకటయతు కస్మి న్మృగపతిః ॥

చ. మదమలినార్ద్రగండయుత మత్తకరీంద్రము లెల్ల దిక్కులం
బదపడి డాఁగెఁ దద్దశఁ లపారకృపారసపాత్ర లెంతయుఁ
సదృశవిహీనముల్ హరిణశాబకముల్ మఱియెందుఁ జూపునో!
సదసి నఖాంకురాళిగతసాహితి నామృగరాజుమేదినిఁ. (సత్య)

మ. మదనిష్యందికపోల శోభితములౌ మాతంగముల్ దిక్కులం
దుదినెందో చరియింప విందుము కరేణుల్ జాలికిందావు; సా
మ్యదశన్ జెందవు లేళ్లికెందు నిలఁబ్రఖ్యాతిఁ మృగేంద్రుండు చూ
పఁదగున్ దీక్ష్ణనఖాళినిస్తుల మహాపాండిత్య సందర్భముల్. (దంటు)

చ. నిరతసరన్మదాంబుమలినీకృతగండతటీకరేణుకా
కరటులు డాఁగె దిక్కులఁ; మృగప్రకరం బసమానశీలమై
పరమకృపాప్రసారతతపాత్రమెయౌ నిఁక నెందుఁ జూపునో
ఖరనఖరాగ్ర సోగ్రపరికల్పిత పాండితిఁజండవైఖరిఁ. (కాక)

ఈ రంగమునందలి యనువాద త్రయమునందును దంటువారి యాంధ్రీకరణము మొదట నెన్నఁదగియున్నది.

షాజహాను చక్రవర్తికడ మందహాససుందరుఁడును మధురతరభాషణుఁడును నగు కోశాధికారి యుండెడివాఁడు. కాని యాతఁడు కఠిన హృదయుఁడగుటచేఁ జక్రవర్తి చేయఁబోవు ధర్మముల కడ్డుతగిలి భంగము చేయుచుండెడివాఁడు. ఒకనాఁడా ధనాధికారి రాజసభలోఁగూర్చుని మృదూక్తులఁబలుకుచుండ బల్లపైనున్న మామిడిపండు నుద్దేశించి పండితుఁ డిట్లు పలికెను.

శ్లో. దిఙ్మండలం పరిమళైస్సురభీకరోషి
సౌందర్య మావహసి లోచనలోభనీయం
ఆహో! రసాలఫలవర్య! తథాపిదూయే
యద్గ్రంథిలం చ కఠినం హృదయం బిభర్షి.

ఉ. సారెకు నీను సౌరభము చక్కఁగ దిక్కులఁ బిక్కటిల్లె నెం
తో రుచిమీఱి లోకము నుతుల్ లచియిం చెడి రూపుఁదాల్చి తౌ
సారరసాలసాలఫలసత్తమ ! నీ వటులైన గ్రంథిలం
బై ఋజుహీనమైన హృదయంబు వహించుటచేఁ గలంగెదర్. (సత్య

ఉ. కమ్మని నీపరీమళముఁగ్రమ్మెదు దిక్కులఁపిక్కటిల్ల నం
దమ్ము మనోహరమ్ముఁ గనుదమ్ములవిందగు నట్టులయ్యె నో
యమ్మకచెల్ల! వన్నుగద యామ్రఫలప్రవరంబ ! నీను డెం
దమ్మది గ్రంథిలంబు గఠినంబగుటర్ బలుమాటలేటికిన్. (దంటు)

తే. నయనయుగలోభనీయ సౌందర్యమూని
మహిత హారిదంతచిత పరిమళము గల్గి
వటలితివిగాని మాకందఫల సళింతుఁ
గఠినగ్రంథిలహృదయంబుఁ గనుటనీవు." (కాక)

ఈరీతి మనోహరానువాదగుంభనము లీయనువాదత్రయముసం దనేకములు కలవు. స్థాలీపులాకముగఁ గొన్నిటిని బ్రకటించితిని. ఆంధ్ర కవిసోదరు లనువాదములొనర్ప నర్హములగు సంస్కృతగ్రంథము లెన్ని యోకలవు. ఆంధ్రభాషాభివృద్ధిని గోరు మహాశయులు కవులకుఁ దగు ప్రోత్సాహమునుగలిగించి, యుత్తమకావ్యానువాదములచేఁ ద్రిలింగ భాషను విజ్ఞానకలాశోభితనుగాఁ జేయుదురుగావుత.

ఓం తత్సత్.

# బమ్మెర పోతరాజకవిశిరోమణి

## చారిత్రవిశేషములు.

వ్యాసకర్త:—విమర్శకాగ్రేసర, **కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు.**

ఈ మహాకవి మొదట నంతగా విశేషప్రఖ్యాతికలవాఁడు కాఁడు కాని క్రమక్రమముగా నీతని యౌన్నత్యము బోధలోనికి వచ్చుచున్నది. ఇప్పుడీతనిఁగూర్చి బహువిధములుగా వ్రాయుచున్నారు. ఈతఁడొనరించిన పద్యశిరోరత్నము ప్రతిమానవుని శిరోభాగము నలంకరించుచున్నది. అయ్యది యేదియన—

ఉ. బాల రసాలసాల నవపల్లవ కోమలకావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీములఁ గందమూలగా
ద్దాళికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై.

ఇందలి కథాసందర్భము బాగుగ గ్రహింపఁజాలక కొందఱీపద్యరత్నమును సరిగ సమన్వయింపలేకున్నారు ఆ సమన్వయింపలేకుండుట పండితుల పాండిత్యలోపమువలనఁ గలిగినది కాదు. పూర్వాపరకథావిశేషము బాగుగా గ్రహింపలేకపోవుటచేఁ గలుగుచున్నది.

—॥ కథాసందర్భము ॥—

కావున **నాకథాసందర్భ**మెద్దియో యిచ్చట బాగుగ వివరింతము. పోతనామాత్యుని పూర్వచారిత్రము తెలిసికొనఁ బ్రయత్నింతము. ఈ మహనీయుని పూర్వచారిత్రమును గొప్పదే కాని భాగవతములో వివరించినంత మహనీయమైనది కాదు. మొదటనైనను జ్ఞానవంతుఁడే కాని, అంత విరాగి కాఁడు. భాగవతము రచించునాఁటికి పరిపూర్ణవిరాగియైనాఁడు. ఈతఁడు మొదట సరాగియై, ఐశ్వర్యలోలుఁడై మసలుకొనియె. అప్పుడు "భోగినీదండకము" అను నొక చక్కని దండకమును రావు సర్వజ్ఞసింగమహీపాలుని ఉంపుడుకత్తెయగు వేశ్యకు మనోహరముగా రచించి కృతి యిచ్చె. తరువాత విరాగియై తాను జేసిన పని మంచిది కాదని గ్రహించుకొని, చేప్పునఁ జక్కగా **మానసము**ను ద్రిప్పుకొని మంచిత్రోవనుబడియె.

ఇదియే 'బాలరసాలసాల' యను పద్యమునకు సరిగా సమన్వయము కుదుర్చునదియై యున్నది. ఈ పద్యము లేకుండిన కూఁతులెవరో, పసుపు కూఁడెద్దియో, మనము తెలిసికొనలేక విహ్వలపడిపోదుము. ఇప్పుడు కూఁతు సర్వజ్ఞసింగమహీపాలుని ఉంపుడుకత్తెయగు భోగినియనియు, పసుపుఁగూఁడు, ఆమెవలనఁ గలిగిన ఐశ్వర్యమనియు మన మూహించుకొనఁగలుగుదుము. కాని పద్యమునందు దోషమెద్దియును లేదు. కావున బాలరసాలసాల నవపల్లవకోమలకావ్యకన్యక యాదండకమనియు, నందలి కూఁతు యా వేశ్యయనియు, ఆ పసుపుఁగూఁడామెవలన వచ్చిన ఐశ్వర్యమనియు మనకు బాగుగాఁ దెలియవచ్చి, బాలరసాలసాలయను పద్యము వ్యాఖ్యానవద్యపదకలితమనియు, నిది ప్రతి హృదయకుహరమునందును గనకాక్షరములతోఁ బ్రకాశింపఁజేయఁదగిన దనియు, ఇంతటి మనోహరపద్యరాజము మఱియొకటి లేదనియు నిందుమూలమున గ్రహించుకొనవలెను. కావునఁ గూఁతులెవరో గ్రహించుకొనుటకుఁ గాని, ఆ పసుపుఁగూఁడెద్దియో తెలిసికొనుటకుఁగాని యిప్పుడెవరికిని చిక్కుండ నేరదు. కాని వేశ్య యింత సుజ్ఞానసంపన్నురాలు కాఁగలదా ! యని సందేహింప నవసరము లేదు. ఏమన దానిని సమకూర్చినవాఁడు పోతనకవి శిరోమణియే. "సత్కవుల్ హాలికులైననేమి గహనాంతరసీమల కందమూలగౌద్దాలికులైననేమి"యనిగదా పోతనార్యుఁడు చెప్పె. ఈమాటల భావ మేమంటిరా "వడిగల యెద్దులఁగట్టుక మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలోసుమతీ" యని చెప్పినటుల నీచాశ్రయము మానుకొని "మాతర్మేదిని, తాత మారుత, సఖే తేజ, స్సుబంధో జల, భ్రాతర్వ్యోమ, నిబద్ధ ఏష భవతా మంత్యః ప్రణామాంజలిః, యుష్మత్సంగ వశోపజాత సుకృతస్ఫారస్ఫురన్నిర్మలజ్ఞానాపాస్తసమస్తమోహమహిమా లీయే పరబ్రహ్మణి" అని చెప్పినట్లుగా వైరాగ్యబోధ బాగుగాఁ గలిగినతరువాత "కందమూలగౌద్దాలికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై" అను నీతిని, ఆ పద్యమునందలి చివరవాక్యములు స్పష్టము చేయుచున్నవి. మొత్తముమీఁదఁ బద్యమంతయు వైరాగ్యజ్ఞానబోధకమై విరాజిల్లుచున్నది.

# గ్రంథవిమర్శనము.

1. విష్ణుమాయానాటకము:—చింతలపూడి యెల్లనార్యప్రణీతము.

రాధామాధవబిరుదాంకితుఁడగు యెల్లనార్యునిచే విరచితమగు నీప్రబంధమును మదరాసు విశ్వకళాపరిషత్తువా రిదివఱలో ముద్రించియున్నారు. కాని యందు ముద్రణస్ఖాలిత్యములు, అన్వయదోషములునుండుటచే శ్రీశ్రీశ్రీ పీఠికాపుర సంస్థానాధీశ్వరులు దీనిని మఱల సంస్కరింపఁజేసి విపులమగు పీఠికతోఁ బ్రకటించిరి. శ్రీశ్రీశ్రీ మహారాజాగారి భాషాసేవయు, నాంధ్రభాషాభిమానమును సర్వజనవిదితములే. వీరి యాస్థానకవీశ్వరులగు శ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రిగా రీగ్రంథమును సంస్కరించిరి. శ్రీ ఉేకుమళ్ల అచ్చుతరావుగారు విపులమగు పీఠికను వ్రాసిరి. ఈ ప్రబంధమునకుఁ గృత్యాదిపద్యములు దొఱుకలేదు. ఎల్లనార్యప్రణీతమగు రాధామాధవ ప్రబంధమును శ్రీ కపిలేశ్వరపురము జమీందారుగారు ప్రకటించియున్నారు. ఎల్లనార్యుఁడు విశాఖపట్టణముజిల్లా వాఁడనియొకరును, గోదావరిజిల్లావాఁడని మఱియొకరును వ్రాసియున్నారు. పీఠికాకారులు గోదావరిజిల్లావాఁడని నిర్ధారణ మొనర్పఁ బ్రయత్నించిరి. ఆవిషయమున వీరివాదములును దుర్బలముగ నున్నవనియే చెప్పనగును. కవిశైలినిగూర్చియుఁ గథానిర్మాణమునుగూర్చియుఁ బెక్కువిషయములు దెలుపఁబడినవి.

2. శ్రీభగవద్గీతోపదేశసారము. ప్రథమషట్కము:—కాకినాడ తాలూకా యింజరంవాస్తవ్యులగు తల్లాప్రగడ వీరేశలింగం శర్మగారిచేఁ బ్రకటింపఁబడినది.

గీతోపదేశమునందలి ధర్మసూత్రముల విద్యార్థుల కుపదేశించుటకును, సనాతనవిద్యాభ్యాససంప్రదాయము నుద్ధరించుటకును గ్రంథకర్త లీగ్రంథమును రచించియున్నారు. ఇందు భగవద్గీతయందలి మొదటి యాఱధ్యాయములలోని విషయములు సులభమగు శైలిని వచనరూపమున నీయఁబడినవి. బ్రహ్మశ్రీ విమర్శకాగ్రేసర కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి విపులమగు పీఠికయుఁ జేర్పఁబడినది. గీతాశాస్త్రప్రాశస్త్యమునుగూర్చి భిన్నాభిప్రాయములు లేవు. ఎన్నివివరణములు వ్రాసినను వ్రాయవచ్చును. ఈ గ్రంథమునందలి ముఖ్యవిషయముల సులభశైలిని వ్రాయఁబూనిన గ్రంథకర్తల యాశయము శ్లాఘనీయము.

దారావాప్తులఁజేయఁగా వలయు మార్తాండాన్వయశ్రీలు పెం
పారన్ వీరలఁ గన్నవారలకు నేత్రానందము ల్పొందఁగాన్. ౨౬౦

చ. అని తలపోయుచుండ మనుజాధిపు నా రఘుపౌత్త్రుఁ గన్గొనన్
మనమునఁ గోరి మానిజనమాన్యుఁడు ధన్యుఁడు వన్యమూలకా
శనుఁ డుదితార్కతేజుఁ డురుసత్యవచోనిరతుండు గాధినం
దనుఁ డనఘుప్రచారుఁడు ముదంబున వచ్చె నయోధ్య కంతటన్.

క. వచ్చిన విశ్వామిత్త్రుని
నచ్చుగ దావారికులు రయంబునఁ గని పెన్
మెచ్చుగ దశరథుతోడన్
జెచ్చెర నెఱిఁగింపఁ దనదు చిత్తం బలరన్. ౨౬౧

పంచచామరం.
పురోహితుల్ మహామతుల్ పురంబువారు గూడి రా
సరోజమిత్త్రధాముఁడైన సంయమీంద్రుపాలికిన్
ధరాతలేంద్రుఁ డేఁగి భక్తిఁ దత్పదాంబుజంబులన్
శిరంబు సోఁక మ్రొక్కి దండఁజేరి నిల్చియుండినన్. ౨౬౨

క. పశుపతిసముఁడగు మునిపతి
దశరథుకుశలంబు నడుగఁ దడయక నాకుం
గుశలమని ప్రల్కి నుతులన్
విశదములుగఁ జేయుచుండ వికసితముఖుఁడై. ౨౬౩

క. అందఱుఁగని కౌశికుఁ డా
నందంబునఁ గుశల మడిగినం దమతమ మే
ళ్లందఱు దెలుపఁగ పఙ్క్తి
స్యందనుఁ డమ్మౌనిఁ దెచ్చె స్వగృహంబునకున్. ౨౬౪

వ. అనంతరం బా వసిష్ఠాదిమునిసహితంబుగా విశ్వామిత్త్రునిం బూజించి
దశరథుం డిట్లనియె. ౨౬౫

సీ. నీరాక పరికింప నీరాకరాత్మజా
కరుణాకటాక్షప్రాప్తికారణంబు

నీదర్శనము సుధాపాదావలోకంబు
సరణి విలోచన సౌఖ్యదంబు
నీ ఘనాశీర్వచనౌఘవైభవ మెన్న
సకలార్థసంసిద్ధిసాధనంబు
నీ కృపామందాకినీఝరీసంప్రాప్తి
మోక్షలక్ష్మీప్రదానక్షమంబు
గీ. గాన నీమహిమంబు సేనానికైన
భవునికైనను కమలసంభవునికైన
సన్నుతింపఁగఁ దరము గా దన్నమాకు
నెన్న వశ మౌనె గాధేయ హితవిధేయ. ౩౬౭
ఉ. నన్నుఁ గృతార్థుఁజేయ గమనంబున నెంచి మునీంద్రచంద్ర! నీ
వి న్నగరీవరంబునకు నిప్పుడు వచ్చితివో మహాత్మ నీ
కు న్నను దాసుగాఁ దలఁచి కోరుము వాంఛిత మెద్దియైన నేఁ
గ్ర న్ననఁ జేసెదన్ శ్రుతిసుఖంబుగ నానతి యీఁగ నాపుడున్. ౩౬౮
చ. జగతి మనుక్షితీశకులసంభవులందఱకన్న కీర్తులం
బొగడికఁ జెంది బంధుజనపూజ్యుఁడవై సుగుణంబు లెల్ల వా
సిగఁ గనుచున్ వసిష్ఠమునిశిష్యుఁడవై విలసిల్లుచున్న నీ
యగణితభాగ్యమెన్నగ జనాధిప యేరికినైన శక్యమే! ౩౬౯
క. ని న్నొక యాచన సేయఁగ
ని న్నగరికి వచ్చినాఁడ నిక్ష్వాకుకులో
త్పన్నులు నరపతు లర్థుల
మన్నింతు రఁటంచు ముదము మదిఁ గడలుకొనన్. ౩౭౦
క. యాచకు లేమడిగిన సం
కోచింపక యిత్తు రధికగుణు లంచుఁ దగన్
వాచాగోచరసత్యస
దాచారులు బల్కుచుండు రవనీస్థలిలోన్. ౩౭౧

గీ. నీవు దర్శింపఁగా నవనీపకుఁడవు
నేను నిక్కంబు దలఁప వనీపకుఁడను
భిన్నవృత్తులమైన నభేదమయ్యెఁ
గాన నాకోర్కి సఫలంబు గాకయున్నె. 322

క. కరులు శతాంగములు లస
త్తురగములు సువర్ణములును దుఁలలేని మణుల్
పురవరము లంబరంబులు
ధరణీశ్వర నిన్ను వేఁడఁ దగ నివ్వేళన్. 323

వ. నామనోరథం బెఱింగించెద నాకర్ణింపుము. 324

సీ. సవన మెప్పుడు నేను సయ్యనఁ గావింపఁ
బూనుదు నంతలో భూరిబలులు
దానవు లిద్దఱు తడయక నేతెంచి
వేదులపైఁ గడువేడ్కతోడ
రక్తంబు జల్లియు రయమున నగ్నులఁ
బలలంబు వైచియు బహువిధముల
యాగవిఘ్నమొనర్తు రద్దురాత్ములుసేయు
పనులకే మిక్కిలి గినిసి చంపఁ

గీ. దలఁచి శాప మొసంగినఁ దపము తఱుఁగు
ననుచు చింతించి శాంతిఁ గైకొనుచు నుందు
ఖలుల వారల ఘోరసంగరములోన
హతులఁ గావించు నీ సుతుఁ డవనినాథ. 325

క. కావున నసురులఁ గూల్పఁగ
భూవర నీసుతుని బనుపు పురుషోత్తముఁడున్
పావనగుణుఁడగు రాముఁడు
దేవారులఁ దునుమఁ దగిన ధీరుం డరయన్. 326

క. రాముని గొనిపో వచ్చితి
భూమీవర నీసుతుండు పూతచరిత్రుం

డీమహితాత్ముని సత్వం
బే మనమున నెఱుఁగుమన్ సమిద్ధగుణాఢ్యా. ౩౭౭

క. నావుడు కర్ణకఠోరము
లై వినఁబడు వానిమాట లాలింపుచు న
భ్భూవరుఁడు వగపుఁ జెందిన
భావంబునఁ గొంతసేపు పలుకకయుండెన్. ౩౭౮

వ. పిమ్మట నమ్మహీశ్వరుం డమ్మునీశ్వరున కిట్లనియె. ౩౭౯

ఉ. బాలుఁడు రాముఁ డెన్నఁగ నృపాలకయోగ్యమహాస్త్రశస్త్రముల్
చాల నెఱుంగఁ డాలముల చందములు న్వినినైన నేరఁ డా
భీలతరాకృతుల్ దనుజవీరులు వారల సంగరంబునన్
గూలుపలేఁడు సుమ్ము మునికుంజర మాటలు వేయునేటికిన్. ౩౮౦

క. పంచదశాబ్దంబులు గల
వెంచిన రామునకు నిప్పు డీతని నీతోఁ
బంచిన నగరే పౌరు లు
దంచితరుచికాకపక్షధరుఁ డౌనుగదా. ౩౮౧

గీ. ఆత్మజులఁ గాంచఁగోరి యే నహరహంబు
చింతనొందుచు నెట్టి విశేషముననొ
ముదిమి నఱువదివేలబ్దములకు సుతులఁ
గన్నవాఁడ సుమీ నన్నుఁ గన్నవాఁడ. ౩౮౨

క. నలుగురు తనయులలోపల
లలితాంగుఁడు సర్వభద్రలక్షణయుతుఁడున్
గులవర్ధనుండు రాముఁడు
జలజాక్షసమానుఁ బనుపఁ జాల న్నీవెన్. ౩౮౩

గీ. తల్లి చెంగట ముద్దు లందముగఁ జూపి
మెలఁగు రాముండు దనుజుల గెలువఁగలఁడె
రణమునం దటుగాన నీరాము బాలుఁ
గరుణఁ జూడుము నీ వట్లుగాకయున్న. ౩౮౪

క. రాముని జూడక యొక గడె
యేమఱి యుండంగ నోప నిటుగావున నా
రామునితో సేనలతో
ని మఖసంరక్షసేయ నే నేతెంతున్. ౩౮౫

క. అన విని కౌశికుఁ డిట్లను
జనవర నీమదికి నింత సంశయ మేలా
విను నీ తనయాగ్రణికిన్
ఘనతరకల్యాణ మేను గావింతుఁ దగన్. ౩౮౬

క. కంటికి రెప్పవిధంబున
జంటగ నీ సుతునితోడఁ జరియించుచు నీ
కంటెను లాలింపుచు ని
ష్కంటకముగఁ దలఁచు నావచన మజతనయా. ౩౮౭

క. దంటగు నీ రాముఁడు నా
వెంటం జరియింపుచుండ విధి విధులకు ము
క్కంటికి గెలువఁగ వశమే
ఘంటాపథములను బోలుఁ గద! నామాటల్. ౩౮౮

ఉ. రాముని సుప్రభావము ధరాతలవర్య! వసిష్ఠుఁ డీ ముని
గ్రామణి దానెఱుంగు బుధగణ్యచరిత్రుఁ డుదారకీర్తి సు
త్రామముఖామరావనవిధానసమర్థుఁడు నీ సుతుండు స
త్తామరసాప్తతేజుఁడు యథావిధి నెన్న మనుష్యమాత్రుఁడే! ౩౮౯

గీ. అసముపాయంబుగల రాముఁ డసురవరుల
గెలువలేఁడని నీవు శంకిలుచు నుంట
యసముపాయంబునను గాదె వసుమతీశ
గుణుల కెన్నఁగ వయసు కారణముగాదు. ౩౯౦

గీ. సకలలోకసమితి సన్నుతిసేయంగ
సకలలోకసమితి సంతతంబు

కరుణ నేలఁ దగిన ఘనుఁడు నీ తనయుండు
పరమపురుషుఁ డితఁడు భానుకులుఁడ! 3౯౧

చ. అనవుడు కుంభినీపతి రయమ్మున నమ్మునిఁ గాంచి పల్కెనో
మునివర యన్నిశాచరుల మూఢుల వారలఁ బంపువారి న
ద్దనుజుల శౌర్యసంపదవిధంబును వారి జయించు వైఖరిన్,
జనవున నానతీవలయు సంశయ మయ్యెడు నా మనంబునన్. 3౯౨

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె. 3౯3

క. మందరగిరిసమధైర్య! వి
నం దగు సంక్రందనాదినాక చరారుల్
సుందోపసుందు లను దితి
నందనులకు నందనుల్ కనద్భుజశౌర్యుల్. 3౯౪

క. ఆ రాక్షసు లెన్నంగా
మారీచ సుబాహు లనఁగ మహి విఖ్యాతుల్
వారలు రావణదనుజ
ప్రేరితులై యధ్వరంబు పెం పడఁతురుగా. 3౯౫

వ. అనిన విని పెల్లగుభయంబున మూర్ఛిల్లి యమ్మహీవల్లభుండు గొంత
వడి కల్లనఁ దెలిసి యుల్లంబు తల్లడిల్ల నిట్లని వితర్కించె. 3౯౬

క. అకటా యీ రాముఁడు ఘన
వికటాకారులగు దనుజ వీరులఁ దునుమన్
బ్రకటాస్త్రము లెఱుఁగఁడు మా
నికటాక్షుంబైన రాదు నే నెటు సేతున్. 3౯౭

క. శశ్వత్తపోబలంబున
నీశ్వరసముఁడైన యీ మునీశ్వరుఁ డెన్నం
విశ్వాపకారి గావున
విశ్వామిత్రాఖ్య జగతి విశ్రుతుఁ డయ్యెన్. 3౯౮

ఆ. వె. మనుకులాహితాత్ముఁ డన మించి లోకవి
ఖ్యాతిఁగాంచె మున్ను ఘనముగాఁగ
మనుకులాహితాత్ముఁ డనఁదగి లోకవి
ఖ్యాతిఁగాంచు నిపుడు కౌశికుండు. ౩౯౯

మ. అని చింతించి మునీంద్రుఁ గాంచి కడు నెయ్యంబార భూపాలుఁడో
మునినాథా! విను దానవుల్ ప్రథనభీముల్ వారి ఘోరాజిలోఁ
దునుమంజాలఁడు గా బిడౌజుఁడయినం దుష్టాత్ములన్ వారి బం
పినవాఁ డా దశకంఠుఁ డాతని కథల్ భీతిప్రదంబుల్ గదా. ౪౦౦

ఉ. కావున వారి నేనెదురఁగా మదిఁ గొంకెద నింక నా సుతుం
డా వరవిక్రమాధికుల నాజి వధింపఁగ నేరఁ డన్న మా
టీవ యెఱింగె దింత నిజ మెంచి సమంచిత సత్కృపామతిన్
గావుము నన్ను నా సుతులఁ గాతరశీలుర నీకు మ్రొక్కెదన్. ౪౦౧

క. నే రా వెఱతును నీతో
నా రాముని బంపవెఱతు నాయెడఁ గృపచే
నేరములెన్నక యేఁగు మ
పారతపోనుతచరిత్ర పరమపవిత్రా! ౪౦౨

క. అనవుడుఁ గనలుచుఁ గౌశిక
ముని కన్నుల విస్ఫులింగములు రాలంగా
ఘనకల్పాంతహుతాశను
ననువున మండిపడి పల్కె నాతని గనుచున్. ౪౦౩

చ. అడిగిన దెద్దియైన వినయంబున నిచ్చెద నంచుఁ బల్కి నే
నడిగినవేళఁ గామితము వ్యర్థముఁజేసితి వైన నేమి యి
ప్పుడమిని నిన్నుఁబోలు నధిపుల్ గలరే యొరు లింతనుండి నీ
కొడుకుల మిత్రులన్ సతులఁగూడి సుఖింపుచునుండు నెమ్మితోన్.

క. ఘనకీర్తివి దాతవు పా
వనచరితుఁడ వధికసత్యవచనుఁడ వనుచున్

వీనికిని లక్షణంబులు విశదమతులు
సంధు లంగముల్ నాయకసంజ్ఞ లాది
గాఁగఁ గల్గిన సామగ్రి గనఁగవలయుఁ
బూర్వులసదలంకృతులలో శర్వతనయ. ౬౮

సీ. సిద్ధియుఁ బ్రాప్తి ప్రసిద్ధి గర్హణము వి
చారం బభిజ్ఞాన సంశయములు
నుద్దిష్టమును నీతి యుత్తేజనము శోభ
క్షమయును దుల్య తర్క మతి యశము
గుణకీర్తనంబును క్షోభంబు దాక్షిణ్య
మాక్రందనము పరిహారకంబు
సాహాయ్య మధ్యవసా యాభిమానము
ప్రోత్సాహమును స్పృహ యుక్తి పృచ్ఛ
యనునయమును బశ్చాత్తాపమును విమర్శ
నము నివేదనము ననంగ నాటకముల
యం దలంకారముల్ త్రిపురాఖ్య లిందు
లక్షణము లెఱుఁగవలె నో యక్షవైరి. ౬౯

సీ. అరయంగ నుద్ఘాత్య కావలగితములు
తగఁ బ్రపంచ త్రిగత చ్ఛలములు
వాక్కేళ్యధిబలముల్ వళులు గండము నవ
స్యంద ప్రహేళికా సత్ప్రలాప
ములు నాల వ్యాహారమును మృదవము త్రయో
దశసంఖ్య లిన్నియు విశదమయ్యె
నిందు నుద్ఘాత్యక మిరు తెఱంగులఁ బొల్చు
నవలగితం బట్ల యతిశయిల్లె
నాముఖాంగత్వమునఁ జేసి యధికగతుల
వీథియనెడినాటకమున విస్తరిల్లె.

వీని కవయవవ్యుత్పత్తి విధము లెల్లఁ
దెలియవలె సలక్ష్మతులలో ధీర హనుమ. ౯౬

ఆ. వె. తెలియ గేయపదము స్థితపాఠ్య మాసీన
పుష్పగండికలనఁ బొల్చు నాల్గు
నల త్రిగూఢ సైంధవాఖ్యముల్ ప్రచ్ఛేద
మును ద్విగూఢ మనఁగ నొనరు నాల్గు. ౯౭

ఆ. వె. ఉత్తమోత్తమకము నొనరు ప్రత్యుక్తము
ననఁగ రెండుఁగూడ నయ్యె నిన్ని
లలిని భాణమునకు లాస్యాంగదశకంబు
వీని నెఱుఁగఁదగుఁ గవివ్రజంబు. ౯౮

గీ. వివిధలక్షణలక్ష్యసంవిదు లొనర్చు
నాటకములు పదార్థ్వస్నెహాటకములు
లక్షణజ్ఞులుగాని ప్రల్లదు లొనర్చు
నాటకంబులు భువి నారకూటకములు. ౯౯

చిత్రకావ్యలక్షణము:—

ఆ. వె. చిత్రకవిత లొనరు క్షితి మున్ను చెప్పిన
వృత్తగర్భితముల నెసఁగి కొన్ని
పద్మ చక్ర నాగబంధాదులను గొన్ని
యమకభేదగోపనములఁ గొన్ని. ౧౦౦

గీ. అవి సమస్తంబు రచియింప నబ్బురంబు
గ్రంథవిస్తరమగు నది గాదటంచు
ఘనులు మెచ్చంగఁ గల్పితకల్పవల్లి
యాదిగాఁ గొన్ని రచియింతు ననిలపుత్ర! ౧౦౧

ఇందులకు లక్షణము:—

సీసమాలిక.

నిడుగీట్లు షట్టంబు నెఱి వ్రాసి యడ్డగీ
ట్లైదుగా నందంట నమర వ్రాయ

నిరువది యిండ్లగు సొరిది నైదైదిండ్లఁ
బద్య మొక్కొక్కటి పరఁగ వ్రాయఁ
గ్రమ మిది కల్పితకల్పవల్లికి నందుఁ
జంపకమాలికల్ జరగు నాల్గు
నాదిపద్యాంఘ్రుల నాదుల రెండేసి
తుదల సప్తార్ణముల్ తొలఁగఁజేయఁ
బ్రమితాక్షరీవృత్త మమరు నార్యాగీతి
కందంబు ద్వివిధమై యందమగును
రెండవపద్యాది నుండెడి నలములు
కడల రెండేసి యక్కరము లుడుగ
నగు మణిభూషణ మందాదిరేఫ పో
ద్రుతవిలంబితవృత్తగతి యెసంగు
మూఁడవపద్యంబు మొగి నాగబంధమౌ
నాల్గవపద్యంబునను మొదళ్ల
వర్ణముల్ రెండేసి వదలినఁ గవికంఠ
భూషణవృత్తంబు పొసఁగ నాను
మొదలిపద్యంబులో మొదలంఘ్రి నార్లఘుల్
గలయించి యేనవఖండికాంత
రగణముల్ పదిమూఱు రహిమీఱఁ జదివినఁ
దగు గణసమకర్మదండకంబు
నం దాఱు లఘువులు నటు మాని చదివినన్
స్రగ్విణీవృత్తంబు సంభవించు
ముజ్జోడు నలసలమ్ములు ప్రాక్త్రిఖండిక
ల ద్విఖండికఁ గల గలమ్ములందు
గలచతుష్టము క్రింది గలమ్ములు రెండును
గలయంగ సీసాంఘ్రిగతిఁ ఘటించుఁ

జరణాంత మైదు తచ్చరణాది నెన్నిది
        వర్ణముల్ గూర్చిన వచ్చు గీతి
నలములు రెండును నలమొక్కటియు నొక
        గలమును ద్విపదకు గణములయ్యె
ధవళంబు సువ్వాల తగిన యారతిపాట
        ఖండికాత్రయమునఁ గ్రమమున నగు
నైదుఖండికలను నాయాయి రగడభే
        దములు రేకులు పెక్కు లమరు మఱియు
నిడుదకందంబు మొదలిఖండికనె యొదవు
నిట్టి చిత్రంబు లెన్నేని యిందె కలవు
చిత్రకవిచంద్రనుతకాయ శిష్టగేయ
యాజిసుతసేవకవిధేయ యాంజనేయ ! ౧౦౨

లక్ష్యము:—

కల్పితకల్పవల్లికాబంధము.

చ. స్మరజయ చారుధామ జయచర్య యజాకృతి సాధుగాయకా
హరిహయ యాంజనేయ యనఘాత్మ యతీడిత యార్యకల్పకా
హరిహయ హారకీర్తి యరుణాస్య యభీష్టద యాదికర్మతా
స్వరుశయ సారమూర్తి శమశాలి సమాదృత సత్సుధీశకా ! ౧౦౩

చ. సరసగ శౌరిదాస సమసఖ్య యశస్కర సౌఖ్యదాయకా
హరసుత హారిగేయ సదృశాంగ దయానిధి యాజిభూహితా
హరిబల హారికాయ సుగుణాఢ్య మహామహ యన్యదారణా
పరభట భారవిప్ర సనుపాయ శుభక్రమ భవ్యధీరతా. ౧౦౪

చ. నరనుత నామధారి నదనాద నమద్ఘన నారపాయకా
వరహరి వారవీర బలవాల వరక్రమ వైరిభీమజా
ధరశర తారహార ధరతార తరస్వర ధాతభారకా
హరిహరి యానసార యసురాసు భయంకర హాదిధారణా. ౧౦౫

చ. గురుకుల గోత్రధైర్య గుణకూట గురువ్రత గోపవాయుజా
తరుతల దండితాక్ష తతదామ తపఃఫల దక్షనక్రహా
పరబల భానుజాప్త పటుభాష భయాసహ భాగవర్ణికా
కరకలి కావిరాజి కపికాంత కనత్కవి గణ్యప్రోవుమీ. ౧౦౩

గీ. మాత్ర యొకఁ డాదిఁ దుద నాల్గు మాత్ర లుడుగ
నిడుదయడుగుల వృత్తంబు నిలుచుఁ జనువఁ
గంద మగు నెత్తుగీతిలో ఖడ్గ మగుచుఁ
బంచవిధసీస మిది యంద్రు పవనతనయ. ౧౦౪

లక్ష్యము:—

పంచవిధసీసము.

రుచిరకీర్త్యుజ్జ్వలరూఢభావృతదిశా
శ్రీరామ దాసాగ్రణీరసజ్జ్ఞ
ప్రవరవాలాగ్ర నిబద్ధరావణబలా
వర్ణి*త్వపద్మోద్భవాదృఢబల
కుధరసంచారి యకుంఠధీమకరికా
దర్పాద్రివజ్రాయుధాధురీణ
స్వకరశాఖాహత జంబుమాలిముఖర
క్షుఃసైన్యదక్షవ్రజా కపీంద్ర
యయమఝరయశాలి †వినయజయనయధన
యనిశవిబుధసన్నుత సదయా భయహార
గంధవహసుతనుజ యనఘ నినుఁ గొలుతు
నయ్య సాధువిధేయా మహాద్రికాయ. ౧౦౫

చతుష్కందలక్షణము:—

గీ. అసమపదముల రెండవ దైన గణము
నలజములలోన నొక్కటి నిలుపవలయు

---

*మూలమున 'వర్ణిత్స' అనికలదు. †మూలమున 'విషయ జయధన' యనియున్నది.

సమపదంబుల రెండవస్థలము గణము
నంపఁ బద్యాదియగుఁ జతుష్పందమునకు. ౧౦౯

ఉదాహరణము:—

కం. ప్రక్షితపరవశలక్ష్మణ
రక్షా కేసరికుమార రాఘవదాసా
శిక్షితరిపుచయ తరుచర
దక్షా వాసవనుతజయ ధైర్యవిలాసా. ౧౧౦

పద్యభ్రమకలక్షణము:—

గీ. మొదలిప్రాసంబు పద్యంబుతుదను దిరుగు
నాదిమాత్రాగ్ర మది తృతీయాంఘ్రికగును
బరఁగ నాల్గోది రెండవప్రాస మరుతఁ
బ్రకటితంబగుఁ బద్యభ్రమకమునందు. ౧౧౧

గీ. అసమపదముల మూఁడవదయిన గణము
నలమె యగుఁ గాని కడమగణములు చారపు
ష్పములనట్ల నలములే జరగునయ్యు
తెలియఁ బద్యభ్రమకకందములను గృతుల. ౧౧౨

ఉదాహరణము:—

క. మానవభట నయజయదయ
యానకతనయా మదద మహారవవనదా
దానవవరహా మదదమ
యానతకనయాయద యజయనటభవనమా. ౧౧౩

టీక:—మానవ=మనువంశజుండైన శ్రీరామునియొక్క, భట=భటుల లో, నయ=నీతియు, జయ=జయమును, దయ=దయయుఁగలవాఁడా! యాన=నడకయందు, కతనయా=నారదుఁడైనవాఁడా, మదద=గర్వ మును ఖండించినవాఁడా, మహారవ=ధ్వనివిశేషముచేత, వనదా=మే ఘుండవైనవాఁడా, ...మదదమ=జితేంద్రియుఁడా,ఆన ...నయ, ఆన

తక=శరణాగతులకు, నయ=నయముగా, అయ=భాగ్యమును, ద= ఇచ్చువాఁడా, అజ... ...నమా, అ=రణరంగమందు, జయ=జయ మనెడు, నట=నటునకు, భవనమా=ఉనికిపట్టైనవాఁడా.

పాదభ్రమకలక్షణము:—

క. అనులోమ విలోమంబుగ
నను వందఁగఁ బాదపాద మది తిరుగంగాఁ
బెనచుక చెప్పినఁ గందముఁ
జనుఁ బాదభ్రమక మనఁగ సత్కృతులందుః. ౧౧౪

ఉదాహరణము:—

క. మానితనగేనితనిమా
యానకహారి యనఘ ఘనయరిహాకనయా
దానవరవారవనదా
మానవపమహిమమతతమమహిమపవనమా ౧౧౫

క. ధర ద్వ్యక్షరి యన రెండ
క్షరములపద్యంబుపేరు కవి పూనిన య
క్షరముల రెండిట నగు నం
దిరవుగ నితరాక్షరంబు లిడరాదెలమిన్. ౧౧౬

ఉదాహరణము:—

క. మిను మిన్న నాను మిమ్మే
మనమున నే నమ్మినాను మను మానీనో
న్ననమేన నామమననా
ననను న్నైనమనుమనుము నన్నును నెమ్మిన్. ౧౧౭

లయగ్రాహిలక్షణము:—

క. అలరు లయగ్రాహి మొద
ల్లల భలము మాన మంగళమహశ్రీయాం
తెలియంగ వనమయూరము
కలుగుఁ బదా అక్షరముల కడలఁ బఠింపన్. ౧౧౮

ఉదాహరణము:—

లయగ్రాహి:—

ఘోరతరజన్యతలవైరిభటసంహారుని
శౌరినుతసాహసు విచారసమధుర్యున్
భూరిబలు ధన్యగుణు నీరనిధి దాఁటిన ర
మారమణదాసవరు మారుతతనూజున్
వీరహరిసైన్యచయకైరవనిశాకరుని
హారఘనసారదరహారధరకీర్తిన్
ధీరజనమాన్యు గిళితోరురవిమండలుని
శూరు హనుమంతు వటుసూరుని నుతింతున్. ౧౧౯

వ. ఇందు మంగళమహాశ్రీయనువృత్తంబును వనమయూరమను వృత్తంబునుం గలవు. ౧౨౦

ఆ. వె. సప్తలిపులమీఁద సౌగంధి మూఁటిపైఁ
గుసుమమంజరియును బొసఁగియుంచు
నొనరుఁ జిత్రకృతుల నుత్పలమాలికా
గర్భితంబులగుచుఁ గపికులేంద్ర. ౧౨౧

ఉదాహరణము:—

ఉ. సైన్యపసౌఖ్యమంత్రి ఘనసారనిభోజ్జ్వలకాంతిమద్యశున్
జన్యరసారమాన్యు ఘను స్వామిహితాధికకార్యదక్షునిన్
ధన్యుని దారితాక్షు ధనిదాశరథిప్రియదాసచంద్రునిఁ
మాన్యుని మారదూరు హనుమంతునిఁ గొల్తు సమంచితస్థితిన్. ౧౨౨

క. తలకట్లుగలవి బోడలు
నలకొమ్ములుఁ దనరు నక్షరాముల హ్రస్వం
బులఁ బద్యము హృద్యంబగు
గిళితాంభోజాతమిత్ర కేసరిపుత్రా. ౧౨౩

తలకట్ల కుదాహరణము:—

క. ఘనశర శశధరభశర
 ఘ్న నదశశతనయనహాయమదనహారనరనం
 దన కనకవసన దరచం
 దనసమ మమరఁగఁ బవనతనయ యశమరయా. ౧౨౪

బోడలకు లక్ష్యము:—

క. క్షితిధృతి నిధిని నిలిపితివి
 స్థితి నిక్కి దివికి నిగిడితి శిఖిజిగి నిర్జిం
 చితి ద్విడ్విధి విరివి విడిచి
 కృతిని విని ర్మించితి సితిఘృణికి గిరిగృహీ. ౧౨౫

కొమ్ములకు లక్ష్యము:—

క. నుతులు నుడువుపురు గుణుగురు
 సుతు గురుభుజుఁ బుఃఖ్య ముఖ్య సుధులు న్బుధులున్
 శ్రుతులును సుముఖులు మునులును
 గుతుకులు గురువులును గుణులు గుణుతు లునుపుచున్. ౧౨౬

క. సరసిజములో మణిగణని
 కరవృత్తనవాక్షరములు కందత్రయమున్
 బరఁగఁగ నివి షడ్విధమై
 యరయఁగఁ గృతులందుఁ జిత్రమయ్యె హరీంద్రా. ౧౨౭

సరసిజము:—

శ్రీరామాప్తున్ చారుశరీరున్ శ్రితజనఫలదుని గృపగలయతనిన్
హరిస్థైర్యున్ వీరవిహారున్ హతదశగళబలు హనుమదధిపతిన్
సారాచారున్ ధీరవిచారున్ శతధృతి గురుమతిశ్వసనుని సుతునిన్
సూరిస్తుత్యున్ దారుణశూరున్ శ్రుతిహితచరితుని శుభగుణుఁ గొలుతున్

భాస్వరవిలసితకందద్వయము:—

అక్షయమతిశమిత్రోరుతరాక్షా యాశ్రితజనచయహరిహయవృక్షా
పక్షితురగభటబాంధవపక్షా భాస్వరవిలసితఫలరుచిభక్షా

దక్షిణశరనిధిలంఘనదక్షా దాశరథిచరణతలభజనేక్షా
లక్షణగుణ మముఁ బ్రోవు జితాక్షా లక్ష్మణధరణిభృదసుపరిరక్షా.

కందద్వయగర్భితక్రౌంచపదము:—

మారుతపుత్రా వారితమారా మనుకులనరవరమణిభటచంద్రా
శూరజనాఢ్యా శ్రీరుచిసూరా సుమహితశశినిభ శుభకరకీర్తీ
చారుగుణాఢ్యా సారవిచారా సలలితభుజబలశమితమహాక్షా
హైరసమాంగా హారివిహారా యమరవిమతతరుహరణకుఠారా.

నిరోష్ఠ్యము:—

గీ. కలయ నోష్ఠా లుకారవకారములును
నల పవర్గంబు మాని మిగిలినలిపుల
నమరఁ బద్యంబు రచియింప నది నిరోష్ఠ్య
మనుచుఁ బల్కిరి సత్కవు లనిలతనయ. ౧౩౧

లక్ష్యము:—

క. తనరంగ నేఁ దలంచెద
ఘనదశరథనందనహితకార్యాసక్తిన్
ఘనరసనిధి దాఁటిన నీ
కనదతిరయచరిత తీక్ష్ణకరతనయహితా. ౧౩౨

గీ. రములు నాల్గింట షడ్యతిన్ స్రగ్విణి యగు
దాని కొన రెండువర్ణముల్ పూని మొదల
నిడ భుజంగప్రయాతమై యొసఁగుఁ జదువ
యతులు ప్రాసముల్ తద్వృత్తగతుల నగుచు. ౧౩౩

లక్ష్యము:—

స్రగ్విణి:—

పావనీ లక్ష్మణప్రాణదాతా సమా
గ్రావచారీలసద్రామ భృత్యాసమ

స్తావనిస్తుత్యసత్య ప్రతిజ్ఞాక్రమా
భావివేళాపరబ్రహ్మమూర్తి నమః. ౧౩౪

క. తలకట్టు గుడుసు కొమ్మును
నల దీర్ఘము లేత్వ మైత్వ మట నో త్వౌత్వం
బులు బొట్టు గిలుక యిన్నియుఁ
గొలఁదిగఁ బంద్రెండు పద్యగుణితంబయ్యెన్. ౧౩౫

గుణితలక్ష్యము:—

మ. సరసా సాహసిసిద్ధవహ్నిహృతరక్షఃశాల సీతావ్యథో
త్తరనాశా సుగుణాఢ్య సూరితతివంద్యా సేవకశ్రీద సై
న్యరసాజాతవసంత సోమనిభ సార్యగ్రప్రధానాఢ్య సం
గరలూనాక్షక దైత్యసర్వహితరక్షా నీకు నే మ్రొక్కెదన్. ౧౩౬

ఆ. వె. ఖడ్గబంధమునకుఁ గర్ణికల్ నాల్గగు
రెండు పిడిని నలుగు రెండు నగుచు
మూఁట నడియుఁ జదువ మూఁడేసి మార్గగు
నొకట నాల్గు మార్గ నొనరఁ జదువ. ౧౩౭

క. చరణాంతాక్షర మావలి
చరణాదుల నిలిచి ప్రాససహితము వడితో
నరయగ సుగంధివృత్తమె
పరఁగును గావ్యముల ఖడ్గబంధ మనిలజా. ౧౩౮

క. పిడినడుమ నంచుల న్నొన
నిడ బంధనమరణరోగవృత్తుఁడగు బతియ
ట్లిడరా దాతనినామము
నడుమనె యనుపంగ శుభ మొనరు ఖడ్గమునన్. ౧౩౯

లక్ష్యము:—

సుగంధి:—

శ్రీనవీనజానకీనసేవకావకావదా
దానవారి యాంజనేయ దారుణస్ఫురజ్జవా

వానరేంద్ర నిన్నుఁ గొల్తు వాంఛితాశ్రితార్థదా
దానవిర్జితాబ్జబాణతాతతారకాధవా. ౧౪౦

క. అందపుచుర్రేఖలు పది
యందంచుల నాలు రేఖ లగు శార్దూలం
బొందగు వృత్తము కర్ణిక
పందొమ్మిది సంఖ్య చక్రబంధమునకగున్. ౧౪౧

గీ. త్రిరసవలయంబులను గృత్యధిపతి గవుల
పేర్లు నిలుపంగవలయును బేర్మితోడ
నితరమగు చుట్లు కడి చమత్కృతి కొలంది
నిడినఁ దగుఁ జక్రబంధంబు కృతులయందు * ౧౪౨

క. మునుపటి యాశ్వాసంబులఁ
బెనఁచితి నొక కొన్ని చిత్రభేదములగతుల్
ఘనులైన కవులకృపచే
ననువుగఁ దెలియంగవలయు నన్నియుఁ గృతులన్. ౧౪3

షట్ప్రత్యయములకు లక్షణము:—

సీసమాలిక.

మ య ర స త జ భ న మహితాష్టగణములు
గురు వొక్కటియును లఘు వొకటియును
గగమును లగమును గలమును లలమును
వరుసన పదునాల్గు వరగణములు
ప్రస్తారమునను బొల్పడి తిరుగు[1] ......
నెట్టన తత్క్రమం బెట్టి దనిన
నుక్త గురులఘు లత్యుక్త గగాదు ల
య్యష్టగణమ్ముల నగును మధ్య

---

* వ్రాఁతప్రతిలో దీనికి లక్ష్యములేదు.

1. చునుండు

మగణాదిఖండికాయుగముల్ ప్రతిష్ఠ కౌ
గజవసుగురులఘుల్ గదిసిరాఁగ
ఖండికల్ నాల్గగు గగముఖ్యములు నాల్గు
సోఁది రాఁ బొలుపొందు సుప్రతిష్ఠ
గాయత్రి యొప్పును ఖండిక లెన్మిదై
పై యష్టగణములు భాసిలంగఁ
బొలుచు నుష్ణిక్ఖండికలు పదా రైనుండు
నబ్ధిరసగురువు లన్నిలఘులు
ఖండికల్ ముప్పదిరెం డనుష్టుప్పున
కగుఁ జతుష్షష్టి గగాదు లౌల
నలువదినాల్గు బృహతికి ఖండిక లష్ట
గణ చతుష్షష్టులు కడలఁ గలయఁ
గరికరేందులు పంక్తిఖండికల్ పైఁబొల్చుఁ
1 ... ... ... ...
... ... ... ...
నక్షీందు శరగ గాద్యంతములయి
జగతికి ఖండికల్ యుగశశిశరములౌ
నన్నేసి మగణాదు లౌను బయిని
గతియుగఖేందులౌ నతిజగతికి ఖండి
కలు రసాజఖగతుల్ గములు లములు
కరిగతిఖాక్షులౌ ఖండికల్ శక్వరి
నగ్గాదులు షడజాభ్రగతులు
షడజాభ్రగతు లతిశక్వరిఖండిక
లష్టగణములుపై నన్ని యన్ని

1. గరశశిశరములు గములు లములు
త్రిష్టుప్పుఖండికల్ ఋతుశరశరములౌ.

దృగజేంషువసులష్టి[1]కగు ఖండిక లహిప
ఢగదృగగ్నులు గురు లన్నిలఘులు
గత్యహిత్ర్యంగాబ్జు లత్యష్టిఖండికల్
కరిరసాద్రియుగాగ్ని [2]......
ఖండికల్ ధృతి గజాంగనగాక్షిశిఖులష్ట
గణములు [3]పది ... ...
ఋతుగణేష్విషుఋతు లతిధృతిఖండికల్
గతిగతీందు యుగర్తు కరగలములు
శయశైలఖేంద్వగ్ని శశిఖండికలు కృతి
గతిగతీంద్వక్షి షట్కారగగజలు
గతిగతీంద్వక్షి షట్కారఖండికలు ప్రకృ
తికి నన్నియె మగణాదికములు తుదఁ
బ్రకృతిఖండికలరె ట్టకృతి కష్యస్త్రేందు
గిరినిధిఖాత్ములౌ గురులు లఘులు
అకృతిరెట్టి వికృతి యగుఁ గరేష్వింద్వద్ర్య
జాభ్రనేత్రముల గగాదు లవును
వికృతిరెట్టగు [4]సంకృతికిఁ గరాస్త్రేంద్వద్ర్య
జాభ్రాత్ములగు మగణాదు లౌల
సంకృతిరెట్టిని జర గభికృతి షడ
బ్జదృగగత్రయరసాబ్జగురు [5]......
నభికృతిరెట్టియై యమరు నుత్కృతి రసా
బ్జదృగగత్రయ షడబ్జగగజముల
సరిచోట్ల లఘువును గురువు బేసుల నిడి
యల బేసి నొక్కటిఁ గలయఁగూర్చి

1. ప్రా. ప్ర. కిని 2. గగము లౌల. 3. పదిలంబుగాఁగ నన్ని.
4. సంకృతికిని గరాస్త్రాద్ర్య. 5. లఘుల.

యర్థింపఁబడిన వృత్తార్ణముల్ చూపు మా
ర్గము నష్టలబ్ధ మన ప్రత్యయంబు
ఛందోక్షరంబులక్రింద నిన్నళ్లిడి
యందులో లఘువులక్రింది లెక్క
లవి ప్రోవుగాఁ జేసి యందొకటియుఁ గల
ప నగు నుద్దిష్టమన్ ప్రత్యయంబు
నినుమళ్లకడలెక్క లినుమడిఁ గూడి మొ
ఆయ వృత్తసంఖ్య యన్ ప్రత్యయంబు
నేఛందమునకేని యెన్ని యక్షరములో
యన్ని యొక్కట్లిడి యందు నొకటి
యమరించి దొంతిగా నవి చేర్చి మఱి యుపాం
తములు చిక్కఁగఁ గూడఁ దనరు ... ...
... ... మేరు వర్ధమేరువులపై నెక్కింపఁ
బబలు లగక్రియా ప్రత్యయంబు
షడ్వింశదురుతరచ్ఛందంబులకు నెల్లఁ
బ్రస్తరింపఁగఁ జోటు పరఁగ నింత
మేర పట్టునటంచు దా నేరుపఱుచుఁ
బ్రకటముగ నధ్వమనియెడు ప్రత్యయంబు
నిట్టి ప్రత్యయషట్కంబు నెఱుఁగవలయు
వినుము వెలలూరుపురమున వెలయు హనుమ. ౧౪౪

ఆ. వె. వృత్తసంఖ్యనొద్దు వెలయు నన్నిని చేతఁ
బొలుగొనిన ఖండికాళి మొదవు
నట్టిఖండికాళి యాయెన్నిదింటనే
హెచ్చఁజేయ వచ్చు వృత్తసంఖ్య. ౧౪౫

చక్రవాళవృత్తము:—

ఘనవాహారి విరామ రామమహీభృత్కంఠీరవ శ్రీపదా
ర్చనలబ్ధాధికపుణ్య పుణ్యజనరాట్సంస్థాన లంకాపురీ
వనకల్పానిలమిత్ర మిత్రజనలస్వారాజి పుత్రాత్మభూ
ప్రణుతోద్యజ్జయభీమ భీమజలధీంద్రప్రోల్లసల్లంఘనా. ౧౪౬

(ఘనవాహారీ)

కం. శతధృతి జనకపదాంబుజ
తతభక్తిస్వాంతయుత బుధద్రుమవసంతా
క్షితిజేశ్వరహితవిస్ఫుర
దతిబలజితసమరభూమి హనుమత్స్వామీ. ౧౪౭

పంచచామరము:—

[1] గుణీతృణీకృతారివీర ఘోరపూరగారలం
కిణీఘృణీనవంశరాతికీర్తి కాంతిమాలికా
మణీఘృణీయకంపనాసుమారుతస్ఫురద్భుజా
ఫణీగణీంద్రముఖ్యదేవపంక్తి దత్తసద్వరా. ౧౪౮

గద్య. ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర భారద్వాజగోత్ర
పవిత్ర సర్వయామాత్యపుత్ర చిత్రకవిపెద్దనార్య ప్రణీతంబైన
లక్షణసారసంగ్రహంబునందు రేఫఱకారభేదంబులును, దశ
రూపనాటక సంజ్ఞలును, చిత్రకవిత్వ లక్షణంబులును,
షట్ప్రత్యయ విశేషమార్గంబులునుగల సర్వంబును
దృతీయాశ్వాసము. సంపూర్ణము.

ఓం తత్సత్.

---

1. వ్రాతప్రతిలో, 'ఘృణీ' అనికలదు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు, పరిషద్వ్యవజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

## కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ, బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు (కోశాధ్యక్షులు).

వెద్దాడ రామస్వామిగారు, ఎం ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గోడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ. ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాసుగారు బి. ఏ., బి. ఎల్.

ఆళిక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావునాయుఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయుఁడుగారు.

మంచితరుణము !! మంచితరుణము !!

# అన్నియు సగము వెలలకే.

---

ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడిన గ్రంథములు (శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువుతప్ప) వెనుకటి పరిషత్పత్రికలసంపుటములును 1 జూలై నుండి 31-10-39 వఱకు **సగము వెలలకే** యిచ్చుచున్నాము. ఈ పత్రికల సంపుటములందు 1 వ సంపుటము మొదలు 8 వ సంపుటమువఱకు కొన్ని సంచికలుమాత్రము లభించును. సందంపూడిశాసనము, పెదచెఱుకూరిశాసనము మున్నగు ప్రధానవిషయములతోఁ గూడిన వ్యాసములుగల సంచికలు దొరకును. 9 మొదలు 27 వ సంపుటమువఱకుఁ బూర్తిగ నున్నవి. విమర్శకులకు, విద్వాన్ శిరోమణి పరీక్షార్థులకు నుపయోగించెడి వ్యాసరాజము లిందుఁ బెక్కులు గలవు.

గ్రంథములపట్టిక నీసంచిక చివరిపుటలలోఁ జూచునది.

వలయువారీ క్రిందిచిరునామాకు వ్రాయవలెను.

కార్యదర్శులు
ఆంధ్ర సాహిత్యపరిషత్తు,
సూర్యరావుపేట, కాకినాడ.

---

Printed by N. Achutaramiah at the Cocanada Printing works Cocanada and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

# విషయసూచిక.



శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౭. { ప్రమాధినామసంవత్సరము. శ్రావణ భాద్రపద మాసములు. } సంచిక 3

## కువలయానందసారవిమర్శనము.

వ్యాకరణవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ,

**ఆకెళ్ల శేషాద్రిగారు.**



"కువలయానందసారము" అను పుస్తక మొక విద్యార్థిచేతిలో నుండఁగాఁ జూచితిని. ఇది యొక యలంకారగ్రంథము. దీనిని రచించిన వారు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు. సంస్కృతమందలి కువలయానందమున కిది యాంధ్రీకరణము.

ఇందు లక్షణము లన్నియు మూలమునందు వలెనే చక్కని పద్యములందు వ్రాయఁబడినవి. వ్యర్థపదములు లేకుండఁగను, అర్థము చెడకుండఁగను, మూలమున కవిరుద్ధముగను, చక్కగ బోధపడునట్లును, ఇట్లు లక్షణములు పద్యములలో వ్రాయుట సామాన్యవిషయము కాదు; అలంకారముల తత్త్వము సరిగా నెఱుఁగని వారికి సాధ్యమగునదియుఁ గాదు.

గొప్పప్రబంధములనుండి యేర్చిన పద్యము లిందు లక్ష్యములుగా నీయఁబడినవి. ఇది మిగులఁ బ్రశంసనీయము. కొన్నిపట్టులఁ దామే మూలమందలి శ్లోకములను దెనిఁగించి యుదాహరణములుగా నిచ్చియున్నారు. ఆపద్యములు గమనించినచో వీరికవిత సరళమైనదని కూడ గ్రహింపఁగలము.

మానవులకుఁ బొరపాటులనునవి పుట్టుకతోడివియే కాన నట్టి స్ఖాలిత్యము లీగ్రంథమునం దచ్చటచ్చటఁ గానఁబడినవి. వానిలోఁ గొన్నిటి నీదిగువను జూపుచున్నాను.

1. ఉత్ప్రేక్ష.

(1) సిద్ధవిషయ హేతూత్ప్రేక్ష:—

దీనికి వీ రిచ్చిన యుదాహరణమును, దాని సమన్వయమును గమనింపుఁడు.

"తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముచేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్.

(మనుచరిత్రము)

ఇట సూర్యుఁ డెఱ్ఱని కాంతి ధరించుట విషయము. అది యత నికి స్వతఃసిద్ధమగు ధర్మము. కాని యిచట సూర్యుఁ డెఱ్ఱవారుటలోఁ బ్రవరునిపైఁ గల కోపము కారణముగ వర్ణింపఁబడినది. హేతువు కాని కోపము హేతువుగ వర్ణింపఁబడినందున నిది హేతూత్ప్రేక్ష యగును."

పై యుదాహరణమును, సమన్వయమును, ఎంతమాత్రమును సరిపడియుండలేదు. దేనిని హేతువుగా నుత్ప్రేక్షించుచున్నామో యది సిద్ధమైనచో నచట సిద్ధవిషయ హేతూత్ప్రేక్ష యనియు, అసిద్ధమైనచో నసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష యనియు, సిద్ధాంతము. పైయుదాహ రణములో సూర్యుఁ డెఱ్ఱవాఱుటలోఁ గోపము కారణముగా ను త్ప్రేక్షింపఁబడినపు డాకోపము సూర్యునికి సిద్ధమైనయెడల సిద్ధవిషయ హేతూత్ప్రేక్ష యగును. కాని కోపము సిద్ధము కాదు. ఎఱ్ఱవాఱుట సూర్యునికి స్వతఃసిద్ధము కాన సిద్ధవిషయ మని వేంకటరమణయ్యగా రనుకొనిరి కాఁబోలు. అది తప్పు. ఎఱ్ఱవాఱుటలో నేది హేతువుగా నుత్ప్రేక్షింపఁబడినదో యట్టి కోపము సిద్ధమైనచో దీని కుదాహరణము

కానోపును. సూర్యుని కట్టి కోపము సిద్ధము కాదు. కాన నిది యసిద్ధవిషయహేతూత్ప్రేక్ష కావలయును. మూలమును బరికించినచో నీవిషయము స్పష్టమగును. సిద్ధవిషయహేతూత్ప్రేక్ష చూడుఁడు:

"రక్తౌ త వాంఘ్రీ మృదులౌ భువి విక్షేపణా ద్ధ్రువమ్."

"చరణయోః స్వతః సిద్ధే రక్తిమని వస్తుతో విక్షేపణం న హేతురి త్యహేతో స్తస్య హేతుత్వేన సంభావనా హేతూత్ప్రేక్షా విక్షేపణస్య విషయస్య సత్త్వా త్సిద్ధవిషయా."

"నీ మెత్తని పాదములు భూమిపై నడచుటచేఁ గాఁబోలు నెఱ్ఱవాఱినవి" అను చోటఁ బాదము లెఱ్ఱవాఱుటలో నడచుట హేతువు కాకపోయినను హేతువుగా నూహించుటచే హేతూత్ప్రేక్ష; నడుచుట సిద్ధమే కాన నిది సిద్ధవిషయహేతూత్ప్రేక్ష యని పైమూలమున కర్థము.

ఇంక మూలమందలి యసిద్ధవిషయహేతూత్ప్రేక్షోదాహరణమును దాని సమన్వయమును గమనింతము.

"త్వన్ముఖాభేచ్ఛయా నూనం పద్మై ర్వైరాయతే శశీ."

"చంద్రపద్మవిరోధే స్వాభావికే నాయికావదనకాంతిప్రేప్సా న హేతు రితి తత్ర తద్ధేతుత్వసంభావనా హేతూత్ప్రేక్షా వస్తుత స్తదిచ్ఛాయా అభావా దసిద్ధవిషయా."

"నీముఖకాంతిని బొందవలయు నను కోరికచేఁ గాఁబోలు శశి, పద్మములతో విరోధించుచున్నాఁడు" అనుచోట సహజమగు చంద్రపద్మవిరోధములో నాయికాముఖకాంతీచ్ఛ కారణము కాకపోయినను, కారణమైనట్లూహించుటచే హేతూత్ప్రేక్ష; నిజముగా నట్టి కోరిక చంద్రుని కుండదు కాన నిది యసిద్ధవిషయహేతూత్ప్రేక్ష యని పైమూలమున కర్థము.

పై రెండు సందర్భములను బట్టియు నేది హేతువుగా నూహింపఁబడునో యది సిద్ధమైనచో సిద్ధవిషయహేతూత్ప్రేక్ష యనియు, అసిద్ధమైనచో నసిద్ధవిషయ హేతూత్ప్రేక్షయనియు, బోధపడుచున్నదిగదా!

"తరుణి ... ... ... ... ... ... ...కషాయదీధితిన్."

అను పద్యమున హేతూత్ప్రేక్షయే యను వేంకటరమణయ్య గారిమతము ననుసరించి, యది హేతూత్ప్రేక్ష యైనను వారు చెప్పి నట్లు సిద్ధవిషయము కాదని యింతవఱకును వ్రాసియుంటిని.

పరిశీలింపఁగా నిది హేతూత్ప్రేక్షయే కాదు. 'కోపముచేఁ గాఁబోలు సూర్యుఁ డెఱ్ఱవాఱెను' అని యున్నచో నెఱ్ఱవాఱుటలోఁ గోపము కారణముగా నూహింపఁబడియుండను గాన హేతూత్ప్రేక్ష కావచ్చును. కాని యుదాహరణములో నట్లులేదు. పరికింపుఁడు. 'రోషభీషణస్ఫురణ వహించెనో యనునట్లు సూర్యుఁడు కషాయదీధితి తాల్చెను'అని యున్నది.సూర్యుఁ డెఱ్ఱవాఱుటను జూచి, యది రోషభీషణస్ఫురణ వహించుట యేమో యని యూహింపఁబడినది. ఇచట నేదియు హేతువుగా నూహింపఁబడుట లేదు. కాఁబట్టి యిది వస్తూత్ప్రేక్షయే కాని హేతూత్ప్రేక్ష యెట్లును గాఁజాలదు.

ఇంక ఫలోత్ప్రేక్షలు చూతము.

ఏది ఫలముగా నూహింపఁబడునో యది సిద్ధ మైనచో సిద్ధవిషయఫలోత్ప్రేక్ష యనియు, అసిద్ధ మైనచో నసిద్ధవిషయఫలోత్ప్రేక్ష యనియు సిద్ధాంతము. మూలమును గమనించినచో నీ విషయము తెల్లము కాక మానదు. ఇది సరిగా గ్రహింప కుండుటచే వేంకటరమణయ్యగారు హేతూత్ప్రేక్షలయందువలెనే ఫలోత్ప్రేక్షలయందును, పొరపాటుపడి యున్నారు. చూడుఁడు:—

(2) సిద్ధవిషయఫలోత్ప్రేక్ష:—

"ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁడే తేరఁ దద్దీప్తి నం
జనసంబంధజబాంధవమ్మున రతిశ్రాంతాంగనానేత్రకో
ణనికాయంబుల డాఁచి తద్ధవళిమం దాఁ బూనెనో చొప్పు మా
ర్ప ననన్ వెల్వెలఁ బాఱె దీపకళికావ్రాతంబు శాతోదరీ!

(మనుచరిత్రము.)

ఇచట దీపములు వెలవెలఁబాఱుట విషయము. అవి వెలవెలఁ బాఱుటలోఁగల ప్రయోజనము చొప్పుమార్చుట యనివర్ణింపఁబడినది. ఫలము కాకున్నను, అది ఫలమైనట్లు వర్ణింపఁబడినందున ఫలోత్ప్రేక్షయగు చున్నది." అని యుదాహరణతత్సమన్వయములు వ్రాసియున్నారు. ఇచట సిద్ధవిషయ మెట్లో సమన్వయింపలేదు. ఫలముగా నూహింపఁబడిన 'చొప్పుమార్చుట' సిద్ధ మయినచో నిది సిద్ధవిషయఫలోత్ప్రేక్ష కావలసినదే ! కాని దీపములు చొప్పుమార్చుట సిద్ధము కాదు; కాన నిది యసిద్ధవిషయఫలోత్ప్రేక్షయే కావలసియున్నది. పై పద్యమునందు ఫలోత్ప్రేక్ష కల దను వేంకటరమణయ్యగారి యభిప్రాయము ననుసరింత మన్నను, అది యసిద్ధవిషయఫలోత్ప్రేక్ష యగునుగాని సిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష యెట్లును గాఁజాల దన్నమాట.

తత్త్వ మరయఁగా వేంకటరమణయ్యగారి యభిప్రాయమే తప్పు. ఇది ఫలోత్ప్రేక్షయే కాదు. 'చొప్పుమార్చుటకుఁ గాఁబోలు దీపములు వెలవెలఁ బాఱెను' అని యున్నచో 'చొప్పుమార్చుట' అనునది వెలవెలఁబాఱుటకు ఫలముగా నూహింపఁబడియుండును గాన ఫలోత్ప్రేక్ష కావచ్చును. కాని యుదాహరణములో నట్లు లేదు. పరిశీలింపుఁడు. 'చొప్పుమార్చుటకై ధవళిమను బూనెనో యనునట్లు దీపములు వెలవెలఁ బాఱెను అని యున్నది. దీపములు వెలవెలఁబాఱుటను జూచి, యది నేత్రములందలి ధావళ్యమును బూనుటఁగా నూహించియున్నాఁడు. కావున నిది వస్తూత్ప్రేక్షయే కాని ఫలోత్ప్రేక్ష కాఁజాలదు.

'ధావళ్య మెందులకుఁ బూనెను'అను ప్రశ్నకు 'చొప్పుమార్చుటకు' అని సమాధానము కాఁబట్టి చొప్పుమార్చుట ధావళ్యమును బూనుటకు ఫలము కాని వెలవెలఁబాఱుటకుఁ గాదు. ఇచట ధావళ్యమును బూనుటయే యుత్ప్రేక్షావిషయముకాని చొప్పుమార్చుట కాదు కాన నిది ఫలోత్ప్రేక్ష యెట్లును గాఁజాలదు.

(3) అసిద్ధవిషయఫలోత్ప్రేక్ష:—

"అలినీలాలక ! కంటె చిల్క భవదీయాలాపలీలాప్తి నిం
పలరం గోరి విపక్వదాడిమతరువ్యాలంబిశాఖాఫల
జ్వలనావాఙ్ముఖమై తపంబు సవరింపన్ సాగె; నే లబ్బెడిం
దలక్రిందైన సమానవాగ్గ్రహణమేధాశక్తి బింబాశికిన్.
(వసుచరిత్ర)

ఇచటి విషయము చిలుక తపస్సుచేయుట; అది కవికల్పితము కాని ప్రసిద్ధము కాదు. చిలుక యెన్నఁటికిని తపం బొనరింప లేదు. అట్లు తపస్సు చేయుటకుఁ గల ప్రయోజనము గిరికాలాపలీలను బొందుట. ఫలము కాని దానిని ఫలముగ వర్ణించుటచే నిచట నసిద్ధవిషయఫలో త్ప్రేక్ష యని యెఱుఁగవలెను." అని దీని యుదాహరణ సమన్వయములు వేంకటరమణయ్యగారు వ్రాసిరి.

ఇచటి సమన్వయము తప్పు. ఫలముగా నూహింపఁబడినది యసిద్ధమైనచో నసిద్ధవిషయ మగును. 'ఫలముగా నూహింపఁ బడిన గిరికాలాపలీలాప్తి యసిద్ధము కాన నసిద్ధవిషయఫలోత్ప్రేక్ష' అని సమన్వయింపవలయును. చిలుకతపస్సు సిద్ధమైనను, అసిద్ధమైనను నిచట దాని ప్రసక్తిలేదు.

2. ప్రతీపాలంకారము.

(1) తృతీయభేదము:—

"వర్ణ్యోపమేయలాభేన తథాఽ న్యస్యాఽ ప్యనాదరః ।
కః క్రౌర్యదర్ప స్తే మృత్యో ! త్వత్తుల్యాః సన్తి హి స్త్రియః ॥
అత్యుత్కృష్టగుణతయా క్వచి దప్యుపమానభావ మసహమానస్యాఽవర్ణ్యస్య వర్ణ్య ముపమేయం పరికల్ప్య తావతా తస్య తిరస్కారః పూర్వప్రతీపవై పరీత్యేన తృతీయం ప్రతీపమ్."

అని మూలము. 'నీ కుపమేయము లోకములో లేకపోలేదు. లేదని గర్వింపకుము' అని చెప్పి యుపమానమును దిరస్కరించుట

మూఁడవ ప్రతీప మని మూలమున కర్థము. 'ఓ మృత్యువా! నేనే క్రౌర్యము కలదాన నని నీ కేల యీగర్వము? లోకములో నీవంటి స్త్రీ లున్నారు సుమా!' అను నుదాహరణము నాలక్షణమునకు సరిప డియే యున్నది. ఇంక వేంకటరమణయ్యగారి తెనిఁగింపు చూతము:

" వర్ణ్యోపమేయాప్తి వర్ణ్యేతరానాద
రంబు చెప్పినఁ బ్రతీపం బ దొకటి.

ఉపమానము నుపమేయముగ మార్చియున్నను, ప్రకృతోపమే యలాభమున, నీ కల్పితోపమేయమును నిరసించుట తృతీయప్రతీపభేద మగును.

గీ. దారుణంబులఁ దొల్లిటి దాన ననుచుఁ
గాలకూటమ! నీ వేల గర్వపడెదు?
కలవు నీపోలికలు గల ఖలుని మాట
లెంతయును సాధుజనులకు హింసఁ గూర్ప.

ఇచట నుపమానమగు కాలకూట ముపమేయమైనను, ప్రకృతోపమేయమగు ఖలవచనమే గ్రహింపఁబడి కల్పితోపమేయము తిరస్కరింపఁబడినది." అని వ్రాసిరి.

ఈ ప్రతీపభేదములో నుపమేయము లభించుటచే నుపమాన మును దిరస్కరించుట మాత్రమే యుండును. కాని యుపమాన ముపమే యముగా మార్పఁబడదు. ఉదాహరణములో 'కాలకూటమ! నీపోలి కలు గల ఖలునిమాటలు' అని చెప్పుటచేఁ గాలకూటము ఖలవచన ముల కుపమానముగానే యున్నది గాని యుపమేయముగా లేదు. మూలములోఁ గూడ 'మృత్యో! త్వత్తుల్యాః సన్తి హి స్త్రియః' అని చెప్పుటచే మృత్యు వుపమానముగానే యున్నది కాని యుపమేయముగా మార్పఁబడలేదు. కాఁబట్టి, యుపమానమగు కాలకూట ముపమేయ ముగా మాఱిన దనియు, నట్టి కల్పితోపమేయము తిరస్కరింపఁబడిన దనియు, వీరి పై వ్రాఁతలు భ్రమమూలకములు.

(2) ప్రతీపములోఁ జివరిభేదము:—

ఈభేదమున కుదాహరణముగా నీక్రింది పద్యము నిచ్చియున్నారు.

"అతనికీర్తిప్రతాపంబు లవనిఁ గలుగ
నేల యివి యంచు మదిలోన నెపుడు తలఁచు
నపుడ పరివేషనెపమున నబ్జసూర్య
మండలముల విధాత్రుండు కుండలించు.

(శృంగారనైషధము.)

ఇందు 'పరివేషనెపమున' అను పాఠము తప్పు. 'నెపము' అను పద మచ్చతెనుఁగు కావున 'పరివేష' అను సంస్కృతముతో సమసింప వీలులేదు. సమాసముచేసి 'పరివేషనెపము' అని వాడినచో నది 'వృక్ష పండు'వంటి తప్పుసమాసము. కాఁబట్టి యిచట 'పరివేషమిషమున'అను పాఠము గ్రాహ్యము.

(3) ప్రతీపాలంకారమును ముగించుచు నుపమేయోపమాప్రతీపములు మాత్రమే యుపమాలంకారభేదము లని కొందఱిమతముగా వేంకటరమణయ్యగారు వ్రాసియున్నారు. అనన్వయము కూడ నుపమాభేద మని కొందఱి మతముగా మూలమునఁ గలదు. చూడుఁడు:—

"కేచి దనన్వయోపమేయోపమాప్రతీపానా ముపమావిశేషత్వేన తదన్తర్భావం మన్వతే."

(సశేషం.)

# నాటకములు—రసములు.

విద్వాన్ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

సంస్కృతవాఙ్మయమున శ్రవ్యకావ్యములతోఁ బాటు దృశ్యకావ్యములును బ్రాచీనకాలమునందే పొడసూపినవి. అందు దృశ్యకావ్యములు రంగమునఁ బ్రదర్శింప ననువగుటచేత మిక్కిలి వ్యాప్తినొంది పండితపామరహృదయాకర్షకము లైనవి. ఔచితినిబట్టి వానిలో నొకదాని కంటె నొకటి మిన్నలై 'కావ్యేషు నాటకం రమ్య' మ్మనియు, 'నాటకాంతం కవిత్వ' మ్మనియుఁ బ్రసిద్ధివహించినవి. ఈదృశ్యకావ్యములు నాయికానాయకవిశేషముల ననుసరించియు, రసభేదమును బట్టియుఁ బదివిధములుగా నున్నవనియు, వీనికి రూపకములను నామ మర్వ్వనియు లక్షణకర్తలచే నిర్ణయింపఁబడినది. ఈరూపకలక్షణనిర్ణయమునఁ బరమప్రాచీనములగు భాసాదులనాటకము లటుంచి కాళిదాసాదికవులనాటకములనే బహుళముగా లక్ష్యము లొనర్చికొని పెక్కురు లాక్షణికులు పెక్కు లక్షణగ్రంథములు రచించుచువచ్చిరి. ఆనాటకములందుఁ దఱచుగా శృంగారవీరరసములే ప్రధానములుగాఁ గనవచ్చుటం జేసి 'నాటకే తు భవే దంగీ శృంగారో వీర ఏవ వా' యనియు 'ఏక ఏవ భవే దంగీ శృంగారో వీర ఏవ వా' యనియు లక్షణము నిర్మింపఁబడినది. సామాజికులహృదయములందు నిరతిశయానందముఁ గూర్చు రసాస్వాదమే నాటకముయొక్క పరమప్రయోజనము గావున—లోకమున సర్వసామాన్యములగు శృంగారవీరరసములకే ప్రాచుర్యము కలుగుటచేఁ దద్రసములనేపురస్కరించుకొని చతుర్వర్గసాధనములుగా నాటకములు రచించుటయు నట్లే సర్వనాటకములు నుండవలెనను లక్షణము పుట్టుటయు సంభవించినది. ఏనాటకమున నేని నొకటరెంట నన్యరసములు ప్రధానములుగానున్నను, వానిని లక్ష్యములుగా గ్రహింప విరళములని కాఁబోలు నట్లేని యభీష్టములగు శృంగారవీరములలో ముడివెట్టుటయుఁ దటస్థించినది. అంత

మాత్రమున నన్యరసప్రధానములు లేవని కాని యయ్యవి యనియమములని కాని యనుటకు వలనుపడదు. లాక్షణికులందును ప్రాచీనులు తగినంత యవకాశము చూపిరి కాని యర్వాచీనులు మాత్రము బాహుళ్యముంబట్టి శృంగారవీరముల కన్యములగురసములకు నవకాశము లేదని నిబంధించిరి.

ధ్వన్యాలోకము తృతీయోద్యోతమున 'ప్రసిద్ధేఽపి ప్రబంధానాం నానారసనిబంధనే, ఏకో రసోఽఙ్గీకర్తవ్య స్తేషా ముత్కర్ష మిచ్ఛతా" అని విశాలముగా లక్షణము గావించి యాగ్రంథకర్తయే పైశ్లోకమున కిట్లు వివరణ మొసఁగినాఁడు. "ప్రబంధేషు మహాకావ్యేషు వా నాటకాదిషు వా, విప్రకీర్ణతయా అంగాంగిభావేన బహవో రసా ఉపనిబధ్యంతే ఇత్యత్ర ప్రసిద్ధౌ సత్యామపి యః ప్రబంధానాం ఛాయాతిశయ మిచ్ఛతి తేన తేషాం రసానా మన్యతమః కశ్చి ద్వివక్షితో రసోఽఙ్గిత్వేన వినివేశయితవ్య ఇత్యయం యుక్తతరో మార్గః" అని దీనింబట్టి యేదేని యొక రసము నాటకాదులందును ప్రధానరసముగా నుండవచ్చు నని తెలియ వచ్చుచున్నది. ఇది యిట్లుండఁ దరువాతివారు బాహుళ్యము ననుసరించి శృంగారవీరాన్యతరమే యంగియైయుండవలె నని చెప్పియుందు రని వెనుకనే సూచించితిని. ఆలక్షణమున కనుగుణముగా నితరరసప్రధానములగునాటకములను సైతము పై రెండురసములలోనే వ్యాఖ్యాతలు విమర్శకులు నంతర్భవింపఁ జేయుచు వచ్చిరి.

పై లక్షణము నుల్లంఘించి యున్నవి (1) ప్రబోధచంద్రోదయము. (2) ఉత్తరరామచరిత్రము. రెండవనాటకమువిషయమై వ్యాఖ్యాతలు విమర్శకులు నటు నిటు సమర్థించుచువచ్చిరి. ఆవిషయము తరువాత వివరింపఁబడును. తొలుతఁ బ్రబోధచంద్రోదయమును గూర్చి రవ్వంత నుడువవలసియున్నది. ఈనాటకమున రస మదియా యిదియా యని సంశయింపకుండఁ గవియే "త ద్వయం శాంతరసప్రయోగేన ఆత్మానం వినోదయితు మిచ్ఛామః" అని ప్రస్తావనయందుఁ జెప్పినుటచే శాంతర

సప్రధాన మనుట నిర్వివాదము. పైఁగాఁ దద్వ్యాఖ్యాతలు రసమును గూర్చి నాటకముయొక్క యాద్యంతములందుఁ జర్చించి శాంతము గూడ రసమే యనియు, నదియే యీనాటకమున నంగి యనియు, శృంగారవీరాదు లంగము లనియు స్వీకరించిరి. (1) చంద్రికావ్యాఖ్య. “తదితి... శాంతరసప్రధానో యః ప్రయోగాభినయః, నాట్యానుకారః... తేనేత్యర్థః”అనియు, (2) ప్రకారవ్యాఖ్య. శాంతరసప్రాయః శాంతరసప్రధానో యః ప్రయోగాభినయః నాట్యానుకార స్తేనేత్యర్థః, అనియుఁ బ్రస్తావనలోని మూలమునకు వ్యాఖ్యచేసి తుదను “అత్రశాంతరసః పంచసంధివ్యాపితయా పునః పున రనుసంధీయమానః ప్రాధాన్యం భజతే, రసాంతరై రంతరాలవర్తిభి ర్య స్సమావేశ స్తస్యప్రాధాన్యం నోపహంతి” అనియుఁ గంఠోక్తముగాఁ దెల్పి విడిచిరి. మూలగ్రంథము ననుసరించియు, వ్యాఖ్యానముల ననుసరించియు, శాంతరసప్రధానము ప్రబోధచంద్రోదయ మనుట నిస్సంశయమే కదా? శృంగారవీరాన్యతరము లంగిగా నుండవలె నను లక్షణమున కియ్యది బాధక మనుట స్పష్టము.

ఇఁక నుత్తరరామచరితవిషయమై కరుణరసప్రధానమా? శృంగారరసప్రధానమా? యని చిరకాలమునుండి వ్యాఖ్యాతలును విమర్శకులును వివదించుచున్నమాట సర్వజనవిదితము. ప్రబోధచంద్రోదయమందువలె వాచ్యముగాఁ గాక వ్యంగ్యముగా నచ్చటచ్చటఁ గరుణరసప్రధానమని కవి చెప్పుటచేతను, నాటకలక్షణమున శృంగారవీరాన్యతరరసములే యంగిగా నుండవలెననియుండుటచేతను, శృంగారరసాంతర్భూతమగు కరుణము కాని కేవలము కరుణరసము కానేరదని కొందఱు చెప్పసాగిరి. మఱికొందఱు నిజప్రౌఢి వినియోగించి కవి కరుణమే సర్వత్ర ధ్వనింపఁ జేసినాఁడు కావున శృంగారప్రధానము కానేర దనినారు. మఱికొందఱు ధర్మవీర మనినారు. ఇన్నివిధముల వివాదములుబయలుదేఱుటకుఁ గారణము పైనాటకలక్షణమున నీనాటకమునుసమన్వయమొనర్పవలె నను నభినివేశమే.

శృంగారరసప్రధాన మనువారికిఁ బ్రాచీనమగు నారాయణభట్ట రచితభావార్థదీపికావ్యాఖ్య యాధారము. కరుణరసప్రధానమను వారి వీరరాఘవకృతవ్యాఖ్యయు, సాహిత్యదర్పణటీకాకారునిప్రాతయు నాధారములు.

శృంగారవాదులు చెప్పునది యేమనః—నాయికానాయకులలో నొకరు మరణించినఁ గదా కరుణము! అట్లు గాక మూలములో సీత భూగర్భమున లీనమైనకథను మార్చి సీతారాముల సమావేశము చెప్పఁబడియుండుటయు, నాటకమున సర్వత్ర సీత తన్నుఁ జేరఁగల దను ప్రత్యాశ రామునకు దృఢముగా నున్నదనియు, సీతాప్రతికృతిని జెంతఁ బెట్టుకొని రాముఁ డశ్వమేధము చేయుటయు, విప్రలంభశృంగారము కాని కరుణము కానేరదు" అని.

కరుణరసవాదులు చెప్పు నదేమనః—రామునకుఁ బ్రత్యాశ లేదనియుఁ, గరుణరస మని దృఢపఱుచుటకు సర్వత్ర వ్యంగ్యముగాఁ దల్లక్షణము కవి చెప్పుచునేయున్నాఁడు. కావునఁ గరుణరసమే దీనియందంగి గాని యన్యము కాదని వీరరాఘవవ్యాఖ్యనుదాహరించియు మఱికొన్ని పాత్రముల పల్కుల నుదాహరించియు సిద్ధాంతీకరించినారు. అశ్వమేధవిషయమున సువర్ణప్రతికృతితో రాముఁ డశ్వమేధము చేయుట కర్మాతగూడ నున్న శ్లేషమో కొన్ని యుపపత్తులు చూపినారు.

అవియన్నియు నిచట నుద్ఘాటించుట నాపని కాకపోదు; కాని పెద్దల నందఱను బేర్కొని వారిని కాదనుట నాపని కాదు. అంతియగాక వారందఱును నాకుఁ బూజ్యులును గురుతుల్యులు నగుటచే వారిని ధిక్కరించుటయు నాపని గాదు. అయినను నీవిషయమై నాకుఁ దోఁచిన యభిప్రాయము నేను గూడ వెల్లడింప సాహసించినందులకుఁ బెద్దలు నన్ను మన్నింతు రని మనవిచేసికొనుచున్నాను.

ఈనాటకము కరుణరసప్రధానమే యని నాయాశయము. అందులకు నాకుఁ దోఁచిన కొన్ని యుపపత్తు లిందుఁ జూపి యాపైని సహృదయులయామోదము గోరెదను.

సీత యవతారము చాలించినకథ కవి యీరీతిగా మార్చుటకుఁ గల కారణ మూహించినచోఁ గావ్యములందు నాయికానాయకుల మరణము వర్ణింపవలసిన తావుల మరణ మెట్లు వర్ణింపవలెనో యాలంకారికసమయ మెట్లున్నదో రవంత పరిశీలింతము. "మరణం మరణార్థస్తు ప్రయత్నః పరికీర్తితః" అని ప్రతాపరుద్రీయమున మన్మథావస్థలలోఁ బదియవదగుమరణావస్థనుగూర్చి లక్షణము గలదు. మరణము యథార్థమే యైనచో రసభంగము కాఁగలదని వారి యాశయము. అదియునుగాక యయ్యది యమంగళమనియుఁ బ్రాచీనుల యభిప్రాయము. కావుననే తద్వ్యాఖ్యాత "సాక్షాత్తదుదాహరణస్యాఽమంగళత్వాత్తదుద్యోగోఽత్ర వివక్షితః" అని వివరించెను. భారతీయ సంప్రదాయము ననుసరించి సాక్షాన్మరణవర్ణన మమంగళ మనియే భవభూతి కరుణరసప్రధానముగాఁ జెప్పఁదలఁచిన తన నాటకమున నాయికా మరణోద్యోగ మంతర్నాటకమున స్పష్టముగాఁ జూపి నాయికానాయక సమావేశ మొనర్చి ముగించెను. అంతర్నాటకమునుగూర్చి కొంచెము దూరమాలోచించిన మొదల:— ఆనాఁటి నాటకమున నా కాసంతయే ప్రదర్శింపఁబడె ననుటకు వలనుపడదుగదా ! రాముఁడు సీతను విడిచిపెట్టినది మొదలు సీత గంగలోఁ బడుటయుఁ బరిపూర్ణముగాఁ బ్రదర్శించియే యుందురు. ఆ యంతర్నాటకప్రస్తావనయందు 'పావనం కరుణాద్భుతరసం కించిదుపనిబధ్యతే' అని వాచ్యముగాఁ గరుణరసప్రధాన మని చెప్పఁబడినది. 'నిర్వహణేఽద్భుతః' అను లక్షణము ననుసరించి కుశలవ జననరూపమగు నద్భుతరసముతో నిర్వహణసంధి ముగింపఁబడినది. ఈవిషయము సూక్ష్మముగాఁ బరిశీలింపఁ బ్రధాన నాటకమందుఁ గరుణరసప్రధానమని చెప్పకున్నను దాని ఛాయయే యగు నంతర్నాటకమునఁ జెప్పుటవలనఁ గరుణరసప్రధానమనియే కవియాశయ మని విస్పష్టమగుచున్నది. నాయికామరణయత్నము మాటలతోఁ గాక క్రియారూపమున నిందుఁ జూపఁబడుట మరణమనుట నిశ్చయము. దానఁ గరుణరసమే ప్రధాన మని తేలుచున్నది.

నాటకమునఁ గరుణమనిన తావులన్నెల్ల విప్రలంభశృంగారాంతర్గతకరుణమని శృంగారరసవాదులు చెప్పినారు. కాని, ఏకోరసఃకరుణఏవ? మున్నగుతావులం దయ్యది పొసఁగదుగదా! మఱియు 'కళత్రే౽ప్యపరతే' యనియు "నాశితప్రియతమః" అనియు రాముఁడు కంఠోక్తిగా 'సీత మరణించినదని' పలికిన పలుకు లన్నియు దుఃఖాతిరేకమునఁ బలికిన పలుకులని శృంగారవాదులన్నారు. పైఁజూపిన పలుకులకంటె వాచ్యముగా నుండు పలుకు లెట్లుండునో యూహింపరాకున్నది. కఠోరగర్భయగుసీతను వనమున విడిచిపుచ్చినతరువాత నామె జీవించియేయున్నను దత్కాలావస్థననుసరించియుఁ బ్రేమాస్పదమగుటవలనను మరణించినట్లే రామునకు విశ్వాసముండుట సహజము. 'వృకాదులచే భక్షింపఁబడియుండు'నని రాముఁడే యనినాఁడు. ఆపద్యమందలి 'నియతం విలుప్తా' యను వాక్యమందలి 'నియతం' ఉత్ప్రేక్షాద్యోతకమని శృంగారవాదులు వాదించినట్లంగీకరించినను నీజన్మమున మరలఁ జూతునను నాశ లేకపోవుట నిశ్చయమేకదా! ఆమరణము సమావేశము లేనప్పుడు కరుణముగాక యన్యమెట్లగును? ఈవియోగము నిరవధికమని కవి రామునినోటనుండియే కాక పెక్కుచోట్లఁ బెక్కుపాత్రలచే రామునిప్రత్యక్షముననుఁ బరోక్షముననుఁ బలికించినాఁడే. కుశలవసమావేశఘట్టమున 'ప్రియానాశే కృత్స్నంకిలజగదరణ్యం హిభవతి,' అనుపలుకులువినిన రాముఁ డయ్యో! బాలురకును రాముఁడు దయనీయుఁడగు నవస్థకు వచ్చినాఁడే' యని యేడ్చినాఁడుగాని బ్రదికియున్నసీతను మరణించినట్లు చెప్పుచున్నారా. ఎంత యమంగళవాక్యము వినవలసివచ్చెనని ఖేదపడలేదే! పోనిండు. గంభీరుఁడు గావున నాభావమును మాటుకొనినాఁడేమో యనుకొనుటకుఁ గన్నుల నశ్రువులు జాఱ నేడ్చి యేడ్చి యెన్నితావుల మూర్ఛిల్లలేదు. తక్కినచోట్ల లేనిధైర్యగాంభీర్యము లీయొక్కచోటనే కలిగెననుటయు నుచితము కాదే! పంచవటియందుఁ దాను మూర్ఛిల్లినప్పుడు సీత తన్ను స్పృశించుటయుఁ దేఱుకొనినపిదప నామెప్రవర్తనమువలనను సీత బ్రది

కియున్నదా ! యని సంశయముకలిగి 'అథవా కుతః ప్రియతమా? నూనం సంకల్పాభ్యాసపాటవోపాదాన ఏష భ్రమో రామస్య (3. అంక. ౭౭ పుట.) యనుటంజూచ సీత లేదని రామునకు దృఢప్రత్యయము గలదనుట స్పష్టము. ఇంక నెక్కడిప్రియురాలు అనుటయుంగూడ నుత్ప్రేక్షయందు రేమో క్రిందివాక్యములు దానికి బాధకములు. మఱియు సీత నశించినదని కుశుండు పలికినపలుకులు విని యమంగళశ్రవణమునకు ఖేదము తెలుపకుండుటయే కాక, తదనుకూలముగా రాముడు.

శ్లో. చిరం ధ్యాత్వా ధ్యాత్వా నిహిత ఇవ నిర్మాయ పురతః
　ప్రవాసే చాశ్వాసం నఖలు న కరోతి ప్రియజనః
　జగజ్జీర్ణారణ్యం భవతి చ కళత్రేఽప్యుపరతే
　కుకూలానాం రాశౌ తదను హృదయం పచ్యత ఇవ.

(ప్రవాసమునం దిష్టజనమును దదేకదృష్టితోం జిరకాలము ధ్యానింపంగా ధ్యానింపంగా భావనాబలముచే నెదుట నిల్చినట్లుండి ధ్యేతకు సమాశ్వాసము కలుగవచ్చును. కాని కళత్రము నశించినయెడలం బ్రవాసమందువలెం బునరాగమనవాంఛాభావముచే భావనయు నసత్యమే యగునుగాన జగత్తంతయు జీర్ణారణ్యమగును. హృదయము తుషాగ్నిరాశియందు సంతతము దహింపంబడుచున్నట్లుండును.) అని పలికిన వాక్యము లుత్ప్రేక్షాదికమని త్రోసిపుచ్చుటకు వలనుపడదు సరే కదా ! సీతావిషయికప్రత్యాశయు లేనట్లు స్పష్టము. కావునం బై యంశములనుబట్టి ప్రత్యాశారహితుండగు రామునియందు శోకమే స్థాయి యగునుగాని రతి కానేరదు.

శ్లో. సకః సంప్రతి నాశితప్రియతమస్తామేవ రామః కథం పాపః పంచవటీంవిలోకయతు. 　　౨-౨౮

శ్లో. దేవ్యా శూన్యస్య జగతః 　　3-33

శ్లో. పశ్యన్నదృశ మిమాన్ దృశే పితృసఖం వృత్తే మహావైశసే
　దీర్ఘే కిం న సహస్రధాహ మథవా రామేణ కిం దుష్కరం. 3-౪౦

మున్నగు రాముని పలుకులం దెచ్చటనైనఁ బ్రత్యాశాలేశమేని యు నున్నట్లు చెప్పఁగలమా ? ఈవిషయ మిట్లుండనిండు.

శృంగారవాదులు మఱియొక యుక్తి చెప్పుచున్నారు. "సీత మరణించినదనియే రామునకు దృఢవిశ్వాసమున్నయెడల విధురుఁడగుటచేతను ధర్మమును విసర్జించి యశ్వమేధము చేయఁగడఁగునా ? చేయఁడు. సీత బ్రదికియున్నదని దృఢనిశ్చయము గలిగియుండుటచేతనే 'యస్య భార్యా విదూరస్థా' యను ధర్మశాస్త్రముననుసరించి సీతాప్రతికృతి చెంత నుంచుకొని యశ్వమేధము చేసినాఁడు. కావున రామునకు సీత బ్రదికియున్నదనియు, నేనాఁటికైనఁ గలిసికొందుననుచు ప్రత్యాశకలదనియు దానిని బట్టి విప్రలంభశృంగారమనియు నిర్ణయించిరి. కాని యీధర్మశాస్త్రమించుటఁ బ్రత్యాశగలదనుట కాధారమైనను వాల్మీకిరామాయణమున సరిపడునట్లు లేదు. సీత భూగర్భవిలీనయై తనయవతారము పూర్తిచేసికొనిన తరువాత రాముఁడు మృతపత్నీకుఁడైనట్లు రామునకును నాఁటి శిష్టులందఱకును నిస్సంశయముగాఁ దెలిసినవిషయమేకదా ! సీత భూగర్భమున నంతర్హితయైనపిమ్మట రాముఁడు కొన్నివేలయేండ్లు భూలోకమున నున్నట్లును, ననేకయాగములను జేసినట్లును, బ్రతియాగమును బంగారుసీతను దగ్గఱనుంచుకొని చేసినట్లును వాల్మీకిరామాయణమున నీవిధముగా నున్నది.

శ్లో. హృది కృత్వా తదా సీతా మయోధ్యాం ప్రవివేశహ
ఇష్టయజ్ఞో రఘుపతిః పుత్రద్వయ సమన్వితః
న సీతాయాః పరాం భార్యాం వవ్రే స రఘునందనః
యజ్ఞే యజ్ఞేచ పత్న్యర్థం కాంచనీ జానకీ భవత్
దశవర్ష సహస్రాణి వాజిమేధా నథాకరోత్
వాజపేయాన్ దశగుణాం స్తథా బహుసువర్ణకాన్
అగ్నిష్టోమాతిరాత్రాభ్యాం గోసవైశ్చ మహాధనైః
ఈజే క్రతుభి రన్యైశ్చ స శ్రీమా నాప్తదక్షిణః.

ఉత్తరకాండము 99 సర్గము.

దీనినిబట్టి సీత లోకాంతర గతమైనదనియుఁ దన్నెన్నఁటికిఁ గలిసికోలేదనియు నిరాశుఁడై యుండి మఱియొక భార్యను జేపట్టనిరామున కన్నివేల యాగము లొనర్పఁ గలుగని విధురత్వము ప్రకృతనాటకమున మాత్ర మెట్లు ప్రసక్తమగును ? అచ్చట నే ధర్మముచే యజ్ఞము లొనర్ప రాముం డధికారి యయ్యెనో యాధర్మముచేతనే యిచటను నధికారియయ్యెను. కావున సీతాప్రతికృతి దగ్గఱనుంచుకొని యాగము చేసెననినంతమాత్రమునఁ బ్రత్యాశయున్నదనుట యుక్తిదూరము. అటులేని రాముఁ డధర్మాచరణమునకుఁ గడంగునా ? యందు రేమో ! యాధర్మమునుగూర్చి మీమాంసాశాస్త్రగ్రంథమగు తంత్రవార్తికమునందును, దద్వ్యాఖ్యయగు న్యాయసుధయందును విపులముగాఁ జర్చింపఁబడియున్నది. గ్రంథవిస్తరభయమున నాయంశము లిందుదాహరింప మానితిని.

పైయంశములన్నిటినిబట్టి చూడఁగా రామునకుఁ బ్రత్యాశయున్నట్లు కొంచెమైన నాధారము లేకపోవుటచే రామునియందు శోకమేకాని యన్యము స్థాయికానేరదు. శోకము స్థాయి యగుటచే నాటకమునఁ గరుణరసమే ప్రధానమని చెప్పకతీఱదు.

శృంగారవాదులలో నొకరు 'సాహిత్యదర్పణ మూలగ్రంథమున శృంగారవీరరసములలో నేదేని యొకరస మంగిగానుండవలెనని చెప్పుచుండ వ్యాఖ్యాత కరుణాదులుగూడ నంగిగా నుండవచ్చునని చెప్పుట యేమిన్యాయమని పల్కిరి. అందునుగూర్చి రవంత విన్నవించుకొందును. దర్పణకారుఁ డేదృష్టితో నన్యరసప్రాధాన్యము విడిచినాఁడో కాని శాంతరసప్రధానమని వాచ్యముగాఁ దెల్పఁబడిన ప్రబోధ చంద్రోదయమునకైనఁ దావీయకుండుట గ్రంథమునకు లోపముకాదా యనుకొని యాయంశమును గరుణరసప్రధానమగు నుత్తరరామచరితమును నుదాహరించి వాని కేదోషమును దగులకుండుటకు ధ్వన్యాలోకమును బ్రమాణముగా నొనర్చికొని వ్యాఖ్యాత లక్షణము విశాలముచేసినాఁడు. అయ్యె

ది శాస్త్రవ్యాఖ్యాతలస్వభావము. కావ్యవ్యాఖ్యాతలు మూలాతిక్రమణముచేసి స్వతంత్రింపరుగాని శాస్త్రవ్యాఖ్యాతలు మూలమును సర్వతోముఖముగా విమర్శించి లోపాలోపము లుద్ఘాటించుట సంప్రదాయము. సాహిత్యదర్పణ మలంకారశాస్త్రగ్రంథమగుటచే వ్యాఖ్యాత యట్లు సోపపత్తికముగా విమర్శించుటయు న్యాయ్యమే. ఆతనిపలుకులును మనకు గ్రాహ్యములే. తేన ఉత్తరరామచరితే కరుణస్య, ప్రబోధచంద్రోదయే శాంతస్య చాంగిత్వ మవ్యాహతమేవ” అనిన వ్యాఖ్యాతపలుకులు మనకుఁ బ్రమాణములు కాకపోవని నామనవి.

కావున నుత్తరరామచరితము కరుణరసప్రధాన మనుట న్యాయ్యము. ఇట్లింకను నాటకాంతరములు రసాంతరప్రాధాన్యమున నుండవచ్చును.

ఆంగ్లమునందలి విషాదాంతనాటకములవలె నాయికానాయకులలో నొకరికిఁగాని యిరుపురకుఁగాని మరణము కల్గినట్లు రంగమునఁ జూపి విడుచుట భారతీయసంప్రదాయము కాకపోవుటచే మరణము వ్యంగ్యమార్గమున సుకుమారప్రయోగముగాఁ జూపఁబడి రసపోషణ మొనరింపఁబడి యాలంబనచ్ఛేదము మాత్రము ప్రదర్శింపఁబడదని తోఁచుచున్నది. శ్రవ్యకావ్యములందు మరణాదికము వాచ్యముగా నున్నను దృశ్యకావ్యములందు వ్యంగ్యరూపమున నుండుట న్యాయ్యము. ఆరీతిగనే రసముగూడ వ్యంగ్యముగా నుండుటయే నాటకములకు ముఖ్యలక్షణము. రామాయణమున వాచ్యముగా నున్న కరుణమే యుత్తరరామచరితమున యౌచితి చెడకుండ శృంగారాద్యంగవిలసితముగా వ్యంగ్యరూపమునఁ జెప్పఁబడినది. వీనింబట్టి చూడఁగా నాటకమున శృంగారవీరరసములతోఁబాటు కరుణశాంతములుగూడఁబ్రధానరసములుగా నుండవచ్చునని స్థిరపడుచున్నది.

---

# ఈ బొం కేలొకో?

సాహిత్యవిశారద కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.



శ్లో॥ ఆదర్శవ ద్విమర్శోఽపి ప్రతిబింబం ప్రదర్శయేత్ ।
హృద్యభావస్వరూపస్య కావ్యగుప్తస్య ధీమతాం॥

పెరుఁగును గవ్వముతోఁ జిలికినఁగాని సున్నితమగు కమ్మని వెన్న కానరానేరదు. కవితను మేథామంథనముతోఁ దరచినఁగాని లలితమగు భావంపువెన్నఁ జూపట్టఁ జాలదు. కావున ధీశాలురగు రసవిదులు సరసమగు భావప్రకటనమునకై వ్యాఖ్యానములు, టిప్పణములు, విమర్శనములు లోనగు వాఙ్మయరచనలఁ బ్రకటించుచుందురు.

నిజముగాఁ గవివరుఁడు చిత్రించిన వచనముయొక్కగాని, పద్యముయొక్కగాని, హృద్యమగు రసము నాస్వాదింప నెంచినచో నావచనశ్లోకముల భావ మేదియో తెలిసికొనవలయును. భావ మవిదితమైననాఁడు సరియగు రసోదయము కానేరదు. దర్పణమున వస్తుప్రతిబింబము చూపట్టునట్లు వ్యాఖ్యానాదివివరణమున భావప్రతిబింబము స్పష్టముగాఁ గన్పట్టును. వ్యాఖ్యానవిమర్శాంతచర్చ లన్నియుఁ గావ్యకూపాంతర్లసితములగు భావామృతములఁ బైకిఁ దీయుట కనువగు చేదలవంటివి.

కావున వ్యాఖ్యానాదిసారస్వతమీమాంసలు కావ్యభావసుధాస్వాదనోపయుక్తము లనుట విబుధలోకవిదితము. కావ్యపఠనమున నటనటయుక్తమగు భావము వ్యక్తముగ స్ఫురింపక పాఠకులు సంశయాత్ములగుట తటస్థమగుచుండును. చిత్తము సంశయముక్తమైనఁగాని సరియగు భావ ముదయింప నేరదు. అందువలన సంశయనివారణమునకై పాఠకుఁడు పాటుపడుట తప్పనిసరిగఁ గన్పట్టుచున్నది.

కావునఁ గాళిదాసకవివరునిచే విరచింపఁబడిన 'అభిజ్ఞానశాకుంతల' నాటకముయొక్క ప్రథమాంకమున నాకుఁ గలిగిన సంశయము నీ వ్యా

సానఁ బ్రకటించి, విశాలాశయులగు కలానిధులవలన సుధాసమానము లగు సమాధానముల విన నభిలషించుచున్నాఁడను. పరానందసంధానమే పండితులకుఁ బండుగ కదా!

సాహిత్యసారస్వతమునఁ గావ్యరచనలు మనోహరములనియు, వానిలో రూపకనిర్మాణము లతిరమణీయము లనియు, అందు శాకుంతలము మతులభావమాధుర్యమోహన మనియు, లోకమునఁ బ్రసిద్ధి కలదు. అట్టి లోకోత్తరకీర్తిశోభితమగు శాకుంతలనాటకమునఁ గవికులసార్వభౌముఁడగు కాళిదాసమహాశయుఁడు నాటకనాయకుఁడగు దుష్యంతునిచే బొంకించి, యాతని రాజఠీకమును మఱుఁగుపఱుపఁ బ్రయత్నించియుండెను.

తుమ్మెదబాధకుఁ దాళఁజాలక శకుంతల తనచెలికత్తియల సాయముగాఁ జీర, వారు "నిన్నుఁ గాపాడ మే మెంతవారము! దుష్యంతునిఁ బిలువుము. ఈ యడవికి నాతఁడే యేలిక యని యెఱుంగవా?" అనఁ జెట్టుమఱుఁగున సమయమునకు నెదురుచూచుచున్న దుష్యంతుఁ డా చెలికత్తెలనుడులు చెవినిబడినతోడనే, అదియ వారిముందఱఁ బడుటకదు నని యెంచి "భయము వలదు, భయము వలదు." అని యర్ధోక్తితో విరమించి, (తనలో) "నా రాజభావము వెల్లడియగు నేమో! కానీ, ఇటులఁ బలికెదను." (పైకి) "అవినీతుల దండించు పౌరవుఁడు పుడమిఱేఁడై యుండ ముద్దియలగు మునికన్నియలమెడ దుడుకుచేతలఁ జూపువాఁ డెవ్వఁడు?" అని యొకమాఱును—

ప్రియంవద దుష్యంతుని గాంచి, అనసూయతో "సఖీ! ఈతఁ డెవ్వఁడో ప్రభువరుఁ డట్లు కన్పట్టుచున్నాఁడు." అన, అనసూయ "నాకు నట్టి సందియమే జనించినది. అడిగి తెలిసికొందును, "అని దుష్యంతుని వంశాదులఁ గూర్చి ప్రశ్నింప, నాతఁడు (తనలో) "న న్నెట్లు వెల్లడించుకొందును! ఏరీతిని మఱుఁగుపఱచుకొందును!" కానీ! యిట్లు పలికెదను "పురువంశప్రభువుచే ధర్మాధికారమున నియుక్తుఁడనై యుచటిమునుల యవిఘ్నక్రియలఁ దెలియవచ్చితిని." అని మఱియొక తడవును—

ప్రథమాంకాంతమున నభ్యర్థికాప్రదానసమయమునఁ బ్రియంవదా నసూయ లంగరమునందలి యక్షరములఁ గాంచి, యక్షజపడునపుడు దుష్యంతుఁడు "మమ్మన్యథా తలఁపవలదు ఇది రాజపారితోషికము." అని వేఁకొతూరియు దుష్యంతుఁడు మఱుఁగుపడఁ గోరి బొంకెను.

కాని, ఈతఁడెవ్వరికడ దాఁగఁ దలంచి యిటుల కల్లలాడెనో యాకన్యకలుమాత్ర మీతని సామాన్యరాజోద్యోగిఁగా నెంచక, సార్వభౌమునిఁ గానే గుర్తించియుండిరి. కనుఁడు.

దుష్యంతుఁడు శకుంతల నుద్దేశించి "తప మభివృద్ధి గాంచుచున్నదా? అని ప్రశ్నింప, ననసూయ "ఇపు డతిథివిశేషలాభముచే" అనెను.

ఇట విశేషపదప్రయోగముచే నీతఁడు సార్వభౌముఁడుగాని సామాన్యోద్యోగి కాఁడను సంగతి సూచింపఁబడినది. మఱియుఁ బ్రియంవద యనసూయతో "ఈతఁ డెవఁడై యుండునే. మధురగంభీరాకారంబుతోఁ జతురోక్తులు పలుకుచుఁ బ్రభావవంతుఁడుగఁ గన్పట్టుచున్నాఁడు." అనుటచే దుష్యంతునిప్రభుతను గుర్తించినట్లు తెలుపఁబడినది.

దుష్యంతుఁడు తాను రాజనియుక్తుఁడనై యిటకు వచ్చితి నని తెలుప, అనసూయ "ఏరాజవంశము పూజ్యులరగు మీచే నలంకరింపఁబడినది? ఏదేశప్రజలు మీవియోగమువలన వ్యాకుల మొందుచున్నారు." అని యడుగుటచే దుష్యంతుని రాజశ్రేష్ఠునిగను, ప్రజాపరిపాలనపటిష్ఠునిగను వారు తెలిసికొన్నట్లు విదితమగుచున్నది గాని, యేరక్షకభటాధికారినిగానో భావించినట్లు కానరాదు.

అనసూయ "సుకుమారతరాకారులగు నేలినవారీ తపోవనాగమనపీడలఁ జెందఁ గారణమేమి?" అని దుష్యంతునిఁ బ్రశ్నించుటచే రాజర్షిమర్యాదానుసారము పుత్త్రులపై రాజ్యభార ముంచి వార్ధకమున వానప్రస్థు లగుట న్యాయ్యము కాని యిట్టి కళత్రసుఖానుకూలమగు నిండుజవ్వనమున విషయోపభోగముల వీడి, ఈబోడిబోడయడవికి రాఁ

గారణ మేమి ?" అను ప్రశ్నస్వరూపము స్ఫురించుచున్నది. దీనిని బట్టి చూడ దుష్యంతుఁడు మహారాజుగా గుర్తింపఁబడినట్లు విదితమగు చున్నది.

దుష్యంతుఁడు పై ప్రశ్నలకు సమాధానముగా "ఇచటి నిర్విఘ్న క్రతుకలాపములఁ దెలియ రాజనియుక్తుఁడనై వచ్చితిని." అని పలుక వనసూయ యట్లగుచో నిపు డాశ్రమవాసులు సనాథులైరి" అనెను. ఇట నాథపదప్రయోగముచే దుష్యంతుని సార్వభౌమునిగా గుర్తించి నట్లు బోధపడుచున్నది.

ముద్రికాప్రదానకాలమున దుష్యంతుఁడు "ఇది రాజొసంగిన పారితోషికము" అన, తోడనే యనసూయ "అట్లైన నీయుంగరము మీయంగుళీవియోగమునకు నర్హము కాదు." అనుటచే రాజముద్రిక రాజులయొద్దనే యుండఁదగును గాని సామాన్యులకడ నుండఁ దగదను భావము వ్యక్తముచేయఁబడినది.

ఈయుంగరప్రదానము శకుంతలావృత్తాంత మంతను సాకల్య ముగా విన్నయనంతరము చేయఁబడినది. కావున నిపుడు గూడ దుష్యం తున కీముచ్చటన మేల ? కాని యిచ్చటఁగూడ బొంకు గుప్తము కా లేదు. నిజమే విదితమైనది. కనుఁడు. రా జుంగర మందిచ్చినతోడనే ప్రియంవద "సఖీ శకుంతలా ! నీ వీ యనుకంపాన్వితుఁడగు పురుషోత్త మునిచే, కాదు, మహారాజుచే మోచిత వైతివి; కావున నీ విపుడు పో వచ్చును." అని విస్పష్టముగా నుంగర మిచ్చిన యాతఁడు ఘనమైయొడ యుఁడని గుర్తింపఁబడినట్లు తెలుపఁబడినది.

ఈరీతిగా దుష్యంతుఁ డెటనెటఁ దన రాజరికమును దాఁప బొం కెనో యా యాతాపులం దెల్ల బొంకులు వెల్లడియైనవి కాని గోపితములు కాఁజాలవాయె. కావునఁ గాళిదాసమహాశయుఁ డీ యతుకమఁటని బొం కుల నేలఁజిత్రించెనో తెలియవచ్చుటలేదు.

ఇఁక మునికన్నియలు దుష్యంతుని రాజునుగా గుర్తించినచో వారి విస్రంభాలాపములకు నదు నమరనేర దని దుష్యంతునిచేఁ గవి యిట్లు బొంకించె నందుమా ? అదియుఁ బొసఁగదు. ఏమందురా! దుష్యంతుఁడు మునితనయలస్వేచ్ఛాప్రసంగముల విన్నపిమ్మటనే వారిముందఱ కేఁగెను.

మునిపుత్త్రికలు దుష్యంతునకు శకుంతలాజన్మగాథను దెల్పునపు డన్ననో! వారు సిగ్గుపడఁ దగిన సంగతి. "సంతసావహమగు వసంతసమయాన నామేనకయొక్క చిత్తోద్రేకకారణమగు లావణ్యమును జూచి" అని యా పైసంగతిని దెలుపకుంటయే. ఇట శ్రోత మహారాజు కానిండు; రాజోద్యోగి కానిండు; మఱే సామాన్యపురుషుఁడు కానిండు. స్త్రీలు దానిని వానికి వెల్లడింప లజ్జింతురు. తమపలుకుల వినువాఁడు మహారాజైనచో సిగ్గుపడుటయు సామాన్యుఁడైనచో నిర్లజ్జగా వివరించుటయుఁ బొసంగదు.

ఇదియుంగాక తాపసకుమారికలు దాపఱిక మెఱుంగని ముద్దియలు కాని కౌటిల్యనిపుణలగు నాగరకకామినులు కారు. కావుననే దుష్యంతుఁ డేదో యడుగ ననుమానించుచుండుటను గాంచి ప్రియంవద "తాపసకన్యకాజనులకడ దాఁపఱిక మవసరము లేదు". అని తెలిపినది. కావున నీదాఁపఱిక మెందులకు?

మఱియు మునికన్యకలు మొదటినుండియు దుష్యంతుని రాజునుగానే గుర్తించి యున్నట్లు తృతీయాంకమునందలి వారి సంభాషణల వలన విదిత మగుచున్నది. కనుఁడు. చెలికత్తెలు శకుంతలను "నీశరీరతాపహేతు వేదియో తెలుపుము" అని యడిగినపుడు శకుంతల "సఖియలారా ! నిజము దాఁప నేల ? వినుఁడు. తపోవనరక్షకుఁడగు నా రాజసింహుఁ డేముహూర్తమున నాకంటఁ బడెనో యది మొదలీయవస్థకు లోనైతిని." అని తెలుపుటచే శకుంతల దుష్యంతుని ప్రాథమికదర్శనముననే మహారాజునుగాఁ దలంచి యున్నదని విదిత మగుచున్నది. నిజముగా నీతలంపే యనురాగవికాసమున కనుకూలమగు సొంపు.

ఇంక శకుంతలాపరితాపకారణమును విన్న నెచ్చెలులముచ్చటలు గూడ నాభావమునే పోషించుచున్నవి. కనుఁడు. ప్రియంవద "అనసూయా! ఈపె యెవ్వని వలచినదియో యాతఁడు పురువంశలలాముఁడగు తేఁకుగా నున్నాఁడు." అనసూయ "సాగరమును వీడి మహానది మఱియొకచోటఁ జేరునా?" ప్రియంవద "అంటుమామిడిగున్న కాకున్న మఱేమ్రాకు బండిగురివిందను జిగిరింపఁ జేయఁజాలును!" ఈపలుకుల వలన వారు దుష్యంతుని మహారాజునుగానే తెలిసికొనియుండి రను సంగతి వెల్లడియగుచున్నది.

ఇంక నొక సంగతి. దుష్యంతుఁడు లేడిపై వాడికోలను విడువఁబోవుచుండ వడివడిగా మువ్వురు మునికుమారులు నడుమ నడ్డువచ్చి "ఇది యాశ్రమహరిణ మగుటచేఁ గొట్టఁజనదు." అని నివారింప దుష్యంతుఁడు వారినుడులకుఁ గట్టువడి వెంటనే వింటఁ దొడిగిన కణకటమ్మును నారినుండి సడలింప, ఆవైఖానసవటువులు సంతోషముతో "పురువంశసంభవుఁడవగు నీకీ వినీతభావ మెంతయుఁ దగియున్నది. కావున రాజోత్తమా! చక్రవర్తి కాఁదగిన సుగుణాలవాలుఁడగు సుతునిఁ బడయుము." అని దీవించి దుష్యంతుని దమ యాశ్రమమునకు రాఁగోరి వెడలి పోయిరి.

దుష్యంతుని దమయాతిథ్యమును జేకొన రమ్మని యాహ్వానించిన మునికుమారులు మహారాజాగమనమును దాపసవనవాటికలోఁ బ్రకటించియుందు రని యూహింప వలసియున్నది.

మునికుమారులు దుష్యంతునిరాకను గణ్వాశ్రమమునఁ బ్రకటించి రనుటకుఁ దార్కాణముగాఁ దృతీయాంకమునందలి విష్కంభమున యజమానశిష్యప్రసంగము విదితముచేయుచున్నది. వినుఁడు.

"ఓహో! ఏమి యీతని మహానుభావత. ఈయేలిక యిటఁ గాలిడినతోడనే యజ్ఞక్రియ లన్నియు నిర్విఘ్నముగా నెఱవేఱినవి!" దీనిచే హరిణమారణనివారణ మొనర్చిన మునిబాలకులవలనఁ దాపసు లందఱకు దుష్యంతాగమనవార్త విదితమైన దని స్పష్ట మగుచున్నది.

మఱొకమాట. ప్రథమాంకమున ననసూయ దుష్యంతవృత్తాంత మడుగఁ దొడఁగినపుడు శకుంతల (తనలో) "హృదయమా! పరితాప మందకుము. నీవు దేనిని దెలియ నభిలషించుచుంటివో దానిని అన సూయ ప్రశ్నించుచున్నది." దీనిచే దుష్యంతుని ప్రాభవమును వినఁ గుతూహల మందుచున్న మునికన్నియకు దుష్యంతునినిజరూపమును వెల్లడించి సంతసింపఁజేయుట సొగసా? లేక యా రాజుచే దబ్బఱలా డించి రాజఱికమును దాపఱికము సేయుటసొంపా? చదువరు లూహింపఁ గోరెద.

ఇఁకఁ దృతీయాంకావతరణికనుబట్టి చూడ ద్వితీయాంకగాథ కణ్వాశ్రమమున నడచినది కాదని స్పష్ట మగుచున్నది. కావునఁ బ్రథ మాంకమునఁ గణ్వాశ్రమమున కేతెంచిన దుష్యంతుఁడు, ఆదివస మట గడపి మఱునాఁడు తిరుగ స్కంధావారమున కేఁగె నని తెలియ నగును. అంక మన నేకదివసకథావస్తువుల దెల్పునదే.

మఱియు ద్వితీయాంకాంతమున దుష్యంతుఁడు విదూషకునితో "నే నీ వనమున నున్న సంగతి కొందఱుతాపసులకు విదిత మైనది. మఱి యోచింపుము? ఏనెపమునఁ గణ్వాశ్రమమును బ్రవేశింప నర్హ మగునో?" అనుటచేఁ దన యునికి మునులకుఁ దెలసిన దని దుష్యంతుఁ డంగీకరించి యుండెఁగదా! తనసన్నిధాన మా తాపసులకుఁ దెలియు టకు హేతువు బాణపాతము నాపిన బాలకులే యని యూహింప వలసియున్నది.

కావున దుష్యంతుఁడు మునికన్నియలముందఱ కేఁగుటకుమున్నే తపోధనులకు దుష్యంతాగమనము తెలిసియుండు నని యూహింప నగును. కావుననే ప్రథమాంకముతుదను "ఓతాపసులారా! మృగ యావినోదాసక్తుఁడగు దుష్యంతుఁడు తపోవనమును సమీపించుచు న్నాఁడు. కావున నాశ్రమసత్త్వములఁ గాపాడఁ ద్వరపడుఁడు." అని తెలుపుటచే నాతనిరాక విదిత మగుచున్నది. ఇఁక నీబొంకులకు సందేది?

సామాన్యముగా స్త్రీకిఁ బురుషునిపైఁ గాని, పురుషునకు స్త్రీపైఁ గాని యనురాగోదయ మైనతోడనే యాస్త్రీపురుషులు తమప్రేమవాహినుల మేలవింపఁ జేయఁగోరువ్యక్తు లుత్తమకులజాతులుగను, ఉన్నతపదవీస్థితులుగను దెలిసినపుడే యెక్కువగాఁ దమమక్కువను మెచ్చికొందురు. అటుగాక తమప్రేమలు వాలినవారు ఏకులమువారో యెట్టిసంపదకలవారో యెటువంటి శీలము కలవారో తెలియనినాఁడు వారి ప్రేమప్రసారములు సంకుచితములై వెలవెలబోవును గాని స్థితిగతులు తెలిసిననాఁటి ప్రణయవిలాససంచారములవలెఁ దళుకొత్తఁజాలవు.

ఇందు కీశాకుంతలమునందే యుదాహరణము కుదిరియున్నది. కనుఁడు. దుష్యంతుఁడు శకుంతలాలావణ్యము నీక్షించినతోడనే యాక్షేని కా రాకాశశాంకవదనపై ననురాగోదయ మైనది. తోడనే యాభూరమణుఁడు శకుంతలను విప్రకులజాతనుగ నెంచి తనకు జనించినతలంపునకు వగచి, తుదకుఁ దనశీలపావనతచే నామెను క్షత్త్రపుత్త్రికనుగాఁ దెలసికొని నిజానురాగమును సంతసముతో వికసింపఁ జేయఁదొడఁగెను. దీనిచే సంశయరాహిత్యమే సంతోషహేతుకమని విదితమగుచున్నది.

అటులనే శకుంతలకు దుష్యంతుఁ డే సామాన్యుఁడో గాక మహారాజని తెలిసిననాఁడు తాఁ బ్రేమించిన సొగసుగాఁడు సార్వభౌముఁడు కాని సామాన్యరాజోద్యోగి కాఁడని తెలిసినచో నామె తన యనురాగమున కమితానందము నందఁగలదు. అందుచే నీదాపటికముచేఁ దోపఁజేయఁదగిన సంపద యేదియో విదితము కాకున్నది. కావున సదాశయులగు కోవిదులు సరసములగు సమాధానములఁ బ్రసాదింపఁ బ్రార్థితులు.

ఓం తత్సత్.

---

# కర్నాటక, కర్ణాటక శబ్దసాధుత్వము.

కర్నాటక, కర్ణాటకశబ్దముల సాధుత్వమునుగూర్చియు, నీశబ్దములలో దేని నుపయోగింపవలయు ననువిషయమును గూర్చియు నిటీవలఁ గన్నడదేశమున భిన్నాభిప్రాయములు బయలుదేరినవి. కర్ణాటక సాహిత్యపరిషత్పత్రిక 23 వ సంపుటమున 3 సంచికయందుఁ బైవిషయము రెండు విమర్శకవ్యాసములఁ జర్చింపఁబడినది. పరిషత్సంపాదకీయ వర్గమువారిలో నధికసంఖ్యాకులు కర్నాటకశబ్దము సాధువే యని యభిప్రాయపడుటచే నది యామోదింపఁబడినది. 1938 సంవత్సరమున బళ్లారిలో జరిగిన పరిషత్సమావేశమున నుభయపక్షములవారి యుద్దేశ్యములను గమనించి, కర్నాటకసాహిత్యపరిషత్తును గన్నడసాహిత్యపరిషత్తుగ మార్చుటకుఁ దీర్మానింపఁబడినది.

కర్ణాట, కర్ణాటకశబ్దములు కేవలము సంస్కృతము లనియు వానినుండియే కన్నడశబ్ద ముద్భవించె ననియు గొందఱివాదము. వీరి వాదానుసారము కర్ణేషు అటతీతి కర్ణాటః అని వ్యుత్పత్త్యర్థమును గ్రహించి కప్రత్యయమును జేర్పవలసియుండును. ఏదేశపు రాజులకీర్తి యందరిశ్రవణరంధ్రముల మ్రోగుచున్నదో యాదేశమే కర్ణాటమని పైయర్థము సూచింపుచున్నది. ఇది ప్రతిదేశమువిషయమై వర్తించును. కాని కర్ణాటకమునకు మాత్రమే చెందునది కాదు.

ఇఁక కర్ణాటక మనునది సంస్కృతీకరింపఁబడిన కన్నడశబ్ద మనియు, పాణినీయసూత్రానుసారముగ ణత్వము సిద్ధించిన దనియుఁ జాల మంది యభిప్రాయము. అదియే సమంజస మని కన్పట్టుచున్నది. వీరి యభిప్రాయమున కరి + నాడు = కర్నాడు అయి, తరువాత కర్ణాట మయినది. కరి అనగా నలుపు లేక గొప్పది యని యర్థము. కర్నాడు అన, నల్లని దేశము, లేక గొప్పదేశ మగును. వీరి వాదమున కరినాడు, కర్నాడు, కర్నాటము మూఁడును సత్వయుతములే, కాని ణకారయుక్త

ములు కావు. కర్నాటశబ్దము నోకేషదముగఁ గైకొని 'రషాభ్యాం నో ణః సమానపదే' అను పాణినీయ సూత్రము వర్తింపఁజేసిన (8-4-1)ణత్వము సిద్ధించి కర్ణాటము నగుచున్నది. పాణినీయమతానుసారము రకారము మూర్ధన్యమే కాని దంత్యము కాదు. (స్యుర్మూర్ధన్యా ఋ టు ర షాః). ఉచ్చారణమున రకారము మూర్ధన్యముగఁ గన్పడదు. దంత్యమో దంత్యమూలమో యగు నని తోఁచెడిని. రేఫలక్షణము ప్రాతిశాఖ్యములలోఁ బాణినీయమతమునకు భిన్నముగఁ గన్పడుచున్నది.

దంతమూలీయస్తు తకారవర్గః (ఋగ్వే-ప్రా 1-36)
సకార రేఫ లకారాశ్చ ( ,, )
రేఫం వర్త్స్యమేకే- ( ,, 1-37)

దీనినిబట్టి రేఫమును, తవర్గము, లకారసకారములతో దంతమూలీయమని తోఁచును. మఱియుఁ గొందఱమతమున నది వర్త్సస్థానభవము. వర్త్సమన నిటుల నిర్వచింపఁబడినది.

వర్త్సే భవో వర్త్స్యః వర్త్సశబ్దేన దంతమూలా దుపరిష్టా దుచ్చ్రానః ప్రదేశ ఉచ్యతే.

తైత్తిరీయప్రాతిశాఖ్యమున రేఫోచ్చారణమున జిహ్వాగ్రమధ్యభాగము దంతమూలోపరిభాగమును స్పృశించు నని చెప్పఁబడినది. శుక్లయజుఃప్రాతిశాఖ్యమున దంతమూలస్థానిక మనియే తెలుపఁబడినది. ఇంకను జిహ్వాగ్రమే కరణము[1].

పైనిర్వచనముల వలన రేఫము దంతమూలముగఁ గైకొనినచో నత్వమే యుండి కర్నాటకశబ్దము సాధువే యగుచున్నది. మూర్ధన్యముగ నెంచితిమా ణకారముతో నుచ్చరించుటయే సుకరము. దుర్నీతి, నిర్నిమిత్త, నిర్నిద్రా మున్నగు శబ్దములఁ గల నకారమునకు వేఱుసూత్రముచే సాధుత్వము చెప్పఁబడినది. దుర్ణయశబ్దమున ణకారమే కలదు. అది దుర్నయ యనవలయుననియు, నన్నయకు నణప్రాస మభిమతమని

1. వైయాకరణపారిజాతము: వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు.

యుఁ గొందఱు వాదించుచున్నారు. (ఆ. దుర్ణయమున శకుని కర్ణ దుశ్శాసనుల్ ...... భారత. ఆది-3-12). కాని యిందు దుర్ణయ మను నది దుస్ అను ఉపసర్గను బట్టి సాధింపవచ్చు ననియు, నట్టియెడ దుఃరష్టత్వణత్వయో' అను ప్రతిషేధసూత్రము వర్తింపదనియుఁ బెద్దల యభిప్రాయము. ఆసందర్భమున దుర్ణయమును దుర్నయమని దిద్ది నన్నయకు నణప్రాస మంటఁగట్టవలసిన ప్రసక్తి యుండదు. దుర్నయాదిశబ్దముల నత్వము వచ్చుటచేతనే కొన్నితావుల రేఫమును దంతమూలముగనుచ్చరించి సవర్ణమగు నకారమును గైకొనవచ్చునని యూహింపనగును. నకారణకారములు పరస్పరమైత్రి గలవియే. ఉచ్చారణసౌకర్యముకొఱకు, శ్రవణసుఖముకొఱకును గొన్నితావుల ణత్వమే యుపయోగించుట యుక్తము. అట్టి భిన్నస్థలముల నిరూపించుటకే నత్వణత్వములవిషయమై వేర్వేఱు సూత్రము లుద్భవించినవి. నకారణకారములు సవర్ణములు. ప్రాకృతముల సంస్కృతనకారము ణకార మగుచున్నది. (నూనమ్-ణూణ, నయన-ణఅణ ...). పైశాచియందుమాత్రము టవర్గము తవర్గ మగును. వర్ణపరిణామమును సూచించు ప్రాకృతసూత్రములు భాషోచ్చారణ సాంప్రదాయముల ననుసరించియే పుట్టినవి (Phonetic) కర్నాటక శబ్దమును గన్నడపండితు లంగీకరించినను, శబ్దసౌష్ఠవసులభోచ్చారణము లవలన కర్ణాటకమే గ్రాహ్యమని తోఁచుచున్నది.

కర్ణాటకసాహిత్యపరిషత్పత్రిక (సంఖ్య. 23 సం. 3 పు. 159-183) యందుఁ బ్రాచీనకన్నడభాషలో నెట్టిరూపము లుండెనో తెలియుటకై శాసనములుకూడఁ బరీక్షింపఁబడినవి. 44 శాసనములఁ గర్ణాట మనియు, 43 శాసనములఁ గర్నాట మనియుఁ గలదు. పెక్కు శాసనముల రేఫానంతరము, కర్ణ, ఉదీర్ణ, సంపూర్ణ, అర్ణవ, సౌవర్ణ మొదలగు పదముల దంత్యనకారమే వాడఁబడినది. కొన్ని శాసనముల నణలు రెండును రేఫముతో నుపయోగింపఁబడినవి. కాని కేవల శాసనాధారముచేఁ బ్రాచీనకన్నడమునఁ గర్నాటమే కల దని నిర్ధారణ మొనర్ప వీలు లేదు. దేశ్యపదమగు కన్నడము సంస్కృతీకరింపఁబడి గర్ణాట మైన

దనుటయే సమంజస మని పైన వ్రాయఁబడినది. ఈసందర్భమున నాంధ్రవాఙ్మయమునందలి ప్రాచీనశాసనములందుఁ గర్ణాటాదిశబ్దము లెట్లు వ్రాయఁబడినవో చూపుచున్నాము.

(1) కన్నాటసుందరీకన్నాటవశంసుని

(S. I. I. Vol VI - 123 Saka 1054)

(2) దిక్పూర్న్ణ (Saka 1066) S. I. I. IV - 1169.

(3) దశాశాపూర్న్ణ ( ,, 1087) Govt. Ep. 49 of 1909.

(4) సువర్న్ణగిరీంద్ర ( 1235) S. I. I. IV - 952.

(5) పూర్ణిమాదినమున (1298) అమీనాబాదు శాసనము.

(6) ధాన్యసంపూర్న్ణవదాన్యయగుచు (1350) పిఠాపురము శాసనము.

(7) పురాభ్యర్ణ్ణసీమ (1462) వంకాయలపాడు శాసనము.
కర్ణ్ణాటభూపాల, విస్తీర్న్ణ.

(8) అఖిలకన్నాటసింహాసనాధీశ్వర (1527)

Ep. Col. 564 of 1915.

(9) బాణశశివర్న్ణితవహా (1548) Ep. Col 260 of 1897.

(10) బుధవర్ణనీయ (1264) 230 of 1905.

ఉత్తరాయణ, ఉత్తరాయనములు రెండును గలవు. వీనిని బట్టి రేఫముతో నకారమే యుపయోగించిరనియు నదియే ప్రథమరూప మనియు నిశ్చయముగాఁ జెప్ప వీలులేదు. నేఁటికిని వ్రాతప్రతుల రేఫణకారములు వ్రాయవలసిన చోటుల ద్విత్వనకారమును వెలుపలగిలకయు వ్రాయఁబడినటులు కనఁబడుచున్నవి. ఆంధ్రప్రబంధములయందుఁ గర్ణాట మనియే గలదు. శ్రీనాథుని గ్రంథములలోఁ గర్ణాటశబ్దము చాలసారులు యతిప్రాసములలోఁగూడ నుపయోగింపఁబడినది.

నిజము నాకవిత్వంబు కర్ణాటభాష... భీమ. ఖం. 1-15 (1)

మ. అరబీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్రగాంధారఘూర్జరభాషల్

భీమ. ఖం. 1-73. (2)

ధర్మశీల! క (3)

ర్ణాటవరాటఘూర్జరవిహార! కళింగకుళింగమండలా. హర. వి. 1-29

శా. కర్ణాటోత్కలపారసీకనృపసఖ్య! ప్రాభవశ్రీనిధీ!
యర్ణోరాశిపరీత భూభువన మధ్యాంధ్రక్షమాధీశ్వరా!
కర్ణాభ్యర్ణ విశాల నేత్ర! జగదేకప్రాజ్యసామ్రాజ్య! దృ
క్కర్ణాధీశ్వరహార భక్తినిరత క్ష్మాపాలచూడామణీ.
కాశీ. ఖం. 3-246. (5)

శా. కర్ణాటక్షితిపాల మౌక్తికసభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్సంస్తుత్య చారిత్ర! దు
గ్ధార్ణోరాశిగభీర! ప్రాఙ్ముఖమధ్యాహ్న పరాహ్ణార్చితా
పర్ణావల్లభ! రాజశేఖరమణీ! పంటాన్వయగ్రామణీ.

ఆంధ్రలాక్షణికులు నణలకు యతి చెల్లు ననిరిగాని ప్రాసము నంగీకరించి యుండలేదు. తిరుపతి వేంకటేశ్వరకవులు తమ భారతవిశేషములను గ్రంథమునఁ దెలిపినరీతి (పు. 39) నకారమునకుఁ బ్రాసము కాఁదగు ణకారము స్థలాంతరమునం దెప్పుడేని నిరుపాధికమైనప్పుడు తన స్వస్వరూపమును బొందియుండవలయునని వారిసిద్ధాంతము.

ముద్దరాజు రామన కవిజనసంజీవనిలో (1-49)

క. చనుఁదత్త్వవిధాయకసూ
త్రనిమిత్తాగతణకారరాజి నకారం
బునకుం బ్రాసముగా నిడఁ
బ్రణుతు లొనర్చెద మురారిపదముల కనఁగన్.

అని లక్షణము నొసంగి అరణ్యపర్వమునందలి

క. త్రిణయన గోత్రస్పర్శం
బున నిజగాత్రము పవిత్రము ... ... ... ...అనుదానిని
శృంగార షష్ఠమునందలి

క. విను మతి గుహ్యము నారా
యణకవచము భక్తవాంఛితార్థ ప్రదమున్ ......

అనుదానిని యుదాహరణములుగ నిచ్చెను. అందుననే యప్ప కవియు ఆ. వె. ధాత్రిపాణినీయ సూత్ర......యను పద్యమున నెట్టి ణలకు ప్రాసముచెల్లునో తెలిపియున్నాఁడు. లాక్షణికులు విరామము

స్వకై కర్ణాటశబ్దమును స్వాంతవేదండాదిశబ్దములలోఁ జేర్చి రెండుతెఱఁగుల విరామము చెల్లునని వ్రాసియున్నారు. తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున హల్లున్నకై

మ. కుసుమం... ... ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ... ... ... ...

స్వసివాఢ్ధ్వజముచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటిరే యనియు, నచ్చునకు భాస్కరరామాయణమునందలి

శా. లాటీ చందనచర్చ... ... ... ... క
ర్ణాటీ గీతకళాసరస్వతి కళింగాంతఃపురీ మల్లికా...
... ... ... ... ... ... ... ...

యను పద్యముల నుదహరించెను. అందువలనఁ కరి+నాడు, కర్నాడు కర్ణాట మను శబ్దతత్త్వమును మనసులో నిడికొని దీనిని స్వాంతాది శబ్దములలోఁ జేర్చి రనుటకు వీలులేకున్నది. పూర్వోక్తవిషయముల గమనించినచో నాంధ్రవైయాకరణులు కర్ణాటశబ్దమును తత్త్వముతో గైకొనినటుల గనఁబడుచున్నది. రేఫము మూర్ధన్యమా దంతమూలమా యను విషయమును గూర్చి యాంధ్రలాక్షణికులు సంస్కృతమర్యాదనే యంగీకరించిరి. ద్రవిడభాషయందు తొల్కాప్పియమున రకారళకారముల యుత్పత్తినిగూర్చి యిటులఁ దెలుపఁబడినది. (Edited by Journal of Oriental Research Page 13 Sutra 95)

నునినా వణరి యణ్ణం వరుట
రకారళకార మాయిరణ్డుమ్ పిఱక్కుమ్.

రకారళకారములు జిహ్వాగ్రము నెత్తి నాలుక పైభాగమును (Hard Palate) నెమ్మదిగ రాచుటచేఁ బుట్టుచున్న వని దీనియర్థము. ఇది పాణినీయమతమునకు భిన్నముగను, ప్రాతిశాఖ్యముల కనుకూలముగ నున్నది. ఆంగ్లభాషయందు రేఫము దంత్యముగను (Dental) ఫ్రెంచి మొదలగు భాషలయందు దంత్యతాలవ్యసంబంధము (Mixed Palatal) గలదిగను దెలుపఁబడుచున్నది.

'By raising the point of the tongue to the front of the palate immediately behind the teeth but not touching them, you get the socalled dentals—the momentary t (hard), d (soft); and continuous, n (Nasal), r and l both soft fricatives, but produced in different ways — r by letting the breath escape over the centre and tip of the tongue for which reason the sound is called a 'central' one, l by letting it pass by the sides of the tongue (lateral).

ఆంగ్లమునఁ గల రేఫమునకును సంస్కృతాదిభాషలఁగల రేఫమునకును భేదము కలదు. రేఫము దంత్యము దంతమూలమని కాని గ్రహించినయెడల దంత్యనకారయుతమగు కర్నాటకమగును. 'రషాభ్యాం నోణః సమానపదే' యిత్యాదిసూత్రము లుచ్చారణమునఁ గలుగు మార్పులను సూచించుటకై యేర్పడినవి. దురష్షత్వణత్వయోః మొదలగు ప్రతిషేధసూత్రములు నట్టివే. రకారమును మూర్ధన్యముగ గ్రహించిన లాక్షణికులు కర్నాటము నేకపదముగఁ గైకొని ణత్వమును విధించియుందురు. సంస్కృతరకారము కేవలము దంత్యమని గాని దంతమూలమని గాని గ్రహింప వీలులేదు. కనుక, కర్ణాటశబ్దమే కర్నాటముకన్న సాధువనియు, నదియే శ్రుతికిఁ గటువుగ నుండదనియు, మనమంగీకరింపవలసియున్నది. కరి + నాడు అనునదియే కాలక్రమమునఁ గర్ణాటమైనది. కేశిరాజు తనగ్రంథమునఁ దెలిపినట్టుల కన్నడము కర్ణాటభవము కాదని నిశ్చయింపనగును. ఈ సందర్భమునఁ ద్రిలింగ - తెలుఁగు - త్రినగ - తెనుఁగు పదముల పౌర్వాపర్యవాదముల మనము విస్మరింపవలసియున్నది. కర్ణాటశబ్దము విధముననే త్రిలింగ, త్రినగపదములు కల్పింపఁబడినవి. నైజమగు శబ్దస్వరూపమును గోల్పోవుటచేఁ దెలుఁగు, తెనుఁగు, కన్నడ పదములు తద్భవములను భ్రాంతిని గలుగఁజేసినవి.

# ఉత్తరరామచరిత కథాసంగతి.

ఉభయభాషాప్రవీణ మల్లాది సత్యనారాయణశాస్త్రిగారు.



సాహిత్యవిశారద బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు శ్రీమదాంధ్ర సాహిత్యపరిషత్పత్రికయందు భవభూతిమహాకవివిరచితోత్తర రామచరితములోని సంవిధానకాంశములను, నితరకవివిరచిత శ్రవ్యదృశ్య కావ్యవస్తువులను, విమర్శించి యుత్తరరామచరితములోని వస్తువిన్యాసము రుచింపలేదని స్వాశయమును వెలిపుచ్చుచు నట్లొనర్చుటకుఁ గారణము తెలియకున్నదని కారణజిజ్ఞాసప్రశ్న చేసియున్నారు.

నేను శ్రీ శాస్త్రిగారి సందేహములను దీర్చునంతటి సమర్థుఁడను గాను గాని ద్విజాతిభావోపపన్నచాపలుఁడనై యీ ఘనకార్యమునకుఁ దగుదునని పూనిన నా యీ చాపలమును బండితులు మన్నింతురుగాక.

ముందుగా వారు సందేహించిన యొక్కొక్క యంశమును జూపి పిదప నా యోచిన సమాధానమును వ్రాయుదును.

సీతాపరిత్యాగఘట్టము నీనాటకమున వదలివేయుటకుఁ గారణ మేమి? అనఁగా నీఘట్టములోఁ బరిత్యాగఖిన్నయగు సీతాదేవి లక్ష్మణునితో ననిన కరుణపరిదేవితవాక్యములు చేర్పవలదా? యెందులకుఁ జేర్ప లేదని శ్రీశాస్త్రిగారి మొదటి ప్రశ్న. ఈప్రశ్నకుఁ జెప్పవలసిన సమాధానముకంటె ముందుగ శ్రీరాముఁడు సీత నడవికిఁ బంపిన కాలములోని వృత్తాంతమును వర్ణింపవలసియున్నది. పిదప సీతాలక్ష్మణసంభాషణఘట్టమును వర్ణింతును.

నాటకములలోఁ బ్రదర్శింపఁ దగిన వస్తువనియు సూచింపఁ దగిన వస్తువనియు రెండువస్తువు లుండును. అందుఁ బ్రదర్శనయోగ్యవస్తువు నంకములలోను సూచ్యవస్తువును విష్కంభాదులలోను జేర్పవలెను. సూచ్యవస్తువునకు నీరసవృత్తాంత మని పేరు. వృత్తాంతమునందు సారస్య

నైరస్యములు కవికల్పితకథాసందర్భమును బట్టి మాఱుచుండును. ప్రద ర్శింప వీలుగాని యతిభీషణంగతవిషయము లన్నియు నీరసములు గాకు న్నను విష్కంభాదులలోనే చేర్పఁదగినవి. పురాణాదులనుండి గ్రహిం చిన కథను సమయమును బట్టి ప్రధానభాగమునకు భంగము కలుగ కుండ మార్చుకొనుటకు నాటకకర్తలకు ముఖ్యముగ స్వాతంత్ర్యము గలదు. మఱియు నే కొంచెముగానో చమత్కృతికై తప్పక పురాణక థకు భిన్నముగా నాటకకథను మార్పవలయునని నియమము కూడఁ గలదు. అట్లయిననే కవిసామర్థ్యము స్పష్టపడును. లేనిచోఁ బురాణసా మర్థ్యమే. ఇప్పుడు మఱలఁ గ్రొత్తగ వ్రాయుటలో వచ్చిన గొప్పత నము లేదుగదా. అట్లుండఁగ భవభూతిమహాకవి, ప్రథమాంకములోఁ జిట్టచివరఁ గదా శ్రీరామునిసీతావివాసనకాలికవృత్తాంతమును జేర్పవ లెను. అందు నావస్తువునకుఁ బ్రవేశము బొత్తుగ బాగుగ నుండదు. ఏల యనిన శ్రీరాముఁడు దుర్ముఖవాక్యమును వినుపర్యంతము సీతావిషయ మున నెట్టి యనుచితోద్దేశమును గలిగియుండ లేదు గదా. అతనితమ్ము లకుఁ గూడ నాసీతయందు దురభిప్రాయము లేదుగదా. ఆస్థితిలో శ్రీరా ముఁడు దుర్ముఖవాక్యశ్రవణానంతరము క్రొత్తవాఁడై యామె యదివ ఱకే కోరియున్న, తా నామెమనోరథము సఫలముచేయువాఁడై యా వఱకే యొప్పుకొని యున్న, ప్రసన్నగంభీరవనరాజిపుణ్యసలిలభాగీరథీ దర్శనకాంక్షను దత్క్షణమే యావజ్జీవారణ్యకదర్శనకాంక్షఁగఁ జేయు వాఁడై దుర్ముఖు నుద్దేశించి "బ్రూహి లక్ష్మణమ్. ఏష నూతనో రాజా రామ స్సమాజ్ఞాపయతి, కర్ణే ఏవ మివ"యని యతిదారుణాశయత్వని రంకుశాజ్ఞత్వాభిప్రాయకములగు నూతనత్వరాజత్వములను దనయందు వెల్లడించుటకును, బయటికిఁ జెప్పవలసిన సీతావివాసనవిషయకవాక్య మును జెవిలోఁ జెప్పుటకును, అందును లక్ష్మణునిఁ బిలిపించి యాత నితోఁ జెప్పుట మాని దుర్ముఖుని లక్ష్మణునితోఁ జెప్పుమనుటకును, వీనిలో నన్నిటికంటె సీతతోనే స్వయముగఁ జెప్పకుండుటకును గారణ

ము ప్రవాసనవిధి యే కొంచెమైన హృదయముగల లక్ష్మణాదులకు శ్రవణగోచరము కాఁగానే వారి ప్రాణాపహారకముగఁ బరిణమింపవలసి యుండునని దానినిబట్టి సామాజికమానసోద్విగ్నత కలుగు నని కాదా? చెప్పువానికి హృదయము లేకపోయినను వినువానికైనను లేకుండునా? యను సామాజికప్రశ్నము శాంతాకాంక్షము కానేరదు గదా. కనుక నాకథాంశమును బ్రదర్శింప యోగ్యత కలిగినంతవఱకుఁ బ్రదర్శించి మిగిలినదానిని సూచ్యముగ సరిపెట్టినాఁడు; తప్పేమి? జనాపవాదము నెఱిఁగింపవచ్చిన దుర్ముఖునకో, యట్టి యాపద సంభవింపదు. అతని కృత్యములే యట్టివని యాతనినోటనే "కథ మిదానీం సీతా మన్తరే ణేదృశ మచిన్తనీయం జనాపవాదం దేవస్యకథయిష్యే. అథవా నియోగః ఖల్వీదృశో మన్దభాగ్యస్య" యని చెప్పించెను. మఱియు నాతనిపే రట్టిదిగా నుంచుటలో నతఁ డట్టి పనికి సమర్థుఁడని తెల్పుటయ తాత్పర్యము. కనుక నట్టి కఠోరవృత్తాంతమును మహాకవి యంకములలో నెట్లు నిబంధన మొనర్చును? అంకములలో నాయాకథావిషయములను రసానుగుణముగ మార్చుకొనుటకు నాటకకర్తలకు సావకాశము గలదు. కనుక సీతావివాసనకాలిక శ్రీరామవృత్తాంతము సూచ్యముగ నొనర్చినాఁడు.

ఇఁక సీతాలక్ష్మణసంభాషణఘట్టమును విచారింతము. ప్రథమాంకమునందుఁ బ్రస్తావనలోనే శ్రీరామపట్టాభిషేకము మొదలు కథ ప్రారంభ మయ్యెను. ఆయుత్సవదర్శనమునకుఁ గాను విచ్చేసిన జనకమహారాజసమ్మేళనమున నుల్లసిల్లు సీతాదేవి మఱల గృహోన్ముఖులగు నాజనకులవియోగమునకు నుద్విగ్నయగుట సాజము. ఆమెను వినోదపఱుచుట ముఖ్యము గనుక నాలేఖ్యదర్శనము ప్రస్తావింపఁబడినది. ఆలేఖ్యము గూడఁ దమపూర్వచరితమునే స్ఫురింపఁజేయుచున్నది. ఆపూర్వచరిత స్ఫోరణము నాటకములోనికథాంశము పశ్చాద్వృత్త మని తెల్లముచేయుటకును, దదనుగుణముగ నాటకనామమున కౌచిత్యప్రదర్శనమున

కును, సీతకు వనరాజిగం గాదర్శనాభిలాష యుదయించుటకును, సీతాపత్యములకు జృంభకాస్త్రోపదేశము చేయుటకును, సయి యున్నది. ఈయుపదేశమువలనం గుశలవప్రత్యభిజ్ఞ జరుగవలసియున్నది. మఱియు నాపూర్వవృత్తము తమ్ము నెంతో జాలిం గష్టపఱచినను జివరకు గొప్పసంతసము గూర్చినది గానం, దలంపను, జెప్పుకొనను, వినను, జూడను గూడం దగియున్నది. ఇది జనసామాన్యస్వభావము. ఇది యిట్లుండంగ శ్రీరామునకు సర్వవిధములం బూజింపందగిన శాంతాభర్త ఋష్యశృంగమహర్షి ద్వాదశవార్షికయాగమారంభించుటయు, నందు వసిష్ఠాదిగురుజనులందఱు నిమంత్రితులై నిరుద్ధులగుటయు, గర్భవతియగు సీతను వినోదింప నింట శ్రీరాముండు గాక యితరులగు పెద్దలు లేకుండుటయు, దానిమూలమున గురుజనులు సీతకోరిన దెల్ల సఫలముచేయ నవసర మనియుం బ్రజానురంజనపరిపాలనము ముఖ్యమనియు నష్టావక్రునిచేం గబురు పంపుటయు, దానిమూలమున శ్రీరాముండు సీతకోరినయరణ్యాదర్శనకాంక్షను లక్ష్మణునిచే నెఱవేర్పను, బ్రజానురంజనమునకై ప్రజోద్దేశమును దుర్ముఖునిచే నారయను, బూనుకొనుటయును, రాంబోవుకథాంశములకుం బునాదులు గదా. మఱియు ఋష్యశృంగునియజ్ఞము వసిష్ఠాదులను శ్రీరామునికడ లేకుండం జేయునదై రాంబోవుకాలములో శ్రీరాముండు సీత నడవులకుం బంప నపుడే స్వతంత్రుండగుటకును, సమీపమందు లేని గురుజనులకు సీతావివాసనమునందు నింద లేకుండం జేయుటకును, బ్రారంభింపంబడినది. గర్భవతి గాన సీతకోరిక లెల్ల నెఱవేర్ప నెంచిన శ్రీరాముని యొడిలో నాలేఖ్యదర్శనశ్రమచేతం దత్కాలసులభప్రవేశయగు నిద్దుర సీత నావేశించుటయు, నాకాలమందే జనాభిప్రాయము నెఱుంగం బంపంబడిన దుర్ముఖుండను చారుండు వచ్చి సీతావిషయజనాపవాదము నెఱుక పఱచుటయు, నప్పుడే యాప్రకారమే యాదారుణ శ్రీరాముండు సీతను నెమ్మదిగ వదలి దుర్ముఖునితో రహస్యముగ నడవిలో విడిచి రమ్మని లక్ష్మణునకుం జెప్పుమనుటయుం గథౌచిత్యమునకుంగా నేర్పఱుచుకొనినయను

కూలాంశములు ఈసందర్భములోఁ గదా సీతాలక్ష్మణసంభాషణఘట్ట ము చేర్పవలెను. అది యిచట మఱియుఁ బొత్తుగ వ్యతిరేకము. ఎట్లన, ఆప్రకారము ప్రేమచే నాదరింపఁబడు, నాప్రకారముదయనీయాకృతి యు నగు సీతను బరమాప్తుఁడగు లక్ష్మణుని నడవులలో విడిచి రమ్మని స్వయముగ శ్రీరాముఁ డాజ్ఞాపింపలేక దుర్ముఖునిచేతఁ జెప్పించినపుడు లక్ష్మణుఁడుమాత్ర మాదేవిసుచరిత్ర మామూలాగ్రముగ నెఱిఁగినవాఁ డు గాన హృదయము నీరై కదలలేనిస్థితిలో నున్నప్పు డెట్లు వెంటఁ బెట్టుకొని పోయినట్లు చిత్రింపఁబడును? ఎట్లో చిత్రింపఁబడినను మాం యన్న శ్రీరాముఁడు మిమ్మీ యడవిలో విడిచి రమ్మనె నని యరణ్యాదర్శ నకుతూహలినియు గంగాప్రవాహావలోకనప్రణయినియు భర్తృవాల్ల భ్యనందినియు నగు నానవమాసగర్భ సీతతో నేనోరుపెట్టుకొని యనఁ గలిగినట్లు చిత్రింపఁబడును? ఆమాట లెట్లో తలవంచుకొని హృదయము తాయిచేసికొని పలుకఁ గలిగినను శ్రుతక్షణముననే యుత్క్రాంతజీవిత కాఁదగిన యాయుత్తమాంగన మొదలునఱికిన చెట్టువలెఁ గ్రిందఁ బడి మూర్ఛిల్లి తెలివివచ్చినప్పు డెల్ల నెత్తి నోరు మోఁదుకొని దుఃఖించుచు నందలి మృగపక్షిలతావనస్పతులను గూడ దుఃఖింపఁజేయుచున్నతఱి స్వభావసుకుమారమతియు దారుణరాజాజ్ఞానుపాలనతత్పరుఁడు నగు లక్ష్మణుఁ డెట్లు చిత్రింపఁబడియుండవలెను? ఆస్థితిలో నున్న యామె నెట్లు వదలి యింటివైపు కాలుపెట్టఁ గలిగినట్లు చిత్రింపఁబడును? కరు ణాతికరుణము నశక్యప్రదర్శనము నగు నీవిషయము మతిభూమింగతముకాన సూచ్యముగ నొనర్చిన కవిశేఖరునినైపుణ్యము నింత యని పొగడ నేరికి శక్యము? ఇఁక నామె యన్నమాటలు వినుటకుఁ జెవులును, బదులు పలుకుటకు నోరును సిద్ధముగనుండఁ గలవా లక్ష్మణునకు? ఏవిధముగ నోదార్పవచ్చును? ఓదార్పకయే మఱలిపోయినట్లు చిత్రించుట భావ్య మా? అది సభ్యులు చూచుటకు నెంతబాగుగ నుండును? అట్లు విడిచి రమ్మని పంపిన హృదయములేని శ్రీరామునికంటెను, అట్లు విలపించు

సంపూర్ణగర్భగుర్వి జీవితనిరాశ సీతకంటెను ముందుగ, సమస్తముఁ జూచుచున్న సుకుమారహృదయుఁడు లక్ష్మణుఁడు చావకుండుటకు నయోఘనశరీరుఁడా ? వజ్రకఠినహృదయుఁడా ? ఎట్లు చిత్రింపఁ దగును ? శ్రీరామునిహృదయమును సమస్తవిషయములచే నావర్జించి ప్రియమై యుండి యకస్మాత్తుగ విడువఁబడియున్న సీతకు, నామెకంటె శ్రీరామునిహృదయము నేమియెక్కు తెలిసికొనినవాఁడని లక్ష్మణునియనునయము లెట్లు సమాశ్వాసనసమర్థము లగును? లేక యిది యంతయు విడిచి నిరంకుశశాసనుఁడగు నా నూతనరామరాజుపలుకులు ప్రాణములపై నాశ మాని తిరస్కరించినట్లుఁలక్ష్మణునిఁ జిత్రింపఁ గూడదా? లేక యెందైన గుప్తముగ నామె నుంచినట్లు చిత్రింప రాదా? యుగ్రగజరాజాజ్ఞను దిరస్కరించెనను నపకీర్తికి లోనైనను, దనచేఁ బూర్వానుభూతసుచరితయగు నాతల్లినిఁ గాపాడ నతఁడు యత్నించినట్లు వ్రాయరాదా ? యీ నన్నివియు, మఱికొన్నియు సామాజికప్రశ్నలకు సమాధానము చెప్ప నావకాశము లేదనియే మహాకవి వాని నెత్తనైన నెత్తలేదని నాభావము. ఇవి యెన్నియు శ్రవ్యములలో సమర్థింప నక్కఱలేదు. కానఁ గాళిదాసాదులకవిత దుష్టము గాదు. కుందమాలలోనో సామాజికులు ప్రశ్నింపఁ దగినవారు. కనుక సీతాలక్ష్మణసంభాషణఘట్టమును ద్వితీయాంకప్రారంభములో "వాసంతీ! సమాశ్వసస్య! హాప్రియసఖి మహాభాగే ఈదృశ స్తే నిర్మాణభాగః । హా రామభద్ర ! అథవా అలం త్వయా ! ఆర్యే ఆత్రేయి ! కథయ తస్మాదరణ్యాత్పరిత్యజ్య వినివృత్తే లక్ష్మణే సీతాయాః కిం వృత్త మితి కాచిదాసీ త్ప్రవృత్తిః ? ఆత్రేయీ! నహి నహి" యనిసూచ్యములో సమకూర్చినాఁడు. ఈయాత్రేయీ వాసంతీవాక్యములచేత సీతాదేవి యునికి శ్రీరామునకుఁ దెలియదనియు నందుచే సీతాదేవికొఱకు శ్రీరాముఁడు ప్రణయసందేశము పంపవీలులేదనియుఁ దెల్లమగుచున్నదిగదా ! మఱియొక సంగతి. శ్రీరాముఁడు సీతను భాగీరథీతీరారణ్యభూములలో విడిచిపెట్టించెను గాని వాల్మీక్యాశ్రమములోఁ గాదు. దీనియౌచిత్యము

జనాపవాదము నొందిన సీతను బుణ్యాశ్రమములలో విడువఁ బంపఁ గూడకపోవుటయే. అట్లు కానియెడల దానికంటె నుత్తమ మయిన తన గృహములం దొక చోటఁగాని దగ్గఱనున్న యాప్తగృహములలోఁ గాని దాఁచి యుంపరాదా? యను ప్రశ్న యుత్పన్నమగుచున్నది. మఱియు జనాపవాదనిమిత్తము తెలియకున్నను బూర్ణగర్భయై భర్తచే విడువఁబడిన దగుటచే సాభిమానయు జీవితమున నిరాశగలదియు నగు సీత మాత్ర మెట్లు పుణ్యాశ్రమములలోఁ గాని మఱియొకచోటఁ గాని యడుగిడఁ దలపెట్టును? మఱేమి చేయు ననఁగ, నేగంగలో నైన దిగి ప్రాణములు పోఁగొట్టుకొని భర్తచే విడువఁబడినది యను నపకీర్తిఁ బోఁద్రోల యత్నించును. మఱొక సంగతి. సీతను రసాతలమునం దుంచుటకుఁ దగిన కారణము, జనాపవాదనిమిత్తముగ భర్త తన్ను విడిచెనను నపఖ్యాతివార్త యామెచెవి నెప్పటికి సోకకుండఁ జేయఁ దలఁచుటయే. ఆవార్త నిజముగఁ జెవికి సోకియు సోకనిసమయములో గంగాపృథువులు గారు సరిగదా పార్వతీపరమేశ్వరులు వచ్చి యనునయించినను నిలువునఁ బ్రాణములు పోఁగొట్టుకొను మానవతి యని మనుష్యులు లేని ప్రదేశములో నావార్తచెవినిఁబడదని యట్లు కథాసంవిధానకము కల్పించినాఁడు. ఎంత రమణీయము! మఱియు జనాపవాదము నొందిన సీతపుత్రులని లవకుశులకు సామాన్యజనులనుండి మాటిమాటికి నింద కలుగకుండఁ జేయుటకుఁ గూడరసాతలప్రాపణము సీతకునవసరమే. కనుకనే "ఆత్రేయీ! తత్రభగవతః కేనాపి దేవతావిశేషేణ సర్వప్రకారాద్భుతం స్తన్యత్యాగమాత్రకే వయసి వర్తమానం దారకద్వయముపనీతమ్" అను వాక్యమువలన సీతాపత్యములకు లోకోత్తరపవిత్రత రక్షింపఁబడినది. అయినను సీతకు లక్ష్మణుఁ డెఱింగించిన పరిత్యాగకారణ మేమనినచో? నిజముగ నేమియులేదు. మా యన్న మిమ్మిచట విడిచి రమ్మనెనని యే, ఈవార్తమాత్రము తక్కువదా? యని యన్నచోఁ గాదుకాని వజ్రనిర్ఘాతసదృశమైన పై వాక్యము వంటిది మాత్రము కాదు.

ఆశాబంధః కుసుమసదృశం ప్రాయశో హ్యంగనానాం సద్యఃపాతి ప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి" యనునట్లు కారణము తెలియదుగాన నెప్పటికైనఁ బునర్దర్శనము కాకుండునా యను నాశచేతను గంగాపృథువులవంటి యుత్తమాంగనల యాశ్వాసవచనముల చేతను బ్రదికినను బ్రదుకును. కారణము దెలిసినపిమ్మటనో యాయాశకుఁ దావు లేదు. ఆ సమాశ్వాసవచనములు పనికిరావు. జనాపవాదము పరిత్యాగకారణమని సీతకుఁ దెలియదనుటకు "సీతా। భగవతి నిష్కారణపరిత్యాగిన స్తస్య దర్శనే నైవం విధేన కీదృశీ మే హృదయావస్థా" యనియు, "ఏతే ఖలు తే అగాధమానసదర్శితస్నేహసంభారా ఆనందనిష్యందిన స్సుధామయా ఆర్యపుత్రస్య సల్లాపాః, యేషాం ప్రత్యయేన నిష్కారణపరిత్యాగేన శల్యితోపి బహుమతో మే జన్మలాభః." యనియు వాక్యములు ప్రమాణములు కనుక భర్తృవియోగముచేతనే యాసీత "పరిపాండుదుర్బలకపోలసుందరం దధతీ విలోలకబరీకమాననమ్ కరుణస్య మూర్తి రథవా శరీరిణీ విరహవ్యథేవ వనమేతి జానకీ" యని విరహావస్థలో వర్ణింపఁబడినది. మఱియొకసంగతి. "పురా కిల వాల్మీకి తపోవనోపకంఠే సంత్యజ్య ప్రతినివృత్తే లక్ష్మణే" యను తమసావాక్యమువలన నవగతమగు వాల్మీకితపోవన సమీపమున సీత విడువఁబడిన దనుసంగతి, శ్రీరామునకుఁ దెలియదని నాతలంపు. ఎన్నఁడు తనయాజ్ఞనుమీఱని లక్ష్మణుఁడు చెప్పినపని చేయుటయేగాని, చేసివచ్చితిననియు, నీవిధముగఁ జేసివచ్చితిననియు, మఱల శ్రీరామునకుఁ దెలియఁబఱచినట్లు చూచియుండ లేదు, ఊహించియునుండ లేదు. అయినను దెలిసినదనియే యూహింతము. కాని యామె వాల్మీకి తపోవనమునకుఁ దప్పక వెళ్ళియుండునని నిశ్చయమెట్లు? మానవతిగాన భర్తచే విడువఁబడితిననురోషముచే నేమి కీడు చేసికొనునోయని సందేహించియుండుననిన బాగుగ నుండును గాని ప్రాణసంరక్షణమునకై యొకరిపంచను జేరునది నిశ్చయించుట బాగుగనుండునా? సూర్యవంశాంకురగర్భము రక్షణీయమై యెట్టిసాహసకార్యము చేయనీయక పోయె నను పురాణేతివృత్తము ప్రకృతనాటకలక్షణవిరుద్ధము కాన మార్చుకొనెను.

అయినను శ్రీరామున కావిషయజ్ఞానము నిశ్చితముగాదనియే తెలియపఱు పఁబడినది గదా! నిజముగఁగూడ నీసీత గంగాజలముఁలయందుఁ బడినదను సందర్భోచితకథ కల్పింపఁబడినదియును గదా. కనుక నెక్కడ నున్నదని నిశ్చయించుకొని శ్రీరాముఁడు రహస్యముగఁ బ్రణయవార్త నంపనైన లేదను నింద నాతనిపై మోపుదుము? మఱియు నతఁడు జనులకు భయ పడిగదా ప్రాణాధికప్రియను గర్భగుర్విణిఁ గ్రవ్యాదులకు బలిభో జనమొనర్చెను. అట్టిదారుణశ్రీరాముఁడు మఱల నే మొగముతో దుర్ము ఖాదుల నామె కడకుఁ బ్రణయసందేశహారులుగ నొనర్చును? అందుల కనియే మహాకవి "త్రస్తైకహాయనకురంగవిలోలదృష్టేః స్తస్యాః పరిస్ఫు రితగర్భభరాలసాయాః। జ్యోత్స్నామయీవ మృదుబాలమృణాళకల్పా క్రవ్యాద్భి రంగలతికా నియతంవిలుప్తా"యని శ్రీరామునిచే ననిపించినాఁ డు. మఱియు"నకిలభవతాం దేవ్యా స్థానం గృహేఽభిమతం తత స్తృణ మివ వనే శూన్యే త్యక్తా న చాప్యనుశోచితా।చిరపరిచితాస్తే తే భావా స్త థా ద్రవయన్తి మా మిదమశరణైరద్యాస్మాభిః ప్రసీదత రుద్యతే" యనియు "వ్యర్థం యత్రకపీంద్రసఖ్యమపి మే వీర్యం హరీణాంవృథా, ప్రజ్ఞా జాంబ వతోఽపి, యత్ర నగతిః పుత్రస్య వాయోరపి, మార్గం యత్ర నవిశ్వకర్మ తనయః కర్తుం నలోఽపిక్షమ స్సౌమిత్రే రపి పత్రిణా మవిషయె తత్రప్రి యేక్వాసిమె" యనియు నిప్పటికిని జనులభయము. శ్రీరామునకు నుండి నట్లును, సీత యెందున్నదియు దుర్ముఖాదులకుఁ గాదు సరిగదా దాటశక్య ముగాని శతయోజనవిస్తీర్ణసముద్రోల్లంఘనము చేసి ప్రవేశింప నశక్య మగు లంకాపట్టణముఁ జొచ్చి చూడనైతిఁ గాని మేడలు మిద్దెలు పరి కించి చివరకు సాధించిన యాయాంజనేయాదిమహావీరులకునైనఁ దెలి యశక్యముగాదని శ్రీరామునిచేఁ జెప్పించుచున్నాఁడు, గాన దుఃఖైక శరణ్యుఁడుగాని శ్రీరాముఁడు సమాశ్వాసనీయుఁడుగాఁడుగదా. మఱి యు సీతను బంద్రెండేండ్లు పాతాళమునందుఁ జిన్నారికొమరుల ముద్దు మొగము చూపింపకుండ దాఁచుటలోనైన యౌచిత్యము, ఋష్యశృం గుని యజ్ఞము ద్వాదశవార్షికపరిమితముగఁ జిత్రించుట యందలి యౌ

చిత్యము “గర్భైకాదశేరాజన్య” మ్మనుసూత్రకారానుశాసనముచొప్పున సీతాపత్యము లుపనయనాదివైదికధర్మములకు సంపూర్ణార్హులు కావలె ననియు, నప్పటికి సంగరధర్మములందు సామర్థ్యముగలిగి యజయ్యపరాక్రము లగుదురనియు గురుజనులగు వశిష్ఠాదులకు నప్పటికిఁగాని శ్రీరాముని విషయ మారయనైతిఁ గాకపోయెననియు నిర్ణయించుటకునై యేరుపఱుపఁబడియున్నవి. లవకుశులు సీతయొద్దనే యున్నట్లు చెప్పినచో నాకుమారులకు నలవడవలసిన యీయనుకూలత సిద్ధింపదు. కనుక మాతాశిశువులకు నొకచో నుండవీలుపడక పండ్రెండేండ్లవఱకు వియోగముతోఁ గాలము గడుపవలసియుండెను. మఱియు విద్యాసంగ్రహణ కాలము పండ్రెండేండ్లని యదియుఁ జెప్పినట్లయినది. “కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా నభవతి” యన్నట్లు సీతవంటి యుత్తమాభిజాతయగు స్త్రీ యొకకారణమున దాను దుఃఖించుచున్నను, తన వినోదమునకై కొడుకులను దగ్గఱనుంచుకొనుటచే నసమర్థులనుజేసి యావజ్జీవము దుఃఖింపఁజేయదుగదా !

మఱియొకసంగతి. ఉత్తమోత్తమచరితయగు సీతకుఁగూడ ముఖ్యముగ నవసరమగుకాలములోఁగాక మిగిలిన యప్పుడు శ్రీరామునకు లేని సుకుమారపుత్రగాత్రాలింగనసుఖము గలుగఁజేయఁగూడదని యేనా తాత్పర్యము. పతిదైవతయగు సీతవంటిస్త్రీకి భర్తృసహావస్థితిలోఁ బుత్రపరిష్వంగానందము న్యాయముగాని ప్రత్యేకానందముగాదుగదా ! కనుకనే “కింవామయాప్రసూతయా, యస్యా మమ తాదృశమపి పుత్రకాణా మీషద్విరళకుందధవళదశనోజ్జ్వలం సులోచన మనుబద్ధకాకలీహసితంనిత్యోజ్జ్వలం ముఖపుండరీకయుగళ మలం నపరిచుంబిత మార్యపుత్రేణ” యని పుత్రదర్శనము శ్రీరామునకు లేకపోయెననియేవిరహావిచార నిమగ్నయగు సీతచేత సవిచారముగ ననిపించినాఁడు. ఇందలి “పుత్రకాణాం” అను బహువచనమాశాస్యవిషయలోకాచారనియమమని తలఁతుమా కనుకఁ గేవలపుత్రదర్శనౌత్సుక్యముకంటెఁ బుత్రదర్శనకుతూహలి భర్తృదర్శనౌత్సుక్యము మెండని తెలియుచున్నదిగదా.

సత్యమేకాని యుభయమును సమావేశముగాక యొకటిమాత్ర ము సులభమైనపుడు రెండవదానినిగూడఁ బోగొట్టుట న్యాయమని యనెదవయ్యా; యనినచోఁ గాదుకాని కుమారసామర్థ్యసంపాదనము నకుఁగాను ప్రధానకథను సుదూరము కొంపోదలంపులేమినిగూడ నన్య థానుపపత్తిగ నట్లుంచుట కంగీకరింపఁబడినదని సర్వము రమణీయ మని నామనవి.

మఱియొకసంగతి. ఈ సీతాపరిత్యాగము వాస్తవముగ శ్రీరా ముని మనస్సులో నామెదుష్టురాలను నుద్దేశము కలిగి చేయఁబడియుండ లేదుగదా ! జనాపవాదమునకుఁగదా యట్లు భయపడినరామునిచేఁ బంపఁబడినది ? ఆస్థితిలో మానవంతుఁడు ప్రజారంజనతత్పరుఁడు నగు శ్రీరాముఁడు నన్యావిదితకాంతావిరహదుఃఖనిమగ్నుఁడుగ వర్ణింపఁదగి నవాఁడుగాని ప్రతినిమేషము ప్రజలతో సంబంధముగలవాఁడై యాప్ర జలచే నారోపితనిందయగు సీతనుగుఱించి యెట్లుగానన్యులతో నాలో చనచేసినట్లు దృశ్యములలో వర్ణింపఁదగును ? దుఃఖమున్న యెడల నన్యా విదితముగ దుఃఖింపవలెనే కాని రెండవహృదయమునకైన గోచరింప నీయవచ్చునా ? ఆవిషయమునే తృతీయాంకశుద్ధవిష్కంభమందు లోపా ముద్రయన్నట్లు, "అనిర్భిన్నో గభీరత్వా దంతర్గూఢఘనవ్యథః। పుటపాక ప్రతీకాశో రామస్య కరుణోరసః" యని చెప్పినాఁడు. మఱియు నాయం కమునందే సీతాదేవితోఁ దమస. "సాంప్రతికమేవైతత్, కర్తవ్యాని ఖలు దుఃఖితై ర్దుఃఖనిబర్హణాని" యని ప్రస్తావించి "విశేషతో రామభద్రస్య, యస్య బహుప్రకారకష్టో జీవలోకః, ప॥ ఇదం విశ్వం పాల్యం విధివదభి యుక్తేన మనసా, ప్రియాశోకో జీవం కుసుమమివ ఘర్మో గ్లపయతి, స్వయం కృత్వా త్యాగం విలపనవినోదోఽప్యసులభః, తదద్యాప్యుచ్ఛ్వాసో భవ తి నను లాభోఽపి రుదితమ్" అనినట్లు రోదనమునుగూడ లాభముగ వర్ణించి యున్నాఁడు. మఱియుఁ బర్యాయముగఁ బ్రజలకు నాతనికరుణపరిదేవి తములు దెలిసినను దెలియవచ్చునని శంకచేతనే కాఁబోలు శంబూకవృ త్తాంతముచే నిల్లువెడలిన శ్రీరామునందుఁ బ్రియాసహవాసవిస్రంభ సాక్షిప్రదేశదర్శనకాలమునందే యాకరుణపరిదేవితములను వర్ణించి

యాటనుండి యతఁడు గృహాభిముఖుఁడై పోవునపుడు మేధ్యాశ్వాను యాయికుమారచంద్రకేతువునకును, లోకోత్తరవీరమునిదారకలవకుమారునకును, సంగ్రామసందర్భము జరుగుచున్నదని విద్యాధరమిథునమువలన నాలకించి యచటికిఁ బోయినట్లును, వాల్మీకికృతనాటకావలోకనమును జేసినట్లును, అందు సీతాదేవియొక్క పవిత్రత, పరమపావనగంగాపృథివీసమాదరణముచే స్పష్టమైనట్లును, వాల్మీకి సంయమీంద్రుని జగదనుశాసనము నవిలంబితముగ జరిగినట్లును గథ నమర్చి నైపుణ్యమును బ్రదర్శించియున్నాఁడు. కనుకఁ బంచవటీదర్శనసముద్భిన్నరామకృతసీతావిషయకైకాంతపరిదేవితములను బ్రజలు వినుటకు విమర్శించుటకుఁ దగినంతకాలము లేదుగాన నావిషయమై ప్రశ్న యవసరము లేదు.

మఱియు నీకవిశిఖామణి మిగిలిన శ్రవ్యదృశ్యకావ్యములలోవలె నిందుఁ బరిత్యాగకాలికసీతావిలపనసందర్భము ప్రదర్శింపకపోవుటకుఁ గారణమేమని (ఏకోరసఃకరుణఏవ) యని గర్జించిన కవిసింహుఁడు కరుణరసపోషకమగు నీసీతాపరిత్యాగరంగమును విడుచుటకుఁ గారణము గానవచ్చుటలేదనిన మఱియొక ప్రశ్నకు సమాధానము చూడుఁడు.

స్త్రీవిలపనమున్ననే కరుణరసమని, పురుషవిలపనమున్నఁ గాదని నియమ మెందునులేదు. రఘువంశములో నిందుమతీవిషయకమగు నజవిలపనము కరుణరసముగను, గుమారసంభవములో మన్మథవిషయకమగు రతివిలపనము కరుణవిప్రలంభశృంగారముగను, బెద్దలంగీకరించియున్నారు. ఇది కేవల కరుణరసమును గాదు. అయిన నిచటవాస్తవముగ దుఃఖింపఁ దగినవా రెవరని విచారింపవలసియున్నది. శ్రీరాముఁడు సీతావృత్తాంతమును సంపూర్ణముగ నెఱిఁగియుఁ దనకుఁ దప్పున్నదని లేశము నెఱుఁగని యాయమాయికయైన యిల్లాలి నేదోయొకకారణము గలదని కాఱడవులపాలు చేయవలసివచ్చెను. అట్లున్నప్పుడు దుఃఖమెవరియందు వర్ణించిన బాగుగనుండునో యోజింపుడు. సీతకు దుఃఖముండదని నాభావముకాదు. సీతకుఁ బరిత్యాగకారణముగాని, పరిత్యజించునని కాని, తెలియదు. తనకోరికపైఁ బ్రసన్నగంభీరవనరాజిపుణ్యసలిలభాగీరథీ

దర్శనమునకే నిజముగఁ బంపుచున్నాఁడని నమ్మియున్నవేల. పరిత్యాగానంతర మీపరిత్యాగమునకుఁ గారణమేమై యుండునని విమర్శించియుఁ దెలిసికొనలేక నిష్కారణపరిత్యాగమునకు దుఃఖపిల్లెనేకాని, లేదా యట్టియాపత్కాలమందు స్త్రీసామాన్యప్రచారసాహసమగు నాత్మహత్యాకార్యమునకుఁ దలకొననేగాని శ్రీరాముని వలె దుశ్శ్రవమగు దుర్ముఖవాక్యము చెవినిఁబడినది మొదలు చచ్చుటకు నేడ్చుటకును వీలులేక యంతరంగమున నేకుముల నవసరములేదుగదా. ఆస్థితిలో శ్రీరాముఁడు ప్రజాపరిపాలనానిర్బంధితుఁడగుటచేత నాతని కాపంద్రెండేండ్లు విలపనవినోదము కూడ లభింపలేదు. చిరపరిచిత సీతాభావుఁడు గాన నాతని కంటికి నిద్దురయు నలవడలేదు.

మఱియు నతఁడు విలపించిన నెవ రాలించి పాలింప నర్హులు? సీతగదా తనకై యెంత యడలుచున్నాఁడని తెలిసి తన నిష్కారణపరిత్యాగదుఃఖశల్యము నుత్పాటించుకొనవలెను? అందులకనియే తృతీయాంకమునందు నీ భవభూతి "తమసా! తదానీంతు శంబూకవృత్తాంతే నానేన సంభావితజనస్థానాగమనం రామభద్రం సరయూముఖా దుపశ్రుత్య భగవతీ భాగీరథీ యదేవ లోపాముద్రయా స్నేహవశా దాశంకితం తదేవాశంక్య సీతాసమేతా కేనచిదేవ గృహాచారవ్యపదేశేన గోదావరీకూలమాగతా" యని యుభయసమావేశము సార్థకము చేసియున్నాఁడు. కనుక నెఱిఁగిన నెఱుఁగకున్న ముందుగఁ జేసిన తప్పునకుఁగాను విచారింపఁదగినవాఁడు శ్రీరాముఁడుగాని యేమియు నెఱుఁగకుండి శిక్షింపఁబడిన సీతగాదు. ఈశిక్షకశిక్షిత విచారములలో నాధిక్యన్యూనతలు వారివారి మంచినడవళ్లనుఁబట్టి యేర్పడును గాని దారులుఁగొట్టు దొంగలకుండునని కాదు. కనుక నాసీతావిషయమట్లునిచి శ్రీరామవిషయము కవికి విచారణీయాంశమయ్యెను. ఆకారణముచేఁ బరిత్యాగకాలికసీతావిలపనము ప్రదర్శింపఁడాయెను. మఱియు నాసీతావిలపనముల నాలింపను బాలింపను దగినవాఁడు నేరము చేసినను శ్రీరాముఁడుగాని లక్ష్మణుఁడు గాఁడు. కాన నాతనిసమక్షముననే యాసీతాదేవియొక్క గంగాప్రవాహపతనము మొదలగువానిని నిరూపింపఁదలఁచి యాతఁడు చూచినంత

మాత్రమున సార్థకము లేదు. కాన వాల్మీకివిరచితనాటకమనియంతర్నాటక మునకు మహత్త్వము నాపాదించి యందలియత్యద్భుతవిషయము నాబాల గోపాలము చూచి తమతప్పును దెలిసికొని దిద్దుకొనునట్లు వాల్మీకి జగ దనుశాసనమును సమకూర్చియున్నాఁడు. కనుక నిట లక్ష్మణునితో సీత యన్నమాటలు చేర్పకపోవుటవలన రసభంగము కానేరదు. మఱియు సీతాదేవి లక్ష్మణునితోఁ బలికిన భర్తృవిషయక సందేశములకన్నను గురు జనులకుఁ జెప్పుమని పలికిన యనునయ సందేశములకంటెను దర్శాలోచి తమగు గంగాప్రవాహపతనము కరుణాద్భుతమయి మిన్నగా నెన్నఁబడు చున్నది. కాన కరుణమునకు నిచటఁ గొదువయు లేదు.

మఱొకసంగతి. "ఉపాయానాం భావా దవిరలవినోదవ్యతికరై ర్విమర్దై ర్వీరాణాం జనితజగదత్యద్భుతరసః, వియోగో ముగ్ధాక్ష్యాస్సఖలు రిపుఘాతావధిరభూ త్కటుస్తూష్ణీం సహ్యోనిరవధిరయంతు ప్రవిలయః" యని శ్రీరామునిచే ననిపించిన కవివరుఁడు, శ్రీ శాస్త్రిగారన్నట్లు పూర్వో త్తరవియోగములయందు హస్తిమశకాంతరమున్నదనియే భావించి యుత్తరవియోగమెక్కుడుగ "సీతా! బహుమానితాస్మి పూర్వవిరహేణ నిరవధిరితి హా హాతాస్మి" యని సమర్థించినాఁడు. ఇఁక గంగాజలములఁ బ్రసవసందర్భము విచారింతము. జీవితాశలేని సీత, ప్రసవసంరక్షణము నకై యత్నించుట యనుచితముగాన గంగానిపతనము ప్రకృతకరుణా ద్భుతమునకు నెంతయు ననుకూలముగ నున్నదని నాభావము. కనుకనే "ఈదృశానాం విపాకోహి జాయతే పరమాద్భుతః, యత్రోపకరణీ భావ మాయా త్యేవంవిధోజనః" యని మురళావాక్యముచే సామాజిక మనస్సులఁ జిత్రార్పితములఁ జేయుచున్నాఁడు. ఈప్రసవరంగము, అనఁగా నంతర్నాటకవృత్తాంతము లేకున్నచో నిర్వహణసంధ్యంగకార్యముల కుచ్ఛేదము వాటిల్లునుగాన నాటకము దుఃఖాంతముగఁ బరిణమించును. అది మన సంప్రదాయముకాదు. పురాణేతివృత్తముగూడఁ జెడినట్లగును. మఱియు ధీరోదాత్తనాయకుఁడగు శ్రీరాముఁడు "వత్స ప॥ తత్కాలప్రియజన విప్రయోగజన్మా తీవ్రోఽపి ప్రతికృతివాంఛయావిసోఢః దుఃఖాగ్ని ర్మనసిపునర్విపచ్యమానోహృన్మర్మవ్రణ ఇవ వేదనాం తనోతి"

యని వెనుకటివియోగస్మరణముచేఁ గుందుచుండ నిప్పటివియోగము నిర
వధికమని చెప్పుట యాశ్చర్యమేమున్నది? కనుక ధీరోదాత్తుఁడు దుఃఖి
తుఁడుగ వర్ణింపఁదగఁడను నియమములేదు. అట్లయిన శాకుంతలములో
దుష్యంతుఁడు, రఘువంశములో నజుఁడు నేమగుదురు ? కనుక నంతయు
రమణీయమని విన్నవించుచున్నాను.

శ్రీమద్రామాయణము సుందరకాండములో ముప్పదియాఱవ
సర్గములోనియీశ్లోకములుచూచి పండితులు, శ్రీరాముఁడుసీతావిషయక
దుఃఖసమవేతుఁడుగ వర్ణింపఁదగినవాఁడో కాఁడో నిర్ణయింతురుగాక.

41. నమాంసం రాఘవో భుఙ్క్తే నచాపిమధుసేవతే
వన్యంసువిహితం నిత్యం భక్త మశ్నాతి పఞ్చమమ్.

42. నైవ దంశా న్నమశకా న్నకీటా న్నసరీసృపాన్
రాఘవోఽపనయేద్గాత్రాత్త్వద్గతే నాంతరాత్మనా.

43. నిత్యం ధ్యానపరో రామో నిత్యంశోకపరాయణః
నాన్యచ్చిన్తయతేకిఞ్చిత్సతు కామవశంగతః.

44. అనిద్రస్సతతం రామస్సుప్తోఽపిచనరోత్తమః
సీతేతిమధురాం వాణీంవ్యాహరన్ ప్రతిబుధ్యతే.

45. దృష్ట్వాఫలంవా పుష్పంవాయద్వాఽన్యత్సుమనోహరమ్
బహుశోహాప్రియేత్యేవంశ్వసంస్త్వామభిభాషతే.

46. సదేవి నిత్యంపరితప్య మానస్త్వామేవ సీతేత్యభిభాషమాణః.
ధృతవ్రతో రాజసుతో మహాత్మాతవైవ లాభాయకృతప్రయత్నః.

ఇంతవఱకు నాకుఁ దెలిసినవి, పెద్దలవలన వినినవి యగు నంశ
ములను సమకూర్చి వ్రాయఁగలిగితిని. ఇందు హెచ్చుతగ్గులున్నయెడల
మన్నింతురుగాక. ఈసందర్భమున నామిత్రులు "సీత రామునితోఁ
జెప్పియడవికివెళ్ళినట్లు భవభూతివ్రాయనందున నాపాత్రకుహ్యానతవాటి
ల్లదా ?" యనుప్రశ్నఁజేయ నాకు సమాధానము పొడకట్టినది గాదు.

# శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు విమర్శపరామర్శము.

శ్రీ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు.

"సూర్యరాయాంధ్రనిఘంటువు"అను శీర్షకముతో "ఆంధ్రపత్రి"కా ప్రమాథిసంవత్సరాదిసంచిక"లో శ్రీ వడ్లమూడి వేంకటరత్నముగా రొక వ్యాసము వ్రాసినారు. తమమిత్రు లొకరు మహాభారతమునకుఁ బ్రత్యేకముగా నొకనిఘంటువును రచించినారనియును, దానిలోఁ గల పదములును సూర్యరాయాంధ్రనిఘంటువులోని పదములును దా మెత్తి వ్రాయఁగా మహాభారతనిఘంటు విచ్చినవి సూర్యరాయాంధ్రనిఘంటువులో నకారాదిపదములలోనే యయిదువందల పదములు కనఁబడ లేదనియును, కనుక సూర్యరాయాంధ్ర నిఘంటువు సమగ్రనిఘంటువు కాదనియును దమకుఁ దోఁచి యావిషయమును లోకమునకుఁ దెలుపుటకై యావ్యాసము వ్రాసినారఁట. ఇది వీరి వ్యాసములోని సారాంశము.

వీరు సూర్యరాయాంధ్రనిఘంటువులో లేక మహాభారతనిఘంటువులోమాత్రము కలశబ్దములను గొన్నిటిని మచ్చునకై చూపియున్నారు. వానిని బరిశీలించువారికిఁ దచ్ఛబ్దములను గ్రహింపకపోవుటవలన సూర్యరాయాంధ్రనిఘంటువునకు లోపము లేకపోవుటయే కాక సవిమర్శముగా నది రచింపఁబడిన దను విషయముగూడ గోచరించును.

"నిఘంటువువారు గ్రహించినపదముల కైనను సమగ్రముగా నర్థములు వ్రాయ లే"దని యింకొక యారోపణము చేసినారు. "వ్యావహారికశబ్దముల నన్నిటిని నిఘంటువులో గ్రహింపలే" దని మఱియొక యారోపణము గూడఁ జేసినారు. వీని కన్నిటికి నీవ్యాసమున సమాధాన మియ్యఁబడును.

వ్యావహారికశబ్దములు భిన్న భిన్నరూపములతో వ్యవహారమునఁ గలవు. ఉదాహరణమునకై సూర్యారాయాంధ్రనిఘంటువులో లేదని విమర్శకు లాక్షేపించిన "ఉకము" అను పదమునే గ్రహింతము. దీనిని

"ఉహాము" అని పెక్కురును, "ఉగము" అని కొందఱును, "ఉఘము" అని మఱి కొందఱును వ్యవహరించుచున్నారు. విమర్శకులు "ఉకము" అని వ్రాసియున్నారు. ఇప్పు డీ నాలుగురూపములలో నేది గ్రహింప వలయును? ఒకటి గ్రహించినఁ దక్కినవి గ్రహింపకుండుటకుఁ గల కారణ మేమి? అన్నియును గ్రహించిన నేవి సాధువులు? ఏవి యసాధువులు? వీని సాధుత్వాసాధుత్వములకుఁ బ్రమాణ మేమి? శిష్టవ్యవహారము ప్రమాణమనుటకు శిష్టులెవరో శిష్టులు కాని వా రెవరో తేలనప్పుడు దానినిఁ బ్రమాణముగాఁ దీసికొనుట యెట్లు? ఒకవేళ శిష్టనిర్ణయము జరిగినను వారుగూడ బహురూపములను వ్యవహరించుచున్నప్పు డం దేది ప్రమాణము? ఇత్యాద్యనేకసాధకబాధకములు విశేషముగాఁ జర్చించియే నిష్ప్రమాణములు సందిగ్ధార్థరూపములునగు వ్యావహారికశబ్దముల నీ నిఘంటువున గ్రహింపలేదు. ఇది గ్రాంథికభాషానిఘంటువు కాని వ్యావహారికభాషానిఘంటువు కాదు గదా! మఱియు నీ నిఘంటు వసందిగ్ధార్థరూపములు సప్రమాణములు నగువ్యావహారికశబ్దములను బెక్కింటిని గ్రహించియే యున్నది.

విమర్శకులు సూర్యరాయాంధ్రనిఘంటువులో లేనట్టి గ్రాంథికశబ్దములను "అపశబ్దములు, అనావశ్యకములు, గృహీతములు" అని మూఁడురకములుగా విభజింపవచ్చును.

## ౧. అపశబ్దములు.

"అనాక, ఎడగర" మున్నగు నవి యపశబ్దములు. కనుక నే నిఘంటువులో వానిని గ్రహింపలేదు. వానినిగూర్చి ముందుముందు సవిస్తరముగా వ్రాయఁబడును.

## ౨. అనావశ్యకములు.

ఇవి కవులు సమానార్థక పదములను గలిపి సృష్టించుకొనునవి. ఇట్టివి వీని నెన్నింటి నిచ్చినను నిఘంటువునకు సమగ్రతయుండదు. వీ రాక్షేపించినవానిలో మూఁడు వంతులకుఁ బైఁగా నిట్టివియే కలవు. చూడుఁడు.

అంగజన్ముఁడు :—ఈ పదము గ్రహింపలేదని యాక్షేపము. 'అంగజుఁడు, అంగభువు, అంగభవుఁడు' మొదలగునవి గ్రహింపఁబడి యుండఁగా నిది గ్రహింపఁబడకున్న నేమి దోషము ? అట్లుగాక యిట్టి వాని నన్నిటిని గ్రహింపవలయునన్న "అంగజాతుఁడు, అంగజాతి, అంగ జనుఁడు, అంగసంభవుఁడు, అంగసముద్భవుఁడు, అంగసంజాతుఁడు" మొదలగు ననేకశబ్దములను గ్రహింపవలసివచ్చును. మఱియు 'అంగ' శబ్దపర్యాయశబ్దము లన్నింటియొద్దనుగూడ నిట్టివి చూపుట కారంభించిన యెడల ననవసరముగా నింకను గ్రంథము పెరుఁగును. కనుకనే యిట్టి పట్టులందుఁ బ్రసిద్ధములగు సంస్కృతనిఘంటువులలో నిచ్చినపదములు కొన్నిచూపినఁ దక్కినవన్నియు నూహింప శక్యము లగునని నిఘంటుకర్త లట్లు చేసినారు. ఇట్లే 'అనిలజుఁడు' అనుపదమును గ్రహింపలేదని యా క్షేపించినారు. "అనిలాత్మజుఁడు" అను దానిని గ్రహించి యున్నారు గదా, దీనిని గ్రహింపకున్న నేమి ? 'అంగజన్ముఁడు' దగ్గఱఁబోలె నిక్కడఁ గూడ సమాధానము చూచుకొందురు గాక. "అనిమిషగురువు" ఇది లేదఁట. 'అమరగురువు' కలదుగదా, చాలదా ? ఇట్టివాని నెన్నిటిని గ్రహించిన సంతుష్టి గలుగును ? కనుక వీరు చూపిన యితరానావశ్యక శబ్దములనుగూర్చి సమాధాన మిచ్చుట యనావశ్యక మని తలఁచి తక్కిన వానికి సమాధాన మిచ్చెదను.

### 3. గృహీతములు.

(నిఘంటువులో నున్నను లేవని విమర్శకు లనుకొనినపదములు ను, దత్తుల్యములును.)

(౧) అకా—ఇది గ్రహింప లేదని యాక్షేపము. దీనిని"కా[1]" గా గ్రహించి 'అని' అనునవ్యయమువలెఁ బూర్వోక్తవిషయమును సూచించును. ఇది యీయర్థమునఁ దఱచుగా ప వార్థకమగు అకార మునకుఁ దర్వాతఁ గనఁబడుచున్నది" అని వ్రాసి ప్రమాణములు చూపి యున్నారు. అట్లుగాక 'అకా'అని యొకపదము గ్రహించిన 'వ...అది

తనసై న్యాపరాధంబున నయ్యోఁగా వగచి...'—భార,ఆర. 3-౧౭౮.
ఇక్కడ అకారపూర్వకము కాకున్నను 'అని' అను నర్థము నిచ్చుచున్నది గదా! ఇది యెట్లు కుదురును? కావుననే దీనిని 'కా[1]' గా గ్రహించినారు. 'అకా నిత్యర్థకము' అను ప్రౌఢవ్యాకరణము ప్రాయికాభిప్రాయము. అందుచేతనే శబ్దరత్నాకరమున 'అకా'' అని గ్రహింపక "కా" గానే సీతారామాచార్యుల వారు గ్రహించినారు.

(౨) అగ్ర్యము—ఈపదము లేదని యాక్షేపము. "అగ్ర్యుఁడు" అను పదమును గ్రహించియుండగా దీనిని గ్రహింప లేదని యాక్షేపించుట సమంజసముకాదు. ఇట్టి విశేషణ శబ్దములలో నమహన్మహన్మహతీరూపములు మూఁడును గ్రహింపక యేదేనొకటియే గ్రహించుట నిఘంటుసంప్రదాయము.

(3) అంపపెట్టు, అంపసెల—ఇవి గ్రహింప లేదని యాక్షేపము. "అమ్ము[1]" లో (వృత్తియందుఁ దఱచుగా 'అంప' అగును) అని వ్రాసి యుదాహరణార్థము 'అంపకట్టె' 'అంపవెల్లి' మున్నగునవి కొన్ని మాత్రమే గ్రహించినారు. "అంపపెట్టు" మున్నగు వాని కన్నిటికిని 'అమ్ము1' లో వ్రాసిన విశేషమువలననే సిద్ధి సులభగ్రాహ్యము. కావుననే యిట్టివాని నన్నిటిని గ్రహించి వృథాగా గ్రంథమును బెంచలేము.

(౪) అంతశ్చరము, అంతఃపరివారము:—ఇవి లేవని యాక్షేపము. సూర్యరాయాంధ్రనిఘంటువులోని "అంతర్" అనుపదమును జూచికొనిన నిట్టివి ప్రత్యేకముగా గ్రహింప నక్కఱలేదని తోఁచును.

(౫) అంబుజాక్షి, అంబుజాక్షుఁడు, అబ్జాక్షి:—ఇవి లేవని యాక్షేపము. ఇట్టివి "అక్షి" శబ్దములో సవిమర్శముగాఁ జూపఁబడినవి. ఇట్టివానిని మేము చూపినట్లే ప్రధానశబ్దములలోఁ జూపినఁ జాలవఱకు గ్రంథవిస్తరము తగ్గుటయేకాక యట్టివాని ననేకములను గల్పించుకొను తెలివికూడఁ గల్గును. లేనిచో గ్రహించినవే తక్కఁ దదితరములు తెలియవు.

(౬) అబ్జముఖి—ఇది లేదని యాక్షేపము. ఇక్కడ "అబ్జముఖ" అను రూపాంతరము గూడ నుండును. ఈ విషయము 'అభిముఖుఁడు' మున్నగువానిలోఁ జూపఁబడినది. ముఖశబ్దమునఁ గూడఁ జూపఁబడును.

(౭) అలుఁగుటమ్ము—ఇది లేదని యాక్షేపము. ఇది విశేషార్థాభిధాయకము కాకపోవుటచేత "అలుఁగు 2"లో నుదాహరణముగాఁ జూపఁబడినది.

(౮) అల్లఁదనము—ఇది లేదని యాక్షేపము. ఇది "అల్ల2"లో నుదాహరణముగాఁ జూపఁబడినది. కొన్నిచోట్లఁ దప్పుఁ దన ప్రత్యయాంత శబ్దములు ప్రత్యేకముగా గ్రహింపఁబడక 'అల్ల2' మొదలగు శబ్దములలో వలెనే ప్రధానశబ్దములలో నుదాహరణములుగాఁ జూపఁబడును. ఇది నిఘంటుసంప్రదాయము.

(౯) అవసథము—ఇది నిఘంటువులలో గ్రహింపఁబడ లేదని యాక్షేపము. ఇది కల దనుటకు దృఢతరప్రమాణములు లేకపోవుట చేతఁ బరిత్యజింపఁబడినది. అమరమున,

శ్లో. ధిష్ణ్యమోకో నివసనం స్థానావసథవాస్తు చ. అని కలదు. ఇది యధికపాఠ మని యమరవ్యాఖ్యాతలు వ్యాఖ్యానము చేయక వదలినారు. ఐనను

శ్లో. రమ్య మావసథం కృత్వా—(రామాయణము బాల. ౧. ౩౦.) లో (ఆవసథమ్=పర్ణశాలారూపం గృహమ్ ధిష్ణ్యమోకో నివసనం స్థానావసథవాస్తు చేత్యమరః) అని గోవిందరాజీయవ్యాఖ్యలో "ఆవసథము"గా ఛేదింపంబడియున్నది. ఇట్లే వైజయంతీనిఘంటువులోఁ గూడఁ బ్రామాణికులచేత ఛేదింపఁబడియున్నది. మఱియు సూ. ఉపసర్గే వసేః. ఆవసథో గృహమ్. సంవసథో గ్రామః— సిద్ధాంతకౌముది. ఉణాది. 3. ౧౧౬—అని పాణినీయమున 'ఆవసథ' శబ్దమే సాధింపంబడినదిగాని 'అవసథ' శబ్ద మెక్కడను సాధింపంబడలేదు. ఇట్టి బహుప్రమాణములను, ప్రామాణికప్రయోగములను బరిశీలించియే శ్రీరంగా

చార్యప్రభృతి నిఘంటుకర్తలుగూడ 'అవసథ'శబ్దమును గ్రహింపక 'ఆవసథ' శబ్దమునే గ్రహించినారు. సూర్యరాయాంధ్రనిఘంటువుకూడ నీ ప్రామాణికమార్గమునే యనుసరించి 'అవసథము'ను గ్రహింపక 'ఆవసథము'నే గ్రహించినది. ఇట్లు సవిమర్శముగాఁ బనిచేయుచున్న సూర్యరాయాంధ్రనిఘంటువు నిందార్హమో స్తుత్యర్హమో విమర్శకలోకమే నిర్ణయించునుగాక. ఇప్పటికి వీ రిచ్చిన మొదటిపట్టిక యైనది. ఇఁక రెండవపట్టికకు వీరు వ్రాసిన యుపోద్ఘాతమును గూర్చెము విమర్శించిన దాని వస బయటఁ బడును. చూడుఁడు: "శ్రీరామయ్యపంతులువారు పీఠికలో 'ఉపసర్గశత్రంతాదిశబ్దములుగూడ నిందు గ్రహింపఁబడినవి' (పీఠిక. 3. పారట) అని వ్రాసియున్నారు. శబ్దములు అను మాటకు 'కొన్ని' అనువిశేషణ మున్నచో నది యథార్థమే యగునుగాని, ఆవిశేషణము లేక 'అన్నియు' అనుభావము కలుగవలయునను తలంపుతో వ్రాసినయెడల నది ఘోరాసత్యమే యగును. పంతులవారి మాటలో 'ఉపసర్గ' అనుటకు ఉపసర్గపూర్వకములు అనియే గదా వారిభావము. చూడుకు: ఆంధ్రమహాభారతమునుండియే కొన్నిపదములు:

| | |
|---|---|
| అకలంకము | అనధీయానుఁడు |
| అకాలకౌముది | అనవిత్త్వము |
| అచిత్తు | అనింద్యము |
| అజరామరము | అనీహమానుఁడు |
| అధశ్శయనము | అఫల్గువు |
| అధోసివి | అవినాభవత్ |
| అవిద్ధము | అశ్లక్ష్ణము |
| | ......... " |

అని విమర్శకులు వ్రాసినారు. కాని యీ పదములలో నేవియును నుపసర్గపూర్వకము గాదు. ఏమాత్రపు సంస్కృతవ్యాకరణజ్ఞానము కలవాఁడైనను "అ, అధస్" అనునవి యుపసర్గము లని చెప్పఁడు. మఱియు "తెనుఁగులోఁబృథక్ప్రయోగార్హములు గాకున్నను సమాసములలో నుప

యోగింపఁబడును గనుక ఉపసర్గశ్రుతంతాదిశబ్దములుగూడ నిందు గ్రహింపఁబడినవి" (పీఠిక, 3 పొరట) అని శ్రీరామయ్యపంతులవారు వ్రాసి యుండఁగా దీనిసంతను సరిగా నర్థము చేసికొనక యీ వాక్యము నందలి యేకదేశమును గ్రహించి విమర్శకులు దానికి విపరీతవ్యాఖ్యా నము చేసినారు. శ్రీపంతులవారు 'ఉపసర్గశబ్దమును "ప్ర, పరాను"లను నర్థమునసనే ప్రయోగించిరిగాని విమర్శకులు వ్రాసిన న్లుపసర్గపూర్వక ము లనుభావమునఁ బ్రయోగింపలేదు. ఉపసర్గములకుఁ దెలుఁగునఁ బ్ర త్యేకముగాఁ బ్రయోగము లేకున్నను సమాసములలో నుండును గనుక మేము "ప్ర" మొదలగు నుపసర్గముల నన్నింటిని గ్రహించి వానికిఁగల యర్థములు నుదాహరణములును జూపినా మని పంతులవారి వాక్యము నకు భావము. అట్లు ప్రాదులను బ్రత్యేకముగా గ్రహించి యర్థాదులు వ్రాయుటచేత విమర్శకులు నిఘంటువులో నీయలేదని యాక్షేపించిన "అపక్రాంతము, అపకృత్రిము, అనుజన్మ, అనుజాతి, అభిఘట్టము, అభి దారణము" మొదలగు నుపసర్గ పూర్వకపదములు తత్తదుపసర్గముల లో వ్రాసిన యర్థములకే యుదాహరణాంతరము లగును. కనుకనే యుప సర్గపూర్వకపదముల నన్నింటిని గ్రహింపక కొన్నింటిని (ముఖ్యములగు వానిని) మాత్రమే గ్రహించినాము. వాచస్పత్యాది సంస్కృతనిఘం టువులుగూడ నీమార్గమునే యనుసరించినవి. అట్లుగాక యుపసర్గపూ ర్వకపదములనన్నింటిని గ్రహింపవలయు నన్నచో నొక్కొక్క యుపసర్గము నకొక్కొక్క సంపుటము కాఁగలదు. అది నిరర్థకపరిశ్రమము. కనుకఁ బరిత్యజింపఁ బడినది. విమర్శకులు పైవిషయమును గమనింపకపోవుట యటుంచి పీఠికనైనను సరిగా నర్థము చేసికొనక తమ కలము న్నిక్కడ యథేచ్ఛముగా సాగించుట మిక్కిలి శోచనీయము.

వీరు చూపిన 'అకలంకము' మున్నగునవి "అ. సం. అవ్య." లో గతార్థము లగును. అక్కడ నక్షరకు సంబంధించినవిషయము విపులము గాను సోదాహరణముగాను వ్రాయఁబడినది.

ఇట్లు పేర్కొనిన రెండవపట్టికలోని శబ్దములు గూడ గతార్థము లైనవి. ఇంక మూడవపట్టికలోని శబ్దములు చూడుడు.

"ఒక్క మహాభారతము నుండియేకాదు వీరుశబ్దములను విడిచి పెట్టినది. తక్కినవాఙ్మయమునుండియు వదలివైచినారు. ఎన్నింటిని వదలి పెట్టినారో ఆదేవునికే యెఱుక. ప్రబంధములనుండి నేను గుర్తువ్రాసి కొన్న పదములలోనుండి కొన్నింటిని ఈసంపుటములో లేని వానిని మచ్చునకు ఉదాహరింతును" అని విమర్శకులు వ్రాసి, కొన్ని పదము లిచ్చి నారు. విమర్శకులు తా మిచ్చిన పదము లేయే గ్రంథములలో నున్నవో వానిపేర్లు మాత్రమే వ్రాసినారు కాని యాశ్వాసాదులను, పద్యసంఖ్యల ను వ్రాయలేదు. ఇది మిక్కిలి యన్యాయ్యము. ఏల యన, "ఎడగర" అనుపదము భారతమున నున్నదని విమర్శకులు వ్రాసినారు. పదునెనిమిది పర్వముల మహాగ్రంథములో నీ నాలుగక్షరములపద మెక్కడ నున్నదో తెలిసికొనుట యెట్లు? దాని మంచిచెడ్డలఁ గూర్చి విచారించుట యెట్లు? ఇట్టివానిని వెదకవలయునన్న నెంతయో కాలము పట్టును. ఐనను నేను వీని నన్నిటిని వెదకినాఁడను. తత్తత్పదములయొద్దఁ దత్తత్పద్యములను వాని సంఖ్యాదులను జూపియే సమాధాన మిచ్చెదను. చూడుఁడు:—

అనాక:—

గీ. అని యవష్టంభసంరంభ మతిశయిల్లఁ
బలుకుటయు నాత్మ గర్వించి నలువపట్టి
యొండనాక యొక్కింతసే పూరకుండి
యుస్సురంచును వేఁడి నిట్టూర్పు వుచ్చె

—కాశీఖండము, (౧.౧౦౧.)

(వావిళ్లప్రతి పాఠము.)

ఇందలి "అనాక" అను పదమును గ్రహింపలేదని విమర్శ కులయాక్షేపము. ఇక్కడ "అనాక" అనునది ముద్రణప్రమాద పతితము. "అగునకనుకనులను ముజ్జీత్తులు పరంబు లగునపుడు కానా

కానలు విభాష నగు" అను బాలవ్యాకరణసూత్రముచేత "అను"ధాతువునకు వ్యతిరేకక్త్వార్థకరూపములు "అనక, నాక" యని రెండుమాత్రమే యగును. కనుకనే "ఒంకునాక" అని ప్రాంతముద్రణమునను, తాళపత్ర గ్రంథములలోను గలదు. ఇంతమాత్రమేని సహింపలేని వీరొక గొప్పనిఘంటువును విమర్శింపఁబూనుట మిక్కిలి సాహసము.

ఉమ్మస(న):—కేయూర బాహు చరిత్రలోని యీ పదమును గ్రహింపలేదని యాక్షేపము.

'ఉమ్మస' అనియే గ్రంథమున నున్నది. అది సరి యగునో కాదో యని తలఁచికాఁబోలు విమర్శకులు (న) కుండలీకరణములో నుంచినారు. ఈపదము కలపద్యమును జూడుఁడు.

(ఒకసమయమున దీర్ఘకాలము వఱపు పట్టినది. అప్పు డొకసర్పము దప్పిచేతఁ గంఠగతప్రాణమై సమీపమున నొకనూతిలో)

క. మండూకనినాదము విని,
నిండిన సంతసముతోడ నీరుండని వో
నుండ వివి యచట నుదకము
లుండఁగఁబోలు నని మేన నుమ్మసలారన్.

— కేయూరబాహుచరిత్రము, 3. ౧౮.

(కదియవచ్చెను.) ఇక్కడ "ఉమ్మ + అసలారన్" అని పదచ్ఛేదము. "ఉమ్మ = ఉక్క. అసలారన్ = అతిశయింపఁగా" అని యర్థము. విమర్శకు లనుకొనినట్లు "ఉమ్మస(న)" అనుపదము లేదు. ఈ విషయము వీరికిఁ దెలిసినచో నిఘంటువువారిపై నాగ్రహింపకుందురు. ఉమ్మ, అసలారు శబ్దములు నిఘంటువులో సప్రమాణముగా గ్రహింపఁబడియే యున్నవి. ఇక్కడ విమర్శకులు "ఉమ్మస (న)లు + ఆరన్" అని పదచ్ఛేదము చేసికొనిరో? "ఉమ్మస (న) + లారన్" అని పదచ్ఛేదము చేసికొనిరో? లేక మఱి యేవిధముగాఁ బదచ్ఛేదము చేసికొనిరో? వారికే యెఱుక.

అట్టహాసము:—భీమఖండములో నున్న యీపదమును గ్రహింపలేదని యాక్షేపము. ఇది సూర్యరాయనిఘంటువు ౯౯ పొరటలో

"పెద్దసవ్వు" అను నర్థముతో నీయఁబడియున్నది. వీరు లేదనుటకుఁ గారణము తెలియదు. ఈ పదము భీమఖండములో ౧-౮౩, ౧౦౭, ౩-౧౭౯, ౪౩౫. లలోఁ గలదు. కాని వీనిలో నెచ్చటను నిఘంటువులో నిచ్చినయర్థము కన్న విశేషార్థమైనను లేదు. కనుక విమర్శకులు నిఘంటువును మరల నొకమాఱు సరిగాఁ జూచుకొందురుగాక.

ఆటకూటము:—భీమఖండములోని యీపదము నీయ లేదని యాక్షేపము.

'వ... కుంతీమాధవదేవునకు విశ్రాంతిప్రదేశంబును హుంకారిణీ మహాదేవికి విహారసంకేతభవనంబును బీతాంబికాలక్ష్మీ కాటకూటంబును ననఁదగి...'

—భీమ, ౨.౫౫.

ఇం దీపదము కలదు. "ఆట=క్రీడకొఱకైన, కూటము=గృహము" అని దీని యర్థము. పై రెండు శబ్దములును వేఱువేఱుగా గ్రహించి వానిలోఁ బై రెండర్థముల నిచ్చియున్నాము. మఱియు నీ యర్థము కల "ఆటగీము" అనుసమస్తపదము నొకదానిని మచ్చునకై చూపియున్నాము. అందుచే నీ పదము పై వానిలో గతార్థమగును. ఇట్టిసమస్తపదములలో నొకదానిని జూపినచోఁ దత్సదృశములగువానిని బాఠకు లూహించుకొనవలెనేకాని నిరుపయోగములగు నిట్టివాని నన్నింటిని నీయ లేదనుట సమంజసము గాదు. ఈయక తప్పదన్నచో "ఆటగృహము, ఆటవేశ్మము, ఆటసద్మము, ఆటనికేతనము" మున్నగు పదములనుమాత్ర మేల యీయవలెను లేదు ? అట్లీయఁదొరఁకొనినచో నంతమెక్కడ ? కావుననే యిట్టిసమస్తపదములవిషయమున ముఖ్యములగునవి కొన్ని చూపి వదలుచున్నాము.

ఏకభోగము:—భీమఖండములోని యీపదము నీయలేదని యాక్షేపము.

గీ. ఏకభాగంబుగాఁగ నేలేఱుగదుసు గడలిసీమయు గౌతమీగంగ మేర
కర్పూరపుఁగ్రోపికాక్షీరఖండమవధి యేలెవిశ్వకుటుంబి భీమేశ్వరుండు.

—భీమ, ౫-౮౮.

ఇక్కడ 'ఏక' 'భాగ' శబ్దములకున్న యర్థముకన్న విశేషార్థ మేమియును లేదు. కనుకఁ బ్రత్యేకపదముగా గ్రహింపవలసినయవసరము లేదు.

అథఃప్రపంచము:—పాండురంగమాహాత్మ్యములోని యీపదము లేదని యాక్షేపము. ఇది యపశబ్దమో సుశబ్దమో విమర్శకులు గ్రహింపలేదు. ఏల యన "అధస్" అనుదానిలోఁ దవర్గచతుర్థవర్ణ మేకాని ద్వితీయవర్ణము లేదు. కనుక వీరు తవర్గ ద్వితీయవర్ణముతో నిచ్చుట తప్పు. ముద్రితపాఠమునుబట్టి తవర్గ చతుర్థవర్ణఘటిత మనుకొన్నచో సూర్యరాయాంధ్రనిఘంటువులోని "అధస్" శబ్దములో గతార్థమగును. వ్రాఁతప్రతులలో,

చ........................వినిపింతు నీకు నేఁ,
గని వినియున్న గోప్యము నగమ్యమునైన యదఃప్రపంచముౕ.

—పాండు, ౨.౨౧౯.

అని తవర్గ తృతీయవర్ణముతో నున్నది. అప్పుడు నిఘంటువులోని 'అదస్' శబ్దములో గతార్థమగును. వ్రాఁతప్రతులపాఠమునందే యర్థము సరిగాఁ గుదురుచున్నది. ఇట్టిచోట్ల విమర్శకులు తగుశ్రద్ధతోఁ బరిశీలనము చేయక సూర్యరాయాంధ్రనిఘంటువుపై నాగ్రహించిన నేమిలాభము ?

ఆదికపి :—పాండురంగమాహాత్మ్యములోని యీపదమును గ్రహింపలే దని యాక్షేపము.

ఉ...............విరించినందనుఁడు...కనియెన్...
సంచితసత్త్వపారసవ శంవను నాదికపిౕ వృషాకపిౕ.

—పాండు, ౨.౧౯౦.

ఇక్కడ "ఆదికపి" శబ్దము "వృషాకపి" శబ్దమునకు విశేషణము. కనుక—ఆదిశబ్ద కపిశబ్దములు చూచికొనిన వానిలో నిది గతార్థమగు ను. ఇట్లే "అయ్యలదొడ్డి" అను మఱియొకపదము లేదని యాక్షేపించి నారు. అది పాం.ను. ౨-౯౨ లో నున్నది. కాని యక్కడఁగూడ నెట్టి విశే షార్థమును లేదు. అయ్యశబ్ద, దొడ్డిశబ్దములు చూచికొనిన వానిలో గతార్థమగును. సరియగు శబ్దములు నిఘంటువులో వదలిపెట్టఁబడినచో నట్టివాని నెవరు చూపినను గృతజ్ఞతాపూర్వకముగా సూర్యరాయాం ధ్రనిఘంటువువారు గ్రహింతు రనియును, ఇట్టి నిర్విశేషసమస్తశబ్దములు గ్రహింప నక్కఱలేదని తెలిసియుండియే మానివేసినా రనియును విమర్శ కలోకము గ్రహించుఁగాక.

ఆరణాలు:—శివరాత్రిమాహాత్మ్యములోని యీపదమును గ్ర హింపలే దని యాక్షేపము.

గీ. త్రిసరకాస్వాదభవమదోద్రేకలహరి
ధరణిదేవుఁ డా వోజ మత్తా వహించి
యారణాలు పఠింపంగ నాలకించి,
శంబరారాతి రతిచేయి చఱచి నవ్వె.

—శివరా, ౩. ౧౪.

ఇక్కడ 'ఆరుణాలు' అనవలెనుగాని 'ఆరణాలు' అనరాదు. ఏల యన, అరుణముతోఁగూడ నాఱుపన్నములు వేదములోఁగలవు. వీనిలో "అరణ్యేఽధీయీత" అని యుండుటచేత "ఆరణ్యకములనియును, అరుణ సంబంధము కలవగుటచేత "ఆరుణము" లనియును వీనికి రెండుపేర్లు వచ్చినవి. 'ఆరుణాలు' అనుటకు బదులు 'ఆరణాలు'అని తప్పుగా వ్యవ హారమునఁ గలదు. అదియే ముద్రాపకులు ప్రమాదవశమున ముద్రిం చినారు. దానిని జూచి మనవిమర్శకులుగూడ భ్రమపడినారు. కనుకనే మ...ఆరుణం, బుల......ఆముక్తమాల్యద. ౩.౧౧. లోను, "ఆరు ణము లనెడు భాగములలో" అని వేదం వేంకటరాయశాస్త్రిగారి వ్యా

ఖ్యలోను గలదు. మొదటిసంపుటమున లేని 'ఆరుణము', 'ఇరుచఁబడు' మొదలగు శబ్దములను రెండవ సంపుటమున ననుబంధమునఁ జూపఁ దలఁచి సుమారు రెండుసంవత్సరములకుఁ బూర్వమే ప్రత్యేకముగా నొక యనుబంధము తయారుచేసి యుంచినాము. ఇట్లే దాఁటిపోయిన వానిని పై సంపుటముల యనుబంధములలోఁ జేర్చుచుందుము.

ఎడగర:—ఇది భారతమునఁ గలదనియును నిఘంటువులో గ్రహింప లేదనియును విమర్శకులయాక్షేపము.

సీ. మాకు నీవున్నఁ సమ్మత మేము దీనికి
నీతోడివారము నీవు డస్సి,
యున్నవాఁడవు నిద్రయును లేకయున్న నీ
వెడగరపడియె దీయడవిలోన
నెమ్మి డప్పిదేఱ నిద్రించి... అడరిన
నరిగణంబు గెలుతు వశ్రమమున. —భార. సౌప్తి. ౧.౬౦.

అని వావిళ్ల, ఆనందవారి ప్రతులలో నున్నది. ప్రాఁతముద్రిత ప్రతులలోను, భారతము లక్ష్మీపతిసోమయాజులుగారి వ్యాఖ్యలోను "లేకయున్నది వేగిరపడియెద వేల యింత" అను పాఠము కలదు. ఈ పాఠమును వావిళ్ల, ఆనందవారుగూడఁ బాఠాంతరముగాఁ జూపియున్నారు. కాని యీ పాఠమున నఖండయతి నంగీకరింపవలెను. కవిత్రయములో నిట్టియఖండయతి లేదనియే పాఠములఁ బరిశీలింపఁగాఁ దేలినది కనుక నీపాఠము మంచిది గాదనుట స్పష్టము. ఇఁకఁ దాళపత్త్రి గ్రంథములు పరిశీలింపఁగా "...నిద్రయును లేకయున్నని వెడఁగురుపడియె దీయడవిలోన, నిల్చి డప్పిదేఱ నిద్రించి..." అను సాధుపాఠము కాన్పించినది. కావున దీనిని "వెడఁగురు"గా గ్రహించి యచ్చట నుంచినాము. ఇట "వెడఁగురు" అనునదియే సరియగు రూప మనుటకు

చ. ఉడుగక కన్నునీరఁ గడు నొప్పఁటె, చాయలు చెడ్డకన్నులుꣳ
వెడఁగురువడ్డమోముఁ బటువేదనఁ, గందినయంతరంగముꣳ

బడుగయియున్న మేను నయిభామిని...

—హరివంశము. పూర్వభాగము, ౮.౧౫౫.

ద్వి. అక్కిలిపఱపక యఱగన్నుఁ గొనక,

వెక్కక వీఁగక వెఁడఁగురువడక...—

—పండితారాధ్యచరిత్రము. దీక్షా, ౯౧ పే.

మొదలగు సాధకప్రయోగములు గలవు. ఇఁక "ఎడగర" అనుటకు సరి యగు ప్రయోగ మొక్కటియేనియుఁ గాన్పింపలేదు. కనుకనే సూర్య రాయాంధ్ర నిఘంటువులో నీపదము గ్రహింపఁబడలేదు. ఇట్లు సవిమ ర్శముగాఁ బనిచేయుచుండుటచేతనే సూర్యరాయాంధ్రనిఘంటువు తయా రగుటకు హెచ్చుకాలము పట్టుచున్నది. అట్లుకాక కనఁబడిన దెల్ల గ్ర హించి యేదియో యొక యర్థము వ్రాయుచుండినచో నింతకుఁబూర్వ మే పని ముగిసియుండును.

ఎలపాసెము:—హరవిలాసములోని యీ పదమును గ్రహింప లేదని యాక్షేపము.

ఉ. పల్లియచోటనుండి యెలపాసెము నవ్కులుఁ జక్కిలంబులున్ ...సం బివియ్యములు... కుమారసెరియాళునకున్ గొనితెచ్చి రర్మిలిన్.—

—హర, ౨.౯౧.

సూర్యరాయాంధ్రనిఘంటువులో "ఎల[1]"లో "అభినవము" అను నర్థము సోదాహరణముగా నిచ్చియున్నాము. అందుచేత నీపదము దానిలో గతార్థమగును. "ఎలపాసెము=అభినవపాయసము, క్రొత్తగాఁ జేసిన పరమాన్నము" అని యర్థము. పర్యుషితపాయసము భక్షణా ర్హము కాదని ధర్మశాస్త్రములో నుండుటచేత శ్రీనాథుఁడు పాసెము నకు 'ఎల' అను విశేషణము నుపయోగించినాఁడు. మఱియు నిక్కడ "ఎలప్రాసఁగుటక్కులు" అను పాఠాంతరము కలదు. అప్పు డీ పదమే లేదుగదా. "ఎలప్రాసఁగు టక్కులు=క్రొత్తప్రాసంగుధాన్యపుటడుకులు" అని యర్థము. కనుక నిదియు గ్రహింప నక్కఱలేదు.

అయదము:—హారవిలాసములోని యీ పదము నీయలేదని యాక్షేపము.

క. హయముల నూరుసవర్ణము
లయుతంబు వహింప సూతుఁడై మాతలియు
న్నియమింపఁ దనరునరదము
నయదము నెక్కింగఁబనిచి హర్షం బెసఁగన్. —హార. ౭-౧౫౧.

నిఘంటువులో "అయము" అనుపదమును గ్రహించి దానిలో "—మంగళము, శుభము" అను నర్థము వ్రాసియున్నాము. "ద" లో (ఇచ్చునది—ఈ యర్థమున సమాసాంతమునసే యుండును. ఉదా:— సుఖదము, దుఃఖదము మొ.) అని చూపఁబడును. ఈవిధముగానే యిట్టి కేవలయౌగికశబ్దముల నన్నిటిని గ్రహించుట యుక్తము. ప్రత్యేకము గా గ్రహింప నక్కఱలేదు.

అధ్వానము:—హారవిలాసములోని యీ పదము నీయలేదని యాక్షేపము.

(రతివిలాపము)

మ. ...ఎన్నండును లేని చందమిది లక్ష్మీపుత్రి నీయందు న
న్నతిదుఃఖాన్వితఁ డించి పోవఁ దగవాయధ్వానపుంబట్టునన్.—
—హార. ౩.౮౬.

"అధ్వానము=ధ్వనిలేనిది, నిశ్శబ్దము" అని యర్థము. ఇది "అ. సం. అవ్య" లో గతార్థము. అక్కడ నఞ్ఞునకు సంబంధించిన విషయము విపులముగా వ్రాయఁబడినది. ఐనను "అధ్వని, అశబ్దము, అరావము, అరవము" మొదలగు నఞ్ సమాసఘటిత శబ్దములనన్నింటి నీయవలయు నన్నచో వానికే యెన్నిసంపుటములైనను జాలవు. కనుకనే వీలయినంత వఱకిట్టి సులభమార్గము లనుసరింపఁబడినవి.

అనాదల:—హారవిలాసములోని యీపదము నీయలేదని యాక్షేపము. హారవిలాసములో నాకీపదము కనఁబడలేదు. ఎక్కడ నున్న దో విమర్శకులు తెలిపినయెడల సమాధాన మిచ్చుటకు వీలగును.

ఇక్కడకు మీరు వ్రాసియుంచుకొనిన శబ్దములకు సమాధాన మిచ్చుటమైనది. విమర్శకులు మఱికొన్ని శబ్దములనిచ్చి వానికిఁగల యన్నియర్థములు నీయలేదని యాక్షేపించినారు. వానిని బరికింపుఁడు.

అయ్య:—"దీనిని శ్రీనాథుఁడు తన శృంగారనైషధములో పురుషసామాన్యవాచకముగాఁ బ్రయోగించినాఁడు. కాని నిఘంటువువారీయర్థమును గ్రహింపలేదు" అని యాక్షేపము.

చ. ............భట్టహర్షునికవితానుగుంభములు
...కొందఱయ్య, లానని కొనిమాడ నేరరు...

—నైష, ౧. ౧౭.

ఇక్కడ విమర్శకుల యర్థము సరియైనది కాదు. "అయ్యలు=పూజ్యపురుషులు" అనియే యర్థము. ఈయర్థము నిఘంటువులో నీయఁబడినది. ఈ ప్రయోగమున మాత్రము వ్యతిరేకలక్షణచే "నింద్యపురుషులు, తెలివితక్కువపురుషులు" అని యర్థము చెప్పుకొనవలయును. ఇట్లు కాక యిచ్చట "పురుష సామాన్య వాచకము" అనిన నింద గమ్యమానము కాదు. ఇట్టివ్యతిరేకలక్షణాలబ్ధార్థములను నిఘంటువునఁ బ్రత్యేకార్థములుగా గ్రహింపరుగాని తత్ప్రయోగము నుదాహరణముగా గ్రహించి నప్పుడు దానిక్రిందఁ జూపుచుందురు; అనఁగా నిట్టి సామాన్యవిషయములను బాఠకులూహించుకొనవలయునని నిఘంటుకర్తల యాశయము. మఱియు "అయ్య" లో "౩. పురుషవాచకము.—వాఁడు." అని యొకయర్థము వ్రాసియుండఁగా నిఘంటువువారు "పురుషసామాన్యవాచకము" అనునర్థము నీయలేదనుట యసత్యము గాదా? పురుషసామాన్యవాచకము లగునయ్యశబ్దము లన్నియు దానికి నుదాహరణములగును. కొన్నిచోట్ల "వాఁడు" అనుశబ్ద మాయర్థమున సరిగా నతుకునని తెలుపుటకై "—వాఁడు" అని చూపినారు. అట్లు కాక యీ రెండును సమానార్థకములే యనుట యిష్టమైనయెడల "పురుషవాచకము, వాఁడు" అని కామాగుర్తుతో నిచ్చియుందురు. "కామాచే విభ

జింపఁబడిన పదములు సమానార్థకములు" అని పీఠికలో వ్రాసియు న్నారు. విమర్శకులు నిఘంటురచయితల యుద్దేశములు సరిగా గ్రహిం పక యాక్షేపించినట్లు వారివ్యాసము స్పష్టము చేయుచున్నది.

"ఆమ్రేడితము, అనుప్రాసము, అధ్యాహారము, ఇత్యాది పద ములను శ్రీనాథకవిచంద్రుఁడు తన వాక్యములలోఁ బ్రయోగించి యున్నాఁడు.

'ఆమ్రేడితమొ కాని యబ్ధిజునకు. —కాశీ. ౪.'

వీనికి లక్ష్యార్థములు చెప్పవలయును గాని శాస్త్రపరిభాషతో నర్థములు పొసఁగవు. కాని నిఘంటుకర్త లాజోలికి పోలేదు" అని యాక్షేపము. కాని నిఘంటువులో "ఆమ్రేడితము" రెండవయర్థముక్రింద

సీ. వీప్సయో కాని పూవిలుకాని సఖునకు
నామ్రేడితమొకాని యబ్ధిజునకు.

—కాశీ. ౪. ౧౯౧.

(ఇట ప్రతిబింబము, సాటి–అని భావము.) అని వ్రాసియుండఁగాఁ గాశీ ఖండములోని "ఆమ్రేడిత" శబ్దమునకు నిఘంటుకర్తలర్థము వ్రాయలే దని విమర్శకులు వ్రాయుట సత్యదూరము. అనుప్రాసము మొదలగు శబ్దములలోఁగూడ నట్లే సప్రయోగముగా నీభావమునే వ్రాయుట న్యాయము. వాని ననుబంధములోఁ జూపితిమి.

అక్షయ్యము:—"ఇది గ్రాసమాత్రభిక్షము అను నర్థమునఁ గాశీఖండమునఁ బ్రయోగింపఁ బడియున్నది. కాని పరిషత్తువారు దానిని చూడనేలేదు" అని విమర్శకులయాక్షేపము. చూడుఁడు :

గీ. హంతకారం బనంగఁ బదాఱుగళ్ళు
గలశభవ! నాల్గుగళ్లు పుష్కల మనంగ,
గ్రాసమాత్రంబుభిక్ష యక్షయ్యమండ్రు,
మానిబృందారక! తదన్నదానఫలము.

—కాశీ., ౫. ౨౧౯.

ఇక్కడ "తదన్నదానఫలము, అక్షయ్యము, అంద్రు" అనియన్వ యింప వలసియుండఁగా "గ్రాసమాత్రంబు భిక్ష, అక్షయ్యము, అంద్రు" అని యన్వయించిన వీరి సమన్వయశక్తికి విద్వాంసులు నిశ్చేష్టులు కావ లసినదే! వీరి సమన్వయమున నాల్గవపాదమున కన్వయము సున్నయే నా? ఆంధ్రభాషలో నిట్టి పాండిత్యముగల మన విమర్శకులు సూర్య రాయాంధ్రనిఘంటువు నాక్షేపించుట యాశ్చర్యకరము. ఇక్కడ మూల మును బరికింపుఁడు.

శ్లో. హంత షోడశభి గ్గ్రాసై, శ్చతుర్భిః పుష్కలం స్మృతమ్
గ్రాసమాత్రా భవే ద్భిక్షా గృహస్థసుకృతప్రదా.

—సం. కాశీ., ౩౫. ౨౦౪.

కూర్మపురాణమునఁ గూడ నీవిషయ మిట్లున్నది.

శ్లో. భిక్షామాహు గ్గ్రాసమాత్ర, మన్నం తస్మా చ్చతుర్గుణమ్
పుష్కలం హంతకారంతు తచ్చతుర్గుణ ముచ్యతే."

మఱియొకవిషయమును జూడుఁడు.

"పరిషత్తువారు ప్రకరణార్థమును గమనింప లేదనుటకు దృష్టాం తముగా మహాభారతపదములనే నాలుగయిదింటిని ఆంధ్రమహాభారత నిఘంటువు సంగ్రహించినవానినుండి యుదాహరింతును.

అగు=ఆధారమగు, ప్రాపగు.

అధికతాపతప్తమైనది నాచిత్త
మొసర నతనితోడ నొకట నునికి
యెన్నఁ డొక్కొ మనకు నిందఱ కగు నాతఁ
డేల మసలెనొక్కొ యిన్నియేండ్లు.—భార. ఆర., 3. ౨౯౦.

ఇచటి అగుధాతువునకు ఆశ్రయమగు అనియే యర్థము చెప్ప వలయును. మూలము చూడుఁడు.

శ్లో. సర్వేషా మాశ్రయోఽస్మాకం రణేఽరీణాం ప్రమర్దితా.

—సం. భార. ఆరణ్య, ౧౪౩. ౧౭.

మూలములోని 'ఆశ్రయ' అనుమాటకే తెలుఁగుభారతమున 'అగు' ప్రయోగింపఁబడినది"

అని విమర్శకులు వ్రాసినారు. వీరియన్వయమున 'ఎన్నఁడో' అనుచోటఁ గ్రియ నధ్యాహారము చేసికొనుటయు, ఈ నూత్నప్రయోగమునుబట్టి 'అగు' ధాతువునకుఁ గ్రొత్తయర్థ మొకటి కల్పించుటయు నవసరములగును. మఱియు సీసపాదములు నాలుగింట నర్జునునకుఁగల గుణవిశేషములు చెప్పి ముగించి మరల నాతని గుణవిశేషమునే యెక్కుడఁ బ్రస్తావించుట స్వారసికముగాదు. కనుక 'మనకు నిందఱ కగుఁగా' వఱకునొక వాక్యముగా నన్వయించినఁ బై దోషము లుండవు. "అగుఁగా = కలుగును" అనియే యర్థము.

మూలమునుబట్టి వీరు కల్పించిన క్రొత్తయర్థమునకు మూల మే మాత్రమును సాధకము కాదు. ఏల యన, ౧౪3-వ యధ్యాయమున ౨౫ శ్లోకములు గలవు. వీనికన్నిటికిని గలిపి యొక సీసపద్యమును భట్టారకుఁడు రచించినాఁడు. అందును గొంతవఱకు మూలమున లేని దానిని జెప్పినాఁడు. ఇట్టిచో సరిగా నీపదమునకే యీతెనుఁగుపదము ప్రయోగింపబడినదని చెప్ప వీలులేదు. అట్లుకాక వీరన్నట్లు

శ్లో. సర్వేషా మాశ్రయోఽస్మాకం, రణేఽరీణాం ప్రమర్దితా
ఆహర్తా సర్వరత్నానాం సర్వేషాం నస్సుఖావహః.

—సం. భార. వన., ౧౪3. ౧౭,

దీని మొదటిపాదమునందలి 'ఆశ్రయః' అనుదానికే 'అగు' తెనుఁగునఁ బ్రయోగింపఁబడిన దనునెడలఁ జతుర్థపాదమునందలి "సుఖావహః" అనుదానికే యేలప్రయోగింపఁబడఁగూడదు? అప్పుడు 'అగు' నకు 'సుఖావహుఁడగు' అను నర్థమునే చెప్పవలయునుగాని, 'ఆశ్రయమగు' అనునర్థమును జెప్పఁగూడదుగదా! ఇక్కడ వీ రేమిసమాధానము చెప్పఁగలరు?. కనుకనే యిట్టి విమర్శనక్షమములుగాని యర్థములు సూర్యరాయాంధ్రనిఘంటువు చెప్పలేదు.

అగు=జీవించు.

వ. నేఁడు రణభూమియందు నర్జునం డొండెఁ ద్రిగర్తులొండెం గావలయు"—భార. ద్రోణ., ౧. ౨౨౦.

ఈ 'అగు' ధాతువునకు 'జీవించు' అనునర్థము చెప్పుటయే సమంజసము. మూలమును జూడుఁడు.

శ్లో. అద్యాస్త్వనర్జునా భూమి రత్రిగర్తాథవా పునః.

—సం. భార. ద్రోణ. ౧౬- ౧౭."

అని విమర్శకులు వ్రాసినారు. కాని యిది "అగు" లోని "౧౮ ఉండు" అను నర్థములో గతార్థమగును, 'రణభూమియందు (కావలయుౝ=) జీవింపవలయునని విమర్శకులు చెప్పినవిధముగా నర్థముచెప్పుట బాగుగా నుండదు. సంస్కృతమున భూమిశబ్దమును భూమిమాత్రపరముగా వాడినాఁడు. దానిని దెనుఁగున 'రణభూమి'యని త్తిక్కన మార్చినాఁడు. కనుక మాటకుమాట-చొప్పునఁ దిక్కన తెనిఁగింపలేదనుట స్పష్టము. ఇఁకఁ దెనుఁగుభారతమునకు—'నేఁడు యుద్ధభూమియందు అర్జునుఁడో త్రిగర్తులో యుండవలయు' ననియర్థము; అనఁగా-అర్జునుఁడు, త్రిగర్తులు-ఇరువురు నుండక ఎవరో యొకరు పాఱిపోవుటయో లేక చచ్చుటయో జరుగవలయు నని భావము.

అంతర్గతము=మనస్సు.

వ. ఇట్లుతని రూపాతిశయంబున కోటువడి చూచుచు నిజాంతర్గతంబున—భార. విరా, ౧. ౨౧౪." అని విమర్శకులు వ్రాసినారు. కాని యీయర్థము నేనిఘంటువులు నీయలేదు. మఱియు నిక్కడ "అంతర్గతంబున=అంతర్గతముగా" అని యర్థము; అనఁగా 'హృదయాంతర్గతముగా' అని భావము. ఇది 'అంతఃకరణము, అంతరింద్రియము, అంతరంగము' మున్నగువానివంటిదికాదు. ఇట్టి ప్రయోగములు నన్నయతిక్కనాదిప్రాచీనకవులలోఁ గలవు. ఇట్లే "ఆత్మగతంబున" అని నన్నయాదులు ప్రయోగించియున్నారు. దానికి 'మనోగతముగా' అని యర్థము

చెప్పికొనవలయునేకాని 'మనస్సులో' అనియర్థము చెప్పరాదు. భారతమున నిట్టివిశేషము లనేకములు కలవు.

"అడరు=వెంబడించు.

చ. అతిరభసంబుమై నడరి యాతనిఁ బట్టిసుశర్మ వెల్చనార్చి...

—భార. విరా, ౩. ౨౦౧.

ఈ 'అడరు'నకు 'వెంటాడి' అనికాదా యర్థము? మూలము తిలకింపుడు.

శ్లో. ప్రమథ్యతిత్వాచప్రసహ్యమత్స్యంవిరాటమోజస్వినమభ్యధావత్.

—సం. భార. విరా, ౩౫.౫."

అని విమర్శకులు వ్రాసినారు. కాని యీయర్థము సరియైనది కాదు. పై పద్యమునందలి 'అడరు'నకు "(యుద్ధమున) కవియు," అని యర్థము. ఈ యర్థము సూర్యరాయాంధ్రనిఘంటువులోఁ గలదు. వీరు ప్రమాణముగా నిచ్చిన మూలమునకును బై పద్యమునకును సంబంధ మేమియును లేదు. మూలము సుశర్మ విరాటునితో యుద్ధముచేయుటకై వచ్చుటను జెప్పుచున్నది. తెనుఁగుపద్యము కొంతవఱకు సుశర్మతోఁ బోరాడి విరథుఁడైన విరాటుని సుశర్మ పైఁబడి పట్టుకొనుటను జెప్పుచున్నది. ఈ పద్యభాగమునకు మూల మిది.

శ్లో. సుశర్మా...విరథం మత్స్యరాజానం జీవగ్రాహ మథాగ్రహీత్.—సం. భార. విరా, ౩౫.౧౧. వీరు చూపిన మూలమున "మత్స్యం" అని కలదు. అది సరియైనది గాదు. కనుక "మత్స్యాః" అని యుండవలయును. ఇట్లున్న నే యర్థము సరిగాఁ గుదురును. ఈపాఠమే గ్రంథములోఁగూడ నున్నది. ఇఁక "అభ్యధావత్" అను దానికి "వెంబడించు, వెంటాడు" అని యర్థము చెప్పుట మిక్కిలి తప్పు. "ఎదురుగాఁ బరువెత్తెను" అని యర్థము చెప్పవలయును. సూర్యరాయాంధ్రనిఘంటువులోని "అభి" లోఁ జూచికొనిన "అభి"కిఁ గల యర్థములు విశదము కాఁగలవు. ఇట్టి స్వల్పవిషయములను గూడ గమనింపక వీరిమిత్రు

లు మహాభారతమునకు నిఘంటువును వ్రాయుటయును, సూర్యరాయాంధ్రనిఘంటువునుగూర్చి సంతసింపని విమర్శకులు దానినిగూర్చి సంతసించుటయును విస్మయకరములే.

ఇంకొక్క మాట. "ఈలఘువిమర్శనమువలన పరిషత్తువారి బృహన్నిఘంటువులో పస యెంత గలదో పాఠకు లూహింపఁ గలరు" అని విమర్శకులు వ్రాసినారు. నిజమే! ఈ విమర్శపరామర్శమును జూచినఁ బరిషత్తువారి బృహన్నిఘంటువులోఁ గల పసయును, దానిపై వ్రాసిన వ్యాసములోని బలహీనతయును స్పష్టము కాఁగలవు.

# గ్రంథస్వీకారము.

---

## 1. ఆంధ్రవ్యాకరణసారము మొదటిపుస్తకము.

రచయితలు:—వ్యాకరణ విద్యాప్రవీణ, ఉభయభాషా ప్రవీణ ఆకెళ్ళ శేషాద్రి గారు, వ్యాకరణ విద్యాప్రవీణ ఉభయ భాషా ప్రవీణ ఓరుగంటి నీలకంఠశాస్త్రి గారును

ఇయ్యది సులభమగు శైలిని వ్రాయఁబడినది. ప్రశ్నోత్తరముల నుండి సూత్రముల రాఁబట్టుపద్ధతి (Inductive Method) లో నీగ్రంథము వ్రాయఁబడుటచే, వ్యాకరణమన్న మిక్కిలి విసుగుఁ జెందెడి బాలురకు వ్యాకరణశుద్ధముగ వాక్యములరచించుట కత్యంతోపయోగియై యున్నది నేఁటిదినములలోఁ బ్రసిద్ధులగు వ్యాసరచయితలుగూడ నక్షరవిన్యాసమునఁ దాఱుమాఱులు చేయుచున్నారు. గ్రంథాంతమున సమకూర్చిన తప్పొప్పులపట్టిక బాలురకు మార్గదర్శి యగుచున్నది. ఇందు 70 పుటలున్నవి. వెల 0-5-0 మాత్రమే క్రమముగ నితరభాగములనుగూడ నచ్చొత్తించి ప్రచురించినచో నిట్టిగ్రంథములు బాలురకు మిక్కిలి యుపయోగకరములుకాఁగలవు.

2. తఱిదాలుపుదళసరి మొదటిపాలు. ఈయచ్చతెనుఁగు ప్రబంధము పోతాప్రగడ కృష్ణమూర్తిపంతులుగారిచే రచింపఁబడినది. ఇందలి యితివృత్తము వెన్నెలకంటి సూరనార్య ప్రణీతంబగు విష్ణుపురాణము నుండిగ్రహింపఁబడినది. కథావిన్యాసమం దచ్చటచ్చట మార్పులున్నను మూలమున కచ్చతెనుంగునుడులతో ననువాదముచేయఁబడినది. ఒకటి రెండుపద్యములఁ జవిచూడుఁడు.

“వ. సర్వభూతమయుండైన వాసుదేవునిమాయాశక్తి లక్ష్మీరూపంబున నతనికి సహాయయై విహరించుం గావున జగంబులకు సంపత్కరంబు

లైన పరికరంబు లెన్ని గల వన్నియును శ్రీ చిహ్నంబులని చెప్పి మఱియు నిట్లనియె." అను విష్ణుపురాణవచనమున కిందలి యనువాదము.

ఉ. బూతము లెల్లఁ దానయిన ప్రోడఁడు వెన్నుఁడు లచ్చిరూపుతోఁ
దాత యొనర్చు పన్నికకుఁ దాఁ దనమాయపుసత్తిఁ బూనుటన్
గాఁతియు నెల్లవారలకుఁ గల్మియునున్ బ్రతుకున్ సుగంబుమేల్
చేతపులం దగన్ హితవు సేసెడు మట్లవి లచ్చిచిన్నియల్.

త॥ ద॥

ఉ. ఏమిటి కింతదుఃఖమున నేడ్చెదవుత్తమలీల నుత్తముం
డీమహనీయ భూవలయమేలుచు రాజ్యముసేయనిమ్ము త
ల్లీ మనుజేంద్రుఁడిట్టిసిరి యెవ్వనిచే మునుగాంచె నవ్విభుం
డేమి యనుగ్రహించి మన కీఁడొకొ యీపరిపాటిసంపదల్.

వి॥ పు॥

ఉ. ఏమిటి కింత వంతగొని యేడ్చెద వుత్తముఁ డొప్పమీఱఁ దా
నేమగఁడౌచు నీ పుడమి నేలఁగ నిమ్ము కొంత లేదు త
ల్లీ మన కింతలోఁ బుడమియేలిక యెవ్వనిచేత నీసిరుల్
తా మును గాంచె నాపబువు తా నిడఁడో మనకిట్టికల్ములన్.

తరిదాలుపుదళసరి.

మొట్టమొదట నచ్చతెనుఁగుపదములతోఁ గ్రుచ్చఁబడిన యీ కైతయందు రానురా నాదళసరి తగ్గినట్లగపడును. కాని గ్రాంథికభాష యన నేవగించెడి నేఁటిదినములలోఁ గూడ వీర లిట్టియచ్చతెనుఁగుకైతనాంధ్రభాషామాత కలంకారముగా నొసంగుట శ్లాఘనీయము.

వ. అదియునుం గాక ౪౧౩

గీ. బొంకువలన మనుజపుణ్యంబు నశియించు
బొంకువలన సిరియు బుద్ధి పోవు
బొంకువానిఁ గనుచు బుధులు నిందింతురు
గాన బొంకు దగదు ఘనుల కెచట. ౪౧౪

గీ. మునిమనోరథంబు మున్ను గూర్చెదనని
యతఁడు రాము ననుపు మన్న వెన్కఁ
బనుప ననుచుఁ బల్కఁ బాడియే నీ కది
గాన రాము ననుపు మౌనితోడ. ౪౧౫

క. అని బోధింప వసిష్ఠుని
ఘనతరకల్యాణసూచకములగుపలుకుల్
విని మనుజవరేణ్యుఁడు దన
తనయుని మునితోడ ననుపఁ దగ నూహించెన్. ౪౧౬

వ. అంత నర్ధరాకాంతుఁడు తద్వృత్తాంతం బంతయుఁ గులకాంతయగు కౌసల్యాకాంత కెఱింగింప నక్కుటిలకుంతల కొంతసేపు చింతాక్రాంతస్వాంతయైన, నేకాంతంబున శాంతవచనము లాడుచున్నంత. ౪౧౭

గీ. ధరణిఁ గతకంబు పంకిలోదకము నిర్మ
లంబుఁ జేసినగతి సరసంబుగాఁగఁ
దనదు వచనాలి దారచిత్తంబు దీర్ప
సంతసంబునఁ బొంగి యజ్ఞపవిభుండు. ౪౧౮

వ. రామలక్ష్మణులం బిలిచి, వసిష్ఠాదిమునులవలనను, సకలభూసురోత్తములవలనను బుణ్యాహవాచనంబులు చదివించి, భద్ర వాద్యనిస్వనంబులు చెలంగ లసద్రూపయగు భార్యయుం దానును గుమారుల దీవించి, గాఢాలింగనపూర్వకంబుగా మస్తకాఘ్రాణంబు గావించి, విశ్వామిత్రుం గాంచి, 'గాధినందనా! యానందకరులగు నానందనులు నేఁటినుండి భవదధీనులు' అని పల్కి, యతని కరకమలంబునం దనూజకరసరోజంబు లునిచి, యప్పగింప నప్పుడు. ౪౧౯

క. పరిమళయుతమై మారుత
మరుదుగ వీచెన్ సుపర్వు లట సుమవృష్టిన్
గురిసిరి నిర్జరదుందుభి
దరరవములు వినఁగవచ్చె దఱుచుగ మింటన్. ౨౨౦

సీ. రామలక్ష్మణు లంత రయమున దశరథు
పాదాంబుజములకు భక్తి మ్రొక్కి
ఘనవసిష్ఠాదిసన్ముని జనంబులకును
మన మలరార నమస్కరించి
రమణీయమణిగణరాజితతపనీయ
భూషణధారణస్ఫూర్తిఁ దనరి
యతులకృపాణబాణాసనపాణులై
చరమాంగబద్ధనిషంగు లగుచు

గీ. కవచములఁ బూని బిరుదసంకలితు లగుచు
పౌరజనలోచనానందకారు లగుచు
గాధినందనమునితోడఁ గరము వేడ్క
ననుగమించిరి తపోఘనవనము సేరన్. ౨౨౧

క. చెన్నుగ మునితో నేనిక
గున్నలవలె నడుచు నృపతికొమరుల యందం
బెన్నఁగ వశమే తిన్నగఁ
బన్నగపతికైనఁ బద్మభవునకునైనన్. ౨౨౨

వ. ఇట్లు కౌశికానుచరులగు నా రాకుమారులు కస్యపమునీంద్రుపిఱుంది నడుచు నింద్రోపేంద్రులచందంబున సాంద్రతరతేజోవిశేషభాసితులై, చూచువారలకు నేత్రోత్సవము సేయుచు, సార్ధయోజనదూరం బఁగి, సరయూదక్షిణకూలంబునం బ్రవేశింప, విశ్వామిత్రుండు రామచంద్రున కిట్లనియెను. ౨౨౩

క. ఆయతభుజ! విను ఘనవి
ద్యాయుగళము నిత్తు నీకు నావిద్యలచే

శ్రీయును ధీయు నపాయమ
మేయబలం బెపుడు నీకు మేలై యుండున్. ౪౨౪

గీ. ఆకలియు దూప యలయిక సోఁక కుండు
శౌర్యధైర్యగాంభీర్యాదిసద్గుణములు
నిలుచు మిక్కిలి నీయందు నీతిభూతి
లోకములయందు నీసరి లేక యుండు. ౪౨౫

క. బల యతిబల యనఁగాఁ దగి
యిల సన్నుతిఁ గాంచినట్టి యీవిద్యలు నీ
వెలమిని గైకొనఁగా జల
ముల శుద్ధి వహించి రమ్ము మునిహితచరితా. ౪౨౬

వ. అనిన విని రామచంద్రుండు పవిత్రోదకంబులు వార్చి వచ్చినఁ, గౌశి
కమునీంద్రుఁ డవ్విద్యల నుపదేశించి మఱియు నిట్లనియె. ౪౨౭

శా. ఈవిద్యాయుగళంబు మార్గముల నీ వేతెంచుచో నాత్మలో
భావింపన్ దనుపుష్టిఁ గూర్చుఁ బ్రబలాపన్నాశముం జేయు న
ద్దేవారాతుల నాజిలోన భుజశక్తిం గూల్తు వో రాఘవా!
యేవేళన్ నిను రక్షసేయు నిఁక నీ కెవ్వారలుం దుల్యులే. ౪౨౮

క. నలినాసనుని తనూజలు
బలవతు లీవిద్య లనుచుఁ బరమమునీంద్రుం
డలరుచుఁ దెలిపిన రఘువరుఁ
డెలమిని దన యాత్మలోన నిటు లూహించెన్. ౪౨౯

గీ. ప్రబల యతిదత్త మీబలాతిబల లనఁగఁ
దనరు చున్నట్టి చారువిద్యాయుగంబు
"ప్రబలయతి ఖలు మా మిదం ద్వయము" మటంచు
నెంచి తత్పఠనంబున మించి యపుడు. ౪౩౦

వ. ఆమునివర్యునకు నమస్కరించి గురుసపర్య లొనరించి యున్నంత ౪౩౧

గీ. పద్మినీకాంతనోములపంట విరహి
చక్రవాకాభిలాషముల్ సంఘటించు

దంట చీఁకటిగములను గెంటు జాణ
తరణి పడమటిగుబ్బలిమరుఁగుఁ జేరె. ౪౩౨

క. జవమున గరు లల్లార్చుచు
దివిఁ బరువులు వెట్టి బారుదీర్చుచుఁ దమలోఁ
గువకువ గూయుచు ఖగముల
నివహంబులు గూళ్లు చేరె నెఱి నవ్వేళన్ ౪౩౩

సీ. అంధకారాత్యాహ్వయం బుచితం బన
హారువిధంబున స్వయంవ్యక్త మగుచు
ఘనతమోనామంబు గనుట యుక్త మనంగ
స్వర్భానుకరణి సుశ్యామ మగుచు
సర్వమహా తిమిరాఖ్య యంచు వచింపఁగా
జలరాశిభాతి విస్తార మగుచుఁ
దగుచు తమిస్రాభిధానం బనఁ ద్రియామ
పగిది నిశాచర భయద మగుచు

గీ. సకల వస్తువితానంబులకును దనదు
రూప మొసఁగుచు జనదృష్టిరోధమగుచు
జారచోరాభిసారికాస్వాంతహృద్య
మగుచుఁ జీఁకటి జగ మెల్ల నాక్రమించె. ౪౩౪

చ. చలమునఁ దాల్చు నవ్యనిమిషత్వము మా కెనగాఁగ మీనులం
చలుకను వేల్పు లభ్రధునివంబుచరంబులఁ బట్టి వైచు పె
న్వల యనఁగా నభంబు గనవచ్చె వలంబడి సాధ్వసంబునన్
జలనము నొందు బేడిసలచందమునం గనుపట్టెఁ దారకల్. ౪౩౫

వ. అనంతరంబ. ౪౩౬

క. రాజితకమలాహితపద
రాజీవవరుండు విబుధరాజనుతుండున్
గోజితకవివిలసద్ద్విజ
రాజుదయించెన్ గళాభిరామం బగుచున్. ౪౩౭

గీ. విరహిజనముల బాధింప వెలయ ననుచుఁ
గంతుఁ డఖిల మెఱుంగ సభాంతరమున
ప్రేలఁ గట్టించినట్టి మేల్వాండిఘంట
నాఁగ నొప్పారె యామినీనాయకుండు. ౪౩౮

సీ. పగలు మరంద మింపుగ మాకు నొసఁగు రా
జీవముల్ ముకుళింపఁ జేసినట్టి
కడలిబిడ్డఁడు మమ్ముఁ గరుణఁ బోషింపఁడే
యటు గాక యున్న రాజనఁగ నతఁడు
వెలయునే గాన నిర్వేళ మరందాధి
కంబైన మధురామృతంబు మాకు
నిచ్చు నమ్మహితాత్ముఁ డెన్నఁగా సారంగ
ధరుఁడు కావున మమ్ముఁ దాల్చు నింక

గీ. నబ్జసాంగత్య మెప్పటి కబ్బ ననుచు
మానుగా సుధఁ గ్రోలంగఁ బైని వ్రాలు
మధుపములబృంద మన చంద్రమండలమున
చారుతరలీల భవ్యలాంఛనము దనరె. ౪౩౯

గీ. పాండువేదండ శుండీరపుండరీక
కుండలీంద్రాల నిరసింపుమండి ధరణి
మండలము వెండికతి నొప్పనుండఁ జేసి
పండువెన్నెల రోదసి నొప్పుచుండె. ౪౪౦

వ. ఆసమయంబున, ౪౪౧

సీ. ఒకమాఱు తగఁ దీర నొప్పుగాఁ జంద్రికాం
కురము లాంతురతచేఁ గ్రోలుచుండి
యొకతూరి తుహినాంశు నొద్ద కేఁగఁ దలంచి
బారులై దివి కొంతదూర మఱిగి
యొకపాలి తమచెంత నున్న కాంతల కిచ్చుఁ

దేటవెన్నెలకొనల్ దెచ్చి యిచ్చి
యొకసారె మాభాగ్యనికర మేమన వచ్చు
నంచు హెచ్చుగ మెచ్చుకొనుచు నుండి

గీ. కౌముదమునకుఁ బోలె మాకౌముదంబు
'కౌముదం కస్య న కరోతి' కౌముదీయ
మంచు నిజకాంతలను గౌఁగిలించుకొనుచు
మంచిగఁ జకోరముల్ విహరించుచుండె. ౪౪౨

వ. అట్టి రాత్రియందుఁ గౌశికదాశరథులు తృణకల్పితశయనంబుల
నిద్రించుచుండ నిశాంతం బగుటయు. ౪౪౩

క. ప్రాగంగన దొడవుల నను
రాగంబునఁ బూనఁ దలఁచి రహిఁ దొలుత సిగన్
బాగుగ నునిచిన కెంపుల
రాగిడి యనఁ దూర్పునందు రవి యుదయించెన్. ౪౪౪

ఉ. కాంతుఁడు పాణిపంకజయుగంబునఁ బెన్ గిలిగింత వెట్టఁగా
సంతస మంది నవ్వగను జవ్వనికై వడి నూతనోదయ
ధ్వాంతవిరోధిభానుకలితభ్రమతవిస్ఫుటపుండరీక స
త్కాంతిసరోజినీరమవికస్వరవృత్తి నెసంగె నత్తఱిన్. ౪౪౫

వ. అంతకు మున్ను గాధేయమునిప్రబోధితులగు రామలక్ష్మణులు
ప్రభాతకాలానుష్ఠానంబు లాచరించి, విశ్వామిత్రునకు నమస్కరించి
కృతప్రణాములై కొంతదూరం బరిగి, భాగీరథిం గాంచి, యచ్చట
సరయూతటంబున నొక్క పరమతపోవనంబుం గనుంగొని, రామ
చంద్రుం డిప్పుణ్యాశ్రమం బెద్ది యని మునివర్యు నడిగిన నతండిట్ల
నియె. ఇది కామాశ్రమం బిచ్చటఁ దొల్లి శంకరుం డుగ్రతపో
నిష్ఠాగరిష్ఠుండై యుండఁ, గందర్పుండు దేవహితార్థంబుగా భవునకు
భవానిం గూర్తునని యుల్లంబునం దలంచి, కుసుమశరంబు లతని
పయిం బరఁగింప ఫాలాక్షుండు కుపితుండై, తృతీయలోచనంబున

నతని నిరీక్షించిన, నతనియంగంబు భూతలంబునం బడుటం జేసి కాముం డనంగుండు నాఁ బరఁగె. నాటం గోలె నీదేశం బంగసంజ్ఞం బ్రవర్తించె, నిచ్చట నాకు శిష్యులగు మునులున్న వార, లీయుభయసరిన్మధ్యంబు పుణ్యాలవాలంబును నివాసార్హంబునుఁ గావున నిచ్చట స్నానసంధ్యాజపహోమాదులయిన యాహ్నికవిధానంబు లొనర్చి, యీరాత్రి యిచ్చట నుండి, రే పిమ్మహానది నతిక్రమింత మనుచుండ నంత, ౨౨౬

క. అచ్చటి మును లచ్చోటికి
వచ్చి మునీంద్రునకు భక్తి వందనములు దా
రచ్చుగఁ జేయుచు వినుతులు
మచ్చిక నొనరించి యంత మహితాకృతులన్. ౨౨౭

వ. రామలక్ష్మణులం గాంచి, యుచితసత్కారంబు లొనర్చి, వారల నిజాశ్రమమునకుం గొనిపోయినఁ, గౌశికదాశరథులు విహితసాయంకాలవిధానంబులు సల్పి, యారాత్రి యచ్చోట వసియింపఁ వేగిన మఱునాఁ డమ్మునులు జాహ్నవీతీరంబునకు వారిం దోడ్కొని వచ్చి, యోడ వెట్టించి, మీ రింక వేంచేయుం డనిన నట్లకాక యని మునివరుల వీడ్కొని, ౨౨౮

గీ. తరణిసన్నిభ తేజు లత్తరణి నెక్కి
యమ్మహానది దాఁటుచో నవనిపాల
సుతులు మునిపతిఁ గాంచి యచ్చోట భూరి
రవము వినవచ్చు నిది యెట్టి రావ మనిన. ౨౨౯

సీ. కౌశికుం డిట్లను కైలాసభూధరం
బున నొక్క కాసారమును విరించి
మనమున నిర్మింప మానసం బనఁ దగి
ఘనతరవిఖ్యాతిఁ గాంచె నందు
వలన సంజాతమై వఱలు నీ సరయువు

సాకేతపురిచుట్టు సంచరించి
జాహ్నవితోఁ గూడఁ జనుదెంచె నిచటికిఁ
గాన గంగాసరయూనదులకు
గీ. సంగమం బయ్యె నిచటఁ దద్భాగసమితి
చెలఁగి యొండొంటిఁ దాఁకినఁ జిత్రముగను
బోడము ఘోషంబు లివి యని పొసగఁ జెప్పి
మఱియు వారలఁ బల్కె నమ్మౌనివరుఁడు. ౨౫౦

వ. ఇమ్మహానదుల దర్శనస్పర్శనంబులు మానవులకు భోగమోక్షప్రదంబు లగుం గావున భక్తిభావంబున నమస్కరించుం డనిన వినయంబున మ్రొక్కుచు నవ్వాహిని నతిక్రమించి, దక్షిణతీరంబునం బ్రవేశించి, తత్సమీపంబున సాల రసాల తాల హింతాల పాటల మధూక వేణు బద రామలక జంబూ జంబీర పన సాశ్వత్థ కపిత్థ నారికేళ వట ప్లక్ష ప్రముఖానేకానోకహావృతంబును, కంక గృధ్ర బక కాకాది ఖగనిస్వనాకీర్ణంబును, సింహశరభ శార్దూల సూకర శుండాల ఖడ్గ భల్లుకాదిమృగకులసంకులంబును, దుర్జనహృదయంబునుం బోలె దుర్గమంబును, అంధకారంబునుం బోలె దుర్నిరీక్ష్యంబును నగు నొక్క మహారణ్యంబుఁ గనుఁగొని, రఘువరుండు మునివరున కిట్లనియె. ౨౫౧

క. మునివర దుర్గమ మీకా
నన మెద్ది యనంగ గాధినందనుఁ డా రా
ముని గుణయుతుని గనుంగొని
విను మని యిటు చెప్పఁ దొడఁగె విస్ఫుటఫణితిన్. ౨౫౨

క. గోత్రారి మున్ను కడిమిని
వృత్రాసురవిపులబాహువిక్రము దునుమన్
సుత్రాముని విమలంబగు
గాత్రంబున బ్రహ్మహత్య కడువడిఁ గదిసెన్. ౨౫౩

వ. అంత, ౪౫౪

గీ. సురలు మునులు వచ్చి శుద్ధోదకంబులు
తెచ్చి దివిజనాథు దేహ మెల్లఁ
గడిగి యతనిమేనఁ గదిసిన మలకరూ
శములు భూమి వైవ సరభసమున. ౪౫౫

సీ. అమరనాథుఁడు నిర్మలాంగుఁడై సూర్యుని
కైవడి తేజంబు గాంచి మున్ను
తనశరీరమునందుఁ దార్కొని యున్నట్టి
మలకరూశంబులు మహి వహింపఁ
గని విస్మయం బంది కరుణాసమేతుఁడై
మలయుక్తదేశంబు మలదమును గ
రూశయుతంబుఁ గరూశదేశంబును
గాఁగ సంజ్ఞలఁజేసి ఘనత మీఱు

గీ. చుండ నీ రెండు దేశంబు లుండు గాత
ననుచుఁ బల్కినఁ దత్కాలమాదిగాఁగ
విమల మలదకరూశదేశములు భూరి
సంపదలఁ జెంది యుండె నుతింపఁబడుచు. ౪౫౬

వ. అట్లు కొంతకాలం బరిగిన, ౪౫౭

గీ. తాటక యనంగ నొక్కతె దనుజకాంత
కరిసహస్రబలాన్విత గలిగె భువిని
దానికొమరుండు మారీచదానవుండు
శౌర్యకంపితగీర్వాణసంచయుండు. ౪౫౮

వ. అద్దురాత్ముఁడిద్దేశంబులకు నాశంబు సేయం గోరి మార్గంబుల నిరోధించుచు, జనంబుల వధింపుచు, గోవృషభమహిషాదిచతుష్పదంబులం బట్టి హింసింపుచుఁ బెక్కుగతుల బాధింపుచుండ, నిప్పురంబులు నిర్మనుష్యంబు లగుట మహారణ్యంబై మార్గంబు గానరాకుండె,

నిచటికి గవ్యూతిమాత్రదూరంబునఁ దాటక యుండు, నచ్చోటికి మన మరిగినపిమ్మట నక్కుటిలనిశాటిం దునిమి యజ్జనపదంబుల నెప్పటియట్ల బహుజనధనధాన్యసంపన్నంబులం జేయు మిక్కార్యంబు నీకుఁ దక్క నితరుల కసాధ్యం బని చెప్పిన రామచంద్రుండు విశ్వామిత్రున కిట్లనియె. ౪౫౯

క. తాటక యనుబోటికి నెటు
వాటిల్లె సహస్రమత్తవారణబల మో
హాటకగర్భసమాన వ
ఘాటులు పరికింప మిగుల దుర్బలులు గదా. ౪౬౦

వ అనిన మునివరుం డిట్లనియె. ౪౬౧

ఆ. వె ధర సుకేతుఁడనఁగఁ దనరారు నొక యక్షుఁ
డతఁ డపత్యరహితుఁడై విరించిఁ
గురిచి తపముఁ జేసి కూఁతు దాటక నాఁగఁ
గరిసహస్రసత్త్వఁ గనె వరమున. ౪౬౨

వ. అనంతరంబ కొంతకాలంబునకు, ౪౬౩

క. పొందుగ నత్తాటకయను
సుందరికిం బెండ్లి సేయఁ జూచి యతం డా
నందమున జంభసుతుఁడగు
సుందునకు నొసంగెఁ గూఁతు శోభనలీలన్. ౪౬౪

వ. అంత. ౪౬౫

సీ. సుందుండు తాటకయందు మారీచాఖ్య
నందనుఁ గని మృతిఁ జెంద నదియుఁ
గొమరుండు దానును గుంభసంభవమౌనిఁ
గని భ్రమింగ నూహించి కదియ నతఁడు
గనుఁగవచే నగ్నికణములు రాల్చుచుఁ
గడు కోపమున వారిఁ గలయఁ జూచి

రాక్షసకృత్యంబు రయమునఁ జేయంగఁ
గడిసిన వారలు గాన మీఁకు
రక్కసులు గం డడంచును వైకసమగు
శాప మొసఁగిన వారు నిశాచరులయి
చెలఁగి యిక్ష్వాకసముగ మెలఁగుచుందు
ర ర్క కులదీప ! భువనసమ్యక్ప్రతాప ! ౪౩౩
వ. కావున. ౪౩౪
చ. సకలజగద్ధితంబుగ నిశాచరి నాజి వధింపు రామ తా
టక ధరఁగూల్పఁ గల్గు పొగడందగుకీర్తి, మనంబులోఁ బొలం
తుక వధియింపఁ గూడ దతిదోష మటంచుఁ దలంపరాదు మున్
బ్రకటగుణాంచితుల్ కుటిలభామినులన్ వెగఁజూడఁ గానమే. ౪౩౫
గీ. కలన వీరుని గని ధైర్యకలన బల్మి
బెట్టుగాఁ జూపి మాయలఁ బెట్టునట్టి
దిట్ట యది యైన బ్రతుకలే దిట్టలమగు
నీపరాక్రమమున నవనీప రామ ! ౪౩౬
క. అనవుడు రఘువరుఁ డిట్లను
మునినాయకుఁ జూచి లోకములు ముద మందన్
ఘనశరముల నీతాటకఁ
దునుముదు సందియము లేదు దురితవిదూరా ! ౪౩౭
క. నీయుక్తి పంక్తిరథభూ
నాయకవచనంబుగతి వినందగు నాకున్
ధీయుత ! నీతో నే దై
తేయుల భువిఁ గూల్ప నేఁగుదెంచితిని గదా. ౪౩౮
చ. అనుచు రఘూద్వహుం డతిరయంబున సింజిని వింటఁ గూర్చి ప్ర
క్షన మొరయింప నవ్విపులఘోషము నల్దెసలందుఁ బర్వుచున్
మనుజసురాసురాదుల మనంబులఁ దల్లడ మందఁ జేసె న
వ్వననిధులుం గలంచె కులపర్వతముల్ వడకించె నంతటన్. ౪౩౯

క. ఆనాదము చెవిఁ బడఁగా
దానవి దా నని కి మదిని ధైర్యం బెంతేఁ
బూనుచుఁ గోపాన్వితమై
యానినదముఁ బట్టి చనఁగ నాత్మఁ దలంచెన్. ౪౭౩

వ. ఇట్లు దలంచి ౪౭౪

క. పదఘట్టనముల మేదిని
గదలఁగఁ బెంధూళి దిశలు గప్పఁగ వడి రా
నొదవిన గాలిని మబ్బులు
చెదరఁగఁ బఱతెంచె రాముచెంతకు నంతన్. ౪౭౫

సీ. అంజనభూధరం బన నల్పు మీఱుచు
నధికపటా మేనితో నమరుదాని
బలుకొండగుహనాఁగఁ బొలుపారు చున్నట్టి
ఘన వివృతాస్యంబు గలుగు దాని
గండస్థలంబులదండ వ్రేలాడు క
పాలకుండలములఁ గ్రాలుదాని
శవకోటి దండగా సంధించి మొలచుట్టు
గట్టిగాఁ గట్టుకొన్నట్టి దాని
నస్థిమాలిక లఱుత వ్రేలాడుదాని
గొప్పమిడిగ్రుడ్లు గిరగిరఁ ద్రిప్పుదానిఁ
జెలఁగి దిక్కులు పగుల గర్జిల్లుదాని
తాటకిని గాంచి రవ్వేళ దాశరథులు. ౪౭౬

వ. అంత రామచంద్రుండు లక్ష్మణుం జూచి యిట్లనియె. ౪౭౭

గీ. అఖిలజనభీకరాకార మైనదాని
నధిక దుర్గంధయుత గాత్రమైనదాని
దానవిని దీనిఁ జూచినధరణిలోన
జ ఉవకుందురె యెటువంటి వీరులైన. ౪౭౮

క. వనిత యిది గాన చిక్కిలి
కనికరమగు, దీనిఁ జంపఁగా రా దిఁక ము
క్కును జెవులుఁ గోసి విడిచెద
దనుజాంగన కిదియ శిక్ష తమ్ముఁడ తలఁపన్. ౪౭౯

క. అని పల్కుచుండ నాలో
దనుజాంగన రేణువారిదంబులు మింటన్
బనివడి పన్ని రజంబులు
మనుజేంద్రమునిమీఁదఁ గురిసె మాయాశక్తిన్ ౪౮౦

వ. మఱియును. ౪౮౧

సీ. తాటక యొక్క ముహూర్తముదాఁకఁ దనమాయ
కతన నిశ్చేష్టులుగా నొనర్ప
నంత రాఘవుఁడు మాయాస్త్ర మేయుచు దాని
మాయ మాయింప నమ్మగువ వేగ
నురుశిలావర్షంబు గురియంగ సాయక
వృష్టిచే ధారుణీవిభులు శిలల
వాన మాన్పించి రవార్యుఁడై రాముండు
శరములచే దాని కరయుగంబు

గీ. దునుమ బీరంబుచెడి ప్రోలఁ దొట్రుపడుచు
నార్పులిడుచుండఁ గనుఁగొని యమితసత్వ
శాలి లక్ష్మణుఁ డధిక శరాళి నసుర
కామినీకర్ణనాసికాగ్రములఁ ద్రుంచె. ౪౮౨

క. అంతటఁ దాటక గనలుచు
నంతర్ధానంబు నొంది యవ్విభులపై
వింతగతి నుపలవర్షం
బెంతేఁ గురియంగఁ జొచ్చె నే పడరంగన్. ౪౮౩

వ. అప్పుడు కౌశికమునీంద్రుండు రామభద్రున కిట్లనియె. ౪౮౪

క. రామా! యీ దుశ్చారిణి
కామిని యని నీవు మదిని గరుణింపంగా
రామా! దానికి మనపై
సామిశిలావృష్టిఁ గురియసాగెను గంటే. ౫౧౫

సీ. కాన నధ్వరవిఘ్నకారిణి పాపసం
చారిణి మాయానుకారిణి యగు
నీదానవిని వేగ మేదినిఁ గూల్పవ
ధింప రాదనుచుఁ దలంప రాదు
దయ చాలు నింక సంధ్యాకాల మబ్బిన
విపులమాయల నిది వెలయుచుండు
సంజల దనుజుల భంజింపఁగా రాదు
మంజుభాషణ బలభంజనునకు

గీ. విహిత మిప్పని యనుచు నవ్విధిసముండు
మునివరుఁడు చెప్ప రఘుపతి మోదమునను
వినుచుఁ దనపైని గర్జిల్లుచును గడంగు
తాటకను గాంచి పరిమార్పఁ దాఁ దలంచి. ౫౧౬

క. దివ్యాస్త్ర మొకటి గైకొని
క్రవ్యాదిని పేరురంబు గాడఁగ సేయన్
హవ్యభుజు లలరఁ దాటక
భవ్యమహీధరముభంగిఁ బడియె న్నేలన్. ౫౧౭

గీ. అట్లు తాటక ధరఁ గూల నధికముగను
చప్పుడొదవిన నల్దిశల్ సంచలించె
నంత గీర్వాణయుతుఁడై బలాంతకుండు
సంతసంబున నచటికి సరగ వచ్చె. ౫౧౮

గీ. ప్రాణములఁ బాసి ఘోరరూపంబుతోడఁ
బుడమిఁ బడియున్న రక్కసిరొమ్ములు చూచి

విస్మయము నొంది రాముని వినతిఁ జేసి
కౌశికుని గాంచి పల్కె సత్కృతికుండు. ౪౮౯

క. ఈరాముఁ డఖిలజగముప
కారంబులు సేయఁ జాలుఘనుఁడు ధరాభృ
త్ప్రియుఁడు పారావారగ
భీరుఁడు జగదేకపూజ్యవిభుఁ డెన్నన్. ౪౯౦

క. కావున నీ దుష్టమతిన్
వేవేగన్ దునిమి నీకు వేల్పులకును నా
కీవేళ సుఖముఁ జేసెను
భావింపఁగ రాముఁ బొగడ బ్రహ్మకు వశమే. ౪౯౧

గీ. భూపవందితు నితని సురోపకృతిని
జేసితేని ప్రతాపవిశేష మొప్ప
నుర్విఁ జేయు నితండు సురోపకృతిని
దళితవాగీశ ! యాశ్రితదురితనాశ ! ౪౯౨

వ. అది గావున నీవెఱుంగు నస్త్రశస్త్రంబు లన్నియు రామచంద్రునకు నను్గ్రహింపవలయు నని పల్కి, కౌశికదాశరథుల వీడ్కొని సురేంద్రుండు సపరివారుండై సురలోకంబున కరిగినపిమ్మట, నమ్మునీంద్రుండు రామభద్రునిం జేరఁ బిలిచి, సాదరంబుగా గాఢాలింగనంబుఁ జేసి, మస్తకాఘ్రాణంబు గావించి, సంధ్యాసమయం బయ్యెఁ గావున నీవింధ్యాచలారణ్యంబున నీరాత్రి వసియించి యెల్లి మదీయాశ్రమంబునకు నేఁగుద మనిన, రామలక్ష్మణులు సంతుష్టాంతరంగులై యానిశీథిని నచ్చోట వసింప వేఁగుటయుఁ బ్రభాతంబున నృపనందనుల మేలుకొలిపి, తత్కాలోచితవిధానంబు లాచరించి, విశ్వామిత్రుండు మందహాసభాసురాననుండై రామున కిట్లనియె. ౪౯౩

క. నీవరవిక్రమమునకును
దేవతలును సకలమునులు దేవేంద్రుండున్

భూవర సంతోసిల్లిరి
గావున నీక స్త్రశస్త్రగణ మే నిత్తున్. ౨౯౪

చ. అన వినయాన్వితుండయి రయంబునఁ బ్రాంజలియైన రామచం
ద్రుని గని గాధినందనుఁడు రూఢకృపామతితోడ నస్త్రముల్
ఘనతరశస్త్రముల్ క్రమముగా నొసఁగెన్ విధియుక్తవైఖరిన్
దనుజుల నెల్ల కయ్యముల దక్షతఁ ద్రుంచెద వంచుఁ బల్కుచున్.

గీ. అమ్మునీంద్రుండు బ్రహ్మాస్త్ర మాదిగాఁగఁ
గలుగు నస్త్రంబులును శస్త్రగణము నొసఁగఁ
గైకొనుచు రాముఁ డల దివాకరునిమాడ్కి
వెలుఁగుచుండెను దేజంబు విస్తరిల్ల. ౨౯౬

వ. ఇట్లు దేవాసురులకు దుర్లభంబులగు దివ్యాస్త్రశస్త్రంబులు వడసి, తత్ప్రయోగంబులు తత్ప్రభావంబులు తదుపసంహారంబులు కౌశికు వలన నెఱింగి యున్నయెడఁ నయ్యస్త్రంబులు మూర్తిమంతంబులై రఘువరుం గాంచి, దేవా! మీ రెట్లు యానతిచ్చిన నట్లు మెలంగెద మనిన సంతోషించి, రాముండు వలయు నప్పు డరుగుదెం డనిన వల్లెయని ప్రాంజలులై యమ్మహాస్త్రంబు లంతర్ధానంబు నొందిన యనంతరంబ.

క. రాముఁడు కౌశికమునివరు
ధీమహితుం గని తపోనిధీ! నీకరుణన్
గామితముఁ గంటి ఘనసం
గ్రామంబులఁ గూల్తు నసురగణముల నింకన్. ౨౯౭

వ. అని వినుతించి నమస్కరించి త్రోవ నరుగుచు, ముందఱ నొక్కపర్వతసమీపంబున రమ్యతపోవనంబుం జూచి, యిది యెవ్వరియాశ్రమం బని యడిగిన రామచంద్రునకు విశ్వామిత్రుం డిట్లనియె. ౨౯౯

క. ఇది సిద్ధాశ్రమ మనఁగా
విదితంబు జగంబులోన విష్ణుం డిచటన్
గదలక యనేకయుగములు
వదలక తప మాచరించె వాచంయముఁడై. ౩౦౦

# అన్నియు సగము వెలలకు
# ఆంధ్ర సాహిత్యపరిషత్తు—కాకినాడ.

ఈక్రింది గ్రంథములును, వెనుకటి పరిషత్పత్రికలన్నియును, సగము వెలలకే, విక్రయింపఁబడును. సూర్యరాయాంధ్ర నిఘంటువు మాత్రము నిండువెలకే. పత్రికలలో 1 మొదలు 8 వ సంపుటము వఱకుఁ బూర్తిగ లేవు. ఈతరుణమును వ్యర్థము చేసికొనకుఁడు. ఇందు చూపఁబడిన వెలలు నిండువెలలు కావలసినవారికి వీనిలో సగము వెలకుఁ బంపఁబడును. పోస్టు రైలువ్యయములు ప్రత్యేకము.

| | | | |
|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము—చదలువాడ మల్లయ్యకవి | 0 | 8 |
| 2 | జైమినిభారతము—వచనము—సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు | 0 | 12 |
| 3 | కవిజనాశ్రయము—వేములవాడ భీమకవి | 0 | 10 |
| 4 | చంపూరామాయణము—ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | 1 | 0 |
| 5 | నీతిసీసపద్యశతకము—తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు | 0 | 2 |
| 6 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము—జ. రామయ్యపంతులుగారు | 0 | 8 |
| 7 | జ్యోతిశ్శాస్త్రసారము—కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0 | 8 |
| 8 | జ్ఞానప్రసూనాంబికాశతకము—శిష్టు సర్వశాస్త్రికవి | 0 | 2 |
| 9 | సర్వేశ్వరశతకము—యథావాక్కుల అన్నమయ్యగారు | 0 | 3 |
| 10 | కావ్యాలంకారచూడామణి—విన్నకోట పెద్దయ్యకవి (8–9 ఉల్లాసములు) | 0 | 8 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక | 0 | 8 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి—శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 12 |
| 13 | శివతత్త్వసారము—మల్లికార్జునపండితారాధ్యులు | 0 | 12 |
| 14 | చంద్రభాను చరిత్రము—తరిగొప్పుల మల్లనకవి | 1 | 0 |
| 15 | శివరాత్రిమహాత్మ్యము—శ్రీనాథమహాకవి | 0 | 12 |
| 16 | ఆర్యభాషావిభాగము—శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 8 |
| 17 | ప్రాస్వరంగములు—క్రొత్తపల్లి సూర్యారావుగారు | 0 | 8 |
| 18 | నారసింహపురాణము—ఉత్తరభాగము—హరిభట్టు | 1 | 0 |
| 19 | మన్నారుదాసవిలాసనాటకము—రంగాజమ్మ | 0 | 8 |
| 20 | కాళిందీకన్యాపరిణయము (ప్రథమభాగము) అహోబలపతి | 1 | 0 |
| 21 | కాళిందీకన్యాపరిణయము (ద్వితీయభాగము) | 0 | 8 |

| | | | |
|---|---|---|---|
| 22 | ఱేనాఁటి రెండు శాసనములు | 0 | 4 |
| 23 | ఆంధ్రధాతుమాల-చిన్నయసూరి | 0 | 12 |
| 24 | శాసనపద్యమంజరి-(ప్రథమభాగము) జయంతి రామయ్యపంతులుగారు | 0 | 12 |
| 25 | శాసనపద్యమంజరి-(ద్వితీయభాగము) ” | 0 | 4 |
| 26 | శతకసముచ్చయము (ప్రథమభాగము) | 0 | 12 |
| 27 | శతకసముచ్చయము (ద్వితీయభాగము) | 0 | 10 |
| 28 | పరిషత్పుస్తకభాండాగారము (ద్వితీయభాగము) | 0 | 8 |
| 29 | సూత్రాంధ్రవ్యాకరణము-చిన్నయసూరి | 0 | 8 |
| 30 | రసాభరణము-అనంతకవి | 0 | 8 |
| 31 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతీకృతాంధ్రటీకోపేతము | 0 | 8 |
| 32 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య | 0 | 8 |
| 33 | హంససందేశము-(తెనుఁగుపద్యములు) కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | 0 | 2 |
| 34 | రాయవాచకము-విశ్వనాథనాయని స్థానాపతి | 0 | 8 |
| 35 | సింహాసనద్వాత్రింశిక-(ప్రథమభాగము)-కొఱవి గోపరాజకవి | 0 | 12 |
| 36 | సింహాసనద్వాత్రింశిక-(ద్వితీయభాగము)-కొఱవి గోపరాజకవి | 0 | 12 |
| 37 | నిఘంటుచరిత్రము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 6 |
| 38 | ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి | 0 | 8 |
| 39 | బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెనుఁగు) క్రొత్తపల్లి సూర్యారావుగారు | 0 | 12 |
| 40 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | 0 | 4 |
| 41 | Defence of Literary Telugu జయంతి రామయ్య పంతులుగారు | 0 | 8 |
| 42 | చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | 0 | 8 |
| 43 | సాంబోపాఖ్యానము-రామరాజు రంగప్పరాజు | 1 | 0 |
| 44 | రసార్ణవాలంకారము-ప్రకాశవర్షకవి | 0 | 8 |
| 45 | కవిజనోజ్జీవని-సమస్యలు శ్రీ కోటి రఘునాథతొండమాన్ మహీపాలుఁడు | 0 | 4 |
| 46 | రఘునాథరామాయణము-(ప్రథమభాగము) రఘునాథభూపాలుఁడు | 0 | 8 |
| 47 | రజతోత్సవసంపుటము-(ఆంధ్రసాహిత్యపరిషత్తు) | 1 | 0 |
| 48 | ఆంధ్రసాహిత్యపరిషద్వృత్తాంతము | 0 | 4 |
| 49 | అఱవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము—అక్కిరాజు ఉమాకాంతంగారు | 0 | 4 |
| 50 | లౌకికన్యాయ వివరణము-శ్రీమాన్ మేడేపల్లి వెంకటరమణాచార్యులుగారు | 0 | 8 |

ఇతరగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1 | దాశరథివిలాసము-(ప్రబంధము) క్రొత్తపల్లి లచ్చయ్యకవి | 1 | 0 |
| 2 | ఉన్మాదసహస్రము-(వేయిపద్యములు) | 0 | 12 |
| 3 | నీతిభవనము-క్రొత్తపల్లి సూర్యారావు ~~గారు~~ | 0 | 4 |
| 4 | నమస్కారములు ” | 0 | 2 |

# ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు, పరిషద్వ్యవస్థాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు

# ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

## కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ, బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు (కోశాధ్యక్షులు).

వెద్దాడ రామస్వామిగారు, ఎం ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ,. ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ., బి. ఎల్.

అళక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోటా వేంకటసుబ్బారావునాయుఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయుఁడుగారు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౮ | ప్రమాధినామసంవత్సరము. ఆశ్వయుజ కార్తికములు. | సంచిక ౪.





కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక, రు. ౦-౮-౦.

1939 అక్టోబరు, నవంబరు.

# విషయసూచిక.



శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటితం

సంపుటము ౨౮. { ప్రమాధినామసంవత్సరము. ఆశ్వయుజకార్తికములు. } సంచిక ౪

## కవి పండితుల నిర్యాణము.

బ్రహ్మశ్రీ చర్ల నారాయణశాస్త్రులవారు.



శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు కార్యస్థానమున వ్యవహర్తలును (Manager) సుప్రసిద్ధ పండితులు నగు బ్రహ్మశ్రీ చర్ల నారాయణ శాస్త్రులవారి మరణ మాంధ్రసాహిత్య పరిషత్తువారి కెంతయు సంతాప కరమైన విషయము.

శ్రీ శాస్త్రులవారు తే 24-3-31 దిని నిఘంటుకార్యాలయమున నియమితులై తే 16-11-39 ది వఱకును ఆ యుద్యోగము నిర్వహించిరి. ఈ యెనిమిదేండ్లనుండియు నిఘంటుకార్యమునందే నిమగ్నులై యుండిరి. వీరి కార్యనిర్వహణదీక్షచే నిఘంటు ప్రథమసంపుటము క్రీ. శ. 1936 వ సంవత్సరముననే ప్రకటింపఁబడినది. ద్వితీయసంపుటము సర్వసిద్ధమై త్వరలోనే ప్రకటింపఁబడనై యున్నది.

శ్రీ శాస్త్రులవారు సంస్కృతమునఁ గావ్యనాటకాదులనే గాక తర్క వ్యాకరణములను గురుముఖమునఁ జదివిరి. ఆంధ్రభాషయందు

స్వకృషిచేతనే పాండిత్యము సంపాదించిరి. హిందీభాషయందును వీరికిఁ బరిచయము కలదు. వీరు సాహిత్యమునందేగాక సంగీతమునందును బరిశ్రమఁ గావించిరి. మృదంగ వాద్యమునఁ బ్రావీణ్యముఁ బడసిరి.

శ్రీ శాస్త్రులవారు తెలుఁగు కవులు. సంస్కృతమునఁ గుట్టికవి ప్రణీతమగు మహిషశతకము నాంధ్రీకరించిరి. మఱియు నాంధ్రశబ్ద చింతామణ్యాథర్వణకారికలనే పద్యరూపమున నాంధ్రీకరించి, నారాయణీయాంధ్రవ్యాకరణమను పేరఁ బ్రకటించిరి. దానికి శ్రీ శాస్త్రులవారి కుమారులు గణపతిశాస్త్రిగారు 'గాణపతసూత్రవివరణము' అను పేర వ్యాఖ్యానము రచియించి యున్నారు. శాస్త్రులవారు పరిషత్ప్రకటితమైన బాలసరస్వతీయమునకుఁ బీఠిక వ్రాసిరి. మఱియుఁ బరిషత్పత్రికయందు 'భారతమీమాంస' రజతోత్సవసంపుటమున 'తెలుఁగు' అను వ్యాసములఁ బ్రకటించిరి.

శ్రీ శాస్త్రులవారు శబ్దసంస్కారదీక్షితులేగాక సంఘసంస్కారపరాయణులును. శ్రీకావ్యకంఠ గణపతిశాస్త్రులవారితోఁ గలసి యాలమూరు మున్నగు స్థలములందు సంఘసంస్కరణములను గూర్చి యుపన్యాసములఁ గావించియున్నారు.

శ్రీ పీఠికాపురాస్థాన విద్వత్కవులును, శతావధానులునగు రామకృష్ణకవులు వీరి శిష్యులని చెప్పినచో వీరిపాండిత్యవిశేషములు తెలియఁ గలవు. ఇంచుమించుగ నలువదేండ్ల వయస్సున శ్రీశాస్త్రులవారు దివంగతులైరి. వారి యాత్మ పరమపవిత్రమగు భగవత్సాన్నిధ్యముఁ జేరుగాక.

---

# పరితాపము.

పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు.



గీ. రామకృష్ణులఁ బోలెదు రామకృష్ణు
లకును సాందీపనియుఁ బోలె లక్ష్యలక్ష్య
సంగతుల నేర్పినగురుండు చర్లవంశ
రత్న మరిగెను దివికి నారాయణుండు.

క. తెనుఁగున సంస్కృతమున సే
వనుపమసాహిత్యనిధివి; వ్యాకరణములం
దును దిట్ట; విట్టిసిస్మృతి
మనముల నెరియింపకున్నె? మా బోటులకున్.

క. కార్యాలయ సమయంబునఁ,
గార్యాంతర చింతయించుకయు సల్పక త
త్కార్య వినిర్వహణంబే
యార్యస్తుత! నీకు సహజమగు గుణముగదా?

క. పాయక రచించు సూర్యా
రాయనిఘంటువున రెండుగ్రంథమ్ములె గా
దా? యచ్చొత్తించితి; వీ
వీయెడ దివి కేఁగ నర్హమే? సరసమతీ!

---

బ్రహ్మశ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రులవారు.

శ్రీ పీఠికాపురసంస్థానాస్థాన విద్వత్కవులును, శతావధానులును సరసకవితాధురంధరులును నగు బ్రహ్మశ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రిగారి నిర్యాణ మాంధ్రవిద్వల్లోకమున కెంతయేని సంతాపము నాపాదించెను.

రాజర్షియు సర్వజ్ఞచూడామణియునగు శ్రీ పీఠికాపురాధీశ్వరుల చే 'విద్వత్కవివర్య' లని ప్రశస్తినిఁ బడసి, శ్రీమహారాజకుటుంబమునకు

నందు ముఖ్యముగ శ్రీ యువరాజచంద్రులకు సంస్కృతాంధ్రభాషా గురువులై 'గురువుగా' రని మన్ననలనంది, శ్రీ వారి కృపాకటాక్షముచేఁ దమజీవితమును, కవితాజీవితమును సార్థకముఁ గావించుకొనిన శ్రీశాస్త్రిలవా రెంతయు ధన్యులు.

శ్రీ రామకృష్ణకవులను పేర సంస్థానవిద్వత్కవులై యున్న కాలమున శ్రీ శాస్త్రిలవారు 'కవిత' యను పత్రికను స్థాపించి, యందు మత్స్యపురాణము, మైరావణచరిత్రము మున్నగు ప్రాచీనాంధ్రప్రబంధములఁ బ్రకటించిరి. వేంకటాధ్వరికృత విశ్వగుణాదర్శముఁ దెలిఁగించి శ్రీ మహారాజావారికి సంకితముఁ జేసిరి. ప్రసిద్ధులగు తిరుపతి వేంకటేశ్వర కవులతో డీకొని వాగ్యుద్ధమొనర్చిరి. పాణిగృహీతి, కౌరవగౌరవము కొండవీటివిజయము లవకావ్యము మున్నగు స్వతంత్రగ్రంథములను రచియించిరి. క్షేమేంద్రవిరచితమగు 'ఔచిత్యవిచారచర్చ' 'సువృత్తతిలకము'లను సంస్కృతాలంకారగ్రంథముల నాంధ్రీకరించిరి.

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభ్యులలో నొకరై శ్రీశాస్త్రిలవారు పరిషత్తునం దెంతయేని యభిమానముఁ గలిగియుండిరి. పరిషత్ప్రకటితమగు ఉత్తరనారసింహపురాణమును దివ్యమగు పీఠికచే నలంకరించినది శ్రీ శాస్త్రిలవారే !

శ్రీ శాస్త్రిలవారిహృదయ మెంతసరళమో వారి కవితయునంత సరళమైనది. శాస్త్రిలవారు కథాసరిత్సాగరమును నాంధ్రీకరింపఁ బ్రారంభించి యందైదులంబకముల నీవఱకుఁ బ్రకటించియున్నారు. మహాభారతమంత గ్రంథమగు కథాసరిత్సాగరము నీదుటకు శ్రీ శాస్త్రిలవారొక్కరే సమర్థులు; కాని మన దురదృష్టమున గ్రంథము పూర్తికాలేదు.

నిష్కల్మషహృదయులును, నిగర్వులునగు శ్రీ శాస్త్రిలవారి నిర్యాణమాంధ్రకవిపండిత లోకమునకుఁ గొఱఁతనే చేకూర్చినది.

---

# సంతాపోక్తి.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.



సృష్టియందెట్టిప్రతిష్ఠయులేకపుట్టుగిట్టుల మాత్రమందువారెంద ఱోకలరు. కాని, కొందఱు ధన్యజీవులు నిజయశఃకాంతుల దిగంతములఁ బ్రసరింపఁజేసి, జీవితాంతమునఁ బరమేశ్వరకారుణ్యమునకుఁ బాత్రులగు చుందురు. అట్టియుత్తమపురుషుల పట్టికలోఁ జేర్పఁదగినజీవితసంపదగలిగిన బ్రహ్మశ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రి మహోదయులు, ఈప్రమాధిని గార్తికమాసాన యశఃశేషులైరను వార్తను విని దుఃఖింపనివారీతెలుఁగు నాట నుండరని నానమ్మిక.

ఈపండితమహాశయుల సుగుణమణికాంతులును, శీలసుమసౌర భములును, లలితకవితావితానరచనలును, ప్రమోదప్రద వాదములును సుందరమందహాసభాషణములును దయామయకార్యములును లోకుల నానందకందళితహృదయులనుగాఁ జేయుచుండెడివి. ఈయొజ్జలమేటి నోటినుండి మోటుమాటలు కలలోఁగూడ వినఁబడకుండెడివి.

మఱియుఁ గీర్తివంతమగు పాండిత్యగరిమ యెంతవిరివిగా నున్నను, మహారాజాస్థానమున గౌరవోన్నతమగు పలుకుబడి తమకెంతవశంగతమై యున్నను, సదావినయసుందరులై చూపట్టెడువారుకాని, ఒకప్పుడు ను గర్వోద్ధతులై కనుపట్టరారైరి!

ఈయుదారహృదయుల సాహాయ్యముచే శ్రీ శ్రీ పీఠికాపుర సంస్థానమువారి సన్మానములనందికొని యానందించిన విద్వాంసు లెందఱోకలరు. ఈమహితాత్ములు ముక్తి నందుటకు ముందువారమునఁ దాము జ్వరపీడితులై యుండియు, మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి, శ్రీ శ్రీ పీఠికాపురమహారాజావారి సంద

ర్ణనమును సమకూర్చి శ్రీవారిచే శాస్త్రిగారిని నూటపదియార్లతో సన్మా నింపఁజేసియుండిరి. ఇట్టియుదారోదాహరణము లెన్నియేని కలవు.

శ్రీ శ్రీ పీఠపురమహారాజకుటుంబమునకు సంబంధించిన స్త్రీపురుషులెల్లరు వేంకటరామశాస్త్రిగారియందసమానగౌరవప్రపత్తులతో మెలంగుచున్నారు. మహారాజాస్థానమునందింతటి నిలకడగల మర్యాదల నందుట సామాన్యులకు సాధ్యమగునది కాదు. అందు కెంతయో సుగుణసంపద యుండవలయు. మఱెంతయో నేర్పమరి యుండవలయు.

ఈపండితావతంసులు నాపై గౌరవాదరములవెల్లడించుచు సౌభ్రాత్రముతో నన్నానందపరవశునిగాఁ జేయుచుండెడివారు. అట్టి సహృదయుల యెడబాటు నాకెంతయు ఖేదావహముగానున్నయది. నేనీకవిసింహులు ప్రాణములవీడుటకు ముందిరువది నిముసములకుఁ జూడనేఁగియుంటిని. అపుడాప్తులు నారాకను వారికి బిగ్గరగాఁ దెలుప ముకుళితములైయున్న కన్నుఁదమ్ములవిప్పి నాముఖమువైపు కొక స్నేహార్ద్రమగు చూపును బ్రసరింపఁజేసి యుండిరేకాని పలుకరింపనేరరైరి. అటుపై మఱికొంతసేపటికీలోకమున సతీపుత్త్రాదిబంధుజనుల వీడి పరలోకమున కేఁగిరి.

"సజాతో యేన జాతేన యాతి వంశః సమున్నతిం" అనునట్లు శ్రీ వేంకటరామశాస్త్రిగారు ఓలేటికుటుంబమునకు సాటిలేని యశము నొడఁగూర్చి నిజజీవితమును కీర్త్యానందములతో సాగించి తుది నానందమయుఁడగు పరమేశ్వరుని దరినిఁజేరిరి. ఈప్రతిభాశాలురు అమూల్యములగు ననేకాంధ్రగ్రంథముల విరచించియున్నారు. ప్రస్తుతము కథాసరిత్సాగరమునకు నాంధ్రానువాదము రచియించుచున్నారు. మఱియు, ఆంధ్రియను సలక్షణాంధ్రభాషాపత్త్రికను స్థాపించి యందుమర్యాదాసుందరములగు వ్యాసరాజములఁ దఱుచుగాఁ బ్రకటించుచున్నారు. ఇంక

కాని కాలచోరుఁడు వేగిరపడి యీకవిచూడామణి జీవితసంపదలనపహరించి పఱుగిడినాఁడు. ఈపండితకవిచంద్రుఁడు ధన్యాత్ముఁడే. కాని, ఈ దయానిధితోడ్పాటున బాగుపడనభిలషించువారికిఁదీరనిలోటువాటిల్లినది. పరమేశ్వరుఁడు వీరి యాత్మకు శాశ్వతానందము నందఁ జేయుఁగావుత.

---

## కవిరాజ శ్రీ వత్సవాయ నీలాద్రిరాజుగారు.

తుని సంస్థానాస్థాన విద్వత్కవులగు శ్రీ వత్సవాయ నీలాద్రిరాజ కవిరాజవర్యులీనడుమనే కీర్తిశేషులైరి. ఉభయభాషలయందును జక్కని పాండిత్యముఁ గలిగి, ప్రాచీనపద్ధతిని రసవత్కవిత్వముఁ జెప్పఁగలిగిన సమర్థులు. శ్రీ కవిరాజుగారు మేఘసందేశమును దెలిఁగించిరి. నాటక రాజమగు నభిజ్ఞానశాకుంతలము నాంధ్రీకరించిరి. స్వప్నలోకమునున్నగు స్వతంత్రగ్రంథముల రచియించిరి. వీరి శాకుంతలానువాదము సరసముగ నున్నదని ప్రసిద్ధవిమర్శకుల యభిప్రాయము. వీరు కవిత్వమునందే గాక సారస్వతవిమర్శనమునఁగూడఁ బ్రవీణులై వ్యాసములఁ బ్రకటించి భాషాసేవ గావించియున్నారు. కవిరాజుగారికీర్తి యాంధ్రలోకమునఁ జిరస్థాయి యగుఁగాక !

---

## డాక్టరు వేమూరి రామకృష్ణారావు M., A. గారు.

ఆంధ్రసాహిత్య పరిషత్కోశాధ్యక్షులుగా నున్నట్టియు, శ్రీపీఠికాపుర మహారాజాంగ్లకళాశాలాధ్యక్షులుగా నున్నట్టియు డాక్టరు శ్రీవేమూరి రామకృష్ణారావుగారి నిర్యాణమునకుఁ బరిషత్తు చింతించుచున్నది. సుప్రసిద్ధాంగ్లేయభాషా పండితులైన శ్రీరామకృష్ణా రావుగా రాంధ్రభాషాభిమానము గలిగి పరిషత్కార్యముల నెంతయేని శ్రద్ధతో నెఱవేర్చుచుండెడివారు. వీరు సర్. ఆర్. వేంకటరత్నమునాయుఁడుగారిగ్రంథములఁ బ్రకటించియున్నారు. వీరినిర్యాణ మాంధ్రలోకమున కెంతేని సంతాపకరము.

## ముద్రిత గ్రంథముల ముఖ్యపత్రములు.

# వ సు చ రి త్ర.

సప్రతిపద టీక

చార్లిసు ఫిలిఫ్ బ్రౌనుదొరవారి అనుమతిని

జూలూరి అప్పయ్య పంతులవారిచేత వ్రాయబడ్డది.

The

VASU CHARITRA

A celebrated poem in the Telugu Language
written by Bhathu Murti
About A. D. 1450.

with a commentary written in the same
Language by Juluri Appayya,
Madras.

Printed by R. W. Thorpe at the Christian
knowledge Society's Press.
1844.

---

# బాలవ్యాకరణము.

పరవస్తు - చిన్నయసూరి ప్రణీతము.

ఇది

౧౮౫౮ వ సం॥ డిసెంబరు మాసము

చెన్నపురమందలి హిందూముద్రాక్షరశాలయందు

శ్రీ - సరవప్పసెట్టి చేత ముద్రింపఁబడియె.

# తెలుఁగు—త్రిలింగము.

కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.



మనము నివసించుదేశమునకుఁ దెలుఁగుదేశమనియుఁ ద్రిలింగదేశమనియుఁ దెనుఁగుదేశమనియు, నాంధ్రదేశమనియు నామములున్నట్లే, మనభాషకును దెలుఁగుభాషయనియుఁ ద్రిలింగభాషయనియుఁ దెనుఁగుభాషయనియు, నాంధ్రభాషయనియుఁ బేర్లు గలవు. తెలుఁగు త్రిలింగపదములలో నేది మొదటిదో నిర్ణయించుటకుఁ బండితులును వ్యాకరణకర్తలును గొన్నిసిద్ధాంతముల నిదివఱకే నెలకొల్పియున్నారు. ఈవాదోపవాదములను జక్కఁగఁబరిశీలించి, తత్పదవ్యుత్పత్తుల పౌర్వాపర్యములనుగూర్చి నిశ్చయింపవలసియున్నది. ఇట్టి నిర్ణయము మాంధ్రసారస్వతమునకే గాక, ఆంధ్రచరిత్రకును ముఖ్యమైన విషయము.

సంస్కృతసారస్వతము, ఆంధ్రవాఙ్మయము, ప్రాచీనశాసనములను బరిశోధించి, తెలుఁగు, త్రిలింగశబ్దములప్రయోగముల నిక్రింద నుదాహరించుచున్నాను. తగినప్రమాణములను జూపి, యీపదములలో నేది ప్రాచీనమో నిరూపించెదను. అది కాదది యనియు, నిది కాదది యనియు విషయనిర్ణయము గావించినచో విమర్శకులు దేశోపకారమును గావించినవా రగుదురు.

తెలుఁగు తెనుఁగుశబ్దములు.

పురాణములలోఁ దెలుఁగుదేశప్రశంస యున్నది. మార్కండేయ పురాణమునుండి యీక్రిందిశ్లోకము నుదాహరించుచున్నాను.

తిలఙ్గాః కుఞ్జరదరీకచ్ఛ వాసాశ్చ యే జనాః
తామ్రపర్ణీ తథా కుక్షి రితి కూర్మస్య దక్షిణః.

Bibliotheca Indica Edition 1862. Page 327.

శ్లోకమును బురాణముల నన్నిటిని విశేషపరిశ్రమముతోఁ

పరిశీలించిన, శ్రీ పర్గిటాన్ దొరవారు (Pargiter) భాషాంతరీకరించున శ్లోకములోని తిలంగపదము తెలుఁగుదేశమును సూచించుచున్నదని వ్రాసియున్నారు. ఈ తిలంగపదము రామాయణమహాభారతగ్రంథములలోఁ జేర్పఁబడ లేదనియు నాగ్రంథముల నాంధ్రపదమే గలదనియుఁ జెప్పియున్నారు. మా చదువరుల పరిశీలనార్థము వా రాంగ్లముఁ వ్రాసియున్న భాగము నుదాహరించుచున్నాను.[1]

మార్కండేయపురాణమునుండి యుదాహృతమైన తిలంగపదముఁబట్టి మనము తెలుఁగువారికిఁ బూర్వము తిలంగులను పేరున్నట్లు తెలిసికొనవచ్చును

పదునొకండవశతాబ్దారంభమునందలి కొన్నితమిళశాసనములలోఁ దెలుఁగుల ప్రశంస గలదు. అందు మొదటిది క్రీ. శ. 1012 A. D. నాఁటిది. వేంగీ, గంగమండలముల మహాదండనాయకుఁడైన మారాయయను నాతఁడు వ్రాయించినది. ఈశాసనములో నితఁడు, చేర, తెలుంగ, రట్టిగ, కొంకణ, తుళువరాజులను జయించినట్లు వ్రాయించుకొనెను.[2]

మఱియొక తమిళశాసనము మొదటి, పరకేసరి రాజేంద్రచోళుని పదియవపరిపాలనాసంవత్సరమునాఁటిది శాసనకాలము క్రీ. శ.

---

1. "The Tilangas, and the people who dwell in Kunjaradari and Kaccha, and Tamraparni-that is the Tortoises right flank."

Note on 'Tilanga' :—This form is not in the dictionary; but it is no doubt the same as Tailanga or Trilinga, that is Telinga, the modern Telugu country. It coincided more or less with the ancient Kingdom of Andhra. I have not found this name in any shape in the Ramayana or Mahabharata; Andhra is the name which occurs in those books.

Bibliotheca Indica Translation 1904. Page 367.

2. No. 5 of 1895 (Madras) and Ep. Car. Vol iii. Sr. 140. Ep. Car. Vol i. c-g 46 and p. p. 12-13. Lamp by General Panchanan Maraya. the Mahadandanayaka of Bengi and Ganga Mandalas. He is called Mummidicola gandhavaranam and is said to have seized the Tuluva and Konkana, held Malcya, pushed aside, eera Telunga and Rattiga.

1022 వ సంవత్సరము శాసనములోని తమిళపద్యములోఁ గళింగులతోను, ఒడ్డీయులతోను, తెలుంగులతోను యుద్ధము చేర్కొనఁబడెను.[3]

కర్ణాటశాసనసంపుటములలోఁ దెలుంగుదేశముయొక్క ప్రశంస గలదు. కొంగల్వరాజొకఁడు తెలుఁగుదేశమును జయించెనని తెలియుచున్నది. ఆశాసనకాలము క్రీ. శ. 1012 నాఁటిది.[4]

క్రీ. శ. 113౦వ సంవత్సరమునాఁటి యొక హోయిసలరాజశాసనములో నతఁడు తెలుంగరాజ్యముపై దండెత్తిపోయి, ఇంద్రుని గెల్చినట్లు తెలిపికొనెను.[5]

క్రీ. శ. 1140 సంవత్సరము నాఁటి మఱియొక కన్నడశాసనములోఁ దెలుంగనాడు ప్రశంసయున్నది.[6]

క్రీ. శ. 1111 సంవత్సరప్రాంతమున విక్రమచోళుఁడు తెలుంగు భీమునిపై దండెత్తిపోయి యతని పర్వతప్రాంతములకుఁ బారఁదోలెనని దక్షిణహిందూదేశశాసనసంపుటములలోఁ గలదు.[7]

ఆంధ్రమహాభారతములో నన్నయభట్టు తెనుఁగు తెలుఁగు పదములను వాడియున్నాఁడు.

క. జననుతకృష్ణద్వైపా
　యనముని వృషభాభిహితమహాభారత బ
　ద్ధనిరూపితార్థ మేర్పడఁ
　దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్.

ప్రథమాశ్వాసము ప. 16.

---

3. No. 30, 31 of Epigraphical Report (Madras) 1917. Inscription of Parakesari Rajendra I. Tenth year of the reign (Acc. 1012 A. D.). Tamil verse mentions battle with Kalingas, Oddas, and Telungas.

4. A Kongalva King was stated to have conquered Telunga country. Epigraphia Carnatica Vol IX. Page 19.

5. Hoyasala Inscription.
After that, marching to the Telunga country,, he captured Indra. Ep. Car. Vol V. B. L. 17.

6. Epi. Car. Vol VII. Part I. Shikarpur Taluq No. 290.

7. South Indian Inscriptions. Vol II. Part II. No. 68.

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు దెలుంగునన్ మహా
భారతసంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్.

ప్రథమాశ్వాసము, ప. 25.

నన్నయ చాళుక్యవరపాలుఁడైన రాజరాజనరేంద్రుని యాస్థాన కవి. రాజరా జాంధ్రదేశమును క్రీ. శ. 1022 మొదలు 1063 వఱకు ను బరిపాలించెను. నన్నయకాలమునాఁటికి దెనుఁగు తెలుఁగు పదములె వాడుకలో నున్నట్లు తెలిసికొనవచ్చును. నన్నయకు సమకాలికుఁడును రాజనరేంద్రునిచేఁ బిఠాపురసమీపమున నున్న నవఖండవాడ యను నగ్రహారమును బడసిన పావులూరి మల్లనకవి తాను రచించిన గణిత శాస్త్రములోఁ దెనుఁగుపదమునె వాడియుండెను.

క. కావున గణితముఁ దెనుఁగునఁ
గావింపఁగఁ గణఁగితి న్సుకవిమల్లుఁడ గౌ
రీవల్లభచరణసరో
జావాసితచిత్తమధుకరాత్ముఁడ జగతిన్.

ఆంధ్రకవులచరిత్రము. ప్రథమభాగము, పుట. 179.

పంద్రెండవశతాబ్దాంతమునందున్న పాలకురికి సోమనాథుఁడు తాను రచించిన బసవపురాణములోఁ దెలుఁగు తెనుఁగు పదములనే వాడియుండెను.

సంభావితుఁడ భవిజనసమాదరణ
సంభాషణాది సంసర్గదూరగుఁడ
నలిఁ బాల్కురికి సోమనాథుఁ డనంగ
వెలసినవాఁడ నిర్మలచరిత్రుండ
నురుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జానుఁ దెనుంగు

చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కి చైవాఱఁ
తెలుఁగు మాట లనంగ వలదు; వేదముల
కొలఁదియు కాఁ జూడఁ జెల్ల నెట్టు లన్నిన.

ప్రథమాశ్వాసము పుట. 5.

పదమూఁడవశతాబ్దమునాఁటి శాసనములలోనేమి, సారస్వతము నందేమి తెలుఁగు తెనుఁగు పదములే వ్యాప్తియుం దుండెను.

తిక్కనసోమయాజి విరాటపర్వములో

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగా
పదియేనింటఁ దెనుంగు భాష జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.

తే. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ
భవ్యపురుషార్థతరుపక్వఫలము గాదె
దీని కెడ నియ్యకొని వేడ్క నూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ ద్రిపురవిజయకర. విరాటపర్వము ప్ర ఆ.ప.7;18

నిర్వచనోత్తరరామాయణములో,

క. తెల్గుఁగు కవిత్వము చెప్పం
గలఁచిన కవి యర్థమునకుఁ దగియుండెడు మా
టలుగొని వళులుం బ్రాసం
బులు నిలుపక యొగిని బులిమిపుచ్చుట చనునే.

క. అలవడ సంస్కృతశబ్దము
తెలుఁగుబడి విశేషణంబు తేటపడంగాఁ
బలుకునెడ లింగవచనం
బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్.

ప్రథమాశ్వాసము ప. 7.8.

తెనుఁగు, తెలుఁగు పదములనే ప్రయోగించెను. అట్లే అభినవ దండిబిరుదాంకుఁడును, ప్రథమాంధ్రవ్యాకరణకర్తయు నైన, కేతనకవి తాను రచించిన ఆంధ్రభాషాభూషణమునందును, దెలుఁగు, తెనుఁగు శబ్దములనే ప్రయోగించెను.

క. మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మదిమెచ్చఁగ
నన్నయభట్టాదికవిజనంబులకరుణన్.

తే. సంస్కృతప్రాకృతాదిలక్షణముఁ జెప్పి
తెనుఁగునకు లక్షణముఁ జెప్ప కునికి యెల్లఁ
గవిజనంబులనేరమి గాదు నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచిన తలఁపుగాని.

ఆ. తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును
దానివలనఁ గొంత గానఁబడియెఁ
గొంత తాన కలిగె నంతయు నేకమై
తెనుఁగు బాసనాఁగ వినుతి కెక్కె.

క. తెలుఁగునఁ గలభేదంబులుఁ
దెలుఁగై సంస్కృతము చెల్లు తెఱఁగులుఁ దత్సం
ధులును విభక్తులు నవ్యా
యలఘుసమాసములుఁ గ్రియలు నవి యెఱిఁగింతున్.

ఆంధ్రభాషాభూషణము ప॥ 5, 6, 13, 14.

ఆంధ్రసారస్వతమునుండి యిట్టిప్రయోగముల నింకను జూపవచ్చును గాని యవి యప్రస్తుతములు. శాసనములలోఁ దెలుఁగుపదమె బహుళముగాఁ గానిపించుచున్నది. కర్ణాటకశాసనసంపుటముల నుండి కొన్ని యుదాహరణము లిచ్చెదను.

(1) తెలుంగదేశచమూసమూహజలాధిసూర్జత్.

క్రీ. శ. 1215 Ep. Car. Vol VII Part I. S. K. 95

(2) తెలుంగరాజ్యము.

క్రీ. శ. 1258 Ep. Car. Vol VII D. g. 103

,, 1275 do do 70

,, 1280 do do 59

దేవగిరి యాదవభూధవులకడ మంత్రిగానుండిన హేమాద్రి తన వ్రతఖండస్థరాజప్రశస్తిలోఁ దెలుఁగు దేశమునకుఁ దిల్లంగదేశ మను పర్యాయనామము వాడెను.

(1) తిల్లంగాధిపతేః పశో ర్విశసనం రుద్రస్య రౌద్రాకృతేః
కృత్వా పూరుషమేధయజ్ఞవిధినా లబ్ధ స్త్రిలోకీజయః॥ 41

(2) తిలఙ్గక్షితిపాలతూలనిచయప్రక్షేపచండానిలో
గర్జద్గూర్జరగర్వపర్వతభిదాదంభోలిదోర్విక్రమః॥ 48

(3) బాహానామపి యస్య వైరివిషయే ప్రావృతస్వతాం ధన్వినా
మాంతిల్లిఙ్గ నృపాఙ్గనాధనుర్ధినం వాహ్యాదిలీలా భవత్॥ 52

(4) త్రైలిఙ్గక్షితిపాలతూలనిచయప్రక్షేపఝంఝానిలో
గర్జద్గూర్జరగర్వపర్వతభిదాదంభోలిదోర్విక్రమః॥ 13

హేమాద్రి పదమూఁడవశతాబ్దాంతమున దేవగిరి పాలించిన యాదవరాజులగు మహాదేవ, రామచంద్రనరేంద్రులకడ మంత్రిగా నుండెను. [8] అతఁడు పేర్కొనిన తిలంగాధిపులు, కాకతీయాన్వయులైన యాంధ్రరాజులు. ఆకాలమునఁ దెలుఁగుదేశమునకుఁ దిల్లంగ, తిలంగ, లేక త్రైలింగదేశమని పేరు వాడుకలో నున్నట్లు తెలిసికొనవచ్చును. మార్కండేయపురాణములో నుదాహరించినతిలంగపదమును, హేమాద్రి ప్రయోగించిన తిల్లంగపదము నొక్కటియే.

8. Early History of Deccan-Bhandarkar. Pages 162, 195-196.

## త్రిలింగము—త్రిలింగభాష.

త్రిలింగదేశప్రశంస బ్రహ్మాండ, స్కాందపురాణములలోఁ గలదు. ఈప్రయోగములను జేటికిని నూటికిని, ఆంధ్రచారిత్రక పరిశోధకులును, ఆంధ్రసారస్వతచరిత్రకారులును జూపుచునే యుండిరి. వారి రచనలనుండియే మరల నెత్తి యీదిగువ నుదాహరించుచున్నాను. చర్వితచర్వణమునకుఁ జదువరులు నన్ను మన్నింతురుగాక.

కీర్తిశేషుఁడైన ఆంధ్రచరిత్రచతురాననుని యాంధ్రుల చరిత్ర ప్రథమ భాగములోఁ ద్రిలింగశబ్దప్రశంసను గూర్చి వారు చూపిన ప్రయోగముల నిచ్చుచున్నాను.

శ్రీశైల భీమకాళేశ మహేంద్రగిరిసంయుతం
ప్రాకారంతు మహత్కృత్వా త్రీణిద్వారాణి చాకరోత్।
త్రిలోచనో మహేశస్తు త్రిశూలంచ కరే వహన్
త్రిలింగరూపే స్యవసత్ త్రిద్వారేషు గణై ర్వృతః॥
ఆంధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశంభునా
యుద్ధ్వా త్రయోదశయుగాన్ హత్వాంతు రాక్షసోత్తమమ్॥
అవస త్తత్ర ఋషిభి ర్వృతో గోదావరీతటే
తత్కాలప్రభృతి క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతం॥

బ్రహ్మాండపురాణము.

కర్ణాటశ్చైవ తైలింగఘూర్జరారాష్ట్రవాసినః
ద్రావిడా ద్రావిడాః పంచ వింధ్యదక్షిణవాసినః॥

స్కాందపురాణములు.

శ్రీవీరభద్రరావుగారు పైప్రయోగములను జూపి బ్రహ్మాండ పురాణము పదునొకండవ శతాబ్దమున వ్రాయఁబడినదని కొందఱు పండితు లూహించుచున్నారని వ్రాసియున్నారు. [9]

9 ఆంధ్రులచరిత్రము ప్రథమభాగము. పుటలు. 28. 29.

ఈపురాణరచనాకాలప్రశంస ముందు రాఁగలదు. త్రిలింగశబ్ద ప్రయోగములను గొన్నిటిని జూపెదను. ద్వితీయాచార్యుఁడని ప్రసిద్ధిఁ గాంచిన యధర్వణాచార్యుఁడు తాను రచించిన త్రిలింగశబ్దానుశాసనములో నాంధ్రభాషను త్రిలింగభాషనుగాఁ జెప్పియున్నాఁడు

జయతి ప్రసిద్ధం లోకే సర్వలక్షణలక్షితం
శబ్దం త్రిలింగశబ్దానా మధర్వణకవేః కృతిః
కరోమి శబ్దం శబ్దానాం త్రిలింగానాం సలక్షణం
బార్హస్పత్యాని సూత్రాణి కాణ్వం వ్యాకరణం విదన్॥

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

త్రిలింగ్యా మపి హైనాఖ్యో స్సమాసే ప్రత్యయం తథా।

అధర్వణకారికలు.

కాకతీయప్రతాపరుద్రుని యాస్థానపండితుఁడగు విద్యానాథమహాకవి ప్రతాపరుద్రీయములో నాటకప్రకరణముసఁ త్రిలింగదేశప్రశంసను దెచ్చెను.

"స్వామిం స్త్రిలింగదేశపరమేశ్వర !"

"యై ర్దేశ స్త్రిభి రేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
యేషాం కాకతిరాజకీర్తివిభవైః కైలాసశైలాః కృతాః
తే దేవాః ప్రసరత్ప్రసాదమధురా శ్శ్రీశైలకాళేశ్వర
ద్రాక్షారామనివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు

నాటకప్రకరణము. పంచమాంకము. శ్లో. 44

విద్యానాథమహాకవికిఁ దర్వాతివాఁడైన నరహరి తన హర్షనైషధవ్యాఖ్యలోఁ త్రిలింగక్షితిపతిని జేర్కొనెను [10]

"యం ప్రాసూత త్రిలింగక్షితిపతిసతతారాధితాంఘ్రిస్స్వయంభూః
పాతివ్రత్యైకసీమా సుకవిసరహరిం నాలమా యస్య మాతా

10 శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు తాము రచించిన శృంగార శ్రీనాథగ్రంథములోఁ దృతీయప్రకరణము పుట ౧౦ లో నుదాహరించిరి.

యం విద్యారణ్యయోగీ కలయితి కృపయా తత్కృతే దీపికాయా
మాద్య స్స్వర్గోఽతిమాద్య త్త్రికులవిజయాచారునీరాజితోఽభూత్.

విద్యానాథ మహాకవియు, నరహరియుఁ బహునాళ్లవ శతాబ్దారం భమునను న్నవారు.

బ్రహ్మాండపురాణము ననుసరించి, "యాంధ్రవిష్ణు వనువాఁడు శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వరమును, మహేంద్రపర్వతముతోఁ గూడఁ గలియునట్లుగాఁ బ్రాకారములు నిర్మించి యామూఁటిని ద్వారములనుగాఁ జేసె ననియు, ఈద్వారములయం దీశ్వరుఁడు శూలపాణియై ప్రమథగణములచేఁ గొలువఁబడుచు లింగరూపములను దాల్చి యందుండెననియు, ఆంధ్రవిష్ణువు సురలసహాయమును బొంది దానవాగ్రేసరుఁడగు శంభునితోఁ బహుమూఁడుయుగములు యుద్ధముచేసి వానిని హతుని గావించి గోదావరితటమునందలి ఋష్యాశ్రమములతో వాని నివాసము నాక్రమించుకొనెననియు, అప్పటినుండియు నీదేశము త్రిలింగమను పేరఁ బఱగుచున్నదనియుఁ" దెలియుచున్నది. స్కాందపురాణములోఁ ద్రైలింగులని యాంధ్రులు వక్కాణింపఁబడిరి. విద్యానాథమహాకవి, శ్రీశైల, కాళేశ్వర, ద్రాక్షారామములందలి త్రిలింగములను బేర్కొని త్రిలింగదేశప్రశంస సల్పియున్నాఁడు. అథర్వణాచార్యుఁడు త్రిలింగశబ్దానుశాసన మను నాంధ్రవ్యాకరణము రచించి త్రిలింగశబ్దములకు వ్యాకరణము వ్రాసెదనని చెప్పియున్నాఁడు. ఆంధ్రదేశము త్రిలింగాఖ్యపూటచేతఁ దద్దేశభాషకును త్రిలింగభాషయను నామ ముద్భవించెను. ప్రజలును ద్రైలింగులని వ్యవహరింపఁబడిరి.

విద్యానాథమహాకవికి నూఱుసంవత్సరములు తర్వాతనుండిన విన్నకోట పెద్దన్న విశ్వేశ్వరభూపతి కంకితమిచ్చిన కావ్యాలంకారచూడామణిలోఁ ద్రిలింగభాషనుగూర్చి యిట్లువ్రాసియున్నాఁడు.

క. ధరశ్రీపర్వత కాళే
శ్వర ద్రాక్షారామ సంజ్ఞవఱలు త్రిలింగా

కరమగుట నంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగదేశ మనఁజను గృతులన్.

ఆ. వె. త త్త్రిలింగపదము తద్భవం బగుటచేఁ
దెలుఁగు దేశమనఁ గఁ దేటపడియె
వెనుకఁ దెనుఁగు దేశమును నంధ్రు కొంద ఱి
బ్భాషపంచగతులఁ బరఁగుచుండు.

నవమోల్లాసము. ప. 5. 6.

పెద్దన కావ్యాలంకారచూడామణిని క్రీ. శ. 1402 తర్వాత రచించియుండెనని, తగిన యాధారములతో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిదివఱకు భారతిలో నిర్ణయించియున్నారు.11

విన్నకోట పెద్దన్నకు సమకాలికుఁడును రెడ్డిజన పాలకుఁడైన పెద్దకోమటి వేమభూపాలుని యాస్థానకవియునైన వామనభట్టబాణుఁడు రచించిన వేమభూపాలీయములోఁ దెలుఁగుదేశమును ద్రిలింగజనపదముగాఁ జెప్పియున్నాఁడు.

"...యూథపతి రివ అసంఖ్యధేనుకానుగతః సముపచిత
సకలధర్మలింగ స్త్రిలింగోనామ జనపదః.—

వేమభూపాలీయము. పుట. 10

"...కలితకలిబలభంగ త్రిలింగాధినాథ కళింగోఽయం..."

వేమభూపాలీయము. పుట. 93

కవిసార్వభౌముఁడైన శ్రీనాథుఁడు పెదకోమటి వేమభూపాలుని కడ విద్యాధికారిగానుండెను. వామనభట్టబాణుఁడును శ్రీనాథుఁడును సమకాలికులు. పెదకోమటి వేమభూపాలుని కుమారుఁడైన రాచవేముని మరణానంతరము, శ్రీనాథుఁడు రాజమహేంద్రవరము రాజధానిఁగాఁ దెలుఁగుదేశమును బరిపాలించిన వేమారెడ్డి, వీరభద్రారెడ్ల యాస్థా

11 విశ్వేశ్వరభూపతి-విన్నకోట పెద్దన్న. విభవసంవత్సర భాద్రపద్ద మాససంచికలోని కలగూరగంప యందలి శ్రీశర్మగారి వ్యాసము.

సముఁకువచ్చి, వారిచే సన్మానింపఁబడి, భీమఖండాది గ్రంథములను రచించెను. వేమారెడ్డి వీరభద్రారెడ్లకుమంత్రియగు బెండపూడి అన్నమంత్రి కంకితమిచ్చిన భీమేశ్వరపురాణములో శ్రీనాథుఁడు త్రిలింగపదమును బహుళముగాఁ బ్రయోగించెను. భీమఖండమునుండి యాప్రయోగములను జూపెదను.

(1) "భూపాలగ్రామణులను త్రిలింగ భూమండలాఖండలులను"

పుట 6.

(2) "మహీమండలమునకు మకరకుండలాలంకారంబునుం బోలె భీమేశ్వరమండలంబు పొరువునఁ ద్రిలింగోత్కలతలంబుల నంది"

పుట 28.

(3) "కాంచెన్ సర్వపురాభిధానముఁ ద్రిలింగక్షోణి వైకుంఠముణ్"

పుట 30.

(4) "త్రిలింగవిషయ మంగళాలంకారంబగు భీమేశ్వరమండలంబున"

పుట 55.

(5) "శ్రీకంఠుండు త్రిలింగభూవలయముణ్ శ్రీభీమనాథేశ్వరుం..."

పుట 109.

శ్రీనాథుఁడు స్కాందపురాణమునందలి గోదావరీ ఖండాంతర్గత శ్రీమద్దాక్షారామ భీమేశ్వరమాహాత్మ్యము నాంధ్రభాషాప్రబంధమున రచించెను. మూలములో రెండుమూఁడుచోట్లఁ ద్రిలింగపదమున్నను, శ్రీనాథుఁ డాంధ్రీకరణములోఁ బెక్కుచోట్ల త్రిలింగపదమును సందర్భానుసారముగ నుపయోగించుకొనెను. శ్రీనాథునితర్వాతి యాంధ్రకవులు, ఆంధ్రదేశమునకును, ఆంధ్రభాషకును ద్రిలింగదేశము, త్రిలింగభాష యని నామాంతరములుగా వాడియున్నారు.

శాసనములలోఁ ద్రిలింగదేశప్రశంస.

పదునాల్గవ, పదునైదవ శతాబ్దములందలి తెలుఁగుదేశమునకు సంబంధించిన శాసనములలో నాంధ్రదేశమునకుఁ ద్రిలింగదేశమని లిఖిం

పఁబడెను. వానిలో నాకుఁ దెలిసినంతవఱకు మొట్టమొదటిది ముమ్మిడి నాయకుని శ్రీరంగము శాసనము అది శా. శ. 1280 అనఁగా క్రీ. శ. 1358 నాఁటిది.[12] సింగయ నాయకుని యక్కలంపూడి శాసనములోఁ ద్రిలింగదేశము వర్ణింపఁబడెను. ఆశాసనకాలము, శా. శ. 1290. అనఁగా క్రీ. శ. 1368.

"దేశాస్సహస్రం భరతస్య ఖండే దోవ్యం త్యఖిలవస్తుశస్తాః"
"తేషాంశిరోభూషణ మేవ దేశా స్త్రిలింగనామాసుకృతైకసీమా"
"త్రిలింగదేశాధిపతిః శ్రీమా న్కేశవనాయకం
యేన భూపా దిలీపాద్యాః స్మర్యా ద్విస్మారితాఇవ"[13].

రెడ్లకాలమునాఁడు తెలుఁగుదేశమునకుఁ ద్రిలింగసంజ్ఞయే వ్యవహారసిద్ధమై యున్నట్లు, ఆ కాలమునాఁటి శాసనములే ప్రమాణములు. శ్రీనాథుని పొన్నుపల్లి, ఆలపాడు శాసనములలోఁ ద్రిలింగపదమే యుపయోగింపఁబడెను.[14]

పొన్నుపల్లిశాసనములో (క్రీ. శ. 1408)
శ్లో॥ ప్రాదా త్త్రిలింగవిషయే వెల్నాడో ర్ధివిసీమని
కృష్ణవేణ్యా స్తరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితః॥
ఆలపాడుశాసనములో (క్రీ. శ. 1413)
శ్లో॥ ప్రదా త్త్రిలింగవిషయే వెలనాండో మనోరమే
తుంగభద్రాతరంగిణ్యాః ప్రాక్తీరే పర్యవస్థితః॥

అట్లే పెక్కింటి రెడ్లశాసనములలో నాంధ్రదేశమునకుఁ ద్రిలింగసంజ్ఞయే గలదు. క్రమక్రమముగా నాంధ్రసారస్వతములోఁ గవులు

12. Epigraphia Indica Vol XIV, Page 83.

13. Epigraphia Indica Vol XIII Akkalampudi grant of Singayanayaka P. 259

14. పై రెండుశాసనముల నకళ్లు శ్రీ వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవుల చరిత్రము ప్రథమభాగములో శ్రీనాథకవిచరిత్రమునం దిచ్చినారు. ఆలపాడుశాసనము Epigraphia Indica Vol. XI. P. 316-319 చూడుఁడు.

త్రిలింగపదమునే బహుళముగాఁ బ్రయోగించిరి. ఉదాహరణములఁ గొన్నిటినిచ్చి మఱియొక విషయమును జర్చించెదను.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవియగు రాధామాధవకవి విష్ణుమాయానాటకములో మూఁడవ యాశ్వాసమునఁ బుండరీకుని కథ వర్ణించుచు సుభిక్షమగు దక్షిణదేశమునందలి వివిధరాజ్యములనుగూర్చి వ్రాయు సందర్భమునఁ ద్రిలింగదేశమును బ్రశంసించెను.

సీ. కర్ణాటరాజ్యంబు గంభీర తుంగభ
ద్రాజలౌఘంబులఁ దఱచు పండు
ద్రావిడదేశ ముత్తరపల్లోర్మిరమ్యకా
వేరికాలువల ముక్కారుఁ బండుఁ
దైత్రిలింగ్యమధ్యభూతలము కృష్ణా గౌత
మీ ప్రవాహంబుల మిగులఁ బండుఁ
గాళింగమధ్యదిక్ఖండంబు లాంగూల
శారదానదులచేఁ జాలఁబండు

గీ. వెండియును జిత్ర మిట్లనావృష్టియైన
నంబుజాక్షి ! నభోనభస్యద్వయమున
వర్ష మొప్పార గౌతమి వరదమునపఁ
బార్శ్వములయూళ్లఁ బదివేలుఁ బండునెపుడు.

తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రములోఁ గవిస్తుతియందుఁ గవిత్రయమునుఁ దలఁచు సందర్భములోఁ ద్రిలింగభాషను బేర్కొనెను.

గీ. ఏ మహాత్ములు ముప్పురు నిలఁ ద్రిమూర్తు
లట్లు గుఱియై త్రిలింగభాషాహ్వయము య
థార్థమొనరించి రట్టి శబ్ద
శాసనుని దిక్కమఖి శంభుదాసుఁదలఁతు.

అహోబలపతి కాళిందీకన్యాపరిణయము ద్వితీయభాగము షష్ఠాశ్వాసమునందలి యిరువదియేడవ పద్యములోఁ గస్తూరి చుక్కబొట్టు ప్రాకృత త్రిలింగభాషల వలె నున్నదని వర్ణించెన్లు.

గీ. ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి
ప్రాకృతాఖ్యైకభాషనా భావిత ద్వి
రేఫవైఖరి గలిగి త్రిలింగదేశ
సూక్తి యన నొప్పుఁ గస్తూరి చుక్కబొట్టు.

పదునేడవ శతాబ్దమునందుండిన కాకనూరి అప్పకవి తన వ్యాకరణము లోఁ దనకు మూఁడువందల సంవత్సరములకుఁ బూర్వమునన్నున్న విన్న కోట పెద్దన్న, విద్యానాథమహాకవులు తెలుఁగుదేశమునకుఁ ద్రిలింగ దేశసంజ్ఞ యెట్లు పరిఢవిల్లెనని జెప్పెనో యా పాఠమె, తానును నొప్పఁ జెప్పెను.

కం. శ్రీక్షితిధర కాళేశ్వర
ద్రాక్షారామంబులనఁగ దనరారెడు నీ
త్రిక్షేత్రంబులలింగము
లేక్షితిని ద్రిలింగసంజ్ఞ కెన్నిక కెక్కెన్.

గీ. తత్త్రిలింగనివాసమై తనరు కతన
నాంధ్రదేశంబు దాఁ ద్రిలింగాఖ్యమయ్యెఁ
దెలుఁగగుచుఁ దద్భవము దానివలనఁ బొడమె
వెరుక కొందఱు దానినే తెనుఁగు నంద్రు.

పదునెనిమిదవశతాబ్దాదినుండిన గణపవరపు వేంకటపతికవిఆంధ్ర కౌముదిలోఁ ద్రిలింగపదమునకుఁ దద్భవమె తెలుఁగని చెప్పెను.

"తత్త్రిలింగపదంబు తద్భవంబగుటచేఁ దెలుఁగనఁదగె, నట్టి తెలుఁగు ప్రాకృతాభిధానముగాన నాలక్షణమ్ములు తొలుతఁగవులకెల్ల తెలియవలయు."  ఆంధ్రకౌముది మొదటిపుట సీసమాలిక.

ఆంధ్రత్రిలింగమధ్యమదేశము.

క్రీ. శ. 1589 సంవత్సరమునాఁటి గంజాముజిల్లాలోని యొక శాసనములోగోల్కొండనవాబునకు మహమ్మదీయసేనానాయకుఁడొకఁడు, ఆంధ్రత్రిలింగమధ్యము దేశమునందలి ముప్పదినాల్గుకోటల కధికారియని

వర్ణింపఁబడెను. ఈశాసనములో త్రిలింగదేశము, ఆంధ్రదేశము వేఱు వేఱుగాఁ జెప్పఁబడుటచే, రెండును నొక్కటిగాదని స్ఫురించినను, త్రిలింగపదవ్యాప్తికి మాత్రమీశాసనము తోడ్పడుచున్నది.[15]

## త్రిలింగపద మెప్పటినుండిపుట్టినది ?

తెలుఁగు త్రిలింగపదప్రయోగములను జూపినతర్వాత నీరెంటిలో నే పదము ముందుపుట్టినదో మనమిప్పుడు నిర్ధారణము చేయవలెను. మార్కండేయపురాణములో త్రిలింగ లేక తెలుగుపదమున్నట్లును, స్కాందబ్రహ్మాండపురాణములో త్రిలింగపదమున్నట్లును బ్రయోగములఁ జూపితిని. ఈమూఁడుపురాణములలో నేదిపురాతనమో పండితు లేగతి నిర్ణయించిరో తెలిపెదను.

(1) విల్సన్ (H. H. Wilson) పండితుఁడు విష్ణుపురాణరచనా కాలమునుగూర్చి చర్చించుచు మార్కండేయపురాణము తొమ్మిది పదియవశతాబ్దములకాలమునాఁటిదని చెప్పెను.

It is not easy to conjecture the date of this purana (Markandeya) it is subsequent to the Mahabharata, but how long subsequent it is doubtful. It is unquestionably more ancient than such works as the Brahma, Padma, and Naradiya puranas; and its freedom from sectarial bias is a reason for supposing it anterior to Bhagavata. At the same time, its partial conformity to the definition of a purana, and tenor of the additions which it has made to revised legends and traditions indicate a not very remote age, and in the absence of any guide to a more positive conclusion, it may conjecturally be placed in the ninth or tenth centuries.

The Vishnu purana. Preface XXXVI.

(2) డౌసన్‌గారి నిఘంటువులో మార్కండేయపురాణ మెనిమిదవశతాబ్దమునాఁటిదని తెలుపఁబడెను.

Prof. Bannerjea places it in the eighth century.

Hindu classical Dictionary. Dowson P. 204.

---

15. No. 187 of Madras Epigrahical Collections for 1913.

(3) రాజేంద్రహజ్రాయను హైందవపండితుఁడు విష్ణుపురాణరచనాకాలమును జర్చించుచు, మార్కండేయపురాణము విష్ణుపురాణముకంటెఁ బూర్వపుదనియు, విష్ణుపురాణము నాల్గవ శతాబ్దారంభమున రచియింపఁబడియుండవచ్చుననియు నిర్ణయించెను. మార్కండేయపురాణము నాల్గవశతాబ్దమునకుఁ బూర్వమె పుట్టియుండవలెను.

"Thus the date of composition of Vishnupurana falls between the first and the middle of the fourth century A. D., that is, between 100 A. D. and 350 A. D. The nature of smriti contents of the Vishnupurana as compared with those of the Markandeya purana tend to show that the former is later than the latter. So it is highly probable that the Vishnupurana was written in the last quarter of the 3rd or the first quarter of the 4th century A. D."

Annals of Bhandarkar Institute. Vol XVIII.
Part III P. 268-269.

(4) ఏడవశతాబ్దారంభమునందున్న బాణుఁడు రచించిన చండికాశతకమునకు మాతృక మార్కండేయపురాణమునందలి దేవీమాహాత్మ్యమే కాని బర్నల్ (Burnell) పండితుఁడు చెప్పియున్నాఁడు. కావున మార్కండేయపురాణ మేడవశతాబ్దమునకుఁబూర్వమె రచియింపఁబడియుండవచ్చును.

Indian Antiquary Vol XXV. P. 325-38.

(5) స్కాందబ్రహ్మాండపురాణములు లెక్కలు లేనన్ని సంహితలు, ఖండములు, మాహాత్మ్యములతోఁగూడి యున్నవనియు, నెవరికిఁ దోఁచినప్పుడు వారు, అట్టి సంహితలను, ఖండములను, మాహాత్మ్యములను రచించి, వానిలోఁ జేర్చుచుండిరనియు, నూతనములగు ప్రక్షిప్తశ్లోకములనేకములు కలుపఁబడుచుండెననియు, నాంగ్లపురాణపరిశోధకులేమి, యాంధ్రపండితులేమి యొప్పుకొన్నవిషయమె. వీని రచనాకాలము స్థిరపఱచుట శక్యముగాదు. బ్రహ్మాండ, స్కాందపురాణములందుఁ ద్రిలింగశబ్దము దేశపరముగా నాంధ్రదేశమునకు వ్రాయఁబడియున్నది. బ్రహ్మాండపురాణమునందుఁ ద్రిలింగశబ్దోత్పత్తి నుడువఁబడెను. శ్రీశైలము,

భీమేశ్వరము, కాళేశ్వరము, అను త్రిలింగముల మధ్యనున్న దేశమునకు త్రిలింగదేశమను నామ ముత్పన్నమైనదని చెప్పఁబడెనుగదా. రెండవది యగు భీమేశ్వరము గోదావరిజిల్లాలోని రామచంద్రపురముతాలూకాలోనున్న దక్షారామము లేక ద్రాక్షారామ మనుగ్రామమే. ఇచ్చట భీమేశ్వరస్వామియాలయమున్నది. ఈస్థలమాహాత్మ్యము స్కాందపురాణాంతర్గతము. ఈమాహాత్మ్యమునే శ్రీనాథుఁడు భాషాంతరీకరించి, భీమేశ్వర పురాణమను నామ మిడి, బెండపూడి అన్నమంత్రి కంకితమిచ్చెను. శ్రీనాథుఁడె భీమేశ్వరపురాణము ప్రథమాశ్వాసమునం దీపురాణమును గూర్చి యిట్లు వ్రాసెను.

"సర్గప్రతిసర్గవంశమన్వంతరవంశానుచరితంబు లను పంచలక్షణాంబులతోడంగూడి సపాదలక్షగ్రంథసంఖ్యాసమన్వితంబై పంచాశత్ఖండమండితంబై బహుసంహితాసమాకీర్ణంబై యొప్పు శ్రీ మహాస్కాందంబను నాదిపురాణంబునందు గోదావరీఖండంబు శ్రీమద్దక్షారామ భీమేశ్వర మాహాత్మ్యసంయుతంబగుటం జేసి భీమేశ్వరపురాణం బనంబరఁగు, నది యాంధ్రభాషాప్రబంధముగఁ జెప్పందొడంగితి."

ఈభీమేశ్వర మాహాత్మ్యములోని చరిత్రాత్మకమైన విషయమును వెల్లడించినచో మా చదువరులు మనప్రాచీనుల పురాణరచనాప్రాగల్భ్యమును మెచ్చుకొనఁదగుదురు. డాకిరేమియను ప్రాచీనగ్రామనామమునకు దక్షారామమను సంస్కృతనామ మొసఁగి, యాదక్షారామము నేదక్షయజ్ఞనాగారముగా మార్చి, దానికి దక్షాధ్వరపురాణగాథను ముడి వెట్టి, మధ్యమున మొదటిచాళుక్యభీమవిష్ణువర్ధనుఁడు తనపేరిట నీశ్వరాలయమును నిర్మించినపిదప, శివుఁడు భీమేశ్వరుఁడను పేరితో నచ్చట సాక్షాత్కరించి యుండెనని, యొక పెద్దపురాణగాథ గల్పింపఁబడెను. ఈభీమపురాణములోనే చాళుక్యభీముఁడునిర్మించిన చాళుక్యభీమవరము వర్ణింపబడెను. ఈచాళుక్యభీముఁడు వేంగిరాజ్యము క్రీ. శ. 888 మొదలుకొని క్రీ. శ. 918 వఱకును బాలించెను. అనఁగా నీదక్షా

రామమను పేరుగల భీమేశ్వరమును, చాళుక్యభీమవరమును పదియవ శతాబ్దారంభమునుండి మాత్రమె వెలసియుండెనని స్పష్టముగదా. ద్రాక్షారామగ్రామమునందలి భీమేశ్వరాలయములో నత్యంతము ప్రాచీనములైన శాసనములు పదునొకండవశతాబ్దమునాఁటివి గలవు.[16]

కావున స్కాందపురాణాంతర్గతమైన భీమేశ్వరపురాణమునకుఁ గారణభూతమైన చరిత్రాత్మకవిషయములు పదియవ పదునొకండవ శతాబ్దారంభమునందు జరిగియుండెను. ఆ స్కాందపురాణరచనాకాల మీయొక్కవిషయమునుబట్టి పరిశీలించినయెడల పదునొకండవ శతాబ్దమునకుఁ

16. చాళుక్యభీముని అత్తిలితామ్రశాసనమును ప్రకటించిన శ్రీ లక్ష్మణరావుగారిట్లు వ్రాసియున్నారు.

చాళుక్య భీముఁడు 360 యుద్ధములలో విజయుండై తనపేరిట చాళుక్య భీమేశ్వరదేవునిఁ బ్రతిష్ఠించి దేవాలయములు నిర్మించెనని పిఠాపురమునందలి మల్లపదేవుని శిలాశాసనమువలనఁ దెలియుచున్నది. ఆగ్రామమునకును భీమవర మను పేరువచ్చెను. అయ్యది సామర్లకోట సమీపమునందున్నది. ఈగ్రామమునకుఁ బూర్వము చాళుక్య భీమనగరి లేక చాళుక్య భీమపట్టణమని పేరుండెనని యిచ్చటి శాసనములవలనఁ దెలియుచున్నది. ఈ రాజే ద్రాక్షారామమున భీమేశ్వరుని దేవాలయము నిర్మించెను.

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.
సంపుటము 11. సంచిక. 6 పుట 250.

చాళుక్యభీముఁడు చాళుక్యభీమవరమును నిర్మించినట్లు శ్రీనాథుని సమకాలికుఁడైన విన్నకోట పెద్దన్న తన కావ్యాలంకార చూడామణిలో విశ్వేశ్వర భూపతి వంశావతార వర్ణనములోఁ జెప్పియున్నాఁడు. ఆ విషయమే విశ్వేశ్వరభూపతి పంచధారలలోనున్న ధర్మలింగేశ్వరస్వామి దేవాలయములోనున్న శాసనములో సహితము గలదు.

" భృతకుమారారామభీముండు చాళుక్య
భీముఁడే నృపకులాగ్రణి విధుండు "

పిఠాపురము మల్లభూపతి శాసనమునకు Ep. Ind. Vol IV. P. 226, విశ్వేశ్వర భూపతి ధర్మలింగేశ్వరాలయ శాసనమునకు, Ep. Ind. Vol. 19. P. 164. చూడనగును. దక్షారామశాసనములు చాళుక్య భీమవరశాసనములు. South Indian Inscriptions Vol. IV ; V. చూడనగును.

బూర్వపుగాదని స్పష్టముగాఁ జెప్పవచ్చును. ద్రాక్షారామభీమేశ్వరుని ప్రశంస నన్నయభట్టుభారతములోఁ గలదు.

మహాభారతము ఆదిపర్వము సప్తమాశ్వాసమునందలి మొదటి పద్యమును, ఆరణ్యపర్వము ప్రథమాశ్వాసమునందలి మూఁడువందల తొంబదితొమ్మిదవ పద్యమును రాజరాజు దక్షారామభీమేశ్వరదయా లబ్ధసుస్థిరైశ్వర్యప్రదుఁడని స్ఫురింపఁజేయుచున్నవి.

కం. బిరుదాంక భీమభీమే
శ్వర కృతనిత్యప్రసాద సౌజన్యగుణా
భరణ పరగండభైరవ
వరనృపమణిమకుటఘటితపదవిబుధనుతా.

కం. శ్రీరాజరాజ వీర
శ్రీరమణీరమ్య గంధసింధురహాయ శి
క్షారూఢవక్ష దక్షవ
ఖారి దయాలబ్ధ సుస్థిరైశ్వర్యప్రదా.

నన్నయభట్టు మహాభారతాదిపర్వమున నర్జునుని తీర్థయాత్రా సందర్భమున కళింగదేశమును, పురుషోత్తమక్షేత్రమును, మహేంద్ర పర్వతమును, గోదావరిని, భీమేశ్వరమును, శ్రీశైలమును జెప్పి, తర్వాత వేంగిదేశవిభవమును వర్ణించెను. అనఁగా నన్నయభట్టుకాలమునాఁటికి బ్రహ్మాండపురాణములోఁ జెప్పబడిన శ్రీశైలము, భీమేశ్వరములందు మాత్రము శివుఁడు లింగరూపమును దాల్చియుండెననియుఁ ద్రిలింగ ములలో మూఁడవదియగు కాళేశ్వరమునం దింకను సాక్షాత్కరించి యుండలేదనియుఁ జెప్పవచ్చును.

"వ. కళింగవిషయంబు సొచ్చునంతఁ దోడిబ్రాహ్మణులు కళింగ ద్వారంబునఁ గ్రమ్మఱి యుత్తరదేశంబులకుం జనిన నందుఁ గతిపయ బ్రాహ్మణసహాయుండై పార్థుం డరిగి పూర్వసముద్రతీరంబునఁ బురుషో త్తమదేవునకు నమస్కరించి మహేంద్రపర్వతంబు సూచుచు."

సీ. దక్షిణ గంగనాఁ దద్దయునొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీదేశ
విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి

తే. ణాంబురాశితీరంబున కరిగి దురిత
హారియైన కావేరిమహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమ
తార్థదానంబుఁజేసి కృతార్థుఁడగుచు.

మహాభారతము. ఆదిపర్వము. అష్టమాశ్వాసము. పద్యము. 139

నన్నయభట్టు తాను బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాన నిరతుఁడ నని చెప్పుకొనెనుగదా. నన్నయనాఁటికి బ్రహ్మాండపురాణము రచియింపఁబడి యుండవలెననియు, నద్దానిని నన్నయ చదివియుండవలెననియుఁ జెప్పవచ్చును. అట్టి బ్రహ్మాండపురాణములోఁ ద్రిలింగదేశ ప్రశంసయున్నయెడల నన్నయభట్టు వేంగీదేశమును, వేంగీదేశవిభవమును వర్ణించి, శ్రీశైల భీమేశ్వరములను మాత్రము పేర్కొని, కాళేశ్వరమును విడిచిపెట్టుట గమనించినయెడల, నతనికాలము నాఁటి కాంధ్రదేశమునకుఁ ద్రిలింగసంజ్ఞ జనించియుండలేదని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. తెలుఁగుదేశమునకుఁ ద్రిలింగనామము చాళుక్యులతరువాత నాంధ్రదేశమును బరిపాలించిన కాకతీయులకాలమున నుద్భవించెననుటకుఁ బన్నెండవ, పదునాల్గవ శతాబ్దములయందలి శాసనములును, సారస్వతమును జెప్పక చెప్పుచున్నవి. ఆకాలమునాఁటి పండితులెవరో త్రిలింగసంబంధమైన ప్రక్షిప్త శ్లోకమును బ్రహ్మాండపురాణములోఁ జేర్చియుందురు. అందుచేతనే కాఁ

బోలు కొందఱు చరిత్రకారులు బ్రహ్మాండ, స్కాందపురాణములు, తస్కరపురాణములని మొగమోటములేకుండఁ జెప్పివైచిరి. ఆవిషయమిచ్చటఁ జెప్పినందులకుఁ బండితులు నన్ను క్షమింతురుగాక. కెప్టన్-విల్ఫర్డు దొరగారు బ్రహ్మాండ, స్కాందపురాణములను దొంగపురాణములనియు, బూటకపు పురాణములనియుఁ జెప్పిరి.

" Other imposters have had recourse to Scanda, Brahmanda, and Padmapuranas, a great part of which is not at present found, and for that reason, they are called the puranas of thieves and imposters, though the genuineness of such parts as are in common use has never been questioned.

' Asiatic Researches Vol. VIII. P. 252. " Sacred isles in the West" by Captain F. Wilford.

పై దొరగారితో విల్సన్‌దొరగా రేకీభవించి బ్రహ్మాండస్కాంద పురాణములలో నమ్మఁదగని యైతిహాసికవిశేషములెన్నో కలవని చెప్పిరి. వారు బ్రహ్మాండ, స్కాందపురాణములను గూర్చి వ్రాసినవిషయము విపులముగ నిం దిచ్చుచున్నాను.

## Date of Skandapurana.

It is informally agreed that the Skandapurana in a collection form has no existence and the fragments in the shape of Samhitas, Khandas, and Mahatmyas, which are affirmed in various parts of India to be portion of purana, present a much more formidable mass of stanzas than even the immense number of which it is said to consist. The most celebrated of its portions in Hindustan is Kasikhanda, a very minute description of the temples of Siva, in or adjacent to Benares, mixed with directions for worshipping Maheswara and a great variety of legends explandory of its merits, and of the holiness of Kasi ; many of them are puerile and uninteresting, but some are of a higher character. The story of Agasthya records probably, in a legendary style, the propagation of Hinduism in the South of India ; and in the history of Divodasa, King of Kasi, we have an:embellished of temporary depression of the worship of Siva, even in its metropolis, before the ascendency of the followers of Budha. There is every reason to believe that greater

part of the contents of Kasikhanda anterior to the first attack upon Benares by Mohamad Ghazni.

P. 44. Introduction to
" Vishnupurana " H, H. Wilson.

Date of Brahmandapurana.

Brahmandapurana is usually considered to be in much the same predicament as the Skanda, no longer procurable in a collective body, but represented by a varieties of Khandas, and Mahatmyas, professing to be derived from it. The fecility with which any tract may be thus attached to the nonexistont original, and the advantage that was taken of its absence to compile a variety of unauthentic fragments have given to the Brahmanda, Skanda, and Padma, according to Captain Wilford, the Character of the puranas of thieves and impostors.

P. 54 of preface to
Vishnupurana, H. H. Wilson.

బ్రహ్మాండ, స్కాందపురాణములకంటెను బ్రాచీనమైనది మార్కండేయపురాణము. మొదటి రెండుపురాణములకు సంభవించిన యపవాదము మార్కండేయపురాణమునకుఁ బట్టలేదు. కావునఁ దత్పురాణమునందలి తిలంగపదము, శాసనములందలి తెలుఁగుపదములె త్రిలింగపదముకంటె పూర్వపుపదములనిస్పష్టము. ఈ త్రిలింగపదము కాకతీయ రాజ్యకాలమునఁ బ్రభవించి, రెడ్డిరాజ్యకాలమున నాంధ్రదేశమున సారస్వతములోను, శాసనములలోను బహుళవ్యాప్తినిగాంచెను. తెలుఁగుపదము వేఱు. త్రిలింగపదము వేఱు. రెండింటికిని సంబంధమేమియును లేదు. ఒకదానినుండి రెండవది జనింపలేదు. అదియునుఁగాక నాంధ్రవిషయమున కొక్కదానికె త్రిలింగసంజ్ఞ కలదని యూహింపరాదు. ఆంధ్ర రాజులను ద్రిలింగాధిపతులని పిలువఁబడుటలేదు. త్రిపురికాలచుర్యరాజ వంశజులకుఁ ద్రిలింగాధిపతులన్న పేరుగలదు. ఆవిషయము నిచ్చటఁ జర్చించెదను.

కాలచుర్యులు త్రిలింగాధిపతులా ?

పదియవశతాబ్దారంభమునఁ గాలచుర్యప్రభువులలో నొక్కఁడగు మొదటియువరాజ దేవుఁడు బలదర్పశౌర్యములచేఁ బ్రఖ్యాతిని గాంచి

దక్షిణహిందూదేశమందలి కుంతల, కొంకణ పాండ్య, కర్ణాట, ఆంధ్ర, సింహళ రాజ్యాధిపతులను పయోష్ణీయుద్ధములో జయించెనని, రాజశేఖరమహాకవి రచించిన విద్ధసాలభంజికయను నాటకములోఁగలదు. ఈసందర్భమునరాజశేఖరకవి వ్రాసిన యొకశ్లోకము నుదాహరించుచున్నాను.

శ్లో॥ కర్ణాటీ యుద్ధతంత్రే చతురతరమతిః సింహళః సింహకర్మా
పాండ్యశ్చండాసియష్టి స్ఫురళపరివృఢః కార్ముకప్రౌఢవాహః
ఆంధ్రో నీరంధ్రసారః సమరభువిసురః కుంతలః కుంతలేశః
కించాన్యేకొంకణాద్యా అపినరపతయః సంశ్రితా సంఘవృత్తిమ్॥

చతుర్థాంకము.

రాజశేఖరుఁ డీనాటకమును క్రీ. శ. 935 సంవత్సరప్రాంతమున రచియించియుండెనని మిరాషీపండితుఁడు నిర్ణయించెను.[17] ఆనాటకమునకు నాయకుఁడైన యువరాజదేవుఁడు త్రిలింగాధిపతియని రెండుచోట్ల నాటకమధ్యమందు వర్ణింపఁబడెను.

(1) (నేపథ్యే) జయజయ త్రిలింగాధిపతే సుఖాయ మాధ్యందినీ సంధ్యాభవతు భవతః।......... ప్రథమాంకము.

(2) (తతః ప్రవిశతి భాగురాయణో దూతశ్చ)—

ఉభౌ: జయతు త్రిలింగాధిపోదేవః॥ చతుర్థాంకము. ఈనాటకమును శ్రీ జనమంచి వెంకట్రామయ్యగా రాంధ్రీకరించినారు. వారు పై భాగములకిచ్చిన భాషాంతరీకరణ మీదిగువ నిచ్చుచున్నాఁడను.

(తెరలో)

(1) జయజయ త్రిలింగదేశాధీశ్వరా! దేవరవారికీ మధ్యందినసంధ్య సుఖదాయిని యగుఁగాక !

(2) ... ...(తరువాత భాగురాయణుఁడును దూతయుఁ బ్రవేశించుచున్నారు.)

* 17. The 'Viddhasalabhanjika' K. B. Pathak Commemoration Volume P. 364. Prof. V. V. Mirashi.

ఉభయులు: త్రిలింగాధిపతులైన దేవరకు జయము.[18]

ప్రాచీనహిందూదేశ చరిత్రయందుఁ త్రికళింగాధిపతులని బిరుదుగలవారు, కాలచురి వంశ్యులగు చేదిదేశపురాజులును, కళింగదేశము నేలిన గంగవంశరాజన్యులును, కటకము నేలిన సోమవంశీయులగు నరపతులును మాత్రమె. కాఁబట్టి కాలచురివంశజుఁడగు యువరాజదేవునకు నుఁ త్రికళింగాధిపతియన్న బిరుదే యుండనోపుననియుఁ త్రిలింగాధిపతి యన్న బిరుదు లేఖకుని పొరపాటుచే యుండవచ్చుననియుఁ బరిశోధకుల యభిప్రాయమై యున్నది.[19]

కాలచుర్యులకుఁ త్రిలింగాధిపతులన్న బిరుదాంకము సంశయోపేతమని తెలిసికొన్నప్పుడు పదియవశతాబ్దమునందుండియుఁ త్రిలింగ పదము వ్యాప్తియందుండెనని చెప్పుటకు వీలులేదుగదా. ఒకపట్టున వాదముకొఱకు వారికాబిరుదు గలదని యొప్పుకొన్నను, ఆంధ్రదేశము నేలని త్రిలింగాధిపతులవలన నాంధ్రదేశమునకుఁ త్రిలింగాభిధానము గల్గిన దనియుఁ త్రిలింగమునుండియే తెలుఁగుపదముద్భవించెననియుఁ జెప్పఁ బూనుట నేలవిడిచి సాము జేయుటవంటిది.

త్రికళింగమునుండి తెలుగుపుట్టెనా?

"ఈ త్రికళింగము జనసామాన్యముచే నుచ్చరింపఁబడునప్పుడు కొంతకాలము జరుగునప్పటికి 'క' లోపించి త్రిలింగపదమే వ్యవహారములోనికి వచ్చియుండును. విదేశస్థులును త్రిలింగమనియే వ్యవహరించియుందురు. త్రిలింగపదము వ్యవహారమునకువచ్చి యభ్యాసపడి దేశమున నాటుకొన్నతర్వాతఁ త్రికళింగపదము జనులనుడులనుండి తొలఁగిపోయి

18. ఈవిద్ధసాలభంజిక సంస్కృతనాటకమును, దాని యాంధ్రభాషాంతరీకరణమును దెప్పించి యిచ్చిన శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు,ఎం.,ఎ. గారికిఁ గృతజ్ఞుఁడను.

* 19. Yuvarajadeva I of Tripuri.
Annals of Bhandarkar Institute Vol. XI. P. 361-373.

శాసనములందు మాత్రమె నిలిచియుండును. తరువాత నీదేశమును బాలించినవారిలో శైవమతస్థులయిన కడపటిపల్లవులకాలముననో, కాకతీయులకాలముననో, మొదటిచాళుక్యులకాలముననో త్రిలింగపదము మిక్కిలి ప్రాచీనమైనదై సట్లుగ్రబయత్నములు చేయఁబడియుండునుఅయి. నను క్రీస్తుశకము రెండవశతాబ్దమునందుండిన టాలెమీ యనునాతఁడు త్రిలింగమని వేర్కొనియున్నాఁడు. త్రికళింగమనుటకు త్రిలింగ మని యుండవచ్చును. దీనినంతయును బట్టిచూడఁగా కళింగమును బట్టియె యాంధ్రదేశమునకు త్రిలింగమనుపేరువచ్చినదనియే సముచితమనితోఁచుచున్నది" అనికీర్తిశేషుఁడైనఆంధ్రచరిత్రచతురాననుఁడు ఆంధ్రులచరిత్ర ప్రథమభాగమున వ్రాసియున్నాఁడు[20] ఇట్టి యభిప్రాయమునే శ్రీ జయపురసంస్థానాధీశ్వరులు శ్రీ విక్రమదేవవర్మగారు వెలిబుచ్చియున్నారు.

"మగధదేశీయుఁడును గుప్తవంశీయుఁడును నయిన భవదేవగుప్తుఁడు త్రికళింగాధిపతియని బిరుదమునుగొనియున్నట్లు క్రీ. శ. పంచమ శతాబ్దపు శాసనములలోఁ గొన్నిటియందుఁ గనఁబడుచుండుటవలనను, ఉత్కళింగము (మీఁదికళింగము), మధ్యకళింగము (నడిమికళింగము), తలకళింగము (క్రిందికళింగము) అను నామములవ్యవహారమువలనను గళింగము కొంతకాలమైనతర్వాత మూఁడుభాగములుగలదయి యుండెను. భవదేవగుప్తుఁడు సమగ్రకళింగమును శాసింపకున్నను, గొంతభాగమును మాత్రము శాసించుచుఁ ద్రికళింగాధిపతి బిరుదమునుగ్రహించి యుండనోపు. బిరుదము లత్యుక్తిపూర్ణములుగదా.

ఉత్కళింగమే యుత్కలముగాను, తలకళింగమే తెలుంగుగాను మాఱినదని కొందఱ యభిప్రాయము. అట్టి యభిప్రాయ మగ్రాహ్యము గాదు. కాళిదాసునికాలమునకుముందే యుత్కళింగ ముత్కలమై యుండును. కనుకనే యాయన మధ్యకళింగమునే కళింగమని నిశ్చయించుకొని దానికిని వంగదేశమునకును నడుమ నుత్కలమున్నట్లు వచించెను.

---

20. ఆంధ్రులచరిత్ర ప్రథమభాగము. పుటలు. 27. 28.

త్రిలింగమధ్యస్థితకారణమువలనఁ దెలుంగన్యోనను నూహాభరితహృదయములందుఁ దలకళింగమే తెలుంగయ్యెనను నూహాము చోటునొందకున్నను, మొదటి యూహముకంటె రెండవ యూహామే యధికతరయుక్తియుక్తము. చెప్పంబడుచున్న మూఁడు లింగములును సృష్ట్యాదిసంభవములుగాని యేకకాలప్రతిష్ఠితములుగాని కావనుట నిక్కము. ఆలింగముల ప్రతిష్ఠలకు మునుపు తన్మధ్యదేశము నామశూన్యముగ నుండెననుట యసమంజసము. మఱియుఁ బదములు మాఱునపుడు వర్ణాగమవర్ణలోపవర్ణవ్యత్యయములు బహుళములు. కాఁబట్టి తల కళింగమే తెలుంగయ్యెనని నానమ్మిక." [21]

పైయిద్దఱ యభిప్రాయములకును మూలము ఎలియట్‌దొర (Sir walter Elliot) తానువ్రాసిన 'దక్షిణహిందూదేశపునాణెములు'అనుగ్రంథములోని యీదిగువవాక్య మని నాకుఁదోఁచుచున్నది.

"త్రికళింగము జనసామాన్యమునోటఁబడి త్రిలింగమయ్యెను. ఆత్రిలింగపదమునుండియే యాంధ్రవ్యాకరణకర్తలు తెలుఁగుపదోత్పత్తిని గల్పించిరి."

"Trikalinga by an obvious eclipse may easily pass colloqnially into Trilinga, a form from which native grammarians have deduced the modern name of the Telugu dialect."

Foot note 4. Coins of Southern India P. 11.

చరిత్రచతురాననుఁడును బండితప్రభువును వ్రాసినవాక్యములు త్రోసిరాజని చెప్పుటకు సాహసించుచున్నాను. త్రిలింగపదమునుండి తెలుఁగుపదముదయించదని చెప్పిన పండితప్రభునితీర్పు న్యాయసమ్మతము. త్రికళింగము తెలకళింగమునుండి తెలుగుద్భవించెనని చేసిన నిర్ణయ మాదరణీయముగాదు. ఏల ?

(1) త్రికళింగమనునది ఇప్పటి విశాఖపట్టణ మండలము, ఓఢ్రరాష్ట్రముఁలోఁజేరిన గంజాముమండలములోని తెలుఁగుభాగమునకును సరివచ్చును. ఈభాగమునకే కళింగమనియెడి నామము శాసనము

21 కళింగసంచికలోని కళింగదేశపోత్సవ సభాసభ్యస్వాగతోపన్యాసము.

లలోను, ఆంధ్రసారస్వతమునందును గలదు. ఈభాగమునె వేంగీ చాళుక్యులును, కాకతీయులును, రెడ్లును జయించి తెలుఁగుదేశములోఁ గలిపివేసిరి. ఆభూభాగమునకుఁ ద్రికళింగమనియుఁ గళింగమనియు నామాంతరములుండుటచేతను, తెలుఁగుదేశము వేరనియుఁ ద్రికళింగ, కళింగదేశములు విషయాంతరములని తెలిసియున్నప్పుడును, త్రికళింగ, కళింగపదములనుండి తెలుఁగుపదముద్భవించియుండలేదని సులభముగా గ్రహించుకొనవచ్చును. గోదావరినదిమొదలుకొని, మిగిలిన దక్షిణ, పశ్చిమాంధ్రదేశమునకెప్పుడును గళింగమనిగాని, త్రికళింగమనిగాని నామములులేవు. త్రికళింగ, కళింగపదములు వ్యవహారము నందున్న కాలముననే, తెలుఁగు, తెనుఁగుపదములు వ్యాప్తియందుండెను. కావున, తెలకళింగము, త్రికళింగము నను పదములకును, తెలుఁగుపదమునకును సంబంధమేమియును లేదు.

(2) దేశనామమునుబట్టి దేశభాషకు నామముగలుగదు. రాష్ట్రవాసుల నామముననుసరించి, రాష్ట్రభాషకును, రాష్ట్రమునకును పేర్లు కలుగుట సర్వజనవిదితము. దేశనామమైన త్రికళింగము ననుసరించి, దేశభాషయైన తెలుఁగుపుట్టినదని చెప్పుట ధర్మముకాదు.

(3) తెలుఁగుదేశములో నంతర్భాగము త్రిలింగము, త్రిలింగములో నంతర్భాగము త్రికళింగము, లేక కళింగము. త్రికళింగమునుండి కాని, త్రిలింగమునుండిగాని, తెలుఁ గుద్భవించెనని చెప్పుట తగనిపని. త్రికళింగదేశమునందును, కళింగదేశమునందును తెలుఁగుభాషయే, తొమ్మిదియవ శతాబ్దమునందుండి మాతృభాషగానుండెను. మనదురదృష్టముచేఁ ద్రికళింగము, కళింగదేశములోని కొంతభూభాగమును, ఓఢ్రుల హస్తగతమైపోయినవి. త్రికళింగమునుండి త్రిలింగము, త్రిలింగమునుండి తెలుఁగుపదములు కలుగలేదు.

తిర్లింగము—త్రిలింగము—తెలుఁగు.

శ్రీ గోడవర్తి రామదాసుపంతులుగారు దాక్షార్ణవుని కుమారుఁ

డైన యింద్రవర్మపుర్లి తామ్రశాసనమును బ్రకటించి, శాసనప్రతిగ్రహీత యైన భవదత్తశర్మ తిరిలింగివాస్తవ్యుఁడని యుండుటఁజూచి, యీ తిరిలింగమే త్రిలింగమని యూహించిరి. ఈశాసనము క్రీ. శ. అయిదవ శతాబ్దమునాఁటిది.[22] ఆశాసనములోని భవదత్తశర్మనుగూర్చి వ్రాసియున్న భాగము నీక్రింద నిచ్చుచున్నాను.

"కౌశికసగోత్రాయ...సబ్రహ్మచారిణే తిరిలింగ
వాస్తవ్యాయ వేదవేదాంగపారంగాయ, భవదత్త
శర్మణే సమ్ప్రస్తదేవం విదిత్వా..."

తిరిలింగవాస్తవ్యాయ యను పదమునకు వారు తిరిలింగదేశవాస్తవ్యుఁడని యర్థమును జెప్పి, తిరిలింగమే, త్రిలింగపదమునకుఁ బూర్వరూపమని శాసించిరి. ఈతిరిలింగపదము నీవిధమున విభజించిరి. తిరిలి+ంగయని పదవిభాగమును జేసి యందులోని +ంగ యను ప్రత్యయాంతము బహువచనమును స్ఫురింపఁజేయుననియుఁ దిరిలి యేకవచనమగు నొక ప్రజనామధేయమనియు వారు వక్కాణించిరి. 'తిరిలి' యను పదమున కర్థము తెలియదనియు, నాపదమునకు వ్యుత్పత్త్యర్థము నన్వేషింపవలసియున్నదని చెప్పి, 'తిరిలి' యనుపదము 'తెల్ల' 'తిల్లి' 'తెలి' యను పదములకుఁ బూర్వరూపమని చెప్పిరి. 'తిరిలి' యనఁగా తెలివి, బుద్ధి, ప్రకాశమని యర్థమిచ్చుచున్నదని స్పష్టపఱచి, తిరిలింగమనఁగాఁ బండితులయొక్కయు, బుద్ధిమంతులయొక్కయు, నివాసభూమి యని తేల్చివేసిరి. ఈతిరిలింగపదమునుండియే, తెలుఁగుపద ముద్భవించెనని చెప్పి, వీరు చెప్పిన సిద్ధాంతమునకు గుడికి బారెడెచ్చుతగ్గుగ, గ్రియరుసన్ (Grierson) పండితుఁడు తెలుఁగుపదోత్పత్తినిగూర్చి, చెప్పినదానితో సరిపోవునని సమాధానము చెప్పుకొనిరి. రామదాసుగారు తిరిలింగమనునది గ్రామనామమో దేశనామమో గ్రహింపక

* 22. (1) Purle plates of Indravarma, son of Danarnava Epigraphica Indica Vol. XIV. P. 300.
(2) Indian Antiquary Vol. LIV. P. 221-227.

పోవుటయే దీనికిఁ గారణము. తిరిలింగవాస్తవ్యుఁడను పదమున కర్థము, తిరిలింగగ్రామవాసి యనియే యర్థముకాని, తిరిలింగదేశస్థుఁడని యర్థము చెప్పుట తగదు. అట్టి తిర్లింగ, తిరిలింగగ్రామములు గంజాము మండలములో నున్నవి. టెక్కలిగ్రామసమీపమున నొక తిర్లింగిగ్రామమున్నది. ఆగ్రామమునందు పూర్వగాంగులకు సంబంధించిన శాసనమునొకదానిని సత్యనారాయణరాజగురుగారు ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారి త్రైమాసికపత్రికలోఁ బ్రకటించిరి.[23]

ఈ ఇంద్రవర్మ దానముచేసిన గ్రామములు గంజాము మండలము లోనివి, దానప్రతిగ్రహీత లందఱును గంజాముమండలములోనివారె. భవదత్తశర్మ తెలుఁగుదేశవాస్తవ్యుఁడుకాఁడు. తిరిలింగగ్రామ వాస్తవ్యుఁడై యుండనోపు. తిరిలింగమను గ్రామములు కనఁబడనప్పుడుకదా, ఆతిరిలింగము గ్రామమో దేశమో యని పరిశోధింపవలసి యుండును. కావున శ్రీ రామదాసుపంతులుగారి తిరిలింగ—తెలుఁగువాదమును త్రోసిరాజనవలసి వచ్చినది.

## మఱికొన్ని వ్యుత్పత్తులు.

ఆధునికులలోఁ దెలుఁగు పదోత్పత్తినిగూర్చి కల్గిన భిన్నాభిప్రాయములఁ గొన్నిటి నిచ్చుచున్నాను. ఈ యభిప్రాయములకుఁ బ్రాఁతు బంగరము లేదు. కాని వారి వారి యనుపమేయవైదుష్యము గొనియాడవలసి యున్నది.

1. ఆంధ్రులు తెలివాహానదీ ప్రాంతమునుండి వచ్చినవారగుట చేత భాషకుఁ దెలుఁగుపేరు వచ్చినది.

2. తెల+ంగ అను పదమును బ్రత్యయమును గలసి, తెలంగ యయినదనియుఁ దెలుఁగుశబ్దమునకుఁ దెల్లనివారనియుఁ దేటగానుండు పదముల భాషయనియుఁ బేరు వచ్చినది.

---

* 23. Tirlingi Copper plate grant. A. H. R. S. Journal Vol. III Part I. Page 54-56.

3. తేనెవంటి భాషకాఫున, తెనుఁగయ్యెనని కొందఱి యభిప్రాయము.

4. తెనుఁగుపదము, తేన్ + ఉన్ + ంగ్ + ఉ అని విభజింపఁబడి, తెన్నననుండువారి భాషయని తెలుపఁబడినది.

5. తిలలు పండు దేశము గాఁబట్టి దేశమునకుఁ దెలుఁగు దేశమని పేరువచ్చెను. భాషకు నాపేరే కల్గెను.

పైనుదాహరించిన వ్యుత్పత్తులు గమనించినయెడల వీనికొక త్రోవయుఁ దెన్నును గనఁబడునట్లు లేదు. ఎవరిబుద్ధికిఁ దోఁచినట్లు వారు తెలుఁగుపదమును ఖండించి, యక్షరమున కొక యర్థమును గల్పించుచు వచ్చిరి. ఈయవస్థలె కర్ణాటకులును, తమిళులును బడుచున్నారు. కర్ణాట పదోత్పత్తినిగూర్చియిట్టి వాదప్రతివాదములు కర్ణాట సాహిత్య పత్త్రికలలో నింకను జరుగుచునే యున్నవి. అవి యన్నియుఁ జెప్పుట నిచ్చట నప్రస్తుతమని విడుచుచున్నాను.

తెలుఁగు—తెనుఁగు.

తెలుఁగు శబ్దమునకు రూపాంతరమె తెనుఁగు. లవర్ణలోపము నవర్ణాగమముఁగల పదములు తెలుఁగుభాషలోఁ జాలఁగలవు. కొన్నిటి నుదాహరించెదను. ఈమార్పు స్వరవ్యత్యయమువలననే కల్గినది.

తొల - తొన

తొలకు - తొనఁకు

ములుఁగు - మునుఁగు

గొలుఁగు - గొనుగు.

ప్రాకృతభాషలో సంస్కృతపదములోని లకారము నకారముగను, నకారము లకారముగను మాఱునని ప్రాకృతభాషావేత్తలు చెప్పుదురు. తెలుఁగు తెనుఁగుగా మాఱుట యట్టి స్వరవ్యత్యయమువలనఁ గలిగినదని నాయభిప్రాయము. తెలుఁగుపదము వేఱు, తెనుఁగుపదము వేఱు ననుకొని, తెనుఁగుపదమునకుఁ గూడ వ్యుత్పత్తులకై వెదకుట వెఱ్ఱిపని.

తెలుఁగుపదోత్పత్తినిగూర్చి సత్యమైన చరిత్రాంశము.

తిలంగులను జనులకు నివాసభూమి గావున, నీదేశమునకుఁ దెలుఁగు దేశమనియు, వారు మాట్లాడెడి భాషగావున భాషకుఁ దెలుంగు భాషయనియు నామములు పరిఢవిల్లెనని యూహించుటే ధర్మమని నా యభిప్రాయము. ఈతిలంగ పదమేమో యనుకొని త్రిలింగపదమే చెవినిబడ టయలవాటుగాఁగల మన పండితులు, తెలుఁగులిపిలో నచ్చు కొఁబడిన సంస్కృత మార్కండేయ పురాణములో నెట్లు తిలంగపదము త్రిలింగపదముగా దిద్దినారో చదువరులకుఁ జూపుచున్నాను.

సంస్కృతప్రతిలో శ్లోకము.

తిలఙ్గా కుఞ్జర దరీ కచ్ఛవాసాశ్చయేజనాః
తామ్రపర్ణీతథా కుక్షిరితి కూర్మస్య దక్షిణః.

తెలుఁగుప్రతిలో శ్లోకము.

త్రిలిఙ్గాః కుఞ్జరదరీ కచ్ఛవాసాశ్చయే జనాః
తామ్రపర్ణీతథా కుక్షిరితి కూర్మస్య దక్షిణః.

తెలుఁగు మార్కండేయపురాణ ప్రతి.
ముద్రితము క్రీ. శ. 1876.

తెలుఁగాణము—తెలింగానా.

తెలుఁగు దేశములోఁ గొంత భూభాగమునకుఁ దెలుగాణమను పేరుగలదు. అది యిప్పటి నైజాము ప్రభుత్వములోఁ జేరిన హైదరాబాదు సంస్థానము నందలి తెలుఁగుభాగమునకు నామము. పదునేనవ శతాబ్దాంతమునందుండిన వెన్నెలకంటిసూరనకవి తాను రచించిన విష్ణుపురాణములోఁ దెలుగాణ ప్రశంసను దెచ్చెను. విష్ణుపురాణకృతి పతియైన రాఘవరెడ్డియు నాతని జనకుఁడగు బసవరెడ్డియు నుదయగిరి రాజ్యపరిపాలకులుగా నుండిరి. వీరిలో బసవరెడ్డి తెలుగాణ భూములఁ గల మన్నెవారిని గెల్చినట్లు తెలియుచున్నది.

సీ. కటకాధి పతియైన గజపతిరాజుచేఁ
　　　　బ్రతిలేని పల్లకిపదవిఁ గాంచె
　మహిమచేఁ గర్ణాట మండలాధిపుచేతఁ
　　　　గడలేని రాజ్యభాగములు గాంచెఁ
　బ్రౌఢ పౌరుషమున రాజిల్లి మెఱయఁగా
　　　　మలక వజీర్లఁ గుమ్మరిలికఁ జేసెఁ
　దెలుఁగాణ భూములఁ గలమన్నె వారిచే
　　　　బలవంతమునను గప్పములు గొనియెఁ
గీ. జాటు ధాటీ నిరాఘాట ఘోటకావ
　లీఖురోద్ధూతనిబిడధూళీవిలిప్త
　మండితాశాంగనాకుచమండలుండు
　బాహుబలశాలి తమ్మయ బసవవిభుఁడు.

క్రీ. శ. 1510 సంవత్సరమునాఁటి ప్రతాపరుద్రగజపతి వెలిచెర్ల శాసనములోఁ దెలుంగాణ ప్రశంస కలదు. ప్రతాపరుద్ర గజపతి తెలుంగాణమర్గములను జయించెనని యీశాసనములోని యీశ్లోకము వలన స్పష్టపడుచున్నది.

సభాపతి ర్దక్షిణ భూమిపాలాన్ విజిత్య విశ్రాణనపారిజాతః
అనన్యసాధారణసాహస శ్రీర్జగ్రాహ పశ్చాత్త్యైలుంగాణమర్గాన్॥ [24]

మహమ్మదీయచరిత్రకారులు తెలుఁగుదేశమునకుఁ దిలంగదేశమనియుఁ దెలుఁగాణమునకుఁ దిలింగాణమనియుఁ దలింగాణమనియుఁ బేర్లిడిరి. కొందఱు పోర్చుగీసు చరిత్రకారులు తెలుఁగుదేశమునకుఁ దెలింగుదేశమనియుఁ దెలుఁగువారికిఁ దలింగులనియుఁ బేర్లిడిరి.

తెలుఁగుపదమునకు వ్యుత్పత్తి గల్పించుట కానిపని.

శ్రీ రామదాసుపంతులుగారు త్రిలింగపదమున కర్థము వ్రాయునప్పుడు తామిచ్చిన యర్థముతో గ్రియర్సన్ (Grierson) పండితుఁ

24. వెలిచెర్లశాసనము-భారతి. ధాత సం॥ శ్రావణమాసము. శ్రీవంగోలు వెంకటరంగయ్యగారు.

డేకీభవించెనని సెలవిచ్చిరి. కాని యాపండితుఁడు వ్యుత్పత్త్యర్థముల కంతు లేదని చెప్పి, యట్టి విచారణసమంజసము కాదని వక్కాణించెను. ఈయన, తెలుఁగుపదము త్రిలింగపదభవము కాదని యొప్పుకొనును. త్రికళింగమునుండి తెలుఁగు కలిగెనను వాదము నాదరింపఁడు. త్రిలింగ పదము ప్రాకృతములోఁ దెలింగపదమై యుండునని తలంచెను. తెలింగ పదము తెలశబ్దముపై 'ంగ' లేక 'ంగ్' ప్రత్యయము చేర్చినచోఁ దెలింగ మయ్యెనని యూహించి, యీ తెలిశబ్దమున కర్థముగాని, వ్యుత్పత్తిని గాని కల్పించుట కర్జము కాదని వదలివేసెను. వారు వ్రాసినవిషయ మాంగ్లేయ భాషలో నిదిగువ నిచ్చుచున్నాను.

" The people themselves call their language Telugu or Tenugu This word is generally supposed to be a corruption of Sanskrit Trilinga. It is explained as meaning the country of three lingas and a tradition is quoted according to which, Siva, in the form of Linga descended upon the three mountains and that these boundaries marked the boundaries of the Telugu Country. In favour of this derivation, other forms of the word such as Telunga, Telinga and Tenunga are urged. It is pointed out that Trilinga, in the form of Trilinga appeared in Ptolemy, as the name of a locality in the east of the Ganges. Other scholars compare Trilinga, with other local names mentioned by Pliny, such as 'Bolingae, Maccolingae, and Modogalingae. The latter name is given as that of an island in the Ganges. Mr. L. D. Campbell, in the Introduction to Telugu grammar, suggested that Modogalingam may be explained as a Telugu translation of Trilingam and compared the first part of the word 'modaga' with 'muduga,' a poetical form of Telugu 'mudu,' three. Bishop Caldwell on the other hand explained 'Modogalingam' as representing a Telugu Mudugalingam, the three Kalingas, a local name which appears in Sanskrit inscriptions and one of the Puranas. Kalinga appears in the Asoka inscriptions and in the form of 'Kling' it has been in the Malay country the common word for the people of continental India.

All these derivations are based on the supposition that Trilinga and not Telugu is the original form of the word. This supposition is however just as impossible as the derivation Tamil from Dravida. The old Aryan name of the Telugu country seems to be 'Andhra'

and replacing of this term by Trilinga seems to be due to the adaptation of a Telugu word. Such a word could probably only be borrowed through the medium of a Prakrit dialect, and in the Prakrit, we must suppose the form to have been Telinga. It seems probable that the base of this word is 'Teli' and 'nga' or 'gu' is the common dravidian formative element. At all events, the derivation from Trilinga is so uncertain that it cannot be safely adopted. A base Teli' occurs in Telugu, 'Teli' bright; Teliyuta, to perceive. But it could not be safe to urge such an etymology. Telugu pandits commonly state Tenugu to be the proper form of the word and explain this as the 'mellifluous language' from 'Tene,' honey.

Under such circumstances, I think we had better follow the opinion held by C. P. Brown, who rejected all etymologies of the word which had hitherto been brought forward and regarded the word as not derived from any known root.

---

Linguistic Survey of India. Vol. IV. P. 576.

# యథార్థ నవ్య సాహిత్య పరిషత్తృతీయ సమావేశము:—మదరాసు.

## అధ్యక్షోపన్యాసము.

బెజవాడ రామచంద్రారెడ్డిగారు. బి. ఏ.సి.బి.ఇ.



ఈ సభ కధ్యక్షుఁడనుగా నుండ సాహసించినందులకు నన్ను మన్నింపవలయును. పండితులు, వైయాకరణులు, కవులు, విమర్శకులు ఆంధ్రవాణీయుపాసకు లిందుండ నుపన్యసింపఁబూనుటకు ధైర్యమువలయును. తప్పులున్నను సవరించుటకును, సమర్థించుటకును మీ రందఱుందురను నమ్మకముచే నే నిందులకియ్యకొంటిని. ఈ సభాసమావేశకులతో నే నెంతదూరము నచ్చఁజెప్పినను దప్పించుకొన వలనుపడదయ్యెను. మేము పట్టుదలతో నెంతసేపు వాదించుకొన్నను, నా పట్టువదలెను, వారి తలఁపే గెలిచెను.

ఈ యొప్పుదలకుఁ బూర్వ మీ సమావేశపు నామకరణమును గుఱించి నాయుద్దేశమును దెల్పితిని. ఆంధ్రసాహిత్యపరిషత్తొకటి యేర్పడియేయుండెను. నవ్యసాహిత్యపరిషత్తు మఱియొకటి బాల్యకోమలముతో నలరారుచుండెను. ఈ రెండింటిని మించి "యథార్థ" శబ్దముతో నింకొకటి యేర్పడుటయందలి యథార్థమెద్దియని తెలియఁగోరితిని. "నవ్యసాహిత్యపరిష"త్తొకటియుండుట మిథ్యకాదని యందఱెఱుఁగుదుము. దానిని మిథ్యయొనర్చు ప్రయత్నమును మన మొనర్పవలసిన యవసరము నాకుఁ దోఁచదంటిని. అదియుండుట యథార్థముగానిచో మన సమావేశమునకే యవకాశముండదని తెల్పితిని. అంతట వారు పేరుననున్న యంతరార్థమును దెలియఁజెప్పిరి. పేరునందు సవరణము గావలసినదను నాయభిప్రాయముతో వారేకీభవించినందున, నే నీనాఁడు మీ యెదుటనుండుటకు సమ్మతించితిని. ఈ యాత్మకథావివరణమును

మన్నించి, నాపలుకులను బాటింపవలయునని వేఁడువాఁడ. నవ్యసాహిత్య పరిషత్తుతో మనమేకీభవింపక పోవచ్చు, వారియాదర్శములనువిమర్శింప వచ్చుఁ, గానివారికి పరిహాసమని తోఁచునట్టు వారిపేరును మనమనుకరిం చుటలో గౌరవము గాంచలేకున్నాను. నవ్యతకు అధికారి నీవా నేనా యను తగవు పెంచుకొనుట మనకు తగవుకాదు. భాషదెలిసి నూతనస మావేశములను సంఘములను నిర్మించుకొను శక్తిగల మనకు అనుకరణదో షములేని ప్రత్యేకనామకరణమును మనసభకుఁగావించుటకు శక్తిమెందు లకు లేక పోవలయును? ప్రతిపక్షులను పరిహాసించినచో మన యాదర్శ మగు సాహిత్యముద్ధరింపఁబడఁగలదా ? కావున, ఆంధ్రసాహిత్యపరిషత్తు నకుఁ బ్రత్యేకముగను, నవ్యసాహిత్యపరిషత్తునకు వ్యతిరేకముగను మన సమావేశములు వర్ధిల్లవలయుననుకోరిక మనకున్నచో వేఱొక పేరిడవ లయును. అనేక కృతికన్యలఁగన్న కవులకిది సుకరమే.

మన వాఙ్మయమును పరిరక్షించుకొను నుపాయములను వెదకు టకే మనమిట సమావేశమైతిమి. గ్రామ్యభాషయనియు, వాడుకభాష యనియు, వ్యావహారికభాషయనియు, క్రొత్తపేరులతో భాషాప్రపంచ మున విదితప్రచారము రెండు మూఁడు దశాబ్దములుగ జరుగుచుండుట యు, నిటీవల నవ్యసాహిత్యముగా ప్రభవిల్లుటయుఁ, బండితులెల్లరును దెలిసినదే. ఈవిచిత్రప్రచారము వారివిమర్శనలకు గుఱియైనదే; వారి యఖండఖండనలకు లోఁబడినదే. ఇప్పుడీసమావేశమునఁ గ్రొత్తగ విమ ర్శింపనదేద్దియును లేదు. నూతనముగ ప్రబోధింపనది యును లేదు. ప్రాఁతమాటలను జ్ఞప్తికిఁదెచ్చుకొనుటయు, క్రొత్తనామరూపములతో వర్ధమానమగు నీబూరుగలు గాచెడి ఫలములకలరూపును వాఙ్మయప్రపం చమునకు విదితమొనర్చుటయు మనయుద్దేశము. నిష్ఫలమగు నీశాల్మలి సాయుజ్యదోషమున సాహిత్యభూమినుండి సారమునుబీల్చి, అమృతఫల ప్రదాయకభూజముల తేజమును రాజిల్లనీయదేమోయని భయపడవల సిన కాల మాసన్నమగుచున్నది. ఈనాఁటి తెలుఁగుపత్త్రికలలోను, కథల

పుస్తకములలోను, బడిబాలుర పాఠ్యగ్రంథములలోను ఈనవ్యసాహిత్య లత అంకురమేర్పఱచుకొని, పెరుగుచు, విరివియగుచు బాహాటమై బ్రహ్మాండమైపోవుచున్నట్లు ప్రత్యక్షముగఁ గనుచు వినుచు నున్నారము గాన జాగ్రత్తపడవలసివచ్చినది. దివ్యభాషాభూషణములఁదాల్చుటకు నోఁచుకొనని పామరజనుల నాశ్రయముగాఁగొని శోభించు నీనవ్యకవి తాలతప్రాకుచుఁ బ్రసిద్ధవాఙ్మణికిరణముల కాంతిని మాటుపఱుచుచున్న దేమోయని సంతాపపడవలసివచ్చుచున్నది. సుగంధికుసుమములను బ్రసవింపలేని యీ తీవవ్యాపనము నాఁపివైవ పండితులు ప్రచారమున కాయత్తపడవలసివచ్చినది. ఈవిషయములను వాఙ్మయరక్షకులకు జ్ఞప్తి కిఁదెచ్చి హెచ్చరికపఱచుటయే యీసమావేశోద్దేశము.

నిర్దుష్టవాక్యములతో రచనారూపమును బొందిన యుత్కృష్ట భావములు సారస్వతమని పెద్దలు నిర్వచించిరి. విమర్శనకుఁబూర్వము భావన యేర్పడునుగాన, భావస్థానమున కర్తమైనరచన పద్యరూప ముగనుండుట లెస్సయని తొలుతఁదలంచిరి. అందులకే గద్యమునకుఁ బూర్వము పద్యమేర్పడెను. భావవైదుష్యముగల మహామహుల ప్రథమప్రయత్నములవలన వాఙ్మయవృక్షము శాఖోపశాఖలతో విస్తరిల్లెను. తరువాతివారు ఆ వాఙ్మయఫలములను గ్రహించి వాని సారము నెల్లను అనుభవించుటకై భాషాంతరీకరణ మొనర్చిరి. క్రమక్రమముగ తత్సారా స్వాదనముచే పదనుపడినజిహ్వలు తలకొకమార్గమున నానందించుచు అనేకవిధముల తమ యానందములను రసాత్మకమైన రూపులుదీర్చిరి. ఇవియే కావ్యములుగను, ప్రబంధములుగను, నాటకములుగను ఏర్పడెను. పురాణములవతరించెను. ప్రహసనములు, ఖండకావ్యములు, నవలలు, చిన్నకతలు, పెరుగుచువచ్చెను. ఆధ్యాత్మికమునుండి ప్రాపంచికమునకు, అందుండి నాగరకమునకు భావనములు చంక్రమణమొనర్చి, వ్యాప్తిచెంది, యీనాఁటి సారస్వతవైశాల్య మేర్పడినది. చదివెడివారి యుత్సాహముతో వ్రాసెడివారి ప్రతిభ యొరపిడివడుటచేతఁగల్గిన యీ

వ్యాప్తికి ముద్రణవిధానము తోడుపడెను. ముద్రణప్రభావమున వార్తాపత్త్రికలు వెల్లువ్వి భాష కేర్పడియుండిన రససౌష్ఠవములను ప్రతిభావంతులకు సులభమార్గముననందిచ్చు ప్రయత్నమొనరించెను. కాని యాధునిక భిన్నరుచులవలననేమి భావములనిముడ్చుకొను వ్యవధి లేమివలననేమి సారస్వతము కట్టువదలి కలవరపడఁజొచ్చినది. వేగప్రచలితమై పెరుఁగుచున్న యీనాఁటి ప్రపంచమున నిష్కృష్టసారస్వతసారము ననుభవించి యానందింపఁగలవారి సంఖ్యవిరుగుచున్నది. ఈ శీఘ్రపరివర్తనము నాగరకతను చవిఁజూచుచున్న సర్వదేశములందును గలుగుచున్నది. ఇట్టిస్థితియే ఆంధ్రమునకుఁగూడ ఆపాదిల్లినది. సారస్వతమునందు అపరసృష్టికంటె పూర్వసృష్టియే రసవత్తరమైనదనియు, భావభూయిష్ఠమైనదనియు, దాని స్వారస్యమును రక్షించు భారము మనమీఁదఁగూడనున్నదనియు విశ్వసించుచున్నాను.

కాలతరంగములు ప్రచండవేగమున నెడతెగక దొర్లుచునేయున్నవి. కాలమును, సందర్భమును అనుసరించి ప్రపంచమున నియమములు హెచ్చవలసియుండి, దానికనుగుణమైన స్మృతులు, శాసనములు, ఏర్పడుచుండుట లోకానుభవము. మతమునందును మానవప్రవర్తనమునందునువలెనే సారస్వతమునందుఁగూడ శబ్దశాసనములును, నియమావళియును ఏర్పడుచుండెను. ఈపరివర్తనవ్యవధులందు కవులేమి, లేఖకులేమి, తరువాతవచ్చి కవిహృదయమును నెఱుంగకయే పరిష్కరింపించి ప్రచురించుచుండిన ముద్రాపకులేమి, కావించినప్రమాదములను ప్రమాణములుగాస్వీకరించి వాదించు సారస్వతప్రచారకులు కొందఱు నియమములతోఁ బెరుఁగుచుండిన తెలుఁగుతెఱవకు స్వేచ్ఛామార్గములఁ ద్రొక్కు చనవు గలుగఁజేసిరి. చేసి, దానిని సమర్థింపఁజొచ్చిరి. గ్రామ్యభాషాభిలాషులు వాడుకభాషాప్రియులైరి. ఈపరిణామపరివర్తనలవలన భాష బాగుపడినదని వాదించువారితో మనకు సమవేదిక లేదు. భాష గ్రంథగ్రథితమైనప్పుడు, తెలుఁగుమండలములన్నింటికిని పరిచితమై

సమగ్రాహ్యమై ఆదర్శమై యుండవలయును. అటుగాక ఆయామండల వాసు లాయామాండలికములను సారస్వతములోఁ జొనిపి వానిని ప్రమాణములుగా వాడుకొనవలయునని యుపదేశించుటచేఁ గష్టమేర్పడుచున్నది. ఒకమండలములోని వాడుకమాటలింకొక మండలములోఁ గ్రొత్తగనుండుటయు, కొన్నిచోట్లయందు పరిహాసజనకముగ నుండుటయు, అందఱ యనుభవములోనున్నయథార్థమే. ఈవిషయము నీవఱకే పండితులు సంపూర్ణముగ విమర్శించియున్నారు; పునర్విమర్శనము చర్వితచర్వణము కాని, యీవాడుకభాషాప్రాబల్యమునుగూర్చి మరలమరలఁ జింతింపవలసివచ్చినది. వార్తాపత్త్రికలలోను రైలుపుస్తకములలోను ఈభాష విరివియగుచున్నందున సారస్వతముయొక్క నిజరూపము, రసము, ప్రజాసామాన్యమునకు నానాఁటికి దూరమైపోవుచున్నది. అంధులు స్పృశించి నిరూపించుకొనిన గజరూపమువలె ఈనాఁటివాడుక భాష వివిధమండలములలో వివిధమార్గముల నెగడుచున్నది. అదియునుగాక పత్త్రికలును పుస్తకములును ఎక్కువసంఖ్య అమ్ముడుపోవుమండలముల వాడుకభాషను వాడుటచే, తదితరమండలీయులు తమకు క్రొత్తనైనపదముల యర్థమును నేర్చుకొనుటయు వాడుటయు విధియైనది. లేనిచో ఆపత్త్రికల పుస్తకముల ధోరణిని అర్థముచేసికొనుటకు వీలుండదు. ఈయవస్థ దెచ్చిపెట్టినది వాడుకభాషావాదము. దానిబాధ ననుభవించవలసినపని ప్రజానీకమునకుఁ గలిగెను. పూర్వము పండితులొనర్చిన విమర్శనములలో సూచించిన భయమిప్పుడు ప్రత్యక్షమైనిలిచినది. ఈకష్టానుభవములను దొలఁగించు ప్రచారముసేత గ్రాంథికవాదుల విధియై యేర్పడినది.

కాలము వక్రించినప్పుడు మిత్రులుగూడ శత్రులగుచుండుట లోకానుభవము. గ్రాంథికవాదులుకొందఱు స్వమతవ్యతిరిక్తులై, కారణాంతరములవలన వ్యావహారికభాషావాదులుగను, నవ్యసాహితీప్రాపకులుగను మాఱుచున్నారఁట. తొలుతవీరుభావములందే నవ్యత నను

కరించుచున్నట్లును, క్రమక్రమముగా భాషయందుఁగూడ నవ్యతనుప్రయో గించుచున్నట్లును, వారిచరితము సూచించుచున్నది. ఆరంభమున భావక వులు తమ నవ్యభావములను విశుద్ధభాషయందు రచించిరి. అంతవఱకును తెలుఁగుతల్లికి ప్రమాదము వాటిల్లలేదు. కాని భావభేదముతో తృప్తిపడక భాషాభేదమునుగూడ సమర్థించు నవ్యకవులు ఇప్పుడు ముందంజవేయు చున్నారు. నవ్యసాహిత్య పరిషదుద్దేశములకై వెదకి మొన్న నొక కర పత్రమునుజూచితిని. దానిలోనిమాటలను మీకు వినిపింతును.

పరిషదుద్దేశములు :

నవ్యసాహిత్యసృష్టి. విమర్శనము. ప్రచారము. వచనవాఙ్మయమూ, సాధ్యమైనం తవరకు పద్యవాఙ్మయమున్ను వ్యావహారికభాషలో నిర్మించడము.

పరిషత్కార్యక్రమము :

నవ్యసాహిత్య ప్రచారమునకు సభలూ, చర్చలూ, సమావేశములూ, ఉత్సవములూ ఏర్పాటుచేయడము; నవ్యగ్రంథ ప్రకటనము; 'ప్రతిభ' పత్రిక ప్రకటించడము; నవ్యపు స్తకభాండారమూ, నవ్యగ్రంథ విక్రయశాలా నెలకొల్పడము"

ఈ రచనలో దీర్ఘముల, 'డము'ల ప్రయోగాతిశయముదప్ప గ్రాంథికశైలికిని దీనికిని విశేషభేద మగపడదు. ఆ ప్రయోగములనవ సరములని గ్రాంథికవాదులందురు. వాని యావశ్యకతనుగాని గాంభీర్య మునుగాని యౌచితినిగాని నవ్యసాహిత్యపరిషత్తువారు విశదపఱుపరు. దానిలోని సౌలభ్యమేమో బోధపడదు. క్రమక్రమముగఁ గొంతకాల మునకీవర్గమువారు పద్యరచనయందు ఛందోనియమములకుఁగూడ అతీ తులయినను విచిత్రముండదు.

భావకవుల భావములను వ్యక్తపఱుపవలసిన యవసరము లేదని యు చదువువారే తద్భావమునుభావించి యానందింపవలయుననియు భావకవుల మతమైనట్లు భావకవి విమర్శకులనుచున్నారు. భావకవులు తమ భావౌన్నత్యమును కృతులలోనేకాక గతులలోఁగూడ విశదపఱచి వారిభావముల స్వభావమును భావించి పాఠకలోకము కృతార్థతఁగను

టకు వసతులేర్పఱచునంతదాఁక వారిమనోవృత్తి సంపూర్ణముగఁ దెలియదేని యితరులు విమర్శించుటకవకాశములు తక్కువ. భావములేని మాటలమూట కవిత్వమనిపించుకొనదు. కవిత్వములోనే భావ మిమిడియున్నప్పుడు, వారికవిత్వము భావముగలదియని తలంచి వచించుటెందులకు ? అట్లు పేరిడుట యెందులకు? అది యట్లుండ, వారిభావముల స్వార్థమెట్లున్నను, భాషాస్వరూపమును వికృతమొనర్పకుండవలయునని తెలుఁగుతల్లి పక్షమున వారిని వేఁడెదము.

ఒకప్పుడు మా బాలురకుఁ జదువుచెప్పుచుండిన పండితులొకరు, ప్రార్థనశ్లోకములను వ్రాసికొనివచ్చి యొకనాఁడీ ప్రార్థనశ్లోకమును పాఠము చేయుచుండిరి.

శ్లో॥ ఓం నమో వేంకటేశాయ
పురుషాయ మహాత్మనే
ప్రణత క్లేశనాశాయ
గోవిందాయ నమో నమః.

తాను వ్రాసికొనిన మాతృకలోని అచ్చుతప్పువలననో, తాను వ్రాసికొనినప్పటి ప్రమాదమువలననో, మూఁడవపాదమునందలి "క్లేశ" శబ్దములోని 'ల' కారమునుబోఁగొట్టుకొని, 'కేశ' యని వ్రాసికొని వచ్చెను. ఇది వేంకటేశ్వరస్తుతిగాన అనుభవమునుబట్టి యాచారమునుబట్టి 'కేశనాశాయ' అనువాక్యమే సరియైనదని భావించి, ఆపంతులు పంతముతో నర్థము జెప్పుచుండెను. దృగ్గోచరముగాని క్లేశనాశము నూహింపలేక, కన్నులకగపడిన కేశనాశమునే వారు భావించిరి. భావకవులభావము లిట్లేయుండునాయని తలంచితిని. నాయూహ తప్పేయగుచుగాక. కల్వములోని యౌషధము మర్దనమున గుణవర్ధనమగునట్లు (కావ్యము) కవనములోనిభావము భావించుకొలఁది ఆనందమును గొల్పునదే భావింపఁదగినభావము. కావున భావారాధకులగు నవ్యసాహిత్యప్రాపకులుగూడ మనతో నేకీభవించినట్లు మనప్రచారము సాగవలయును. మతముగాని

రాజకీయములుగాని ప్రచారముతో వృద్ధిఁబొందును. అయితే యీకాలమున ననుసరించి ప్రచారముతో మాసారస్వతమును సంస్కరించుకొని యుద్ధరింపవలయును. నవ్యకవులు కలహంసనో కలకంఠహంసనో వర్ణింపనిండు. కవులు హృద్యవస్తువులనుండి ప్రతిభనువినియోగించి, ఊహల నెగురవేసి, అంద కొండవసనల్లుగూర్చెను భావముతో భావములు. భావములసౌష్ఠవసౌందర్యములు లేకున్న కావ్యము సొంపునింపదు. పూతమెఱుంగులతో తృప్తిగొనదు. జీనుగుజీనితో నమర్చఁబడక యుత్తమాశ్వము స్వారీమోదమును గూర్చదు. పసిఁడిలో పొదుగవలసినరత్నములను ఇత్తడిలోపొదిగినచో నవి గౌరవమును విలువను గోల్పోవును. ఉత్తమభావములు ఉత్తమభాషతోడి సమతకొఱకు హాళినిఁబొందును. తద్వ్యస్తము జాలినిఁగొల్పును.

గ్రాంథికశైలిని మాటాడుట యెట్లు విపరీతముగానుండునో మాటలాడుధోరణినే గ్రంథములను వ్రాయుటగూడ వైపరీత్యమే యగును. వ్యావహారికశైలిలో వ్రాయకపోయినచో వాదములబలము తగ్గిపోవుననియును, నవరసములొలకించుటకు వీలుగాదనియును, భావములు సుబోధములుగావనియును, వాడుకభాషవారి తాత్పర్యము. ఈ యాశయములు క్రమములుగావని భారతాదిగ్రంథములే ఋజువు పఱచుచున్నవి. మనపురాణములలోఁగాని నాటకములలోఁగాని విమర్శ గ్రంథములలోఁగాని యేభావములసొంపుతగ్గెను? ఏరసములోని రసము విఱిగెను? భావమును రసమును ఒలికించుటకు కవితాచమత్కృతి యుండవలయునుగాని భాషాపేలవత్వము సహకారి కాఁజాలదు. ప్రస్తుతమున వాడుకభాషలో వ్రాసెడిపత్రికలను పుస్తకములను బఠింప నొక విశేషము బయల్పడుచున్నది. వానిలో నొక్కొక్క వాక్యము ప్రత్యేకమైన భాగముగా నేర్పడుచున్నది. ఏ భావమెంతవఱకు ముగిసెనో తెలియజాలము. వాక్యమునకు కూడికయుండదు. పాఠకుల కిదియొక కష్టము.

సర్కారుల వాడుకపదములను అర్థము జేసికొనుటకు రాయలసీమ

వారు క్రొత్తవ్యావహారికభాషానిఘంటువును సృష్టించుకొనవలసి యున్నది. భావకవులును వాడుకభాషవారును కఠినపదములను వదలి వేయుటలేదు. సంస్కృతపదఘటితసమాసములను గుప్పించియు, వాక్యమును 'ను,' 'ము' 'డను' లతో ముగించినచో వ్యావహారికభాష కాశైలిదాపుననుండునని వారి యూహ గాఁబోలు. ఇదియెంత పొరపాటు!

ఏ భాషలోనైన కథకంటె భావసమృద్ధివలనను శైలీసౌష్ఠవము వలనను ఔచిత్యపోషణమువలనను గ్రంథమున కుత్కృష్టత, కీర్తివచ్చును. ఆంధ్రమున భారతము, తమిళమున (కంబన్) రామాయణము, హిందీలో (తులసీదాసు) రామాయణము, ఆయాభాషలలోని యితరగ్రంథములకంటె గౌరవమును బొందుటకదియేకారణము. కావున శైలిలో బిగువు, భావములో బలముగలరచనలను ధరించునంతకాలము తెలుఁగు జవరాలు అందమునఁ దీసిపోకుండును. 'దేశభాషలందు తెలుఁగులెస్స' "Telugu is the Italian of the East" అనుగణ్యతను ఆంధ్రమునకుఁ దెచ్చినది గ్రాంథికభాషయే. కాన, దానినాదరించి తెలుఁగుతల్లిని ఆరాధించుట ఆంధ్రులపరమకర్తవ్యము.

---

# కువలయానందసారవిమర్శనము.

(గతసంచిక తరువాయి)

వ్యాకరణ విద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ,

**ఆకెళ్ళ శేషాద్రిగారు.**



### 3. ఆక్షేపము.

ఆక్షేపాలంకార ద్వితీయభేదమునకు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు తమ కువలయానందసారములో నిచ్చిన లక్ష్యమును, తత్సమన్వయమును గమనింపుఁడు:

"కోప మొకింత లేదు బుధకోటికిఁ గొంగు పసిండి, సత్యమా
రూపము, తారతమ్యము లెఱుంగు స్వతంత్రుఁడు, నూతనప్రియా
టోపము లేని నిశ్చలుఁడిటుల్ కృతలక్షణుఁడై వెలుంగఁగా
ద్వాపరలక్షణుం డనఁగ నొప్పునొకో యలధర్మనందనున్.

ఇచట యుధిష్ఠిరుఁడు ద్వాపరలక్షణుఁడైనను, కాఁడని చెప్పునిషేధము బాధితమై కృతలక్షణత్వ మను విశేషమును చెప్పుచున్నట నిది యాక్షేపము."

ఇది తప్పు. ఈయలంకారమున నిషేధము వాచ్యమై యొక విశేషము వ్యంగ్యముగా నుండవలయును. పైపద్యమున 'కృతలక్షణత్వము' అనునది విశేషమనికదా వీరియాశయము! అది వ్యంగ్యముగా లేదు. పద్యమందలి 'కృతలక్షణుఁడై' అనుపదమువలన వాచ్యమగుచునే యున్నది. మఱియు నిచ్చట నిషేధము వాచ్యముగాఁగూడ లేదు. 'ద్వాపరలక్షణుండనఁగవచ్చునొకో' అనియున్నది కాని 'ద్వాపరలక్షణుండు కాఁడు' అననిషేధము వాచ్యముగా లేదు. వాచ్యముకావలసినది వాచ్యము కాక పోవుటయు, వ్యంగ్యముకావలసినది వాచ్యమగుటయు ననుదోషములతోఁ

గూడిన యీయుదాహరణమే వీరి కెట్లు దొరకెనో తెలియదు. వీరి గ్రంథమునకు మూలమగు కువలయానందమును బరిశీలించినచో వీరితప్పు తెలియఁగలదు. చూడుఁడు:

"నిషేధాభాసమాక్షేపం బుధాః కేచన మన్వతే,
నాహం దూతీ తనోస్తాపస్తస్యాః కాలానలోపమః.
..........దూత్యా ఉక్తో నాహందూతీతినిషేధో బాధితత్వా
దాభాసరూపః సంఘటనకాలోచిత కైతవవచన పరిహారేణ యథార్థ
వాదిత్వే పర్యవస్య న్నిదానీ మేవాగత్య నాయికోజ్జీవనీయేతి
విశేష మాక్షిపతి."

ఇందు 'నాహందూతీ (నేను దూతిని గాను)' అను నిషేధము వాచ్యముగా నున్నది. 'ఇదానీమేవాగత్య నాయికోజ్జీవనీయా (ఇప్పుడే వచ్చి నాయికను బ్రతికింపుము)' అనువిశేషము వ్యంగ్యముగా నున్నది. 'కువలయానందప్రకాశము' అనుపేర సంస్కృత కువలయానందమును మిక్కిలి చక్కగా నాంధ్రీకరించిన కటికనేని రామయకవి యీయలంకారలక్ష్య లక్షణములు సరసముగా వ్రాసియున్నాఁడు. చూడుఁడు:

"అనిరి నిషేధాభాసం
బును నాక్షేపం బటంచు భువిఁ గొందఱొగిన్
విను దూతి గాను నేత
త్తనుతాపము విలయకాలదహనుని బోలున్."

ఈపద్యము, మూలమునకు సరియైన యాంధ్రీకరణము.

## 4. తద్గుణము; అతద్గుణము.

ఇతరగుణసంబంధమునఁ దనగుణమును విడిచి యన్యగుణమును స్వీకరించుట తద్గుణాలంకార మనియు, ఇతరగుణసంబంధమున్నను నాగుణమును స్వీకరింపకుండుట యతద్గుణాలంకార మనియు సిద్ధాంతము. తద్గుణమునకు, బు॥ వేం॥ ర॥ గారు,

"అనిమేషస్థితిమాన్ని చిత్తరపుఁబాపు ... ... ...
మనుజేంద్రుని భ్రమి యించుకంతనె రహిన్మర్త్యత్వమున్ సంధిలెన్."

అని యుదాహరించి, యిందు దేవాంగనకు దేవత్వము పోయి మనుష్యత్వము కలిగెనని సమన్వయించియున్నారు. అదితప్పు. దేవత్వ మనుష్యత్వములు జాతులు కాని, గుణములు కావు. కావున వీరిచట భ్రమపడియున్నారు.

ఇంక నతద్గుణాలంకారమునకు వీరిచ్చిన యుదాహరణము చూడుఁడు:

"కరతలపీడనంబునను గందని చక్కని పూలచెండ్లు ... ... ..."

ఇచటఁ గరతలపీడనముచేఁ బూలచెండ్లు కందిపోవుట యను గుణము పొందవలసియున్నను నట్లు కాకుండుటచే నిది యతద్గుణమని వీరి సమన్వయము. ఇది తప్పు. ఎచట నన్యగుణసంబంధమున్నను నాగుణమును స్వీకరింపని యట్లు వర్ణింపఁబడునో యచట నతద్గుణమని సిద్ధాంతముగదా!

"సంగతాన్యగుణానఙ్గీకారమాహురతద్గుణమ్." (కువలయానందము.)

వీరియుదాహృతిలోఁ బూలచెండ్లకుఁ గందుట యను గుణ మితర గుణసంబంధమువలనఁ గల్గునది కాదు. కటికనేని రామయకవి పై రెండలంకారములకు నిచ్చిన యుదాహరణములు మిగుల సమంజసముగా నున్నవి.

## 5. లలితాలంకారచర్చ.

మూలములో నీలలితాలంకారమునుగూర్చి చర్చించుచు 'ఈయలంకారము నిదర్శనాలంకారము కాఁగూడదా' అని ప్రశ్నించి, నిదర్శనలోఁ బ్రస్తుతాప్రస్తుతములు రెండును గ్రహింపఁబడి యారెండిటికిని నైక్యము చెప్పఁబడుననియు, లలితమం దన్ననో యప్రస్తుతవృత్తాంతము మాత్రమే గ్రహింపఁబడును గాని ప్రస్తుతవృత్తాంతము గ్రహింపఁబడదు గాన నీయలంకారమునకును, ప్రస్తుతాప్రస్తుతములు గ్రహింపఁబడి

వాని యైక్య మారోపింపఁగాఁ గల్గు నిదర్శనకును భేద మున్నందున నీలలితము నిదర్శన యగుటకు వీలు లేదని సమాధానము చెప్పఁబడినది. పిమ్మట విషయవిషయులగు ప్రస్తుతాప్రస్తుతవృత్తాంతములు గ్రహింపఁబడినపుడే ప్రవర్తించెడి నిదర్శనాలంకారము, విషయి యగు నప్రస్తుత వృత్తాంతము మాత్రమే గ్రహింపఁబడెడి లలితాలంకారవిషయమునఁగూడఁ బ్రవర్తించునెడల, భేద మున్నను భేదము లేనట్లు వర్ణించెడి యతిశయోక్తిగూడ రూపకమే కావలసివచ్చునని యు మూలములోఁ జెప్పఁబడినది. అతిశయోక్తిలో విషయిమాత్రమే చెప్పఁబడును. రూపకములో విషయవిషయులు రెండును గ్రహింపఁబడి వానికైక్యము చెప్పఁబడును. విషయవిషయులు రెండును గ్రహింపఁబడునపుడే ప్రవర్తించెడి యలంకారము విషయిమాత్ర మున్నపుడుకూడఁ బ్రవర్తించునెడలఁ బైయతిశయోక్తి విషయమునఁగూడ రూపకమే కావలసివచ్చునని యర్థము. ఈవిషయమున మూలమును, బు॥ వేం॥ ర॥ గారి యాంధ్రీకరణమును బరిశీలింపుఁడు:

'నాఽపి నిదర్శనా, ప్రస్తుతాప్రస్తుతవృత్తాన్తయోః శబ్దోపాత్తయోరైక్యసమారోప ఏవ తస్యాః సముల్లాసాత్. యది విషయవిషయిణోః శబ్దోపాత్తయోః ప్రవర్తమాన ఏవాఽలఙ్కారో విషయిమాత్రోపాదానేఽపి స్యాత్తదా రూపకమేవ భేదేఽప్యభేదరూపాయా అతిశయోక్తేరపి విషయ మాక్రామేత్." (కువలయానందము.)

"ఇయ్యది నిదర్శనయుఁ గాఁజాలదు. ప్రస్తుతాప్రస్తుతవృత్తాంతములు రెండును వాచ్యములై యున్ననే నిదర్శన యగును. ఇచ్చటఁ బ్రస్తుతము వాచ్యముకాదు. ఇచటఁ బ్రస్తుతము లేకున్నను, అప్రస్తుతమున్నందున నిదర్శనాలంకారము కాఁగలదని చెప్ప వీలు లేదు. ఇట్లు చెప్పినచో రూపకముకూడ నతిశయోక్తియందే యంతర్భవింపఁగలదు. చూడుఁడు: ఉపమానోపమేయముల కభేదము చెప్పిన రూపక మగును. "నీముఖము చంద్రుఁడు" అని యుదాహృతి. ఇచటఁ జంద్రముఖములకు భేదము

న్నను అభేదము ఆరోపింపఁబడినది. కావున నిది సంబంధాతిశయోక్తియే యగునని చెప్పవలసివచ్చును." (కువలయానందసారము-పుట. 141.)

బు॥ వేం॥ర॥ గారి పై వ్రాఁతలో నర్థమే కనఁబడదు. అతిశయోక్తి కూడ రూపకమే కావలసివచ్చునని మూలములో నుండఁగా రూపకము కూడ నతిశయోక్తియే యగు ననుట యెట్లో! అదియు సంబంధాతిశయోక్తి యగునఁట! ఇది యేమి చిత్రమో!! మూలములో సంబంధాతిశయోక్తిమాట యేమున్నది? దీనినిబట్టి వీరికిచ్చట మూలము సరిగా నర్థముకాలేదని చెప్పవలయును.

మఱియు వీ రీ యలంకారచర్చను ముగించుచు, "అట్లనే యీలలితము అసంబంధమున సంబంధము నారోపించు నతిశయోక్తియుఁ గాఁజాలదు." అని వ్రాసియున్నారు. అతిశయోక్తిలో నసంబంధ మున్నను సంబంధ మున్నట్లు వర్ణించుట యుండును గాని సంబంధ మారోపింపఁబడదు. ఇట్లు వ్రాయుట యలంకారశాస్త్రసిద్ధాంతవిరుద్ధము.

6. సమాసోక్తి.

ఉభయసాధారణవిశేషణ సమాసోక్తికి, బు॥ వేం॥ర॥ గారు,

"చేరువతోఁట యందు వికసించిన మావుల పూవుతావు లిం
పార వహించుచు న్మధుపు లానుచు సోలుచు మెల్ల మెల్ల సం
చార మొనర్చుచుం గదిసి చయ్యన జార్చె సమీర బాలుఁ డా
పేరవరంపు నీలనిభ వేణుల గుబ్బలమీఁది పయ్యెఁటల్."

అని యుదాహరణ మిచ్చియున్నారు. సమీరబాలుఁ డనగా 'పిల్లవాయువు' అని యర్థ మనియు, ఇచట నప్రస్తుతమగు కామినీవిలాసవృత్తాంతము స్ఫురించుచున్న దనియు సమన్వయించియున్నారు. కాని 'సమీరబాలుఁడు' అనగా 'పిల్లవాయువు' అని యర్థము వచ్చినచో సరిపడును గాని 'సమీరమనెడు బాలుఁడు' అని యర్థము వచ్చినచో రూపకాలంకారము కావలసివచ్చును. 'బాలసమీరము' అని యనక 'సమీరబాలుఁడు' అని యనుటచే నిచట రూపకమే కవియుద్దేశ్యమా యనియు నాలోచింపవలసియున్నది.

'మోహముతో గుబ్బలమీఁదిపైఁటకొంగు లాగుట' అనునది యువకుఁడు చేయవలసినపని కాని బాలుఁడు చేయునది కాదు గాన నిచట రూపకాలంకారము సరసము కాదనియు, నందుచే 'పిల్లవాయున్న' అను నర్థము చెప్పి సమాసోక్తియే యంగీకరింపవలయు ననియు,నందు కేని, యిట్టి క్లిష్టసమన్వయము కల పద్యము నుదాహరించుటకంటె మిక్కిలి స్పష్టకని యుదాహరణము నిచ్చుట మంచిదని నాయూహ. కటికనేని రామయకవి చక్కని యుదాహరణ మిచ్చినాఁడు. చూడుఁడు:

"అతివల్గత్కుచభార మాకులకచం బాలోలహారౌఘ మా
తతనృత్యన్మణికుండలాభ మసకృత్పాణిప్రహారక్రమా
న్వితమాస్విన్నముఖాబ్జ మాయతలసన్నిశ్వాసమై యొప్ప నీ
సతి నీసేవ యొనర్చుఁ బ్రేమనిది నీసద్భాగ్యమౌఁ గందుకా ॥"

ఇచట బంతియాటను వర్ణింపఁగా, విపరీతరతి చేయుచున్న స్త్రీవృత్తాంతము వ్యంగ్య మగుచున్నది.

## 7. సమాసోక్త్యలంకార చర్చ.

సమాసోక్త్యలంకారమునుగూర్చి చర్చించుచు మూలమున,

"యథా ప్రస్తుతవిశేష్యేఽప్రస్తుత వృత్తాన్తస్యాన్వయాయోగ్యతా, తథైవ వాఽప్రస్తుతేఽపి జారాదౌ నాస్తి ప్రస్తుతవృత్తాన్తస్యాన్వయయోగ్యతా. ఏవంచ సమప్రధానయోః ప్రస్తుతాప్రస్తుతవృత్తాన్తయో రన్యతరస్యావశ్య మారోపేఽభ్యుపగన్తవ్యే శ్రుత ఏవ ప్రస్తుతేఽప్రస్తుతస్యారోప శ్చారుతాహేతు రితి యుక్తమ్."

అని వ్రాయఁబడినది. దీనిని గటికనేని రామయకవి మూలాను సారిగనే యాంధ్రీకరించి యున్నాఁడు. చూడుఁడు:

"ప్రస్తుతవిశేష్యమునం దప్రస్తుతవృత్తాంతంబున కన్వయయోగ్యత్వం బెవ్విధంబున లే దవ్విధంబునను యప్రస్తుతంబైన జారాదికంబునంఁ బ్రస్తుతవృత్తాంతంబున కన్వయయోగ్యత్వంబు లేదు గావున సమ

ప్రధానంబులైన ప్రస్తుతాప్రస్తుతవృత్తాంతంబులలో నన్యతరంబున కన్యతరంబునం దవశ్యం బారోపం బంగీకరింపందగియుండ శ్రుతంబైన ప్రస్తుతంబునందె యప్రస్తుతవృత్తాంతారోపంబు చారుతాహేతువని చెప్పుట యుక్తంబు."　　　(కువలయానందప్రకాశము.)

ఇంక, బు॥ వేం॥ర॥ గారి యాంధ్రీకరణము పూరాతము :

"సమాసోక్తి యందుఁ బ్రస్తుతవృత్తాంతమే ముఖ్యము. అప్రస్తుతము ముఖ్యము కాదు. సమాసోక్త్యుదాహరణములలో ప్రస్తుతవిశేష్యమునం దప్రస్తుతమున కన్వయయోగ్యత కలదు. కాని యప్రస్తుతమునందుఁ బ్రస్తుతమున కన్వయార్హత లేదు. కావునఁ బ్రస్తుతమునకుఁగల ప్రాధాన్య మచట అప్రస్తుతమునకు లేదు. అచటఁ బ్రస్తుతమునందే యప్రస్తుతవృత్తాంతసమారోప ముచితము. అట్లొనరించిననే చమత్కారము కలుగును."　　　(కువలయానందసారము. 125. పుట.)

ఈవ్రాఁత కర్థ మేమో తెలియదు. ప్రస్తుతవిశేష్యమునం దప్రస్తుతమున కన్వయయోగ్యత లేదని (అన్వయాయోగ్యతా) మూలములో స్పష్టముగా నుండఁగా యోగ్యత కలదని వీరు వ్రాసియున్నారు. మఱియు నొకటి ప్రధానము, వేఱొకటి యప్రధానమును గాక రెండును సమానములే యైనను నేదో యొకదానియందు మఱొకటి యారోపించితీరవలసియుండఁగాఁ బద్యములో వినఁబడుచున్నందున నాప్రస్తుతమునందే యప్రస్తుతము నారోపించుట న్యాయ్యమని మూలములోనుండఁగాఁ బ్రస్తుతము ప్రధాన మనియు, దానియందే యప్రస్తుతము నారోపించుట యుచిత మనియు వీరభిప్రాయపడుట తప్పు. ఈ వీరివ్రాఁతనుబట్టి మూలము వీరికి సరిగా నర్థముకాలేదని స్పష్టము.

### 8. ఉల్లేఖము.

దీని మొదటిభేదమునకు,

"పెక్కుగతుల నుల్లేఖము
నొక్కపదార్థమునఁ బెక్కు రోలి నిలిపినన్."

అని లక్షణము వ్రాసి, "అనేకవిధధర్మములు కల వస్తువును, తత్తద్ధర్మాను సారముగ ననేకు లనేకరీతులను తలంచుట యుల్లేఖము,

ఉదాహృతి.—

చిలుకల చదువుల బడులయి
*యటలకుఁ బానీయశాల లయి కోకిలమం
డలముల కామెత లయి వల
పులకు నిదానంబులగుచుఁ బొలిచెం దరువుల్. (కవిజనరంజనము)

ఇచటఁ దరువులు చిలుకలకుఁ జదువులబడులుగను, తేంట్లకుఁ బానశాలలుగను, గోకిలలకుఁ గాయకలుగను, ఉన్నట్లు వర్ణింపఁబడినది" అని వేంకటరమణయ్యగారు వ్రాసియున్నారు.

పై యుదాహరణము సరిపడియుండలేదు. ఇచట ననేకు లనేక రీతుల నుల్లేఖింపలేదు.

చిలుకలు మొదలగువానికిఁ దరువులు, చదువులబడులు మొదలైనవిగా నున్నట్లు కవి చెప్పియున్నాఁడే కాని యనేకు లనేకరీతులుగాఁ దలంచి యున్నట్లు వర్ణింపలేదు. కాన నిది దీని కుదాహరణ మగుటకు వీలు లేదు. మూలమందలి యుదాహరణములో ననేకు లనేకరీతులఁ దలంచినట్లు స్పష్టముగాఁ గప్పట్టును. చూడుఁడు:

"గజత్రాతేతి వృద్ధాభిః శ్రీకాంత ఇతి యౌవతైః
యథాస్థితశ్చ బాలాభి ర్దదృశే శౌరిః సకౌతుకమ్."

ఇచట శౌరి వృద్ధస్త్రీలచేతను, యువతిజనముచేతను, బాలికల చేతను, ననేకరీతులఁ జూడఁబడినట్లు స్పష్టముగా వర్ణింపఁబడినది.

9. అపహ్నుతి.

పర్యస్తాపహ్నుతి:—

దీనికి వేంకటరమణయ్యగారు "ప్రకృతధర్మం బితరస్థలార్థమైనఁ బర్యస్తయా" అని లక్షణము వ్రాసి, "ఒకవస్తువుయొక్క ధర్మమును,

* 'యటలకు' తప్పు. 'యళులకు' అని యుండవలయును.

ప్రస్తుతాతిరిక్తమగు వేఱొకస్థలమున నారోపించినఁ బర్యస్తాపహ్నుతి యగును.

గరళము విషంబు కాదు భార్గవియె కాని
ప్రజ లదేలనో మార్చియే పలుకుచుంద్రు
విసపు మేతరి సుఖముగా మసలు; లక్ష్మి
ముట్టినంతనె వెన్నుఁడు మూర్ఛఁబొందు.

ఇచట గరళమునందలి విషత్వము నచటఁ గప్పివైచి, యిందిర యం దారోపించుటం బట్టి యిది పర్యస్తాపహ్నుతి యగును.'' అని వ్రాసి యున్నారు.

పై లక్షణము కొంచెము దిద్దవలసియున్నది. ప్రకృతధర్మ మితర స్థలార్థమైనఁ బర్యస్తాపహ్నుతి" అను దానిని "ప్రకృతధర్మనిహ్నవ మితర స్థలారోపార్థమైనఁ బర్యస్తాపహ్నుతి" అని మార్పవలయును. ఇచటి మూలమును గమనింతము:

"అన్యత్ర తస్యాఽరోపార్థః పర్యస్తాపహ్నుతి స్తు సః
నాఽయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీముఖమ్.

యత్ర క్వచిద్వస్తుని తదీయధర్మనిహ్నవః, అన్యత్ర వర్ణనీయే వస్తుని తస్య ధర్మస్యాఽరోపార్థః స పర్యస్తాపహ్నుతిః। యథా చంద్రే చంద్రత్వనిహ్నవో వర్ణనీయే ముఖే తస్యాఽరోపార్థః"

ఈ యలంకారమునఁ గటికనేని రామయకవి యాంధ్రీకరణ మెట్లు నిర్దిష్టముగ నున్నదో చూడుఁడు:

"నిక్కువంబుగఁ దద్ధర్మనిహ్నవంబు
నన్యమందున నారోపణార్థమైనఁ
బరఁగుఁ బర్యస్త మనెడి యపహ్నవంబు
శశి యితఁడు కాఁడు, శశిప్రియాస్యం బఁగ.

ఒకానొకటి యగువస్తువునందుఁ దదీయ ధర్మనిహ్నవం బన్యం బైన వర్ణనీయంబగు వస్తువునం దారోపార్థం బయ్యెనేని పర్యస్తాపహ్నుతి

యగును. ఇయ్యుదాహరణంబునందుఁ జంద్రునియందుఁ జంద్రత్వవిశేషణంబు వర్ణనీయంబైన ప్రియావదనంబునం దారోపార్థంబయ్యె."

10. విధి.

శ్రీ. బు॥ వేం॥ ర॥ గారు విధ్యలంకారమున కిచ్చిన యుదాహరణమును, తత్సమన్వయమును గమనింపుఁడు.

"నీవు మాటలు నేర్పి నెమ్మితోఁ బ్రోచిన
చిల్క చిల్కగుఁ జుమ్మి చిగురుఁబోఁడి!
నీవాట దిద్ది మన్నించి పెంచిన బర్హి
బర్హియౌఁ జుమ్మ శంపాలతాంగి!
నీ కొలంకునఁ జేరి నెక్కొన్న కోకంబు
కోకమౌఁ జుమ్మి చకోరనయన!
నీతోఁట మధుపాని నీటు గాంచిన యళి
యళియగుఁ జుమ్మ మత్తాళివేణి!
దైవబల మేరికి నొకింత తప్పెనేని
ప్రాణబంధువు లైనను బగతు రగుదు
రింతి! యటుగాన వేగ నన్నేలుకొనుము
కాయజుఁడు నిర్దయకరుఁడుఁ గాచువాఁడు.

ఇందుఁ జిలుక చిలుక యగునని చెప్ప నక్కఱలేదు. కాన రెండవ 'చిలుక' అనుపదము 'నీవుపెంచని చిలుక యథార్థమగు చిలుక కాదు. అది నీచమగునది' అను నర్థమును బోధించుచున్నది. ఇట్లే తక్కినపదముల విషయమునను గ్రహింపవలెను."

పై యుదాహరణము, కూచిమంచి తిమ్మకవి రసికజనమనోభిరామమందలి మూఁడవయాశ్వాసమునఁగల 92 వ పద్యము. ఇందొకఁడు తాను ప్రేమించిన యువతితో "సుందరీ! నీవు నన్నేలుకొననిచో నీవుపెంచిన చిలుక మొదలైనవియే నీశత్రువు లగును" అని చెప్పుచున్నాఁడు. ఇట్టిసందర్భములో "నీవుపెంచిన చిలుకయే మంచిచిలుక; తక్కిన

చిలుక నీచమగునది" అని పేరుచెప్పిన యర్థమెంతమాత్రము రా వీలులే దు. ఆపద్యమును చివరవఱకుఁ జదివినచో నేఁజెప్పినయర్థము బోధపడు చునే యున్నది. " 'చిలుక, బర్హి, కోకము, అళి' అనునివి నీకు సంబంధు లగుటచే నిన్ను బాధింప వనుకొనుచుంటివి కాఁబోలు ! అవి నీచేఁ బెంపఁ బడినను వాని స్వభావముచే విరహిజనబాధాకరములు కాకమానవు" అను నర్థము వ్యంగ్యము.

ఇంతే కాక యిచట మఱియొక చమత్కార మున్నది 'చిల్లగున్' అను చోట 'చిల్లు+అగున్' అని విభజించినచో 'బాణమగును' అనియు నర్థము రాఁగలదు. కాన నీచిలుక, బాణమువంటి దగుననియు స్ఫురించు చున్నది. మఱియు 'బర్హి' అనఁగా 'దర్భ' అనియు నర్థము కలదు. దర్భ పట్టుకొనినచోఁ జేయి తెగును కాన నీనెమిలి, దర్భవలెఁ బ్రమాదకర మగు ననియు గమ్యము. ఇంక 'కోకము' అనఁగా 'తోఁడేలు' అనియు నర్థము గాన నీకోకము, తోఁడేటివలెఁ గ్రూరమగు ననియు వ్యంగ్యము. ఇంతేగాక 'అళి' అనఁగా 'తేలు' అనికూడ నర్థము గాన నీతుమ్మెద, తేలువంటిదగుననియు నిచట ధ్వనించుచున్నది. రసికాగ్రేసరుఁడగు కూచి మంచి తిమ్మకవి వ్రాసిన యీపద్యమున నింకను వ్యంగ్యశతములు స్ఫురిం చుట కవకాశ మున్నదేమో కాని, బు॥ వేం॥ ర॥ గారు చెప్పిన 'నీవు పెం చినచిలుక నీచమగుచిలుక' అనునర్థము మాత్ర మెట్లును నిచట స్ఫురింప నవకాశము లేదు.

పై పద్యమును సరిగా నర్థముచేసికొనకపోవుటచేతనే వీరు విధ్య లంకారమునుగూర్చి వ్రాసిన క్లిష్టచర్చలోఁ గూడ నిట్లే పొరపాటుపడి యున్నారు.

## 11. అనుజ్ఞ.

అనుజ్ఞాలంకారమునకు, బు॥ వేం॥ ర॥ గారు వ్రాసిన

"దోషముననె గుణంబది తోఁచియున్న
దానిఁ జెప్ప ననుజ్ఞయై తనరుచుండు."

అనులక్షణములో 'దానిఁ గోర ననుజ్ఞ' అనియున్నచో మూలానుసారిగ నుండెడిది. మూలముచూడుఁడు:

"దోషస్యాభ్యర్థనాఽనుజ్ఞా తస్మిన్నేవ గుణదర్శనాత్."

దీనికి సరియైన యాంధ్రీకరణమగు కటికనేని రామయ కవి లక్షణము చూడుఁడు:

"దానియందునె గుణదర్శనానుభూతి
నమరుదోషార్థన మనుజ్ఞ యనఁగఁ బరఁగు."

## 12. ఉన్మీలితము.

గుణసామ్యముచే రెండువస్తువులకు భేదము కనఁబడక యొక్కటిగానే కనఁబడుట మీలితాలంకారము. రెండు వస్తువులు వేఱుగాఁ గనఁబడుచున్నను నా రెండిటికి సాదృశ్య ముండుటచే నందేది యేవస్తువో యను విశేషము తెలియకపోవుట సామాన్యాలంకారము. పై మీలితాలంకారముండు స్థలములో నేదైన నొకకారణముచే భేదము తెలియఁబడినచో నది మీలితాలంకారప్రతిద్వంద్వి యగు నున్మీలితాలంకార మనియు, సామాన్యాలంకారస్థలమున విశేషస్ఫూర్తియైనచో సామాన్యాలంకారప్రతిద్వంద్వి యగు విశేషకాలంకార మనియు, కువలయానందసిద్ధాంతము. ఇట్లుండ, బ్ర॥ వేం॥ ర॥ గారిచ్చిన యున్మీలితాలంకారలక్ష్యము చూడుఁడు:

"క్రొన్నెలతాల యుప్పరిగ కొప్పుల నొప్పులు గుల్కు ప్రాయపుం
గన్నెలముద్దుమోములను గ్రాలెడుమేడలదారి నేఁగు నా
వెన్నెలతేని నేర్పులుప వేఱొకనేరుపు తోఁచమింగదా
వెన్నెలతేనిలో నలుపు వేలుపుపెద్ద యొసర్చె గుర్తుగన్."

గుణసామ్యముచే రెండువస్తువులకు భేదము కనఁబడకపోఁగా నేదైన నొకకారణముచే వానిభేదము తెలియఁబడినచో నున్మీలితాలంకార మని సిద్ధాంతము. ఇందు 'ముఖములు, చంద్రుఁడు' అను వీని యైక్య మసంభవము. కావున నిది యున్మీలితాలంకార మెట్లును గాఁజాలదు.

ఉదాహరణ పద్యముల నితరగ్రంథములనుండి యేర్చి యిచ్చుట సుకరము కాదు. మిగులఁ బరిశీలించి యీయవలయును.

కటికనేని రామయకవి యాంధ్రీకరణము చూడుఁడు:

"త్వద్యశోమగ్నమైన శీతాచలమును
దెలియుచున్నారు చలిచేత నివిజు లరయ."

కీర్తియందు శీతాచలము వేఱుగాఁ గనఁబడకపోఁగాఁ జలిచేఁ దెలియఁబడుచున్నదని చెప్పుటచే నిచట నున్మీలితాలంకారలక్షణము చక్కఁగా సమన్వయించుచున్నది.

13. ఏకావళ్యలంకారము.

"గృహీతముక్తరీత్యార్థశ్రేణి రేకావళి ర్మతా,
నేత్రే కర్ణాన్తవిశ్రాన్తే కర్ణౌ దోస్తమ్భదోలనౌ.

ఉత్తరోత్తరస్య పూర్వపూర్వవిశేషణభావః పూర్వపూర్వస్యోత్తరోత్తర విశేషణభావో వా గృహీతముక్తరీతిః. తత్రాద్యః ప్రకార ఉదాహృతః. ద్వితీయో యథా,

"దిక్కాలాత్మసమైవ యస్య విభుతా, యస్తత్ర విద్యోతతే......"

అని లక్ష్యలక్షణములు చూపఁబడినవి.

"ఉత్తరోత్తరస్య పూర్వపూర్వ విశేషణభావః" అనఁగా, 'ఉత్తరోత్తరము పూర్వపూర్వమునకు విశేషణ మగుట' అని యర్థము. మొదటి యుదాహరణము దీనికి సరిపడియే యున్నది. ఇంకఁ బూర్వపూర్వ ముత్తరోత్తరమునకు విశేషణమగుటకు రెండవ యుదాహరణము సరిపడియున్నది.

ఇచట, బు॥ వేం॥ర॥గారి యాంధ్రీకరణము చూచినచో వీరుపడిన వింతభ్రమ తెలియఁగలదు.

"ఎంతు రేకావళి యని గృహీతముక్త
రీతిచే నర్థఘటనల రీతి వెలయ"

ఉత్తరోత్తరమునకుఁ బూర్వపూర్వము విశేషణమైనను, పూర్వపూర్వమున కుత్తరోత్తరము విశేషణమైనను గృహీతముక్తరీతి యనఁబడును. ఆరీతిగ నర్థములు కూర్పఁబడునేని యేకావళి యను నలంకారమగును.

మొదటిభేదమున కుదాహరణము:—

"తావులవెంబడిన్ దగిలి తాఁకెడుఁ దేఁటులు, తేఁటి ఱెక్కలం

బోవక నాఁటెఁ బుప్పొడియు..........

ఇచట నుత్తరోత్తరములగు తేఁటులు మొదలగువానికిఁ బూర్వపూర్వములగు తావులు మొదలగునవి విశేషణములట్లు వర్ణింపఁబడినవి.

ద్వితీయభేదమునకుదాహరణము:—

దేనివిభుత్వంబు దిక్సముదాత్మల

సమమగు నటఁ బ్రకాశమగునంతు

వాఁడెవండు..............."

ఇచట వీరిభ్రాంతి యేమనఁగా, మూలమందలి 'ఉత్తరోత్తరస్య పూర్వపూర్వవిశేషణభావః' అనుదానికి 'ఉత్తరోత్తరమునకుఁ బూర్వపూర్వము విశేషణ మగుట' అని యర్థ మనుకొనిరి. కాని మూలమందలి 'ఉత్తరోత్తరస్య పూర్వపూర్వవిశేషణభావః' అను మొదటిభేదమున కుదాహరణమగు 'నేత్రే కర్ణాన్తవిశ్రాన్తే' అనుచోట నుత్తరోత్తరమునకుఁ బూర్వపూర్వము విశేషణము కాలేదనియు, పూర్వపూర్వమునకే యుత్తరోత్తరము విశేషణ మైనదనియు వీరు గమనింపలేదు. ఇట్లే మూలమందలి లక్ష్యలక్షణములను సరిగా నర్థము చేసికొనకపోవుటచే రెండవభేదమునను బొరపాటు పడిరి.

ఒకవేళ మూలమందలి ప్రథమభేదమును వీరు ద్వితీయముగాను, ద్వితీయమును బ్రథమముగాను జెప్పి రనుకొందమన్నను సరిపడుటలేదు. అట్లయినచో మూలమందలి ప్రథమభేదోదాహరణమును వీరి ద్వితీయభేదమునకును, మూలమందలి ద్వితీయమును వీరిప్రథమమునకును

నుదాహరింపవలయును గదా! అట్లు చేయక మూలములోనున్న ద్వితీయ భేదోదాహరణమునే యాంధ్రీకరించి, వీరును వీరి ద్వితీయభేదమునకే యుదాహరణముగా నిచ్చియున్నారు.

కనుక నిచట వీరు మూలము నర్థము చేసికొనకయే యాంధ్రీకరించియున్నారని చెప్పవలసియున్నది.

## 14. అత్యుక్తి.

ఈ యలంకారమున మిథ్య యగుదానిని వర్ణించుట యుండును. కాని మిథ్య యగునట్లు వర్ణించుట యుండదు. వీరు లక్షణమున కర్థము వ్రాయునపుడు 'యథార్థము కాకున్నట్లు వర్ణించిన అత్యుక్తి యగును' అని పొరపాటు పడిరి.

## 15. అవజ్ఞ.

కాశీఖండమందలి మొదవయాశ్వాసమునగల 311 వ పద్యము నీయలంకారమున కుదాహరణముగా నిచ్చి యందలి 'సుధాంధసులు' అను పదమునకు రాక్షసులని యర్థము వ్రాసినారు. సుధాంధసు లనగా దేవతలు; రాక్షసులు కారు.

## 16. ఉల్లాసము.

దీని యుదాహరణములో 'పునీత నగుదునని గంగ తలంచెన్' అని వీరు వ్రాసిరి. ఇది వీరి సొంతపద్యము కాబోలు ! ఇందలి పునీతశబ్దము వ్యాకరణదుష్టము. 'పూత' అని కావలయును గాని 'పునీత' అని యగుటకు వీలు లేదు. ఈపదమును శబ్దరత్నాకరము గ్రహించుటకూడ బొరపాటు.

## 17. మాలాదీపకము.

బ్ర।వే।రా।గా రీ యలంకారమున కిచ్చిన యుదాహరణమును, తత్సమన్వయమును గమనింపుడు:

"వసియించెను మన్మథుఁడా
బిసరుహపత్రాక్షి చిత్తపీఠిక, నా మా

నసము కరము నీయందున

వసియించెను వేఱు మాట పలుకఁగ నేలా!

ఇచట 'వసియించె'నను క్రియయొక్కటే ప్రస్తుతాప్రస్తుతములగు స్త్రీచిత్తపురుష చిత్తములందుఁ జెప్పఁబడుట దీపకమగును......"

పై పద్యములో 'వసియించెను' అనుపదమొక్కటే యున్నదా? రెండు పదము లున్నవి. వాక్యద్వయమునందును నన్వయించెడి పద మొక్కటే యున్నచోటనే దీపక మగును. రెండు వాక్యములందును వేఱు వేఱుగా నన్వయించుచున్న 'వసియించెను' అనుపదములు రెండు కల పద్యము నుదాహరణముగా నిచ్చుట యొక తప్పు. తామిచ్చిన పద్యమును సరిగాఁ జూచుకొనకుండ నందొక్కటే పదమున్నదని సమన్వయించుట మఱియొక తప్పు. కటికనేని రామయకవి యెట్లు నిర్దుష్టముగా నాంధ్రీక రించినాఁడో చూడుఁడు:

"దీపకైకావళీయోగదీప్తివలనఁ

దేజరిల్లును మాలికాదీపకంబు

మదనుచేతను మదిరాక్షిమదిని దాని

చేత నీయందునను స్థితి సేయఁబడియె."

ఈలక్ష్యంబునందు 'స్థితి'అను నీ యేకపదంబునకు "మదనుచేతను మదిరాక్షిహృదయంబునందు స్థితి సేయఁబడియె; ఆ హృదయంబుచేత నీయందు స్థితి సేయంబడెను" అని యివ్విధంబున వాక్యద్వయాన్వయంబు గలుగుటవలన దీపకంబయ్యె........."

18. ముద్రణస్ఖాలిత్యములవంటివి.

(1) అప్రస్తుతప్రశంసాలంకారము నందలి కార్యనిబంధన కిచ్చిన యుదాహరణపుసమన్వయములో "కావున నిది కారణనిబంధన యగు చున్నది." (పుట. 45.) అని తప్పు పడినది. "కార్యనిబంధన యగు చున్నది" అని యుండవలయును.

(2) అసంగత్యలంకారలక్షణమున కర్థము వ్రాయునపుడు "కార్య మొక్కచోటను కార్యము వేఱొకచోటను వర్ణించుట" (పుట.60) అని యున్నది. "కార్యమొక్కచోటను కారణము వేఱొకచోటను" అని యుండ వలయును.

(3) మీలితాలంకార లక్ష్యసమన్వయములో "ఇచటి పదార్థములన్నియుఁ దెల్లని వగుటచేఁ గాంతలు నిండు వెన్నెలలో నారులచేఁ బాకంబడినను దెలియఁజాలరని భేదభావము వర్ణింపఁబడియున్నది." (పుట. 103.) అని వ్రాయఁబడినది. ఇచట 'భేదభావము' అనుటకు బదులు 'అభేదభావము' అని యుండవలయును.

(4) రూపకలక్షణములో 'విషయము విషయతాద్రూప్యయుక్తమైన' అనుచోట 'విషయితాద్రూప్య' అని యుండవలయును.

బ్రు॥ వేం॥ర॥గారు యీ యలంకారముల కితరగ్రంథములనుండి పద్యము నుదాహరణముగా నిచ్చినపు డా పద్య మాగ్రంథమునం దే భాగమునందలిదో, అందెన్నవపద్యమో కూడఁ జూపినచోఁ బాఠకులకు మిగుల నుపయుక్తముగా నుండెడిది.

ఇఁక వీరి వ్రాఁతలో వ్యాకరణము పాటింపఁబడినదో లేదో తెలియదు. ఒక్కొక్కచోట ప్రథమప్రకృతికమునకుఁ దరువాతఁ బరుషములు వచ్చినప్పుడు సరళాదేశాదికము చేయుటయు, వేఱొకచోట సరళాదేశము చేయకుండుటయే కాక ద్రుతలోపము చేయుటయుఁ గాఁబడుచున్నది. చూడుఁడు:

| | | |
|---|---|---|
| ఇచటఁ బ్రస్తుతము. | 47 పుట. | 9 పంక్తి. |
| ఇచట ప్రస్తుతము. | 47 పుట. | 15 పంక్తి. |

ఇట్లే వీరిచేతికి వచ్చినట్లు వ్రాయుటయే కాని, యొకనియమము లేదని స్పష్టీకరించు నుదాహరణము లెన్నియేని కలవు.

| | | |
|---|---|---|
| కాన నిది. | 103 పుట. | 18 పంక్తి. |
| కాన ఇది. | 47 పుట. | 12 పంక్తి. |
| అభేదము ఆరోపింపఁబడినది. | 141 పుట. | 21 పంక్తి. |

ఇట్లు వ్యస్తపదముల సంధిలోనే కాక సమాసమున రెండు పదములు కలియునప్పటి మార్పులునై తము వీరు చేతికి వచ్చినట్లు వ్రాయుచు వచ్చిరి.

| | | |
|---|---|---|
| కల్గునర్థద్వయము. | 41 పుట. | 3 పంక్తి. |
| ఉపకరించు ఉఋము. | 83 పుట. | 9 పంక్తి. |
| అగునంశము. | 108 పుట. | 4 పంక్తి. |

బు॥ వేం॥ ర॥ గారు పండితులు. వీరికీపాటివ్యాకరణవిషయములు తెలియక వ్రాసినారని నేను జెప్పుట లేదు. కాని తమవ్రాంత నొక నియమముతోఁ బోనిచ్చిన బాగుగా నుండెడినని నాయాశయము.

పై విషయములలో నేను జూపిన యనుపపత్తులు ఋజుదృష్టితోఁ బరిశీలించుకొని యవి తమపొరపాటులే యైనచో వేంకటరమణయ్యగారు వానిని బునర్ముద్రణమున సవరించుకొని పాఠకుల కుపకారము చేయుదురుగాక యనియు, అందు నేనేమైనఁ బొరపాటులు వ్రాసినచో వానిని దెలుపుదురుగాక యనియుఁ గోరుచున్నాను.

మఱియు వీరు వ్రాసిన యీయాంధ్రీకరణమును మూలముతోపాటు శోధించి విమర్శింపఁగల పండితు లెవరిచేనైనఁ బరిష్కరింపించికొని పిమ్మటఁ బ్రకటించిన యుక్తముగా నుండెడిదనియు, అట్లుచేసినచోఁ దమకు మూల మెచ్చట నర్థము కాలేదో యచ్చటఁ దెలిసికొనుటకును, ఇతర గ్రంథములనుండి యిచ్చిన యుదాహరణములు సరిపడినవా, లేదా, యని విమర్శించుకొనుటకును, ఆంధ్రీకరణము మూలానుసారిగా నున్నదో లేదో పరిశీలించుకొని తప్పులు దిద్దుకొనుటకును, అవకాశ ముండెడిదనియు మనవి చేసికొనుచున్నాను.

# గ్రంథస్వీకారము.

1. శ్రీవేంకటేశ్వరశతకము—మదనపల్లి కళాశాలయందు ఆంధ్ర భాషోపన్యాసకులగు విద్వాన్ దర్భా వేంకటకృష్ణమూర్తి ఎం. ఏ. గారిచే నేటి లోకవ్యవహారమునఁ గల దుష్టవర్తనములను గూర్చి రచింపఁబడిన శతకము. 'ఏయేవేళన్ నామది। కాయాసము సంఘటిల్లె నాయావేళన్ వేయుద్భవిలిన' పద్యసముదాయమని వీరి పీఠికయే తెలుపుచున్నది. ప్రపంచమునఁ గల మాయల నున్నటులు వర్ణించితి మనియుఁ,దమ యుద్దేశమెవరినిగాని తిట్టుటకొఱకుఁ గాదనియు వీరు శతకాంతమున వ్రాసియున్నారు. వీరి కవిత్వము సరళముగనున్నది. వీరందంపు లోకోక్తుల నిమిడ్చి చక్కగ వ్రాసియున్నారు. కాని కొన్ని సందర్భముల నవి శ్రుతికటువుగ నున్నవి. ఈ గ్రంథమునఁ గేవలము దోషోద్ఘాటనమేగాని గుణప్రశంస గన్పడదు. అది మఱియొక శతకమునఁ జేయుదురని తోఁచెడిని. శ్రీవేంకటేశ్వరాంకితము. మచ్చునకుఁ బద్యములు.

ఉ. ఇచ్చకముల్ రుచించునటు లింపగునే హితబోధ మింతయే
నిచ్చకు వచ్చినట్లు చరియించి నశించెదు దుష్టబుద్ధికిన్ ?
మెచ్చునె మేలి యౌషధము ? మెచ్చును గాక యపథ్యవస్తువుల్
హెచ్చుగ రోగి పాపము ఫలించెడు వేళల వేంకటేశ్వరా ?

ఉ. ఒక్కఁడు వ్రాయు గ్రంథము, మఱొక్కరి కబ్బు యశం, బదట్లకా?
చక్కని సౌరభంబు వెదచల్లు సుమంబుల నెవ్వఁడెంచు ? న
మ్మక్క ! తదీయసౌరభము నంతయుఁ జక్క గ్రహించి వీచునా
తెక్కలి గాలినే కడు నుతింతురు గాకిల వేంకటేశ్వరా.

---

2. సేతుబంధమహాకావ్యము—దేవవ్రతచరిత్రాది మహాప్రబంధ నిర్మాతలును, శ్రీ విజయనగరమహారాజావారి కళాశాలయం దాంధ్ర గీర్వాణ పండితులు నైన శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారిచే

రచింపఁబడినది. ఇది మహారాష్ట్రప్రాకృతభాషలో ప్రవరసేనునిచే రచింపఁబడిన రావణవధ లేక సేతుబంధమను కావ్యమున కాంధ్రీకరణము. ఆచార్యదండియు, హర్షచరిత్రోపోద్ఘాతమున బాణుఁడును దీనిని ప్రశంసించియున్నారు. ప్రవరసేన మహారాజు కాశ్మీరరాజో, వాకాటకవంశీయుఁడో నిర్ణయింపఁబడలేదు. పంచదశాశ్వాసయుతమగు మూలకావ్యమును బండితకవులగు గ్రంథకర్తలు గీతముల ననువదించిరి. వీరి భాషాభిమానము పాండిత్యము నందఱకు విదితము. ప్రతిఘట్టమునకును ముందందలి విషయము వచనరూపమున వివరింపఁబడినది. క్లిష్టమగు మూలము నిక్లిష్టాంధ్రీకరించి, వీరు కృతకృత్యులైరి. ఇందుఁ గొంతభాగ మిదివఱలోఁ బరిషత్పత్రికయందుఁ బ్రకటింపఁబడినది. శైలికై కొన్ని పద్యములు.

గీ. బాష్పసంక్లిన్నమయ్యును బంక్తికంఠ
వధసమాలోచనోద్భూతబహుళకోప
వహ్నిదుష్ప్రేక్ష్య మయ్యెనుఁ బ్రభుముఖంబు
చైత్రచండాంశు బింబంబు చందమునను. 1-43

గీ. ఎంతఁ జూచినఁ గనులకు వింతఁగొలుపు
నెంతవిన్నను వీనుల కింపునింపు
సుకృతపరిణామమునుం బలె సూక్తిపోని
సుఖపరంపర నీనెడు సొబగుదాని. 2-10

గీ. మూర్ఛఁదేరిన తఱినైన ముగుద చిన్న
యూర్పు లలయించుఁ బల్మాఱు నుస్సురనుచు
నిస్పృహములైన యంగముల్ నిలుపలేక
సంతతశోకోచ్ఛ్వసితదధికాశ్రుసంతతులను
మునిఁగియున్న కనీనికల్ పొలుపుఁ జూప
మెల్లమెల్లన గనువిచ్చె మెలత యపుడు. 11-60

వీరి యాంధ్రీకరణమిట్లు కొన్ని తావుల సులభముగ నున్నను రొుక్కొకచో టిప్పణి నపేక్షించుచున్నది. అందులకు దీర్ఘసమాస యుతంబగు మూలమే కారణమై యుండును.

గీ. భూరిదర్వీకరాభోగభోగవేష్టి
తాంబువేదండధవళదంతాగ్రమగుచు
సాగ్నిశరదగ్ధకేసరసంఘజలధి
సింహ సంఘాత సంకులశ్రీకమగుచు

గీ. ధూత పర్వత సంచయోత్తుంగశిఖర
పతిత మణ్యశ్మజాల సంభగ్న విద్రు
మంబు దరదగ్ధ విషధరౌఘంబు గరళ
పంకసమ్మగ్నవిహ్వలవారిగజము.

---

(3) ఉమాదర్శః (4) స్తుతికుసుమాంజలిః. (5) సర్వసమవృత్త ప్రభావః (6) కమలావిజయనాటకమ్. ఈనాలుగు గ్రంథములును గీర్వాణభాషయందు నివృత్తమహీశూరదేశీయసంస్కృతకళాశాలోపద్రష్టలగు శ్రీ. సి. వేంకటరమణార్యులచేరచింపఁబడినవి. (Retired Inspector of Schools, Mysore). ఆంగ్లభాషాప్రాధాన్యము గలిగి దేశభాషలకును, గీర్వాణభాషకును సరియగు గౌరవములేని నేఁటికాలమున నిట్టిగ్రంథములు సంస్కృతభాషలో రచియింపఁబడుట భారతదేశీయుల యదృష్టమనవచ్చును. ఇట్టి గ్రంథరచనము సంస్కృతభాషయందలి యభిమానమును, గౌరవమును సూచించును. ప్రథమగ్రంథమగు ఉమాదర్శము కె. ఏ. కృష్ణస్వామి అయ్యరుగారిచే నాంగ్లపద్యకావ్యముగ రచియింపఁబడిన Uma's Mirror అను గ్రంథమున కనువాదము. కలహభోజనుఁడగు నారదమహాముని పార్వతీపరమేశ్వరులఁజూడఁబోయి, తన సౌందర్యమును గనులారఁగాంచి సంతసించుటకై పరమేశ్వరు నొక యద్దమును వేఁడుమని పార్వతిని ప్రోత్సహించి తనదారినిఁ బోవును. నీనైజస్వరూపము భౌతికసాధనములకు గ్రహింపరానిదని పరమేశ్వరుఁడామెకుఁ దెలిపినను, పార్వతి యాగ్రహించి యతని యాజ్ఞను వడసి భూచక్రమంతయును గ్రుమ్మరి, తత్త్వజ్ఞానమును బొందెను. తత్త్వజ్ఞాన

మువలన స్వరూపసాక్షాత్కారమును బొందినచో దుఃఖనివృత్తియు, సుఖావిర్భూతియుఁ గలుగునను వేదశాస్త్రార్థమును సామాన్యజిజ్ఞాసువుల కొఱకై కథారూపముగ రచించితిమని గ్రంథకర్తలు వ్రాసియున్నారు. ఈగ్రంథమున సంస్కృతానువాదమును నాంగ్లభాషాపద్యములును గూడఁ గలవు

స్తుతికుసుమాంజలియందు వేర్వేఱుదేవతలను గూర్చి వివిధవృత్తము లలో రచియింపఁబడిన స్తుతులుగలవు. వానియందుఁగల యద్వైతమత తత్త్వములు వేదాంతరహస్యజిజ్ఞాసువులగు ముముక్షువుల కాత్మజ్ఞానము నొసంగునని హయవదనరావుగారు తమ పీఠికయందుఁ దెలిపిరి. ఆయా స్తవముల రచియించుటకుఁ గారణము ప్రస్తావనయందు గ్రంథకర్తలును దెలిపియున్నారు.

సర్వసమవృత్తప్రభావః— సంస్కృతభాషయందు ఛందోలక్షణములఁదెలుపుగ్రంథములు విరళముగఁగలవు. వానియందలి విషయముల గ్రహించి, వివిధవృత్తములకు లక్షణములను నిర్వచించుటయే గాక యుదాహరణశ్లోకములను గూడ సులభమ్ము నుమధురమగు శైలిని గ్రంథకర్తలు రచించియున్నారు. గ్రంథాంతమునఁ బ్రస్తారము చేతను గణితవిధానము చేతను వృత్తసంఖ్యానిర్ణయము, నష్టవృత్తస్వరూప నిర్ధారణము, యతిస్వరూపము మొదలగువిషయములు వివరింపఁబడినవి. ఆయావిషయములు కేదారప్రణీతమగు గ్రంథమునకంటె మిన్నగనున్న వని శ్యామశాస్త్రిగా రభిప్రాయ మిచ్చియున్నారు. అదెట్లున్నను,ఛందో విషయములఁ దెలియఁగోరువారి కీగ్రంథము మిక్కిలి యుపయోగకరము గ నుండుననుట నిర్వివాదము.

కమలావిజయనాటకమ్:—ఆంగ్లభాషాప్రపంచమునఁగల కావ్య రత్నముల నేర్చి సంస్కృతభాషలో ననువదింప మిత్రులు ప్రోత్సాహ ము చేయుట చే,సుప్రసిద్ధాంగ్లకవీశ్వరుఁడగు ఆల్ఫ్రెడ్ టెనిసన్ Alfred Tennyson రచించిన 'కప్' (The Cup) అను దుఃఖాంతనాటక

మును భారతీయనాటకరచనానుసారముగ సుఖాంతముగ మార్చి, యథోచితముగ నవరసాదులను మేళవించి, నూతనవిషయములను జేర్చి గ్రంథకర్త లీనాటకమును రచించిరి. ఈనాటకమయిదంకములు గలిగి పతివ్రతావిజయప్రధానమై ధర్మబోధకమై యున్నది. పంచమాంకమున స్వర్గలోకమున నాయికానాయకు లింద్రమునిసభలో పునస్సమాగమము నొందుటయు, వారికింద్రాదులు దీవనలొసంగి వివాహ మొనర్చుటయు, వర్ణింపబడినది. పంచమాంకమున స్వప్నతత్త్వవిచారము, పుణ్యాపుణ్య ఫలవిచారము ప్రాచీనహైందవసంప్రదాయానుసారముగ వివరింపబడినవి. మూలమునగల పాత్రలనామధేయములును సందర్భోచితముగ మార్పబడినవి. గ్రంథకర్తలగీర్వాణభాషాభిమానము శ్లాఘనీయము మచ్చునకై రెండుశ్లోకములు.

బాల్యేక్రీడావిలాస స్తదను మతిహితా నీతివిద్యాసుశిక్షా
భోగే భావః సుఖేచ్ఛావివిధవిషయతో యౌవనే వస్తులోభః
భూగేహాపత్యభార్యా పశుమణిధనతో, వార్ధకే స్వాస్థ్యయోగో
దివ్యంసౌఖ్యం జనానాంభవతి తవకృపానుగ్రహాన్నిత్యమిత్థమ్.
నిశ్వాస స్తే సమీరో మధురరసభర శ్చాదయ త్యద్రిభూమిం
ఘాసైర్వ్యాప్తైశ్చవప్రం కుసుమఫలభరై ర్గ్రామభూమిం సుసస్యైః
చేతోమోదం సమానం పశుమృగనరప్రాణినాం సంతనోతి
ప్రీత్యాసక్తం సమస్తం ఫలితపరిణయం దేవిమాం సంతనుష్వ.

(కమలావిజయమ్ అంక 4 శ్లో 5,6)

---

7. భారతీసుప్రబోధము—శతావధాని కావ్యకళానిధి పిసుపాటి చిదంబరశాస్త్రిగారిచే రచింపబడినది.

ఈ యిరువదియవశతాబ్దమున మనదేశమున మతసాంఘికాది విషయములగల్గిన నూతనపరిణామమును జూచి సహింపలేక తమహృదయావేదనమును గ్రంథకర్త లీశతకమున సీసపద్యములవివరించియున్నారు.

సంఘసంస్కర్తల కిట్టిగ్రంథములు రుచింపకపోవచ్చును. ప్రాచీన హైందవ ధర్మోత్కృష్టత పలుతావుల నుగ్గడింపఁబడినది. పాఠకులు సహృదయులై పఠింతురుగాక.

సీ. పలుకులలోఁగల భావ మేదియొ కూడ
నెఱుఁగక దోషంబు లెంచువారు
గొప్పవారల నెదుర్కొనుటచేఁ దమ కేదొ
గొప్ప యశం బనుకొనెడివారు
చెడుకార్యములు తామ చేయుచుఁ గూడదం
చని చెప్పువారిపైఁ గసలువారు
గుణదోషములను వాక్రుచ్చినప్పుడు తమ
కున్న దోషముఁబట్టి యుఱుకువారు

గీ. కటకటా నేఁడుబయలు దేఱుటను జేసి
ధర్మమును జెప్పుటయుఁగూడఁ దప్పెననుచుఁ
దోఁచుచున్నది మదిలోనఁ దూట్లతుదకుఁ
దేఱి కనుఁగొనరే భారతీయులార.

---

8. సుయోధనశృంగభంగము అను ఘోషయాత్ర— మల్యాల జయరామయ్యగారిచే రచింపఁబడి శ్రీ శ్రీ శ్రీ జయపురాధీశ్వరులగు శ్రీ విక్రమదేవవర్మగారి కంకితము చేయఁబడినది. ఇందు పాండవులు ద్వైతవనంబున నుండ దుర్యోధనాదులచటికి గోసంరక్షణమను మిషచేఁ బోయి యట గంధర్వులచే నోడింపఁబడి పాండవమధ్యమునిచే విడిపింపఁబడుట మూఁడంకముల వర్ణింపఁబడినది. శైలి సులభము. సలక్షణమగు భాషనే రచించుట కవి యుద్దేశము. ఒండు రెండు విషయముల స్వతంత్రించి యుండుట పీఠికయందుఁ దెలుపఁబడినది. గ్రంథమున కుపోద్ఘాతముగఁ బండితకవుల ప్రశంసావాక్యములు గలవు. కొన్నితావులఁ బాత్రముల సంభాషణము లనౌచిత్యమును దలపించుచున్నవి. గ్రంథమును సుయో

ధనశ్శృంగభంగ మనుటకంటె, ఘోషయాత్రయని మాత్రము పేర్కొను టయే సమంజసము. ముద్రణస్ఖాలిత్యములు పెక్కులుగలవు. వెల తెలుపఁ బడియుండలేదు.

---

9. శతకప్రబంధ హరిహరస్తోత్రరత్నాకరము— శ్రీ చాగంటి రామచంద్రరావుగారిచేఁ బ్రకటింపఁబడినది. ఇందు హరిహరుల మహి మనుగూర్చి పెక్కుప్రబంధములనుండి పద్యములీయఁబడినవి. ముద్రణ స్ఖాలిత్యములు పెక్కులు గలవు. ఇది గ్రంథమునఁ బ్రథమభాగము. మిగిలిన మూఁడుభాగములు ముందు ప్రకటింపఁబడును. ఈభాగముల ను భక్తులనుద్దేశించి కూర్చితిమని గ్రంథకర్తలు వ్రాసియున్నారు.

---

10. ఆధునిక విజ్ఞానం—కవి శ్రీ వసంతరావు వేంకటరావుగారు విజయనగరము మహారాజావారి కళాశాలలోని విజ్ఞాన శాస్త్రపండితులు ఆధునిక విజ్ఞానమను శీర్షికతో నిందు మూఁడు విషయములు చర్చింపఁ బడినవి. (1) సృష్టిరహస్యం (2) మంత్రాలు (3) చంద్రలోకయాత్ర- సంభాషణపూర్వకముగ విజ్ఞానవిషయములను దెలియఁజేయుట కవియుద్దే శము. ఇది యాధునిక విజ్ఞానవిషయముల నామూలాగ్రముగఁ దెలియ పఱుచుట కుద్దేశింపఁబడిన గ్రంథము కాదు. ఇందుఁగ్వాచిత్కముగమూఁడు విషయములుమాత్రము వివరింపఁబడినవి. ప్రాచీనాధునాతన దృక్పథము లకుఁ గల యాంతర్యము పెక్కుమాఱు లుగ్గడింపఁబడినది. ఈగ్రంథమొక కథాసంపుటి యనవచ్చును. శైలి యాధునిక వ్యావహారికము. సులభ మగు శైలిని నేఁటివిజ్ఞానవిషయముల బాలురకు బోధించుటకై గ్రంథకర్త లుపయోగింపవచ్చును. అంతులకు 'కరుకు గట్టిజీవస్ఫులింగాలు గోల్పో యిన' 'అభీకరకీలావిర్భావంతో', ఆమహోజ్జ్వల తేజోవిక్షేపంతో' మొద లగునవి యుపయోగింపరాదు. గ్రంథకర్తలు విజ్ఞానవిషయములను స్వక

మముగ వివరించిన భాగుండును. ఒకటిరెండు విషయములమాత్ర మిట్లు చర్చించిన యుపయోగము తక్కువ.

---

11-. శ్రీ యోగానందము.—కవితావినోద అల్లంసెట్టి అప్పయ్య గారిచే రచింపఁబడినది. శ్రీమచ్ఛంకరభగవత్పాదుల యద్వైతసిద్ధాంతములననుసరించి సులభమగు పద్యములలోఁ బారమార్థిక విషయములు వివిధదృష్టాంతములతో వివరింపఁబడినవి. జిజ్ఞాసువుల యుపయోగార్థము టిప్పణియునీయఁబడినది. శ్రీ శ్రీ స్వామి యోగానందులవారి కృపావిశేషమునఁ బ్రచురింపఁబడుట శ్రీయోగానందమని గ్రంథమునకుఁ బేరువచ్చినది. గ్రంథము చక్కనిసులభశైలిని వ్రాయఁబడినది.

---

12. గాంధిచరిత్రము:— శ్రీమాన్ కొమాండూరి శఠకోపాచార్యులు ఎం.ఏ.బి.యల్.గారిచే రచింపఁబడినది.          వెల 8 అణాలు.

గ్రంథకర్త లిదివఱలో తాతా, జవాహర్లాలు, సుభాషచంద్ర బోసు గార్ల జీవితచరిత్రములను రచియించుటయేగాక హె. జి. వెల్సు గారి ప్రపంచచరితము నాంధ్రీకరించియున్నారు. గాంధిగారి యాత్మకథ యాంగ్రధములోని కనువదింపఁబడియున్నది. కాని యందలివిషయములు 1921 సంవత్సరముతో నాఁగిపోవుటవలనను,అందుఁగేవల మాధ్యాత్మిక విషయములకే ప్రాముఖ్య మీయఁబడియుండుటవలనను, యీ గ్రంథ రచన మావశ్యకమయినది. ఇందు గాంధిగారి జీవితచరిత్రము సంగ్రహముగఁ దెలుపఁబడుటయేగాక వారేయేవిషయములకు ముఖ్యస్థానము నిచ్చియున్నారో, యవి సంపూర్ణముగ వివరింపఁబడినవి. వారి జీవితపద్ధతి మత సాంఘిక రాజకీయభావములు చర్చింపఁబడినవి. గాంధిగారి నిర్మాణ కార్యక్రమమున ముఖ్యసూత్రములగు సత్యాగ్రహము,ఖద్దరు,మద్యపాన నిషేధము, అహింస, గ్రామపరిశ్రమసంఘనిర్మాణము, అస్పృశ్యతా

నివారణము, హిందీభాషా పఠనములనుగూర్చి వేఱువేఱఅధ్యాయ ము లనుబంధముగ నీయఁబడినవి. ఏని గ్రంథమున నిదియే ముఖ్యభాగము. అందుఁ జర్చించిన విషయములు మహాత్ముని జీవితచరితమును నాశయ ములను మనకుఁ గరతలామలకముగఁ గనఁబఱచుచున్నవి. ఇట్టి గ్రంథ ము నేఁటిపరిస్థితులలో మిక్కిలి యవసరము. మహాత్ముల జీవితచరి త్రములే బాలబాలికల కున్నతాదర్శముల బోధించును. ప్రజాసామా న్యమున కాంగ్లభాషాపరిచయము లేకపోవుటచే నిట్టిగ్రంథము లమూ ల్యము లయినవి. గ్రంథకర్త లీగ్రంథమును రచించి యాంధ్రులకుఁ జాల నుపకార మొనర్చియున్నారు.

---

13. బాలవిజ్ఞానతరంగిణి:-6 వ తరంగము భూగోళవృత్తాంతము. బ్రహ్మశ్రీ కూచి నరసింహము పంతులుగారు. [వెల 0-12-0.

వివిధవిజ్ఞానవిషయముల బాలురకు సులభరీతిని బోధపఱచుటకై వ్రాయఁబడిన గ్రంథమాల యందొక కుసుమము. గ్రంథకర్తలు సుప్రసిద్ధులు. పీఠికాపురపు హైస్కూలునఁ బ్రధానోపాధ్యాయులుగఁ బెక్కువత్సరములు పనిచేసియుండిరి. భూమియాకారము, పరివర్తనము, సాంద్రత, భూమిలోని వివిధపదార్థములు మొదలగువిషయములు గలవు. బాలబాలికల కత్యంతోపయోగకరము. శైలి యింకను సరళముగ నుండిన బాగుండును.

---

14. నానావిషయక విరచనములు:— బ్రహ్మశ్రీ కూచి నరసింహము పంతులుగారు. [వెల రు. 1-0-0.

ఇందు గ్రంథకర్తలు వివిధవిషయములను జేర్చియున్నారు. నాసిక, మాయచొక్కా, జీవపరిదేవనము, కాలమహిమ యనునవి ఖండకావ్యములు. గ్రంథవిభాగములు, విమర్శతత్త్వము, పాఠశాలల లోని తెలుఁగు భాషావిషయకములు. గురుశిష్యసంవాదముల ప్రాచీనా

ధునాతనపరిపాలనా పద్ధతులు, అర్థశాస్త్రసంప్రదాయములు మొదలగు వాని విషయమై సంవాదపూర్వకముగ గురుశిష్యులు చర్చించియున్నారు. మనము వీనినుండి పెక్కుసంగతుల గ్రహింపనగును. సాంఘికమత సంబంధమగు చర్చలును గలవు.



సీ. ఆ జనార్దనుపాలి కరుదెంచి వేల్పులు
బలిదానవుఁడు సేయు బాధ లెల్ల
నెఱిఁగించి సన్నుతు లెంతయుఁ గావించి
మఱి మ్రొక్కి దృష్టాంతముగా నప్పు డప్పుడు
బలి యేలుచుండె నీ బ్రహ్మాండ మంతయు
వాని గర్వ మడంపవలయు నీవు
వామనమూర్తివై వలనుగా నాతని
నధ్వర కాలంబునందు భూమి
పత్త్రియము వేఁడి యీవిష్టపత్రయంబు
గొనుచు నాఖండలునకును గోర్కె మీఱ
నొసఁగవలె దేవ! యని తెల్పు మంద నటకు
నేఁగుదెంచెను గశ్యపుఁ డింతితోడ. ౧౦౧

వ. వచ్చి కశ్యపమునీంద్రుం డమ్మహాత్ముని దేవతలచందంబునఁ బ్రార్థించినఁ గరుణించి, పుండరీకాక్షుండు నీకుఁ బుత్త్రుండనై జన్మింతునని వరంబిచ్చి, కశ్యపునివలన నదితిగర్భంబున వామనుండై పుట్టి, మఘసమయంబున నబ్బలీంద్రుని పదత్రయమాత్రధాత్రీతలంబు యాచించి, తనవిక్రమంబున లోకత్రయం బాక్రమించి, యసురనాథుని రసాతలంబున బంధించి, క్రమ్మఱని విశ్వపాలనాధికారంబు దేవేంద్రునకొసంగె, దాన విష్ణుండు త్రివిక్రముండనం బరఁగె, మఱియు ననేక మహామును లిచ్చోటఁ దపస్సిద్ధులైరి, యీసిద్ధాశ్రమంబున నేనుం దపంబు గావింపుచుందు నని పల్కుచుఁ గౌశికుండు రామలక్ష్మణసహితుండై తదాశ్రమంబు ప్రవేశించిన ౧౦౨

గీ. అచటిమునివరు లెదురుగా నరుగుదెంచి
గాధినందనుఁ బూజించి కరము వేడ్క
రవికులోద్భవులైన యారాఘవులకు
నతిథిసత్కారము లొనర్చి యభినుతించి. ౧౦౩

వ. పరివేష్టించియున్న సమయంబున. ౧౦౪

సీ. వారణంబులతో నుదారమైత్రి యొనర్చి
తిరుగా మెలఁగు కంఠీరవములు
ధేనువర్గంబులపైని మక్కువఁ జూపి
జానొప్పు వ్యాఘ్రసంతానములును
లీలతో మూషకజాలంబులను గాంచి
లాలింపుచున్న బిడాలములును
తురగంబులను గూడి వరమోద మొప్పఁగాఁ
దిరుగుచున్నట్టి కాసరచయంబు
మఱియుఁ జెలువొందు జంతుసమాజములును
శుక పికాది విహంగమనికరములును
చారు పల్లవ ఫలయుక్తభూరుహములు
గలిగి వెలయు తపోవనిఁ గనుచు నృపులు. ౧౦౫

గీ. రహిని దమలోన సహజవైరంబు విడచి
మెలఁగుచున్నవి యిచ్చోటిమృగము లెల్ల
కౌశికుతపోమహిమ యొప్పఁగా వశంబె
యనుచు నాశ్చర్యమందిరి యాత్మలందు. ౧౦౬

వ. అంత రఘువరుండు విశ్వామిత్రున కిట్లనియె. ౧౦౭

గీ. సవనదీక్షఁ బూనుఁడయ్య మౌనీంద్ర
సవనభుజులు చాల సంతసింప
సవనమునకు విఘ్నసంప్రాప్తి లేకుండ
నా శరాలిఁ ద్రుంతు నాసురాలి. ౧౦౮

క. అని తెల్పఁగ మునినాథుఁడు
ఘనసంతోషమునఁ బొంగి క్రన్నన దీక్షం
గనియుండె నట నభోమణి
కనకప్రభ నొప్ప నపరకంధిని గ్రుంకెన్. ౧౦౯

అంత రామలక్ష్మణులు సమయోచితంబులు దీర్చి, యారాత్రి పుచ్చి మఱునాఁడు వేకడ లేచి, స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లాచరించి వైశ్వానరార్చనాయత్తుండగు విశ్వామిత్రుంగాంచి యిట్లనిరి. ౧౧౦

అనఘ మఖ మెన్నిదివసంబు లాచరింప
వలయుఁ దద్విఘ్నకారులు వచ్చునట్టి
సమయ మెద్ది యనన్ మునిసత్తముండు
పలుక కుండిన నచ్చటిపరమమునులు. ౧౧౧

సీ. కౌశికముని దీక్షఁ గైకొని యున్నాఁడు
గావున సమయంబు గాదు పలుక
నా అహోరాత్రంబు లాదరంబున మీర
లధ్వరరక్ష సేయంగవలయు
నని చెప్ప రాఘవు లతిదృఢచిత్తులై
బాణబాణాసనపాణు లగుచుఁ
గనురెప్ప వేయక కడుజాగరూకులై
రేబగల్ నిశ్చలరీతి యమర
ఖండనోద్యుక్తమతు లగుచుండి రంతఁ
గౌశికమునీంద్రుఁ డామ్నాయగదితసరణి
నవ్యఘృతసమిధాదికద్రవ్యములను
వీతిహోత్రార్పితములు గావింపుచుండె. ౧౧౨

గీ. యాజకముఖోక్తనిగమోక్తు లతిశయిల్లఁ
బావకజ్వాల లాకాశ భాగమంట
హవ్యభుజులు మహానంద మందుచుండ
నధ్వరక్రియ రమ్యమై యమరుచుండె. ౧౧౩

వ. అంత నాఱవదినంబున, ౧౧౪

సీ. నీచాత్ములైన మారీచసుబాహులు
యాతుధానాలిసమేతులగుచు

సింహనాదంబులు సేయుచు నభమునఁ
దమమాయచే వారిదములఁ బన్ని
వేదికపై రక్తవృష్టిని గురియించి
క్రతువిఘ్న మొనరింపఁ గడఁగునపుడు
రాఘవుం డధికసంరంభుఁడై తమ్మునిఁ
గనుఁగొని చూడు మీదనుజుఁ గూల్తు
ననుచు మారీచుపైఁ బవనాస్త్రమేయఁ
దన్మహామారుతంబున దైత్యుఁ డుదుటు
మాలి శతయోజనంబులు దూలి పాఱి
నీరధిని గూలె దేవతానికర మలర. ౯౧౬

ఉ. అంత రఘూద్వహుండు వెస నంబరభాగమునందు మంట ల
త్యంతముఁ గ్రమ్ముచుండ ననలాస్త్రము గర్వితుఁడౌ సుబాహుదో
రంతర మంట నేయ వడి నగ్నిశిఖాగణదగ్ధుఁడయ్యు వాఁ
డెంతయు నార్చుచున్ రణమహాస్థలిఁ గూలెను వేల్పు లుబ్బఁగాఁ.

క. పిమ్మట రాఘవ్రుఁ డనిలా
స్త్రమ్ముఁ బ్రయోగించి దనుజసంఘమ్ముల నో
క్కుమ్మడిఁ బుడమిం గూల్చెను
సమ్మదమున సురలు దన్నుఁ జదల నుతింపన్. ౯౧౭

క. సకలాసురనికరంబులఁ
బ్రకటభుజాబల మెసంగఁ బరిమార్చి మహా
ధికుఁడై వెలిఁగెడు రాముని
నకలంకుని బొగడిరంత నమరులు మునులున్. ౯౧౮

వ. ఆసమయంబున, ౯౧౯

గీ. మఖము సంపూర్ణ మొనరించి మౌనివరుఁడు
గాధినందనుఁ డనఘు నిక్ష్వాకువంశ
భవుని నారామభద్రుని బహువిధములఁ
బ్రస్తుతింపుచు ముదమునఁ బలికె నిట్లు. ౯౨౦

క. నామఘముఁ రక్షించితి
వో మహనీయప్రతాపయుత ! నేఁటికి నా
కామితము గంటి కీర్తుల
చే మించితి నీవు నాకు శిష్యుఁడ వగుటన్. ౫౨౧

క. జనకునిశాసనమున నా
వెనుకం జనుదెంచి గురునివిధమున నన్నుం
గనుచును నేఁ బూనిన పని
కొనసాఁగం జేసి తీవు గుణనిధి వగుటన్. ౫౨౨

క. నీపాదములకు దాసుల
మోపావనచరిత ! తాపసోత్తమ ! యనుకం
పాపర ! పాపరహిత ! మా
కేపనిఁ జెప్పిన నొనర్తు మిఁక నీయాజ్ఞన్. ౫౨౩

క. కరుణాకటాక్షమున మము
నిరతముఁ గనుఁగొనఁగవలయు నీ వటులైనన్
సిరులును గీర్తులు మాకి
ద్ధరణిని జెన్నొందుచుండుఁ దాపసవర్యా ! ౫౨౪

క. నీదయఁ గాంచినవారికి
మేదినిలో శుభము లపరిమితముగఁ గలుగున్
గాదే గాధేయ ! మహా
వేదాఖిలశాస్త్రతత్త్వవిద్యానిపుణా ! ౫౨౫

ఆ. వె. అనుచు వినుతిఁజేయ నంతరంగమునందు
సంతసమునఁ బొంగి సంయమీంద్రుఁ
డర్కకులవరేణ్యుఁడగు రామవిభుఁ జూచి
యనఘచరిత ! విను మటంచుఁ బలికె. ౫౨౬.

సీ. ఘనపుణ్యమూర్తియౌ జనకుండు గావించు
సవనంబు గనుఁగొనఁ జనఁగవలయు

ముదముతో నిచ్చటి మునిగణంబులు నేను,
గానఁ దమ్ముఁడు నీవు కరము వేడ్క
మాతోడ నరుదెండు మానుగా నచ్చట
గంధపుష్పాక్షతకలితధూప
దీపార్చితము దివ్యరూపంబు దుర్భర
మురుతరసార మత్యున్నతంబు
నైన శివకార్ముకము గల్గు ననఘ! దాని
సంతతంబును బూజించు జనకవిభుఁడు
ధరణిఁ దద్దర్శనము మోదకరము గాన
మనము గనుఁగొంద మా విల్లు మనము చెలఁగ. గి. ౨౭

క. నరపతు లందఱు నాగురు
తరచాపము నెక్కు వెట్టఁ దలఁపుచు మిథిలా
పురి కేఁగి జనకపతిమం
దిరమునఁ జెన్నొందుచున్న దృఢచాపంబున్. గి. ౨౮

గీ. కాంచి తచ్చారుతకు సంతసించి యౌరా!
యంచుఁ దత్సన్నిధికి నేఁగుదెంచి, దాని
వంచి యెక్కిడలేక లజ్జించి మిగుల
వంచితుల మైతిమంచు భాషించి మరల. గి. ౨౯

వ. తమతమనగరంబులకుఁ జనుచుందురని చెప్పిన విని, రామలక్ష్మణులు తత్కార్ముకదర్శనోత్సుకులై యుండ, విశ్వామిత్రుండు దాశరథిసహితుండై మునిగణంబులు పరివేష్టింప వనదేవతల నుద్దేశించి, యోవనదేవతలారా! మీయనుగ్రహంబున నీయాశ్రమంబునఁ దపస్సిద్ధుండనైతి, మీకుఁ గుశలం బగుంగావుత, మీచేత ననుజ్ఞాతుండను గదా పోయివచ్చెద నని పలికి, కృతప్రయాణుండై జాహ్నవియుత్తరతటంబున హిమశైలంబుఁ గనుంగొని, ప్రదక్షిణంబు గావించి నమస్కరించి, యుత్తరాభిముఖుండై దూరపథంబరిగి, సూర్యాస్తమయంబగు

టయు శోణనదీతీరంబున సంధ్యాద్యనుష్ఠానంబు లాచరించి, యొక్క
మునివాసంబునం బ్రవేశించి కూర్చుండియున్న కౌశికమునీంద్రు
నచ్చటి మునిగణంబు లర్ఘ్యపాద్యాదివిధులం బూజింప, రామభ
ద్రుండు గాధేయసమీపంబుననుండి, యోమునివరా! యీరమ్యత
పోవనసమేతంబగు దేశం బెవ్వరి దెఱింగింపు మనిన న మ్మునీంద్రుండు
రాఘవున కిట్లనియె. ౧౩౦

క. నరవర! కుశుండను నొకఋషి
సురుచిరవైదర్భియందు సుతుల కుశాంబున్
వరమతి కుశనాభు నసూ
తరజసు వసునామధేయుఁ దనరఁగఁ గనియెన్. ౧౩౧

క. సూనుల నొగిఁజూచి యతం
డోనందనులార! మీరలురుధర్మమతిన్
మానవుల నేలుచుండుఁడు
నా నలువురు జనకభాషణప్రముదితులై. ౧౩౨

సీ. ఘనుఁడు కుశాంబుండు కౌశాంబియు కుశనా
భుండు మహోదయాపురవరంబు
శాంతుం డసూతరజసుఁడు ధర్మారణ్య
మను వసువు గిరివ్రజనగరంబుఁ
బొనఁగ రచించి రవ్వసువు నామంబున
వసుమతి యనఁగ నివ్వసుధ పరఁగె
నీపంచశైలంబు లీభూమిఁ జుట్టును
విలసిల్లు నీనైనమలలనడుమఁ
దనరుచుండెను మాగధీతటిని మగధ
దేశమునఁ బారుచుండు పృథ్వీశ! యిద్ధ
రిత్రి మాగధి యనఁగ సుక్షేత్ర యగుచు
వెలయు నిది వసుదేశంబు వినుము మఱియు. ౧౩౩

గీ. అనఘచరితుండు కుశనాభుఁ డనెడుపేర
నమరు రాజర్షి యచ్చరయగు ఘృతాచి

వలను మోదంబుతో గుణవతుల నతుల
మతుల రుచిరాకృతుల శతసుతులఁ గనియె. ౫౩౪

క. చపలోపమరుచులగు నా
నృపకన్యక లొక్కనాఁడు నిరుపమభూషా
తపనీయాంబరధరలై
యుపవనమునఁ జొచ్చి లీల లొప్పఁగ నచటన్. ౫౩౫

క. పటుతరవాద్యస్వనములు
ఘటియిల్లఁగ రాగతాళగతు లెసఁగంగా
నటనములు సేయుచుండఁగ
నట కనిలుఁడు వచ్చి వారి నరుదుగఁ జూచెన్. ౫౩౬

గీ. చూచి తమకంబుఁ జెంది, యో సుదతులార!
కడఁక మీరెల్ల నాప్రియకాంత లగుఁడు
సంతతామోదకరమైన జవ్వనంబు
నమరభావచిరాయువు లమరు మీకు. ౫౩౭

సీ. అనిన నవ్వుచు వార లాసమీరునిఁ జూచి
సకలభూతములందు సంచరించు
దేవతామూర్తివి నీ వెఱుంగనియట్టి
ధర్మముల్ గలుగునే తగనిమాట
లిటు పల్కఁజెల్లునే యేము మాతండ్రిని
సరకుసేయక కులాచారసరణిఁ
దప్పి నిన్నువరింపఁ దగునె మాజనకుండె
మాకు దైవము గాన మమ్ము నెలమి
తండ్రి యెవ్వని కిచ్చు నాతండు మాకుఁ
బతి యగుచు నంద ఱొక్కసారె పలుక వినుచుఁ
గనలి పవమానుఁ డతిబలగాత్రములను
జొచ్చి భంజించి సరగ గుజ్జుల నొనర్చె. ౫౩౮

గీ. అంత నక్కన్య లిల్లకు నరిగి సిగ్గు
వడుచు లోచనముల బాష్పవారి దొరుఁగఁ

దద్ద గుందుచునుండ నాత్మజలఁ జూచి
హృదయ మడలంగ కుశనాథుఁ డిట్టులనియె. ౨౩౯

ఆ. వె. తనయలార! మీకతన మత్కులం బొప్పె
నేను సేయు సుకృత మిటు ఫలించె
చింత దొలఁగె ముదము చేరె మీసుగుణంబు
లార్యనుతము లగుచు నతిశయిల్లె, ౨౪౦

క. కరువలి మిము నందఱఁ గని
వరియింపుఁడటన్న నతని వారింపుచు వే
గిరపడకుండిన మీక్షమ
పరఁగన్ వినుతింప వశమె బ్రహ్మకునైనన్. ౨౪౧

సీ. క్షమ యలంకారంబు క్షమయ ధర్మంబును
క్షమయ మోక్షంబును క్షమ యశంబు
క్షమ సద్గుణంబును క్షమయ యజ్ఞంబును
క్షమయ దానంబును క్షమయ తపము
క్షమయందె వసియించు సకలజగంబులు
గాన క్షమావతులైన మీకు
క్షమ నన్యకన్యలు సరిగారటంచును
వేమఱు మన్నించి వీడుకొల్పి
రహి నమాత్యులతోడ మంత్రం బొనర్చి
దేశకాలపాత్రంబుల తెఱఁగు లెఱిఁగి
నాతనూజలఁ దగువరునకు నొసంగ
వలయు ననుచును వెండియుఁ బలికె నిట్లు. ౨౪౨

క. మదియును మునివరునకు సో
మదయను గంధర్వి చారుమతి పరిచర్యన్
ముద మొనరిచి తత్కృప బ్ర
హ్మదత్తుఁడను వానిఁ బడసె మానసపుత్రున్. ౨౪౩

గీ. బ్రహ్మదత్తుండు కాంపిల్యపట్టణమున
కరిగి జను లెల్ల దను మెచ్చ నవని నేలు
చుండెఁ గావున నమ్మహీమండలేశు
నకు నొసంగెద నూఱ్వుర నాదుహితల ౧౪౪

సీ. అని పల్కి బ్రహ్మదత్తుని వేగ రప్పించి
మన్నించి భానుసమప్రతాపుఁ
డగు కుశనాభుండు దగుకీర్తి నూఱ్వుర
కన్యల నొసఁగెఁ గ్రమముతోడ
నతఁడు వారికరగ్రహణము సేయంగన
క్రాంతుని కేల్సోఁకినంతలోన
న ప్పుడంతుకలు కుబ్జాకృతిహీనలై
యలరుచుండిరి సుందరాంగు లగుచు
నాత్మజలఁ జూచి జనకుండు హర్షమొందె
తండ్రి గాఁగిటఁ జేరి రత్తనయ లెలమి
నల్లునిం గూఁతుల నరేంద్రుఁ డాదరించి
పంపఁగా వార లరిగిరి ప్రమద మెసఁగ ౧౪౫

వ. అనంతరంబ. ౧౪౬

క. తనయప్రీతిం బద్మజ
తనయుండగు కుశుఁడు తనదుతనయునకుఁ దగన్
దనయుఁడు గలుగకయుండిన
మనుమఁడు గలుగంగఁ దాను మఖ మొనరించెన్. ౧౪౭

క. ఒనరిచి కుశనాభుం గనుఁ
గొని తనయుఁడ గాధియనెడు కొమరుఁడు నీకున్
జనియించు నతినివలనన్
ఘనయశ మొందెద వటంచుఁ గౌతుక మొప్పన్. ౧౪౮

గీ. ఆ కుశుఁడు పంకజాసనలోకమునకు
నరిగెఁ బిమ్మటఁ గొన్నివాసరము లరుగ
నొనరఁ గుశనాభునకు గాధిజనవరుండు
పుట్టె నారాజమణి కేను బుట్టినాఁడ. ౧౪౯

క. నాకగ్రభగిని సత్యవ
తీకన్యక రుచికుసతి పతి మృతుఁడైనన్
శోకింప కతనివెంబడి
నాకమునకు నొడలితోడ నరుదుగ నరిగెన్. ౧౫౦

గీ. అరిగి సుకృతవశంబున ననఘచరిత
సత్యమయి సత్యవతి హిమాచలమునందు
కౌశికీనామధేయంబు గనిన దివ్య
నది యగుచుఁ బుట్టె జగము లానందమొంద. ౧౫౧

క. భగినీస్నేహమునఁ దదా
పగచెంత వసింతు నేఁ దపముసేయుచు నో
జగదవ! సిద్ధాశ్రమ మది
దగ నీకతనన్ మనోరథం బటఁ గంటిన్. ౧౫౨

క. శ్రీకరమగు కుశకులమునఁ
బ్రాకటముగ నుద్భవించి ప్రబలితిఁగానన్
నాకుం గౌశికనామము
లోకములో వినుతికెక్కె లోకస్తుత్యా! ౧౫౩

క. నీ వడుగు దేశవిధమును
మావంశసమాగతక్రమము దెలిపితి రా
జీవదళేక్షణ! యీవన
మావృతరక్షఃసమూహమై యిపు డుండెన్. ౧౫౪

ఉ. శీతమరీచి మింటఁ గడుచిత్రముగా నుదయించి దిక్చయం
బాతతచంద్రికావిశదమై దనరారఁగఁజేసె చేతన

ప్రాతము లుల్లసిల్లఁగ నవారణలీల వెలుఁగఁ జూచితే
యీతఱి నర్ధరాత్రమగు నీవును దమ్ముఁడు నిద్రఁబొం డికన్. ౫౫౫

వ. అని పలికి మిన్నకుండిన మునులు సంతోషించి, విరించితుల్యుండగు కౌశికుం బూజించి, తద్వంశసంభవమహీపతుల వినుతించి, తదగ్రజయగు కౌశికీపావనచరిత్రంబు గణుతించిన సంతుష్టాంతరంగుండై విశ్వామిత్రుండు నిద్రించె, రామలక్ష్మణు లాశ్చర్యమానసులై గాధినందనుం గొనియాడి శయనించి, రంతఁ గొంతసేపున కమ్మునివరుండు మెల్లని యుదితసూర్యుండునుంబోలె వెలుంగుచుఁ బ్రభాత సమయంబున రామలక్ష్మణుల నుచితవాక్యంబుల మేలుకనిపి, వారలుం దానును దాత్కాలికానుష్ఠానకృత్యంబుల నిర్వర్తించి, పయనంబై గదలి, శోణనదిం దాఁటి, యామధ్యాహ్నంబునకు దూరమార్గంబరిగిన ముందట శీతలప్రవాహశీకరయుక్తంబును, కమలకైరవకల్హారాదిసుగంధ బంధురంబును మందగమనంబును మనోహరంబును నగు మలయమారుతం బభిముఖంబై శరీరంబులకు సోఁకిన నందఱు నానందితహృదయారవిందులై యున్న యెడ. ౫౫౬

క. నరవరసూనులు గాంచిరి
సరసిజకువలయపరాగసముదయసంగన్
గురుతరనిస్వనభృంగన్
తరలతరంగన్ లసత్పతంగన్ గంగన్. ౫౫౭

సీ. కని రామచంద్రుండు కౌశికుఁ గనుఁగొని
మునివర! గంగపావనచరితము
విన వేడుకయ్యెడు విబుధలోకాపగ
త్రిభువనంబులకు నేరీతి వచ్చె?
నిమ్మహావాహిని పిమ్మట నద్భుత
గతిసాగరముతోడఁ గలసె నెట్లు?
విశదంబుగా నాకు వినుతింపవలయు నిం
కీ వెలుంగని వార్త లెందు లేవు

వరతపోధననిధివి సర్వజ్ఞమతివి
వత్సలత మమ్ముఁ బ్రోచుదేవతవు నీవు
గాన నిన్వేఁడితిని బుణ్యకథవచింప
ననిన రాముని కనియె నయ్యతివరుండు. ౨౨౮

క. గంగాపావనచరితము
రంగుగ నెఱింగింతు నీకు రఘువర్య! రణా
భంగపరాక్రమ! దీని వి
నంగలమనుజాలియఘము నాశమునొందున్. ౨౨౯

వ. అని పలికి,సమాహితచిత్తుండవై వినుమని మునిపతియిట్లనియె. ౨౩౦

గీ. మేరుపుత్రికయైన మనోరమకును
తుహినభూధరవరునకుఁ దొలుత ఘటనఁ
జేసి, యాదంపతులకు సృజించె సుతుల
గంగ యుమ యన నిద్దఱఁ గమలజుండు. ౨౩౧

సీ. హిమవన్నగాధీశుఁ డేపారు ముదమునఁ
దనతనూభవలను మనుపుచుండ
నాతని చెంగటి కరుదెంచి వేల్పులు
నీ యగ్రసుత గంగ నేఁడు మాకు
నీయంగఁ దగు లోకహితముకై యని వేఁడ
గంగను సురల కొసంగ నదియు
దేవాళితో నమరావతి కేతెంచెఁ
దరువాత నయ్యుమ హరునిఁగూర్చి
భూరితప మాచరింప నా భూధరేంద్రుఁ
డయ్యుమాకన్యభావంబు నాత్మ నెఱిఁగి
నిఖిలలోకేశ్వరుండగు నీలకంఠు
నకు నొసంగెను జగము లానందమొంద. ౨౩౨

క. గంగామలకథలు వినం
గంగామలకుందతారకానిభయశ మ
బ్బుంగద జనులకు సత్ప్రతు
రంగోజ్జ్వల దివ్యధామ! రాఘవరామా! గీ. 3

వ. జనవరా! తరువాతి వృత్తాంతంబు చెప్పెద వినుము. పరిణయానంతర మునఁ బార్వతీపరమేశ్వరు లొక్కసమయంబున మదనశరదళిత హృదయారవిందులై, యనేకదివ్యవర్ష సహస్రంబులు సురతాసక్తులై యుండిన వారిశరీరంబులవెడలు తేజంబులవలన లోకంబుల కుపద్రవంబు వాటి ల్లునని బ్రహ్మాదిదేవత లమ్మహాదేవుపాలికి వచ్చి సాష్టాంగదండప్రణా మంబు లాచరించి, నిగమవచనంబుల వినుతించి, సురతంబుచాలించి తపంబుసేయుండని ప్రార్థించిన భవుండు కరుణించి, సురతంబుచాలిం చి, తనతేజంబు నమరుల వహింపుఁడని పల్కి, రేతఃపతనంబు చేసిన దానిందేవతలయనుమతంబున భూమియుఁ బావకుండును బవమానుం డునుం దాల్చినంత భవానియుఁ దనసంతానప్రయత్నంబున కంత రాయంబు గావించి రని యమరుల ననపత్యులుగా శపించి సకల మానవుల కనుభవపత్ని వగుమని భూదేవికి శాపంబొసంగిన నిర్గమవడి యింద్రాదిదేవతలు నిజనివాసంబులకుం జనిరంత భాలలోచనుండు ను, హిమవన్నగోత్తరశృంగంబునందు నియతుండై తపంబుసేయు చుండె, నటఁగొంతకాలంబునకు వేల్పులు మునిగణసమేతులై విరిం చికడకుం జనుదెంచి, సేనాపతిని సృజింపుమని ప్రార్థించిన నతం డ గ్నిదేవు నారాధించుం డనుటయు, నమరు లట్లు గావించిన పావకుం డును దనశరీరంబున వెలుంగుచయ్యుమా తేజంబు గంగయందు విడుచు టయు, గంగయు నాతేజంబుదాల్చి గర్భిణియై గర్భంబు దుర్భరంబై న నగ్నిదేవుననుమతి హిమవంతంబున నొక్కచోట శరవణంబున నిడిన నందువలనఁ గుమారుండు జన్మించె, నచ్చటికిఁ గృత్తికలువచ్చి యక్కుమారునిచేత స్తన్యపానంబుచేయించి రతండు దేవసేనాగ్రేస

రుండై పార్వతీనందనుండును, గాంగేయుండును, పావకాత్మజుండును శరజన్ముండును, సేనానియు, కార్తికేయుండును ననునామధేయంబులఁ బ్రసిద్ధుండయ్యె నని చెప్పి యిట్లనియె. ౧౬౮

ధరలోనఁ గార్తికేయుని
చరితము విను నట్టి విబుధజను లుల్లమునన్
దిరముగఁ గోరిన కోర్కులు
కరమొప్పుచుఁ దుదిని ముక్తిఁ గాంతురు వత్సా. ౧౬౯

మఱియు గంగావృత్తాంతంబు చెప్పెదవినుము, మిక్ష్వాకువంశసంభవుండగు సగరుం డశ్వమేధయాగదీక్షితుండై హయంబు విడిచిన నయ్యశ్వంబు నాఖండలుండు రాక్షసాకారుండై యపహరించిన, సగరతనయు లఱువదివేవురు తండ్రియానతి నశ్వాన్వేషణంబు సేయుచుండి యెందును గానక, రసాతలపర్యంతంబు భూతలంబు ద్రవ్వి యచ్చట నిమీలితనయనుండై, తపోనిష్ఠాగరిష్ఠుండై యున్న కపిలుసమీపంబున నయ్యశ్వంబుం గాంచి, యమ్మహాత్ము నశ్వచోరుంగాఁ దలంచి, భర్జించి యతనికోపాగ్నివలన భస్మీభూతులై, రంత సగరుండు దన పౌత్రుండగు నంశుమంతు నశ్వంబు వెదకం బనిచిన నతండు పితృవర్గంబు జనిన మార్గంబున పాతాళలోకంబున కరిగి యచట పితృభస్మరాసులం గని శోకించి, యచ్చోట నున్న హయరత్నంబుం గొనివచ్చి, సగరున కొసంగిన నతండు యాగంబు సంపూర్ణంబు గావించె, నటఁ గొంతకాలంబరిగిన నంశుమంతుని పౌత్రుండగు భగీరథుండు తన ప్రపితామహులకు నాకలోకనివాసంబు గోరి, గోకర్ణక్షేత్రంబున విరించి నుద్దేశించి బహుసహస్రాబ్దంబులు నియతాహారుండును నూర్ధ్వబాహుండును నై పంచాగ్నిమధ్యంబున నుండి యుగ్రతపంబు గావించిన తపఃప్రీతుండై కమలజుండు వరంబు వేఁడుమనిన నారాజేంద్రుండు పితృభస్మరాసులమీఁద గగనగంగం బ్రవహింపఁ జేయుమనిన నట్లకాక యుని గంగాపాతంబునకు భూతలంబు సహింపఁజాలదు, కావున గంగాభరణంబునకు భుజంగాభరణుం

ప్రార్థించుమని చెప్పి బ్రహ్మయంతర్హితుండగుటయు నానృపాలుండు చంద్రశేఖరుంగూర్చి తపంబొనర్చిన నతనితపంబునకు మెచ్చి, యీశానుండు ప్రసన్నుండై వియన్నదిం దాల్తునని వరంబిచ్చె, నంతగంగయు నాకాశంబుననుండి శివునిజటాజూటంబునందుఁబడి, బలిసదనంబున కేఁతేర సంభ్రమించిన శంకరుండు కుపితుండై యమరనదింగదలకుండ జటానివహంబున బంధించె. మరల నమ్మేదినీశ్వరుండు గంగాధరుంగూర్చి తపంబుఁజేసిన గిరీశుండు కరుణించి బిందుసరోవరంబున విష్ణుపాదోద్భవను విడిచె, నందువలన నేడుప్రవాహంబులు పుట్టె, నందుసప్తమవాహిని భగీరథు వెనుక వచ్చుచు జహ్నుయజ్ఞాయతనంబు ముంచిన జహ్నుండు కోపవహ్నిసమేతుండై గంగాప్రవాహంబు కడుపునిండంద్రావి, సురమునీంద్రప్రార్థితుండై కర్ణరంధ్రంబులవలన నమ్మహానదిని మరలవెడలించె, నక్కతంబున గంగ జాహ్నవి యనంబరఁగె, తదనంతరంబ యవ్వాహిని సాగరమార్గంబున నాగలోకంబునకేఁగి సగరసుతభస్మరాసులపయిం బ్రవహించిన సాగరులు స్వర్గనివాసులై, రంతఁ బితామహుండును జనుదెంచి ప్రపితామహులనాకనివాసులం జేసిన భగీరథునిచరిత్రంబు వినుతించి, తనలోకంబునకరిగిన నవ్విశ్వంభరానాయకుండు పితృవర్గంబునకు గంగోదకంబుల ధర్మోదకదానంబులు చేసి ప్రీతుండై తనపురంబునకు నేఁగి ధర్మమార్గంబునఁ బ్రజాపాలనంబు సేయుచు బహుకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి త్రిదివంబునకరిగె, భగీరథసమానీతయగుటఁ జేసి గంగ భాగీరథి యనంబరఁగెనని చెప్పి, రామభద్ర! గంగావతరణక్రమంబును వినిపించితి, నీకు భద్రప్రాప్తియగు, నీగంగాప్రభావంబు వినినమానవులకు దురితంబులు దొలంగు మనోరథంబులు సిద్ధించు ననిపల్కిన. గి౬౬

సీ. రంగు మీఱువియత్తరంగిణీ కథముని
పుంగవుచే వినుటం గరంబు
~~సౌఖ్యమొం~~డెడు నంతరంగంబులో సుంద
రాంగుండు సంగరాభంగవీర్యుఁ

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు, పరిషద్వ్యవస్థాపాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు–ఉయ్యూరు జమీందారువారు

## ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

## కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ, బి. ఎల్.

## కార్యదర్శులు.

కపాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు (కోశాధ్యక్షులు)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ,. ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ., బి. ఎల్.

అల్లక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావునాయుఁడుగారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయుఁడుగారు.

మంచితరుణము !! మంచితరుణము !!

# అన్నియు సగము వెలలకే.

ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడిన గ్రంథములు (శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువుతప్ప) వెనుకటి పరిషత్పత్రికలసంపుటములును 1 జూలై నుండి 31-3-40 వఱకు **సగము వెలలకే** యిచ్చుచున్నాము. ఈ పత్రికలసంపుటములందు 1 వ సంపుటము మొదలు 8 వ సంపుటమువఱకు కొన్ని సంచికలుమాత్రము లభించును. నందంపూడిశాసనము, పెదచెఱకూరిశాసనము మున్నగు ప్రధానవిషయములతోఁ గూడిన వ్యాసములుగల సంచికలు దొరకును. 9 మొదలు 27 వ సంపుటమువఱకుఁ బూర్తిగ నున్నవి. విమర్శకులకు, విద్వాన్ శిరోమణి పరీక్షార్థులకు నుపయోగించెడి వ్యాసరాజము లిందుఁ బెక్కులు గలవు.

వలయువారీక్రిందిచిరునామాకు వ్రాయవలెను.

కార్యదర్శులు:
ఆంధ్ర సాహిత్యపరిషత్తు,
సూర్యరావుపేట, కాకినాడ.

---

Printed by N. Achutaramiah at the Cocanada Printing works Cocanada and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

# వి ష య సూ చి క.



శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును

| సంపుటము ౨౮. | ప్రమాథినామసంవత్సరము.<br>మార్గశిర-ఫాల్గునములు. | సంచిక ౫-౬ |
|---|---|---|

ఓం.

కీర్తిశేషులైన బ్రహ్మశ్రీ ఓలేటి వేంకట రామశాస్త్రులవారు పండితకవిపుంగవులైన సత్పురుషులు. వీరు సరసకవిత్వలక్షణవిచక్షణులైన సుప్రసిద్ధమహాకవిశేఖరులు. సంస్కృతాంధ్రములయం దఖండ పండితులు. సతతము భాషాసేవ సేయుచుండిన కవివతంసులు. వీరు స్వర్గస్థులగుటచే మనసారస్వతమునకుఁ దీరని కొఱఁత ప్రాప్తమయ్యె. తెనుఁగు వాఙ్మయమునం దభిమానము గలవారలలో నీ కవివరేణ్యుని మరణమునకై వగవని వారుండు టరుదగుటకు సందియము లేదు. విశేష శేముషీవిభవాభిశోభితులైన యీవిద్వత్కవివర్యులు వినయవినమితాంగులై మెలంగిరి. నిష్కల్మషహృదయులు. సత్యవచస్కులు. పరోపకారపరాయణులు. భగవద్భక్తులు. సకలసద్గుణముల కాలవాలమైన యీ యార్యవర్యు లత్యుత్తమచరిత్రులు. సుజనస్తుతిపాత్రులు. బ్రహ్మర్షి వేంకటరత్నమహాశయులచే సౌజన్యమున మిన్నగ నెన్నఁబడి మన్ననఁగన్న ధన్యులు. ఇటువంటి మిత్త్రరత్నము నన్ను విచారసాగరమున ముంచి యమరపురి కరిగె. పరమేశ్వరుఁడు వీరియాత్మకు శాంతి నొసంగుఁగాత.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

శ్రీ రాజా రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు.
(శ్రీ పిఠాపురము మహారాజావారు)

# కీ॥ శే॥ గిడుగు రామమూర్తి పంతులుగారు

రావుసాహేబు, కళాప్రపూర్ణేతి బిరుదాంకితులగు గిడుగు రామమూర్తి పంతులుగారీ నడుమఁ గాలధర్మము నొందిరని తెలుపవలసివచ్చినందుల కెంతయు వగచుచున్నారము. పంతులుగారు గంజాము మండలములోని పర్లాకిమిడి నివాసులు. అక్కడి కళాశాలలోఁ జిరకాల ముపాధ్యాయులుగానుండి, ఆపనినుండి విరమించినపిదప భాషావిషయమై అధికముగాఁ బరిశ్రమ చేయుచుండిరి. ఆంధ్రభాషయందును, ఆంధ్రవాఙ్మయమునందును వీరికి మంచి ప్రవేశముకలదు. వీరికిఁగల పాండిత్యము గ్రంథరచనమందు వినియోగించినచోఁ బెక్కుగ్రంథములు రచియింపఁగలిగియుందురు. అట్లుచేయక శాబ్దికవిచారమే ముఖ్యముచేసికొని దానియందే కాలముగడిపివేసిరి. రమారమి ముప్పది సంవత్సరములక్రిందట అనఁగా, పరిషత్తు ప్రతిష్ఠాపితమైన కాలములో వీరును, వీరిమిత్రులు మఱియిద్దఱును చేరి గ్రంథస్థమైయున్న యాంధ్రభాష మిక్కిలి ప్రాచీనమగుటచే నేఁటివారికి దుర్గ్రాహ్యమనియు, యికముందు గ్రంథరచనము అక్షరాస్యులు సంభాషణమందు వాడుచున్న వ్యావహారిక భాషయందే జరుపవలెననియు నొకవాదమును బ్రతిపాదించి దానిని స్థిరపఱుచుటకే యావజ్జీవము పాటుపడిరి.

ఆవిషయములో వీరికిని పరిషత్తువారికిని మతభేదము అత్యధికముగా నుండెను. పంతులుగారికిఁ గార్యదీక్ష యధికము. పట్టినపట్టు విడుచుట వారెఱుఁగరు. ఎవరేమనుకొన్ననుసరే యని వారివాదమును వారు ప్రకటించుచునే యుండెడివారు. మొత్తముమీఁద వారిశక్తి చాలవఱకు దీనిక్రిందనే వినియోగపఱిచిరని చెప్పవచ్చును.

ఇటీవల 'బాలకవిశరణ్యా' మను నొకచిన్ని గ్రంథమును రచించి ప్రకటించిరి. దానివలన గ్రంథరచనయందుఁ బ్రయోగించు శబ్దములకుఁ గేవల వ్యవహారప్రమాణము చాలదనియు, పూర్వకవి గ్రంథప్రయో

గను లావశ్యకములనియుఁ దేలుచున్నది. దీనివలనఁ బంతులుగారు తమ పూర్వవాదమును గొంతవఱకు మార్చుకొనినట్లు స్పష్టపడుచున్నది. కాని వీరు గ్రహించిన పాఠములలోఁ గొన్ని యలు ప్రమాణములుగా గ్రహింపఁదగినవి కావు.

రామమూర్తి పంతులుగారు సవరభాషకు నిఘంటు వొకటి నిర్మించినారు. వాఙ్మయముమాట యటుంచి లిపియేనియు లేక బహుముఖములుగా నున్న యీ యాటవిక భాషలోని శబ్దముల స్వరూపమును అర్థమును నిర్ణయించుట కడుదుష్కరమైనకార్యము. ఈ గ్రంథముయొక్క గుణదోషముల నిర్ణయించుటకు నాకధికారము లేదు. గుణదోషములెట్లున్నను యీ యుద్యమమే మిక్కిలి ప్రశంస్యము.

గ్రామ్య గ్రాంథిక భాషావిషయమైన వాదములలో నేనును రామమూర్తి పంతులుగారును అన్యోన్య ప్రత్యర్థులముగా నుంటిమిగాని తక్కినవిషయములలో మాకు మైత్రి యధికముగా నుండెడిది.

పంతులుగారి యాత్మ శాశ్వతసుఖమును బొందుఁగాక.

జ. రా.

---

# కీ. శే. పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పీఠికాపురాస్థానకవిశేఖరులును, అనేకాంధ్రనాటకకర్తలు, విమర్శకాగ్రేసరులు నగు మహారాజశ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు తే 1-1-40 దిని యశశ్శేషులయినారని తెలుపుటకుఁ బరిషత్తెంతయుఁ జింతిల్లుచున్నది.

పంతులుగారు చిరకాలమునుండి పరిషద్గౌరవసభ్యత నంగీకరించియు, 1922 సంవత్సరం బీఠికాపురమున జరిగిన యాంధ్రసాహిత్య పరిషదేకాదశవార్షికోత్సవమున కధ్యక్షపదవి నలంకరించియుఁ బరిషత్తునకెంతేని యభ్యుదయ మొడఁగూర్చినారు. ఆవార్షికోత్సవ సందర్భమున

వీరలో సంగిన యథ్యత్యోపన్యాసము నేటికిని నిత్యనూతనమై యలరారు చున్నయది.

సాక్షిసంపుటములు వ్యాపించినంతవఱకు శ్రీ పంతులుగారి నెఱుఁగని యాంధ్రు లుండరని యనవచ్చును. అచ్చొత్తింపఁబడిన యీసాక్షి సంపుటము లాఱు. వీనిలోఁ బంతులుగారు హాస్యయుతముగ సాంఘిక దురాచారములను వెలుపుచు, వానిని సవరించుకొను మార్గములను బాగుగఁ బ్రదర్శించియున్నారు. ఈగ్రంథములఁ జదువుచుఁ గడుపుబ్బ నట్లు నవ్వని వారుండరు. ఈరీతిగనే, సాంఘికాచారములను, అందలి గుణదోషములను వెలుపుకథలను ఆఖ్యాయికలను హిందీభాషలో రచియించిన 'ప్రేమచంద్' అను నాతఁడు 'ఉపన్యాససమ్రాట్' అను బిరుదము నందినాఁడు. ఆంధ్రదేశమునం దుండుటచే వీరికట్టి బిరుదము లభింపలేదు.

పంతులుగారు పీఠికాపురాస్థానమున నాటకరచయితలుగాఁ బ్రవేశించి రచియించిన నాటకము లమూల్యములు. వీరు రచియించిన నాటకము లించుమించుగ ముప్పదిగలవు. ఇందిరువదియాఱు ముద్రితములైనవి. అముద్రితములింకను నాలుగుగలవు. సాక్షిసంపుటములందలి యుపన్యాసములకంటె నీనాటకములయందే పంతులుగారి ప్రతిభావిశేషము, కల్పనాపాటవమును బ్రకటితములగుచున్నవి.

ఈనాటకములలో 'కల్యాణరాఘవము' 'పట్టభంగరాఘవము' 'వనవాసరాఘవము' 'విజయరాఘవము' 'రాధాకృష్ణ' 'సారంగధర' 'సరోజిని' 'నర్మదాపురుకుత్సీయము' 'విప్రనారాయణ' మున్నగునవి పౌరాణికములు. కథాంభాగము పురాణాములనుండి సేకరించినను స్వతంత్రభావములతో నీనాటకముల నలంకరించినారు. 'ప్రచండచాణక్యము' 'చూడామణి' మున్నగునవి చరిత్రాత్మకములు. 'కోకిల' 'సరస్వతి' 'వృద్ధవివాహము' 'మాలతీమాల' 'రాతిస్తంభము' మున్నగునవి కల్పితనాటకములు. వీనియందు హాస్యరసము బాగుగ వెలయుచున్నది.

ఈనాటకముల కన్నిటికి 'కంఠాభరణము' కంఠాభరణమే. 'బుద్ధబోధసుధ' యను నాటకము బౌద్ధమతమున వీరికిఁగల భక్తితాత్పర్యముల స్ఫుటీకరించుచున్నది. ఆయుర్వేద మన వీరికాదరాభిమానములు మెండు. 'సాక్షి' ఉపన్యాసములలో నీవిషయమును బలుతావుల నుగ్గడించుటయేగాక, 'అభినవచికిత్సారత్నాకరము' మున్నగు గ్రంథములకు వీరు పీఠికలు వ్రాసిరి.

మఱియు 'కథాలహరి' 'హాస్యవల్లరి' మున్నగు చిన్ని చిన్ని యుపన్యాసములఁ గూడఁ బంతులుగారు రచియించి యాంధ్రలోకమునకు మహోపకృతి నొనరించియున్నారు. ఈనాటకరాజములన్నియు శ్రీ పీఠికాపుర మహాప్రభువులకు, వారికుటుంబమునకు నభ్యుదయమును గోరి, అభ్యుదయసమయములఁ బంతులుగారు రచియించినారని పీఠికాభాగముల నటనటఁ దెలుపుచు వచ్చిరి. వీరు రచియించిన నాటకముల కన్నిటికి కూచి నరసింహము పంతులుగారు నాందీప్రస్తావనలను వ్రాయుట యలవాటుగవచ్చినది. పంతులుగారు తమగ్రంథములన్నిటియందు సర్వజనామోదదాయకమగు గ్రాంథికభాషాశైలినే రచనలసాగించిరి. పద్యములఁ గూడ వచనమురీతిని సుబోధముగ నడపించుట వీరలకభిమతము. 'స్వప్నానసూయ' మున్నగు గ్రంథరాజములకుఁ బీఠికలు రచియించి పంతులుగారు తమయసాధారణవిమర్శనపాటవమును దెలిపియే యున్నారు.

వీరు సారస్వతమునసేగాక వ్యవహారనిర్వహణమునందును గడుఁ బెద్దలు కొంతకాలము ఆనెగొంది యాస్థానమునను, కొంతకాలము ఉర్లాము సంస్థానమునను, మఱికొంతకాలము లక్ష్మీనరసాపురము చల్లాయమ్మారావుగారి యాస్థానమునను మంత్రిపదవుల నలంకరించి కడుదక్షతతో రాజకీయవ్యవహారములఁ గొనసాగించిరి. పిమ్మట శ్రీ సూర్యారాయ ప్రభువర్యుల కరుణాకటాక్షపాత్రులై, వారివలన గౌరవవేతనమునందుచు సారస్వతచర్చలకే తమజీవితసర్వస్వమును ధారవోసి ధన్యతను బడసినారు.

ఇట్టివీరల నిర్యాణము ఆంధ్రసారస్వతమునకుఁ దీఱనికొఱఁత నాపాదించినది. భౌతికదేహమును వీడునప్పటికి వీరలవయస్సు 75 వత్సరములు. వీరల యాత్మకు భగవంతుఁడు శాంతినొడఁగూర్చుఁగాక.

శాంతత్సత్.

---

# పానుగంటి లక్ష్మీనరసింహారాయకవిస్మృతి.

దాసరి లక్ష్మణకవిగారు.

సీ. అభిరూపభూయిష్ఠమగు సత్పవిత్రఁ గాఁచి
దానుఁడీతఁడనంగఁ దనరినాఁడు
హాస్యప్రధాన కావ్యచణుండగుచు సర్వ
జనుల కుత్సాహంబొసంగినాఁడు
సాక్షిరూపమున వ్యాసము లెన్నొ రచియించి
యాంధ్రావనిని యశం బందినాఁడు
పలుకుపల్లునకు స్తబ్ధులఁ జేయఁగల మహో
పన్యాసకుండయి వఱలినాఁడు

గీ. పానుగంటివంశభవుఁడు ప్రథితయశుఁడు
ఆర్యనుతుఁడు లక్ష్మీనృసింహాకవివరుఁడు
అవనివీడి దివంబున కరిగినాఁడు
అకట ! మనదేశజుల యభాగ్యమున నేఁడు.

క. పుట్టినవారలలో నే
తట్టున లేఁడిట్టి కోవిదప్రవరుఁ డికం
బుట్టఁగఁ బోవం డెప్పటి
కిట్టేఁడు సముఁ డితని కితఁడె పృథివిస్థలిలోన్.

గీ. అమలగుణుఁడు శ్రీవత్సవాయకవిరాజు
మొన్న నేగాడె చనె స్వర్గపురికిఁ ? బిదపఁ

జర్ల నారాయణగురుండుఁ జనియెనటుక.
చనియె మొదమొన్న నే వారిచాడఁబట్టి
శతవధానవిధాన విచక్షణుండుఁ
బిఠికాపురాస్థాన కవిప్రభుండు
శ్రీ మదోలేటి వేంకటరామగురుఁడు.
వీరియెడఁబాటునకె మేము వెత మునుంగ
నింతలోనె నీవేఁగు టేటి న్యాయ
మయ్య? లక్ష్మీనృసింహరాయకవివర్య!.

ఉ. ఏగతి రాగభోగముల నెల్లఁ ద్యజించి సురేంద్రుపీఠి కే
వేఁగితి వింతలోనె, ? నిను నేకరణిన్ మఱవంగనేర్తు మే
మేగతి నింక నీరచన లేర్పడఁ గాంచెద మెవ్వ డెట్టి భా
గోగులు జెందఁగావలయునో యెఱుఁగన్ వశమౌనె యేరికిన్ ?.

ఆ. వె. ఎంతపరితపింప నేమిలాభము, దైవ
కృత మి దిట్టు లుండె నింక నీవు
గురుగణంబుతోడఁ గోర్కిమీఱఁగ స్వర్గ
మెనయుమయ్య సత్కవీంద్ర సతము.
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# మిత్రస్మృతి.

(శతావధాని కావ్యకలానిధి చిదంబర శాస్త్రిగారు)

ఉ. చంద్రికవోలె నల్దెసలఁ జాయలువాఱెను నీయశంబు భూ
మీంద్రునినెమ్మనమ్మునకు నెక్కితి వేమి కొఱంత గల్గి నీ
వింద్రునిఁ జూడ నేఁడు దివి కేఁగితి వేంకటరామశాస్త్రి యా
యింద్రుఁడు సూర్యరాయధరణీంద్రునికన్నఁ దలంప మిన్న యే.

ఉ. ధీయుతుఁడై సరస్వతికి దిద్దైను వన్నెలు నీగురుండు నా
రాయణశాస్త్రి నీ వతని కాతఁడు నీకును దోడునీడలై

పాయనియట్లు దేహములు వాసియుఁ బాయకయుందు రంచు మా
కీయెడఁ దెల్లమయ్యె సుకవీ దివి కిర్వురుఁ గూడి యేఁగుటన్.

## కవిస్మృతి.

ఉ. మానితకీర్తిశాలి మతిమద్గణనీయుఁడు పానుగంటి ల
క్ష్మీనరసింహరావు దివికిన్ జనినాఁ డని విన్ననాఁడె యీ
మానవలోకమం దొకటమాత్రమె చాటక సూర్యరాయభూ
జాని గుణంబు లచ్చటను జాటుటకే చనె నంచు నెంచితిన్.

ఉ. చేసినవాఁ డనేకపరిశీలనముల్ బహులోకవేత్తయై
వ్రాసినవాఁడు గ్రంథములు వన్నెలు చిన్నెలు గుల్కునట్లుగా
సేసినవాఁడు భారతినిఁ జిత్రకథామణిమాలలన్ ధరం
బాసినవాఁడు నేఁడు మతిమంతుఁ డొకండు నృసింహుఁ డక్కటా!

## స్మృతి.

(విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు)

సీ॥ కల్పనాగరిమచేఁ గడుపుబ్బనవ్వించు
నరయ నెవ్వానికంఠాభరణము
ఒకమాఱు చదివిన నకలంక లోకవి
జ్ఞానమ్ము నొసఁగు నెవ్వానిసాక్షి
పాత్రౌచితీ రమ్యభావపరంపరల్
ప్రకటించు నెవనినాటకచయంబు
బ్రహ్మఁ దిమ్మని దిమ్మ బ్రహ్మనిగాఁ జేయు
ననువరియెవ్వాని వ్యాసరచన,

గీ. ఆతఁ డాత్మీయసామర్థ్య మాంధ్రదేశ
మెల్లఁ గొనియాడ దానితోఁ దృప్తిపడక
త్రిదశ సంఘము మెప్పు లార్జింపఁ దలఁచి
యరిగె లక్ష్మీనృసింహరాయుండు దివికి.

# కావ్యాలంకారచూడామణి.

## కొన్ని పాఠభేదములు.

వ్యాకరణ విద్యాప్రవీణ — చిలుకూరి పాపయ్యశాస్త్రి

ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక భాండాగారమున సుమారు 4600 తాటియాకుప్రతులు గలవు. ఈప్రతులలోఁ గొన్ని తెలుఁగు గ్రంథములు, మఱికొన్ని సంస్కృతగ్రంథములును. వీనిలో నేఁటికిని నముద్రితములు హెచ్చుగనున్నవి. వీనినన్నిటిని ముద్రించుటకుఁ దగినధనము పరిషత్తునకుఁ జేకూరకపోవుటచేఁ గ్రమక్రమముగఁ గొలఁదిగ్రంథములు మాత్రమే ముద్రింపఁబడినవి. నేఁటికి ముద్రితములైన గ్రంథములు యేఁబది. ఇంకను నముద్రితములు ప్రకటింపవలసినవి సుమారు రెండువేలుండును. ఇంతవఱకు ముద్రితములయిన గ్రంథములు పురాతనములు నమూల్యములని పాఠకలోకమునకు విదితమే ఈగ్రంథముల స్వరూపమును, నందలి విషయమును దెలుపుటకై పరిషత్తువారు 1931 వ సం॥ లో 'పరిషత్పుస్తకభాండాగారము' (Descriptive Catalogue)అను గ్రంథమును బ్రకటించినారు. తిరిగి యిప్పుడాగ్రంథమునకుఁ దరువాతిభాగమును బ్రకటింప నుద్యమించి, తొలుత లక్షణగ్రంథముల స్వరూపనిరూపణ మావశ్యకమనియెంచి, యాగ్రంథములఁ బరిశోధించుచుండ నముద్రితములు నమూల్యములునగు గ్రంథములు గోచరించుచువచ్చినవి. ఇందు, 1. లక్షణశిరోమణి (పొత్తపి వేంకటరమణకవి.) 2. లక్షణశిరోమణి (గణపవరపు వేంకటకవి.) 3. సకలలక్షణసారసంగ్రహము (రత్నాకరము గోపాలకవి.) 4. 'సుకవికర్ణామృత'మను 'కుకవికర్ణకఠోరము' (కొలూరి ఆంజనేయకవి.) 5. లక్షణమంజరి (నైషధము తిమ్మకవి.) 6. కవితాలక్షణసారము (రామయకవి.) 7. చిత్రబంధదర్పణము (నడిమింటి వేంకటకవి.) 8. లక్షణదీపిక (గౌరన) యును ప్రధానములు. *

* ఈగ్రంథరాజములందలి విశేషములఁగూర్చి యీసంచికలో నచ్చొత్తింపఁబడిన పరిషత్పుస్తకభాండాగారము 1-16 పుటలను జూడుఁడు.

ఇంతియగాక ముద్రితగ్రంథములందలి సందిగ్ధఘట్టములకుఁ బాఠభేదములను దెలుపుచు, ప్రక్షిప్తములను గవికల్పితములను నిర్ణయించుటకుఁ దగియున్న ప్రతులనేకములు గలవు. ఈలక్షణగ్రంథముల యుపయోగమును గూర్చి రెండుమాటలిటఁ బొందుపఱుతును.

మానవిల్లి రామకృష్ణకవిగారు నన్నెచోడుని కుమారసంభవమునకుఁ బీఠిక వ్రాయుచుఁ బేర్కొనిన 'అథర్వణచ్ఛందస్సు' అను గ్రంథము కలదని కొందఱు, లేదని మఱికొందఱును దెలుపుచున్నారు. కాని, పొత్తపి వేంకటరమణకవి లక్షణశిరోమణియందును, గౌరన లక్షణదీపికయందును, లింగమకుంట తిమ్మన సులక్షణసారమునను నీ ఛందస్సునందలి పద్యము లుదాహృతములైనవి. ఇంతియగాదు, పద్యములలో మార్పేమియు లేదు. చూడుఁడు.

గీ. పర్వతములందు మేరువుభాతియగుచు
సర్వసురలందు శంకరుచందమునను
అడవిమృగములయందు సింహంబుకరణి
గణములం దెల్ల నగణంబె గరిమఁ దాల్చు.

పరిషత్పుస్తకభాండాగార సంఖ్య 1297 గల లక్షణశిరోమణియందును, సంఖ్య 3439 గల లిం॥ తి॥ సులక్షణసారమునను నథర్వణునిదని యీపద్య మొకేరీతిగ నుదాహరింపఁబడినది.

క. అనలానిలసంయోగం
బనుపమకీలాకలాపమగు వహ్నిభయం
బొనరించుఁ గర్తగృహమున
కనుమానము లేదు దీన నంధ్రకవీంద్రుల్.

ఈపద్యము సంఖ్య 1391 గల లక్షణదీపికయందును, పై సంఖ్యగల సులక్షణసారమునను నొకతీఱుననే యున్నది. ఇట్లు మూఁడిట నొకేరీతిగనున్న యనేకపద్యములున్నను గ్రంథవిస్తరభీతి చేసిటఁ జూపమానితిని.

దీనింబట్టి చూడ, వేఱ్వేఱుకాలములలో రచియింపఁబడి, వేఱు వేఱు ప్రాంతములనుండి వచ్చిన విభిన్నగ్రంథములలోఁ జేర్పఁబడి, విషయసౌల్యముతోఁ గూడిన యథర్వణచ్ఛందస్సు లేదనుటకంటె, నింతకు ముందొకప్పు డితరలక్షణగ్రంథములవలెఁ బ్రసిద్ధిఁ జెందిక్రమముగఁ గాలగర్భమున నణఁగిపడనుటయే యుక్తమని తోఁచును.

ఇటులనే యీ లక్షణశిరోమణి మున్నగు గ్రంథములందాఁకాలమునకుఁ బ్రచారమునందున్న లాక్షణికులవలనఁ జేర్పని, తత్తల్లక్షణములు పరిగ్రహింపఁబడినవి. వీనియం దుదాహృతములగు భీమచ్ఛందస్సు, అనంతుని ఛందస్సు, లక్షణసారసంగ్రహము మున్నగు గ్రంథములందలి పద్యములను బరిశీలించినచోఁ బ్రక్షిప్తపద్యములు లక్షణగ్రంథములందున్నవేమో యనుశంక తొలఁగుటయేగాక, ప్రసిద్ధలాక్షణికులు సేకరించిన యీలక్షణములు ప్రమాణములే కావచ్చు నను ప్రత్యయముగూడఁ గల్గును.

ఇది యిటుండ, సులక్షణసారము వెల్లంకి తాతంభట్టు రచియించినాఁడని కొందఱును, లింగమకుంట తిమ్మన రచియించినాఁడని మఱి కొందఱును వివదించుచున్నారు. తాటియాకుప్రతులఁ దడవినచో నీసంశయము కొంతవఱకుఁ దీఱునని నానమ్మకము. 'సులక్షణసార'మను పేర నచ్చొత్తింపఁబడి నేఁడు ప్రచారములోనున్న ప్రతిలోఁగాని, దానింబోలు నాఱు లిఖితప్రతులలోఁగాని యెచ్చటను కవిపేరు కానరాదు. లింగమకుంట తిమ్మన రచియించినాఁడని తెలుపుకృత్యాదిపద్యభాగముతోఁ గూడిన ప్రతియొకటియు, దానితోఁ దుల్యరూపముగల సులక్షణసారపుఁబ్రతులు మఱి రెండును పరిషత్తునందుఁ గలవు. ఇందలి విషయమునకు, ముద్రిత సులక్షణసారమునందలి విషయమునకుఁ బోలికయే లేదు. వీనింబట్టిచూడ లింగమకుంట తిమ్మనయే సులక్షణసారము రచియించినాఁడనుట నిశ్చయము.

మఱియు కందుకూరి వీరేశలింగముపంతులుగారు లిం॥ తిమ్మన సులక్షణసారమును రచియించినాఁడని తెలుపుచుఁ జేర్చిన, కవిసర్ప గారుడము, శ్రీధరచ్ఛందస్సు, ఉత్తమగండచ్ఛందస్సు మున్నగునవి యీ మూఁడు ప్రతులందును జేర్పఁబడినవి. మఱియు వారు నిరూపించిన కృత్యాదిపద్యములు నిందలిపద్యములును సరిపడియే యున్నవి. చూడుఁడు.

సీ. శ్రీవైష్ణవహితుండఁ జిక్కయభట్టరు
శిష్యుఁడఁ గవితావిశేషశేష
తులితసర్వార్యు పౌత్త్రుఁడ లక్ష్మణయకుఁ దిమ్మాంబకు సుతుఁడఁ బెద్దనకు మాచ
నకు రామకవివరునకు ననుజన్ముఁడ
నా రామకవి చెప్పినట్టి మహిత
మత్స్యపురాణ వామనపురాణాది
సత్కవితల కెల్ల లేఖకుఁడ వృద్ధ
కుండికాతీర లింగమకుంటనామ
పట్టణస్థితికుండ సౌభాగ్యయుతుఁడ
నాదిశాఖాప్రవర్తన నమరువాఁడఁ
గాశ్యపసగోత్త్రుఁడను దిమ్మకవిని నేను.

క. లక్షణశాస్త్రము లెల్లఁ
బరీక్షించుటఁ గొంతకొంత యెఱిఁగినవాఁడన్
లాక్షణికానుగ్రహత సు
లక్షణసారం బొనర్తు లక్ష్యము లమరన్.

మఱియు తాతంభట్టు రచియించినది కావ్యచింతామణియే యను టకును నాధారముగలదు, పా. వెం. లక్షణశిరోమణి, లిం॥ తి॥ సులక్షణసారము మున్నగువానిలోఁ దాతంభట్టును బేర్కొని యాతనిపద్యముల నుదాహరించినారు. ఆపద్యములన్నియుఁ గవిచింతామణిలోనే యగ

పడుచున్నవిగాని ముద్రితసులక్షణసారమునఁ గాని, దానింబోలు లిఖిత ప్రతులలోఁగాని కానరావు. కవిచింతామణిలోఁ గృహ్యాదిని, ఆశ్వాసాంతగద్యములలోఁ గూడ తాతంభట్టు రచియించినాఁడనుటకుఁ దగిన పద్యములు గద్యములు గానవచ్చుచున్నవి

ఇట్టియమూల్యములగు నంశములతో నిండిన యీలక్షణగ్రంథములను ధనికులై సారస్వతాభిరుచిగల యుదారులెన్నడేని ప్రకటించి ప్రచారమునకుఁ దెచ్చుటకై పరిషత్తునకు సహాయమునొసఁగినచో నిట్టి యనేకసంశయములు తొలఁగుటయేగాక యాంధ్రభాషకొక నూతన వికాస మేర్పడుననుట నిశ్చయము.

ఇది యిట్లుండ నీతాటియాకుప్రతులయందలి పాఠభేదములు ముద్రిత గ్రంథపరిశోధకుల ప్రమాదములఁదెల్పుచు లక్షణలక్ష్యతాత్పర్యనిర్ణయమున కెంతేని సహకారులగు ననిగూడఁ దెలుపవలసియున్నది. ఈ పరిశోధనఁ జేయుచుండఁగనే నాదృష్టి కావ్యాలంకారచూడామణిపైఁ బ్రసరించినది. కావ్యాలంకారచూడామణి వ్రాఁతప్రతులు పరిషద్భాండాగారమున మూఁడుగలవు. వీనిలో నొకటి 75, రెండవది 871, మూఁడవది 382వ సంఖ్యలుగలవై యున్నవి. ఈమూఁడు వేఁగ్వేరు జిల్లాలనుండి తేఁబడినవియే. పాఠభేదములఁ దెలుపునపుడు క్రమముగ వీనిని 'క' 'గ' 'చ' యని వ్యవహరింతును.

కావ్యాలంకారచూడామణి యను నీ లక్షణగ్రంథమును రచియించినవాఁడు విన్నకోట పెద్దనకవి. ఈగ్రంథరాజము చాలకాలము వఱకు ముద్రణభాగ్యమునందకయే కాలగర్భమున నణఁగియుండి, తుదకు వేదము వేంకటరాయశాస్త్రిగారి దృక్పథమునఁబడి యాంధ్రలోకమున కందుపాటులోనికి వచ్చినది. ప్రథమమున నీగ్రంథమం దేడాశ్వాసములు మాత్రమే శ్రీ శాస్త్రులవారు తమ జ్యోతిష్మతీముద్రాక్షరశాలయందుఁ బ్రకటించినారు. పిమ్మట నాంధ్రసాహిత్యపరిషత్తువారీ గ్రంథమందలి యెనిమిది తొమ్మిదవ యాశ్వాసములను బ్రత్యేకముగ

1920 సం॥న ప్రకటించినారు. మద్రాసు విశ్వవిద్యాలయమువారు, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారును 'విద్వాన్' మున్నగుపరీక్షల కీ గ్రంథమును బాఠ్యముగా నిర్ణయించుటచేతను, ఇందుఁజార్రిత్రాంశములు హెచ్చుగనుండుటచే విమర్శకుల కత్యంతోపయోగి యగుటం జేసియు నేఁటికి దీనిని నాలుగుమాఱులు ముద్రింప నవకాశము గల్గినది. వీనిలోఁ బ్రథమముద్రణము 1893 వ సం॥నను ద్వితీయముద్రణము 1909 వ సం॥నను, ...చతుర్థముద్రణము 1938 వ సం॥నను జరిగినవి. నాల్గుముద్రణములందును 'మక్కికి మక్కి'గనే యున్నవిగాని పాఠములం దెచ్చటను మార్పుగానరాదు. తొలుత నీ యేడాశ్వాసముల గ్రంథమును బరిష్కరించి ప్రకటించిన వేదము వేంకటరాయశాస్త్రిగారి పాండిత్యవిశేష మాంధ్రలోకమునం దెల్లెడలఁ బ్రసిద్ధమే. వీరలు రచియించిన గ్రంథరాజములు, పరిష్కరించి యాంధ్రవివరణముతోపాటు ప్రచురించిన గ్రంథములును సర్వథా నిర్దుష్టములు నిరుపమానములును. శాస్త్రులవారు పరిష్కరించిన గ్రంథమునందలి దోసఁగులెంచుట నాపనిగాదు. అద్దానికి నేను సమర్థుఁడనుగాను. కాని, ముద్రితమైన కావ్యాలంకారచూడామణిలోఁ బలుతావులందలి పద్యములు లక్ష్యలక్షణవిరుద్ధములుగ నుండుటం జేసి, యివి యన్నియుఁ గవిలోపములేనా? లేక యిందేవేని పాఠభేదము లుండునా? యను సందేహముతోఁ బైమూఁడుప్రతులను దీసి పరిశీలించితిని. వీనిలోఁ బెక్కుతావుల నొకేరీతిగ భిన్నమైన పాఠములుండుటను, ఆపాఠములకు ముద్రితగ్రంథమునందలి పాఠములకు మిక్కిలి భేదము పొడసూపుటవలనను, పరిశీలించినచో వ్రాఁతప్రతులందలి పాఠములే రమ్యములని తోఁచుటవలనను వానిని గొన్నింటి నిటఁ బ్రకటింపఁగడఁగితిని.

1

క. రస మారోప్యంబగుటన్
బొసఁగదు నాట్యములయందుఁ బొల్పగుఁ దత్త

త్రపసరస్మరణముచేతఁ
రససామాజికులయందు వ్యక్తకు నెలవై.

కా. చూ. ౨ ఉ. ౭ ప.

“ఎన మాకోవ్యము గాన నాట్యములయందు దా రసముండ నేరదు.” అని యీపద్యపూర్వార్ధమునకు భావము. ఇట ‘నాట్యములందు’ అను చోట వ్రాతప్రతులు మూఁడింటిలోను ‘నర్తకులయందు’ అని కలదు. దీని యవ్యవహితపూర్వమునం దున్న పద్యసందర్భమును బట్టి యీపాఠమే యుక్తమని తోఁచును. చూడుఁడు.

“ప్రౌఢలకుఁ గావ్యములయందుఁ బొందురసము
ద్రష్టలకు నాట్యములయందుఁ దనరురసము......”

సాహిత్యరత్నాకరము. “అష్టావేవరసా నాట్యేష్వితి కేచిదచూచుదన్.”

రసగంగాధరము. పుట. 30.

ఆలంకారికసిద్ధాంతమిట్లు ప్రసిద్ధముగనుండ ‘పొసఁగదునాట్యములయందు రసము’ అనుట పొసఁగుటెట్లు ?

అదియుఁగాక కవియిటఁ జెప్పఁబూనినది “రసము నటాశ్రయము కాదు. ఆనటుఁడు ప్రదర్శించు విభావాదులస్మరించుటచే సామాజికులయందే యీరసముండును.” అనునదియే. చూడుఁడు. ప్రతాపరుద్రీయమున విద్యానాథుఁడు, రసము నాయకాశ్రయమని చెప్పి, పిమ్మట “అథవా మాలత్యాదిశబ్దేభ్యః యోషిన్మాత్రప్రతీతౌ, రావణాదిశబ్దేభ్యశ్చ శత్రుమాత్రప్రతీతౌ, స్మృత్యారూఢేన తత్తద్యోషిద్విశేషేణానుకార్యేణ సామాజికాశ్రయత్వమపి న విరుద్ధమ్......నటస్యానుకరణమాత్రపరతయా నైవ రసాశ్రయయోగ్యతా. అనుభావాదీనాం ప్రకాశనం శిక్షాభ్యాసపాటవేనైవ ఘటతే.”

ప్రతా. రసప్ర. ౯౯.

అని రసము నటాశ్రయముకాదని వ్యాఖ్యానించియున్నాఁడు.

2

క. అసితంబగు రత్యాది
ప్రసరణచే దేజర్లి ప్రశమరసాదుల్
సొసఁగఁబడు నెచట నదియో
రసవదలంకారమనఁగ రసికుల కెక్కు౯.

కా. చూ. ౫ ఉ. ౫౬. ప.

ఇట మూఁడుప్రతులలోను 'లసితంబగు రత్యాది' అని కలదు. ఈపాఠమే యుక్తము. ముద్రితపాఠ మసన్వితముగ నున్నది. ఏలయన, అసితరత్నప్రసారములకు శృంగారాదిరసములకు సంబంధమేమి ? ఇచటఁ గవి చెప్పఁబూనినది "విభావాదులచేఁ బరిపుష్టి నందిన రత్యాదిస్థాయి భావములచేఁ దేజరిల్లి శృంగారాదిరసము లెచ్చట సహృదయహృదయాహ్లాదకముగఁ బొసఁగఁబడునో యదియ రసవదలంకారము" అనునదియే.

మఱియు విన్నకోట పెద్దన, ఇందలి యలంకారలక్షణముల నన్నిటిని దండికావ్యాదర్శమునుండి సేకరించినాఁడు. అచ్చట లక్షణమీతీరున నే యున్నది. చూడుఁడు.

"ప్రేయః ప్రియతరాఖ్యానమ్ రసవ ద్రసపేశలమ్.

కావ్యాద. ౨ ప. ౨౭౫ శ్లో.

"రసపేశలమ్=విభావాదిభిర్వ్యక్తః చిత్తవృత్తివిశేషః రత్యాదిరూపఃస్థాయిభావః రసః తేన పేశలం సహృదయహృదయాహ్లాదకత్వం యత్ తత్ రసవదలంకారః"

కావ్యాదర్శవ్యాఖ్య. కుసుమప్రతిమ. 211 పొరట.

ఇచటఁ దాటియాకుప్రతిలో సంయుక్తవర్ణమగు 'స' కు, 'య' కుభేదము గుర్తింప ననువు కాకపోవుటచే నచ్చులో 'రత్నాది' యని పడియుండెనేమో యనిపించుచున్నది. ఇటులనే 'ల' కు మాఱుగా 'అ' కూడ ముద్రింపఁబడి యుండవచ్చును.

(సశేషము.)

# రవీంద్రుఁడు.

కొమాండూరి శఠకోపాచార్యులుగారు.

---

ఆధునిక కవిసార్వభౌముఁడు రవీంద్రనాథుఁడు 1861 లో కలకత్తాలో జనించెను. వీరివంశము సుప్రతిష్ఠితము. వీరిపూర్వికులు రాఢాకృష్ణశాఖకుఁజెందిన పశ్చిమవంగీయబ్రాహ్మణులు. వీరిది "ఠాకూరు" (=మాన్య) వంశము. పూర్వమునుండియు వారిలోఁజాలమంది విద్వాంసులు; కొందఱు రాజకీయ సాంఘికాదిరంగములయందుఁ బ్రముఖులైరి; సర్ ప్రద్యోతకుమార ఠాకూరు మున్నగు కొందఱకుఁ బెద్దజమీందారీలున్నవి. రవీంద్రుని పితామహుఁడు ద్వారకనాథఠాకూరు గొప్పవ్యాపారము చేయుచు, ఆర్థికసాంఘికరంగములఁ గృషిఁజేయుచు, రాజా రామమోహనరాయలకు మిత్రుఁడును, ఆయనస్థాపించిన బ్రాహ్మసమాజమునకుఁ గార్యదర్శియునై యుండెను. వారికుమారుఁడు దేవేంద్రనాథుఁడు గొప్ప విద్వాంసుఁడు, మహాభక్తుఁడు, రామమోహనరాయలకు సహకారియై, తరువాత నాదిబ్రహ్మసమాజమునకు నాయకుఁడయ్యెను; వేదవాఙ్మయమందును బండితుఁడై, పవిత్రజీవనుఁడై, "మహర్షి" యని ప్రసిద్ధిచెందెను; వంగభాషలో "తత్వబోధిని" యను ధార్మికపత్రికను నడపెను. లక్ష్మీసరస్వతు లత్తకోడండ్రతత్వముతో మైత్రిలేనివారై, ఉభయులు నొకేయెడ నుండరని ప్రతీతి. మనదేశమున విద్యావంతులు శ్రీమంతులై యుండుట యరుదే. కాని ఠాకూరు కుటుంబమునకు మాత్రము లక్ష్మీసరస్వతు లుభయులు ప్రసన్నులైరి. ఈ వంశమున శౌరీంద్రమోహనుఁడు గొప్ప సంగీతవిద్వాంసుఁడు, స్థితిమంతుఁడు.

దేవేంద్రనాథుని సంతతివారందఱును విఖ్యాతులు, ప్రతిభావంతులు నైరి. వారిలో జ్యేష్ఠుఁడు ద్విజేంద్రనాథుఁడు గొప్పతత్వవేత్త; బంగాళీభాషలో నాతఁడు రచించిన "స్వప్నయాత్ర" యను పద్యకావ్య

మత్యుత్తమమగు నాధ్యాత్మికగ్రంథము. వంగవాఙ్మయమం దది యొక రత్నము. రెండవకుమారుఁడు సత్యేంద్రనాథుఁడు స్వభాషలో మంచి రచనలఁ జేయుటేకాక, ఐ.సి.ఎస్. పరీక్షలోఁ గృతార్థులైన భారతీయుల మొదటిజట్టులో నొకఁడై, తరువాత జిల్లాజడ్జియై, ఉన్నతోద్యోగముల నిర్వహించెను. నాల్గవపుత్రుఁడు జ్యోతీంద్రనాథుఁడు ధీమంతుఁడు, గొప్ప కళాభిజ్ఞుఁడు. విశ్వవిఖ్యాత చిత్రలేఖకులు, అవనీంద్ర, గగనేంద్రు లీతని కుమారులే. దేవేంద్రుని యేడవకుమారుఁడగు రవీంద్రుఁడే కనిష్ఠుఁడు. ఠాకూరుకుటుంబమున స్త్రీపురుషు లెల్లరు విద్వాంసులు, ఉదారులు. దేవేంద్రునికుమార్తెత స్వర్ణకుమారి యద్భుతమగు నవలల రచించెను.

రవీంద్రునికి బాల్యమందే తండ్రి, ఉపనిషత్తులు, భక్తిగీతములు నేర్పెను. కవులు, గాయకులు, చిత్రలేఖకులతో నిండిన వారియిల్లు కళామయము. ఈ సన్నివేశమున రవీంద్రుని సహజప్రతిభ క్రమముగ వికసించుచుండెను. అతఁడు బాల్యమునుండియు స్వతంత్రబుద్ధికలవాఁడు; అధికారుల పాఠశాలలలోని సంకుచితపద్ధతులకు లోఁబడలేకపోయెను. సర్కారుబడులలోని ప్రస్తుతకార్యక్రమము మనస్సును హృదయమును వికసింపఁజేయుటకు బదులు సంకుచితమొనరించుచున్నది. జ్ఞానాభిరుచి కల్గుటకు బదులు, విధిలేక నిర్బంధముగఁ జదువుటే తఱుచుగఁ దటస్థించుచున్నది. అట్టిపాఠశాలలోఁ జదువకున్నను, ఇంటనే యథాప్యాయముగ విద్యనేర్చిన రవీంద్రుని మనోవికాసమున కెట్టినష్టమును గలుగలేదు. శైశవమునందే, ఆతనికి విద్యాభిరుచియుఁ గళాభిజ్ఞానమును గల్గినవి. అతఁడు గురువులకడ, ఇంటనే, సంస్కృతములోను, వంగభాషలోను గల ప్రాచీనమహాకావ్యములఁజదివెను; మధుసూదనదత్తు, రమేశచంద్రుఁడు, బంకించంద్రుఁడు మున్నగు నవ్యులరచనలఁగూడ నాసక్తితోఁబఠించుచుండెను.

బాల్యముననే రవీంద్రుఁడు కవిత్వరచన లారంభించెను. ఆతని సోదరులును కుటుంబములోనివారును నాతనికిఁదగుప్రోత్సాహమిచ్చు

చుండిరి. రవీంద్రునికిఁ బండ్రెండవయేట నుపనయనమాయెను. ధార్మికప్రవరుఁడగు దేవేంద్రుఁడు వెంటనే యాతనిని కలకత్తాకుఁ గొలఁదిదూరములో విశ్రాంతమైన బోల్పురమున సుందరారణ్యములనడుమఁ దాను స్థాపించిన శాంతినికేతనాశ్రమమునకుఁ దీసికొనిపోయి, అటనుండి హిమాలయగిరులకును గొంపోయెను. ఈ యద్రిరాజు ప్రకృతిశోభ యద్భుతము, విశ్వరూపుఁడగు నీశ్వరునిముఖ్యలీలారంగము; ఎందఱో మహర్షుల కాధ్యాత్మికరహస్యముల గోచరింపఁజేసిన దీ నగమే. పూర్వమహర్షుల కావాసమైన యీపర్వతస్థలమందు రవీంద్రునికి బాల్యమందే యీశ్వరమహత్త్వమును, ప్రకృతికళావిభవమును గోచరించినవి. అప్పటినుండియు రవీంద్రునకుఁ బ్రకృతిసౌందర్యమం దభిలాష వృద్ధియైనది.

రవీంద్రునితల్లి శారదాదేవియు గొప్పభక్తురాలు. ఆమె 1874 లోఁ జనిపోయెను. అప్పటికే రవీంద్రుఁడు చిల్లరపద్యముల వ్రాయుచుండెను. 1877 లో ద్విజేంద్రుఁడు "భారతి" యను మాసపత్రికను వంగభాషలోఁ బ్రచురింపఁదొడఁగెను. ఇందుఁ జాలమంది మహనీయులు చక్కని వ్యాసముల వ్రాయుచుండిరి. దానితోపాటు, "భానుసింహుని పద్యాజలి" యను గీతములు నెలనెలకు వెలువడుచుండెను. ఇవి పూర్వకవుల గంభీరశైలి నొప్పుచు, మృదుమధురములై చక్కని భావము గల్గి భక్తిరస మొలుకుచు, ధ్వనిప్రధానములై యున్నవని, ఈ భానుసింహాకవి వైష్ణవసంప్రదాయపుఁ బ్రాచీన కవిసత్తముఁడని, చాలమంది విద్యావంతు లభిప్రాయపడి, ఆ కవిశ్వరుని కాలనిర్ణయములఁగూర్చి చర్చించుచు, తగవుపడుచుండిరి. ఈ భానుసింహమహాకవియు డు పూర్వకవి కాఁడు, బాలకవియగు రవీంద్రుఁడని కొంతకాలమునకు వెల్లడియైనది. "భారతి" లోఁ జక్కని భావములుగల వ్యాసములును కొన్నిగ్రంథవిమర్శలను గూడ రవీంద్రుఁడు వ్రాయుచుండువాఁడు. బంకించంద్రుఁడు, మధుసూదనుఁడు మున్నగు మహాకవులరచనలఁగూడ నాతఁడు ధైర్యముతో స్వతంత్రవిమర్శలపాలు చేయుచుండెను; "శైశవసంగీత" అను గీతములఁ

గూడ నాకాలముననే ప్రకటించెను. 1878 లో నతఁ డింగ్లండునకు వెడలి, లండను విశ్వకళాశాలలోఁ గొన్ని నెలలు చదివెను; 1880 లో మాతృదేశమునకు మరలివచ్చెను. తరువాత "యూరప్ ప్రవేశేర్ పత్ర" (=యూరపుయాత్రలేఖలు) వ్రాసెను. అప్పుడే "భగ్నహృదయ," "సాయంసంగీత్," "ప్రభాతసంగీత్" మొదలగు పద్యగ్రంథములఁ బ్రచురించెను. వీనిలో శృంగారమేగాక, కొంతకరుణరసమును, గాన నగును. ఇరువదేండ్లప్రాయముననే రవీంద్రునకు వంగభాషలోని ముఖ్య కవులలో నొకఁడని పేరు గల్గెను. అప్పుడు ప్రసిద్ధోద్యోగియు, విద్వాంసుఁడు, గ్రంథకర్తయు నగు రమేశచంద్రునియింట నాతనిపుత్రిక వివాహము జరిగెను. అందుకు వంగవిద్వాంసులును కవులును విచ్చేసిరి. అచ్చట దత్తుగారు, బంకించంద్రుని "సాహిత్యసామ్రాట్"అని గౌరవించి, వారిని పుష్పమాలాలంకృతునిగఁ జేసిరి. బంకిము, వెంటనే దానిని దన మెడనుండి తీసి, ప్రక్కనున్న యువకుఁడగు రవీంద్రుని కంఠమం దలంకరించి, కవిసార్వభౌముఁడు కానున్నవాఁ డితఁడే యని యెల్లరయెదుట బహూకరించెను.

అప్పటికి మాతృభాషలు వెనుకఁబడి యుండెను. వాని వాఙ్మయాభివృద్ధికి శ్రద్ధవహించువారును, లేఖకులును, పరస్పరసహాయముతో సాహిత్యసేవ జరిగించుటకొరకు ప్రత్యేకసంఘ మేర్పడుట యవసరమని రవీంద్రుఁ డాకాలముననే కనిపెట్టెను. 1893 లో మఱికొందఱఁ గూర్చుకొని "వంగీయసాహిత్యపరిషత్తు"ను స్థాపింపఁజేసెను. కొంతకాలము దానికిఁ దానే కార్యదర్శిగ నుండెను. ఈ పరిషత్తు రవీంద్రాదుల కృషి వలన వృద్ధిఁ జెంది, వంగవాఙ్మయము నేఁటి యున్నతదశకు వచ్చుటకుఁ దోడ్పడినది. కొన్నియేండ్లు గడచినతరువాత, ఆయాదర్శముతోఁ దక్కిన మనదేశభాషలలోను 'సాహిత్యపరిషత్తు' లేర్పడినవి.

అప్పటికే, షెల్లీ, బ్రౌనింగ్‌సతి, విక్టర్ హ్యూగో, మున్నగు పాశ్చాత్యకవుల గీతములను, భావరచనలను, రవీంద్రుఁడు వంగభాషలోని కనువదించెను. ఈలోఁగా నతనికిమరల నాంగ్లదేశయాత్ర తగిలెను.

ఠాకూరులు స్థితివంతులగు భూస్వాములగుటచే రవీంద్రునికి జీవనోపాధికి లోటులేదు. ఐనను ద్రవ్యార్జన ప్రయోజకతకు లక్షణమని గౌరవముగల స్వతంత్రవృత్తియుండుట మంచిదని, సోదరులాలోచించి, (అప్పటి నవనాగరికతాశిరోమణివి) అతనిని బారిస్టరుపరీక్షకుఁ జదువుమని 1881 లో నింగ్లండుకుఁ బంపిరి. న్యాయవాదవృత్తియందు దాతఁడు ప్రవృత్తి యుండు దుర్దశ దేశమునకుఁ దప్పిపోయినది. 'లాయరు' వృత్తియందుత్సాహములేక రవీంద్రుఁడు తిరిగి వెనుకకు వచ్చివేసెను. అప్పటికి సాహిత్యసేవయే వృత్తిగఁ జేసికొను నలవాటు మనదేశమున లేదు. కాని రవీంద్రుఁడు తన జీవిత మందులకే వినియోగింప నిశ్చయించెను.

బాలురకును, పామరులకును సాహిత్యాభిరుచి గల్గించు చిన్న కథలను సులభమగు విజ్ఞానపుస్తకముల నతఁడు వంగభాషలో వ్రాసెను. అవి ప్రజామోదమును బడసినవి. 1885 లో నతఁడు "బాలక్" అను మాసపత్రికను బ్రచురింప నారంభించెను. దీనిలోఁ జక్కని బాలవాఙ్మయము ప్రచురితమాయెను.

తరువాత ధార్మికవిషయముల గాఢచర్చనారంభించి, అందుకై "సాధన" యను క్రొత్తమాసపత్రికను 1891 నుండి రవీంద్రుఁడు స్వయముగఁ గొన్నియేండ్లు నడపెను. అటుపై రెండేండ్లు తనయన్న ద్విజేంద్రుఁడు స్థాపించిన 'భారతి' యను బెంగాలీపత్రికను, ఆపిమ్మట నైదేండ్లు బంకించంద్రుఁడు స్థాపించిన "వంగదర్శన్" పత్రికనుగూడ, రవీంద్రుఁడు సంపాదకుఁడుగ సాగించెను. ఆ పత్రికలలో నవ్యశైలిని పద్యములను, కథలను, విమర్శలను, సాంఘిక వ్యాసములను, రాజకీయప్రసంగములను, నవలలను, నాటకములనుగూడఁ దానే వ్రాసి ప్రచురించుచుండెను.

ఇట్లుండఁగా 1902 లో రవీంద్రునిభార్య "మృణాళినీదేవి" మరణించెను. ఈవిపత్తు రవీంద్రునిహృదయములో శూలమును నాటెను. అంతవఱ కతఁడు శృంగారప్రధానమగు రచనలనే చాలవఱకు వ్రాయుచుండెను. 1902 నుండి రెండేండ్లవఱ కాతనిరచనలలోఁ గరుణరసమే

ప్రధానముగా నుండెను. "స్మరణ్" "నౌకాడూబీ" మొదలగు గ్రంథము లప్పటివే. రవీంద్రుఁడు మరల వివాహముచేసికొనక, తనశక్తిని గాలమును దేశమునకే పూర్తిగ వినియోగింపఁదొడఁగెను. అప్పటినుండి కొంతకాల మాతఁడు సాంఘికరాజకీయములందుఁ బూర్తిగఁ బాల్గొనెను.

1904 లో వంగరాష్ట్రమును, కర్జనుప్రభువు ప్రభుత్వము రెండు గఁజీలఁదీసెను. ఆ"వంగభంగము" తమజాతీయజీవనమును భగ్నముచేయునని యెంచి, దానిని రద్దుచేయించుటకు వంగీయు లప్పుడు తీవ్రాందోళన మారంభించిరి. రవీంద్రనాథుఁ డప్పుడు ప్రజలలో జాతీయోత్సాహముగల్గించుటకుఁ దనలేఖిని నుపయోగించెను. వంగభాషలో నాతఁడిచ్చు నుపన్యాసములును, తాను రచించి పాడు జాతీయగీతములును, జనుల నాకర్షించుచుండెను. జాతీయవిద్యాభివృద్ధికై రవీంద్రుఁ డప్పుడప్పుడు మహనీయవిద్యాధికులగు కొందఱసహాయముతో కలకత్తాలో జాతీయపరిషత్తను పెద్దకళాశాలను స్థాపింపఁజేసి, దాని నిర్వహణమునకై విశేషశ్రమపడెను. అప్పుడు బెంగాలులో జనించిన తీవ్రజాతీయభావము భారతదేశ మంతటను వ్యాపించెను. 1905 లో రవీంద్రుఁడు "భాండార్" అను క్రొత్తమాసపత్రిక నారంభించి, అందులో జాతీయదృష్టితో, ఆర్థికరాజకీయసమస్యలను సమర్థతతోఁ జర్చించుచుండెను. అప్పు డారంభించిన స్వదేశీయుద్యమము ప్రజలలోవ్యాపించుటకు రవీంద్రునివ్యాసములును జాతీయగీతములును, వక్తృతయును జాలతోడ్పడినవి. కాని యిట్లాతఁడు తీవ్రముగుజాతీయప్రవాహమున నీఁదుచుండ, అందపాయకరముగు మొసలివచ్చునట్లు చూచి, దానిని వారింపఁబోయి, అట్లలవిగాక, శోకముతో హఠాత్తుగ గట్టుచేరెను. 1906 లో స్వదేశీయుద్యమము తీవ్రమైనస్థితిలోనుండఁ గొందఱు బ్రిటిషువస్తుబహిష్కారము సాగించిరి. ఆప్రచారము ప్రజల నుద్రిక్తులుగఁ జేయుచుండెను. అదిహింసాతత్త్వప్రయుక్తమని రవీంద్రుఁ డందుల కిష్టపడలేదు. ఇంతలోఁ

వారిపైఁ దీవ్రద్వేషము, చూపఁదొడఁగిరి. ఈహింసాధోరణిలో హిందువులకు ముస్లిములకు మధ్య విరోధములు పెఱిగి, సాంఘికమైత్రి చెడిపోయెను. ఈహింసాతత్వము సంఘమంతటికిని హానికరమని రవీంద్రుఁడు కనిపెట్టి, తనభావములను పత్రికలలోను, ఉపన్యాసములలోను దీవ్రముగ వెల్లడిచేసెను. అంతవఱకు రవీంద్రుఁడు జనులకుఁబ్రేమపాత్రుఁడై యుండెను. 1907 లో మొదటివంగరాష్ట్రసాహిత్యసభ జరిగెను. దానికిని 1908 లో పాబ్నాలో జరిగినరాష్ట్రీయరాజకీయమహాసభకును రవీంద్రనాథునే యధ్యక్షుఁనిగ నెన్నుకొనిరి. ఇట్టిసభలన్నిటిలోను రవీంద్రుఁడు సోదరవంగీయులతో "ఉద్రేకమును హింసాధోరణియు హానికరములు; వీనికిఁబ్రోత్సాహ మీయరాదు; అట్టివారి నట్టిధోరణినుండి మరలింపవలెను" అని గట్టిగ వాదించెను. అందుచే నప్పటివంగీయులలోఁ జాలమంది తీవ్రరోషముతో రవీంద్రుని నిరసించిరి. రవీంద్రుఁ డంతటితో రాజకీయరంగమునుండి హఠాత్తుగఁ దప్పుకొనెను. అప్పటినుండియుఁ దన జీవితము నాతఁడు సాహిత్యకృషికే వినియోగించుచున్నాఁడు

1909 లో రవీంద్రుఁడు గీతాంజలియను భక్తిరసప్రధానమగు గీతములసంపుటిని బెంగాలీలోనే వ్రాసి ప్రచురించెను. వంగభాషాపరిచితులందఱకును సాహితీగగనమునం దొక నవ్యజ్యోతిరుదయము విస్పష్టమాయెను. రవీంద్రునకు భారతీయకవిసార్వభౌముఁడని ప్రఖ్యాతిగల్గెను; 1911 లో వంగీయసాహిత్యపరిషత్తువారు ప్రత్యేకసన్మానమిచ్చి, పండితసభలో గౌరవించిరి. రవీంద్రుఁడు గర్వితుఁడు కాలేదు. స్వభాషాసేవ యింకను హెచ్చినది. 1910—11 లో "జీవనస్మృతి" యను స్వీయచరిత్రను వ్రాసెను. ఆధ్యాత్మికవిషయములందుఁ దనభావములఁ దెల్పుటకై రవీంద్రుఁడు తనతండ్రి యిదివఱలో స్థాపించిన "తత్త్వబోధిని" పత్రికకు సంపాదకుఁడై, నాగ్లేం ద్లాపత్రికను స్వయముగ నడపెను. అప్పుడే బంగాలీలోఁ గొన్ని నాటకములఁగూడ వ్రాసి ప్రచురించెను. రవీంద్రునిగీతములఁ గొన్నిటి నితరు లాంగ్లములోనికిఁ దర్జుమా చేసి మాడరన్‌రివ్యూ

పత్త్రికలలోఁ బ్రచురించిరి. అవి చాలమనోజ్ఞములు. అంతటఁ గొందఱు ప్రోత్సహింప రవీంద్రుఁడు స్వయముగఁ దనగీతములలోఁ గొన్నిటి నాంగ్లములోని కనువదించెను. వీనిమొదటిసంపుటియగు "గీతాంజలి" యద్భుతమని పాశ్చాత్యవిమర్శకులు మెచ్చుకొనిరి.

ఉదారాదర్శముతోఁగూడి, ప్రపంచమందలి యేభాషలోనైన వెలువడుసాహిత్యగ్రంథమునకు, ప్రపంచవిద్వాంసులసంఘము వారొక గొప్పపురస్కార మిచ్చుట గలదు. దీనినే 'నోబెలు' బహుమతి యందురు. ఇది 8000 బంగారుకాసులది. ఈబహుమతిపొందుట వాఙ్మయలోకములో నసమానగౌరవమనియు నెంతురు. అప్పటి కట్టిబహుమతి భారతీయులకే గాదు, ప్రాచ్యులెవ్వరికిని రాలేదు. 1913 లో "గీతాంజలి" కాబహుమతినిచ్చి, రవీంద్రుని గౌరవించిరి. బెంగాలీలోని గీతాంజలి, ఖేయ, నైవేద్య, అను (రవీంద్రుని) మూఁడుకావ్యములలోనుండితీసిన కొన్ని గీతములయనువాదసంపుటియే యింగ్లీషుగీతాంజలి. అంతటితో రవీంద్రునకు నాగరికదేశములన్నిటిలో విశేషఖ్యాతిగల్గెను. తనబెంగాలీయుద్గ్రంథముల మఱికొన్నిటి నాంగ్లములోని కనువదించుమనియు, విదేశములకు విచ్చేసి యుపన్యసింపుమనియు, నలుగడలనుండియు విద్వాంసులు విజ్ఞానసంస్థలును నాహ్వానించిరి. రవీంద్రుఁడు తనరచనలలోఁ గొన్నిటిని స్వయముగ ననువదించెను; కొన్నిటిని మిత్త్రు లాంగ్లీకరించిరి. ఐరోపానుండివచ్చిన యాహ్వాన మంగీకరించి, అచట సంచారముచేసి, అచటి విద్వాంసులవల్ల సన్మానముపొంది, యూరపులోని వాఙ్మయప్రవాహపు వివిధపోకడలను నవ్యధారలను బరిశీలించి, అందలివిశేషములను రవీంద్రుఁడు గ్రహించెను.

1919 లోఁ బ్రభుత్వము వారు రవీంద్రునకు "సర్" బిరుదమునిచ్చి సన్మానించిరి. కేవలవాఙ్మయసేవయే చేయువారి కట్టిబిరుదము నిచ్చుట యప్పటి కరుదు. మనదేశమందు సాహితీకుల కట్టిగౌరవ మంతదనుక లభింపలేదు. ఇంతలో జర్మనుమహాయుద్ధము లోకము నావరించినది.

హింసాతత్వ మంతటను విజృంభించెను. బ్రిటిషుసామ్రాజ్యాంతర్గతముగుటచే మనదేశమునకుఁగూడ నీశిక్ష తగిలెను. ఈరక్తపిపాస కాళీతాండవము వంగదేశములో నెక్కువవ్యాపించెను. రవీంద్రునిసుకుమారతత్వమున కీధోరణి యెంతమాత్రమును సరిపడలేదు. అప్పు డాయన రచించిన గ్రంథము లీసంగతిని విశదపఱుచును. ఈసంఘర్షములోఁ దాను బడకుండనే దాని నెల్లైన తగ్గించుట కాయన కృషిచేసెను. అమెరికాసంయుక్తరాష్ట్రములనుండి వచ్చిన యాహ్వాన మంగీకరించి, రవీంద్రుఁడు జపాను, అమెరికాలలోఁ బ్రయాణముచేసి ' జాతీయత ' మున్నగువిషయములఁగూర్చి యుపన్యసించి యక్కడిజనులచే నద్భుతసమ్మాన మొందివచ్చెను.

బోల్పురగ్రామములో రవీంద్రుఁడు స్వయముగస్థాపించి జరుపుచుండిన "శాంతినికేతన" మను పాఠశాలను, 1921 లో వృద్ధిచేసి, ఒకగొప్పవిశ్వకళాపరిషత్తుగఁ జేసెను. దీనికి "విశ్వభారతి" యను పేరిడి, దీనితరపున 1922 నుండి రవీంద్రుఁడొక త్రైమాసికపత్రికనుగూడఁ బ్రచురించుచున్నాఁడు.

1924 లో రవీంద్రుఁడు చీనాజపానులలో సంచారముచేసి, ఆదేశముల సంస్కృతికిని భారతీయ సంస్కృతికిని బూర్వమునుండియుఁగల యన్యోన్యతను బునరుద్ధరించుటకుఁ బ్రత్యేకకృషిచేసెను. మనసంస్కృతిలోని ప్రత్యేకతను వారికి విశదపఱిచి, అక్కడిప్రాచీనసంస్కృతిలో నిటీవలఁ గలిగిన వికృతిపరిణామమును వారికిఁగనపఱిచి, దానిని పరిశుద్ధమొనరించుకొండని వారికి బోధించెను. 1926 లో మరల రవీంద్రునకుఁ బ్రపంచయాత్ర తగిలెను; యూరపులోని విశ్వవిద్యాలయములలో విశ్వజనీనతఁనుగూర్చి యుపన్యసించెను. 1930లో రష్యా కేఁగి, సోవియటు పద్ధతిని, ఆసాంఘికపరిస్థితులనుస్వయముగఁబరిశీలించి, తరువాతఁదనయనుభవముల వార్తాపత్త్రికలలోఁ బ్రకటించెను. తత్త్వవేత్తల యాహ్వానముపై 1930 లో నింగ్లండులో " Religion of Man " మానవధ

ర్శ్మమునుగూర్చి మహోపన్యాసమిచ్చెను. 1931 లో మనయాంధ్రవిశ్వవిద్యాలయముతరపునను నరతత్వమునుగూర్చి యుపన్యసించెను.

ఇటీవలఁ దమవిశ్వభారతిని సర్వకళాసంపూర్ణనుగఁ జేయుటకు రవీంద్రుఁడు తనశక్తినంతయు వినియోగించుచున్నాఁడు, తనకుటుంబములో శౌరీంద్రమోహనుని కాలమునుండియు వృద్ధియగుచున్న సంగీతచిత్రలేఖనాది కళలందుఁ బ్రత్యేకకృషి చేయుచున్నాఁడు. వయసున వృద్ధుఁడయ్యు, ఉత్సాహమున యువకులకన్న హెచ్చుగ నహోరాత్రములు దీక్షతోఁ బనిచేయుచుండును. ఇప్పటికిని "విశ్వభారతి" పత్త్రిక నతిసమర్థతతో నడుపుచు, అనేకకళలనుగూర్చి సంస్కృతిసమస్యలఁగూర్చి పరిశోధనలఁజేయుటేకాక, వంగభాషలోఁ బ్రతిసాలున నవ్యగ్రంథముల రచించుచునేయున్నాఁడు.

రవీంద్రునివాఙ్మయసేవ.

రవీంద్రుఁడు ప్రపంచమునందలి మహాకవులలో నొకఁడనియెల్ల రంగీకరించినదే; ఆధునికకవులలో సర్వోత్తముఁడని చాలమంది భావము. ప్రత్యేక మొకశాఖలో నాటకములలోనో, నవలలోనో, గల్పములలోనో, గీతములలోనో, పద్యకావ్యములలోనో రవీంద్రునికంటె ప్రజ్ఞావంతులనిపించుకొనినవారిపుడుండిన నుండవచ్చు. కాని యన్నిట సమప్రజ్ఞగల యిట్టియఖండధీమంతులింకెవ్వరును లేరనియే చెప్పవచ్చును. రవీంద్రుఁడు, స్వయముగ ముఖ్యపాత్రల ధరించి, నాటకములనాడి, పెక్కుమాఱు లపూర్వమైన నాట్యకళ నభివ్యంజన మొనర్చెను. సంగీతశాస్త్రములోను చిత్రలేఖనాదులలోను ప్రాచ్యపాశ్చాత్య పద్ధతులలోని విశేషముల గ్రహించి, వానినుండి క్రొత్తపద్ధతి సృజించి ప్రాముఖ్యము నను(ఁ)దెచ్చెను. సర్వతోముఖదృష్టి రవీంద్రుని వాఙ్మయమందలి ముఖ్యగుణము.

రెండవవిశేషము విశాలత. ఆతఁడు శతాధికగ్రంథకర్తయన్నంతనే యావిశాలత పూర్తిగ గోచరముకాదు; ఆయన యిప్పటి కఱువదేండ్లకుఁ

బైగ, అవిచ్ఛిన్నముగ వాఙ్మయసేవఁ జేయుచున్నాఁడు. ఐనను క్రొత్త రచనలలోఁ గూడఁ బటుత్వముగాని ప్రతిభగాని యేమియుఁ దగ్గలేదు. సర్వజనరంజకత్వము మఱియొకవిశేషము. వంగభాష నెఱింగిన ప్రతిగృహమునకు రవీంద్రుని రచనలు వ్యాపించినవి. మహావిద్వాంసు లాయన రచనల ననేకరీతుల గౌరవించిరి. ఎక్కడను నట్టిపరీక్షయు నీయకున్నను, కలకత్తా విశ్వవిద్యాలయము వా రాయనకు డాక్టర్ ఆఫ్ లిటరేచర్ బిరుదమిచ్చియున్నారు.

రవీంద్రుని గ్రంథములలోఁ గొన్నిటిని స్థాలీపులాకన్యాయమునఁ బరిశీలింతము: అన్నిటిలోను జగత్ప్రసిద్ధిగాంచినది "గీతాంజలి"; ఇది గీతకావ్యము. సంస్కృతవాఙ్మయమునందలి ప్రసిద్ధివహించిన "గీతగోవిందము"తో గీతములఁబదునాల్గవశతాబ్దిలో వంగీయుఁడగు జయదేవుఁడారంభించెను. బాల్యమునందే రవీంద్రుఁడు దాని నతిశ్రద్ధతోఁ జదివెను; తరువాత "విద్యాపతి" "చండీదాసు" మాతృభాషలో రచించిన గీతముల నేర్చెను ఇవియన్నియుఁ బ్రేమభక్తిని బురికొల్పునవి. చైతన్యుఁ డట్టి గీతముల నద్భుతముగఁ బాడుచు, భగవంతుని గీర్తించుచు, తన్మయుఁడగుచుండువాఁడఁట. రవీంద్రుఁ డీవైష్ణవమతమునందలి భక్తిసారము నంతను బాల్యమందే గ్రోలెను. తానప్పుడు భానుసింహుని పేరిట వ్రాసినగీతము లాప్రాచీన గీతములరీతివే.

తరువాత నాతఁడు రచించిన "సంధ్యాసంగీత్" లో భావస్వాతంత్ర్యము మెండు; ఇందు నవ్యకవిత కంకురార్పణ మైనది. అందుఁ గొన్ని గీతముల పేర్లు: 'ఆశలో నిరాశ,' 'నక్షత్రపుటాత్మహత్య,' 'శోకగీతి,' 'హృదయవిహీనయగు స్త్రీ,' ఇట్లే "ప్రభాత్ సంగీత్"లో 'విశ్వస్వప్నము 'జీవితనిత్యత,' 'ప్రకృతితోఁ బునస్సంయోగము.' వీనిలో రవీంద్రుఁడు తనవ్యక్తిత్వమును జిత్రించెను.

రవీంద్రుఁ డిరువదిమూఁడవయేట వివాహమాడెను; తరువాతఁ బదియేండ్లు 'మానసి,' "సోనార్ తారీ" మొదలగు గీతకావ్యముల రచిం

చెను. ఈశృంగారకావ్యముల మాధుర్యము విశ్వసాహిత్యమంతటిలోను సాటిలేని దందురు. వీనిలోఁ గొన్నిటి యాంగ్లానువాదమే The Gardener అనుపేరఁ బ్రశస్తిగాంచినది. రవీంద్రునిభార్య హఠాత్తుగ మరణించెను; అంతటితో నాతనితత్త్వము మాఱినది; ధార్మికభావములకే ప్రాధాన్యము హెచ్చెను. అప్పటి "ఖేయ," "నైవేద్య," "గీతాంజలి" మొదలగు ఖండకావ్యము లిట్టివే. ఈమూఁడింటిలోని కొన్నిగీతముల యనువాదమే ఆంగ్ల గీతాంజలి. "గీతాంజలి" భక్తిరసప్రధానము; ఇందీశ్వరప్రేమ మహానదివలె గంభీరముగఁ బ్రవహించుచుండును. జయదేవ, విద్యాపతుల పౌరాణికభక్తియు, చైతన్యునిపత్నీప్రేమయునిందుఁ గొంతపరిణామ మందినవి. కాని, రవీంద్రుని కుటుంబపు బ్రహ్మసమాజతత్త్వమీగీతములలోఁ జూపట్టును. ఇందు "అవతారస్తోత్రము" నకు రాధాదివర్ణనలకు బదులు 'పరిశుద్ధాస్తిక' మనఁబడు బ్రాహ్మధర్మ ముద్యోతితమగును. వీనిఁ జదువునప్పు డుపనిషద్భావములు భాగవతులభక్తిగీతములును యథాయోగ్యముగ మిళితమైనట్లు స్ఫురించును. కొన్నిటఁ బ్రపత్తిసిద్ధాంతసూచనయుఁ గలదు. అతివిశాలభావము లగుట విశ్వజనులకు నుదారత్వము బోధించును.

ఈపద్యవాఙ్మయముతోపాటు రవీంద్రుఁ డితరరచనల సాగించెను. ఆతనినాటకములును బ్రశస్తాయుతము లే. ఆతఁడుపదునాల్గవయేటనే "వాల్మీకిప్రతిభ" యను నాటకము వ్రాసెను: "వాల్మీకి దొంగలగుంపునకు నాయకుఁడై దోపిడులు చేయుచుండెను. ఆజట్టులో నొకఁడొకకుమారిని బలిమిమైఁ బట్టితెచ్చెను. ఆముగ్ధముఖమునందలి పవిత్రసుందరభావములచే వాల్మీకిహృదయమునఁబరిణామముకల్గెను. ఆతఁడుదయామయుఁడై, ఆమెను విడిపించి స్వస్థలమునకుఁబంపి, తోడిదొంగలకు నీతి బోధించెను. తరువాతఁ బ్రేమతోఁ గ్రీడించుపక్షులజంటలో నొకదానినొక వ్యాధుఁడు చంపుటఁ గాంచి కరుణామయుఁ డాయెను. ఆశోకము వాల్మీకినోటఁ బురుషోత్తముఁ గీర్తించు శ్లోకరూపమునొందెను. అంతట నద్భుత

స్ఫురణగల్గి వాల్మీకి రామాయణము రచించెను.' ఇది యందలి కథ. పదునాల్గేండ్ల లేఁబ్రాయమున నిట్టి సుందరపవిత్రకథను దననాటకవస్తువుగఁ గొనిన బాలకవి తరువాతఁ గవిసార్వభౌముఁడు కాఁజాలుట సహజమే. "శ్లోకత్వ మాపద్యత యస్యశోకః" అని కాళిదాసు నుడివినట్లు, నరులకుఁ గరుణరసము పవిత్రమై శాంతభక్తిభావము లుదయింపఁజేయు నని యీనాటకము సూచించును. ఆతఁడు తరువాత రచించిన "ప్రకృతిక్ప్రతిశోధ" యనునాటకములో నొకఁడు సన్న్యాసియై కేవలవిరాగిగ లోకసంబంధము లేకుండి, అటుపైఁ బ్రేమతత్త్వస్పర్శగల్గి, నిష్ఠురత్వము వీడి, లోకప్రేమపరుఁడైనట్లు చిత్రింపఁబడినది. నివృత్తిమార్గము పేర బైరాగులై ముక్కుపట్టుకొని మూలకూర్చొనుట జీవితమును వ్యర్థపఱుచును; జనులయెడఁ బ్రేమగల్గి లోకోపకార మొనర్చుటే నిజముగ నిశ్శ్రేయసకరమని రవీంద్రుని సూచన.

"కర్ణ ఒ కుంతీ" అనునాటిక ధ్వనిప్రధానమైనది. కౌరవయుద్ధమునకుముందు కుంతీదేవి కర్ణుని గలిసికొని, అతఁడు తనజ్యేష్ఠపుత్రుఁడగుటఁ దెల్పి, రాజ్యాధికార మిప్పింతుననియు, పాండవపక్షమునకు రమ్మనియుఁ గోరెను. తన్ను బాల్యమునుండియు నాదరించి గౌరవముతోఁ బోషించుచుఁ దన బలావేశముల నమ్మి తనకు జయ మొడఁగూర్చునను విశ్వాసముతో యుద్ధమునకు దిగిన దుర్యోధను నాస్థితిలో వీడుట మహాద్రోహమని యెంచి కర్ణుఁడు నిరాకరించును. ఈనాటికలోనికర్ణుని మానవత్వము, విశ్వాసబుద్ధి, 'సేవకుల' మంచును తృప్తియు రవీంద్రుని చే మనోహరముగ వర్ణితములు. రవీంద్రుఁ డింక ననేక నాటకముల రచించెను :—"రాజారాణి" (King of the Dark chamber) లో స్వార్థప్రేమ హానికరమని, "చిత్రాంగద" లోఁ బ్రకృతిసౌందర్య మతివిశిష్టమని, "మాలిని"లో నిజమైన ప్రేమపూజార్చనలవల్లఁ గాక ప్రేమవల్లనే కలుగునని, "విసర్జన్ " (Sacrifice) లో నధర్మముపై నాధారపడ రాదని, సూచించెను.

రవీంద్రుఁడు సుప్రసిద్ధములైన యాఖ్యాయికలంగూడ రచించెను. ఈచిత్రవచనరచనలనే 'నవల' లనుచున్నాము. "నౌకాడూబీ" (The Wreck) లో హిందూకుటుంబజీవిత మిప్పు డెట్లు ప్రకృతిని గోల్పోయి కృత్రిమస్థితిలో నున్నదో చిత్రించినాఁడు. "గోరా" లోని కథ విచిత్రము. 1857 లో సిపాయియుద్ధము జరిగినప్పుడు ఐరిషుజాతీయులగు పాశ్చాత్య దంపతు లొకశిశువును గని విడిచిరి. తల్లిదండ్రులులేని యా శిశువు నొక శిష్టహిందువుపెంచెను. ఆబాలుఁడు తాను హిందువనియే యెంచి, సనాతనాచారపరుఁడై, పాశ్చాత్యులయెడ సంఘసంస్కారులయెడ ద్వేషము వహించెను. ఇతరులసంపర్కమువలన నాతనిహృదయములోఁ గల్గిన మార్పులును, మానవప్రకృతికి సాంఘికసంబంధమునఁగల్గు పరిణామములును, మహాప్రజ్ఞతోఁ గవి వర్ణించెను. "ఘరే బాఇరే"† (The Home and the World) అను నవల యింకను సద్భుతమైనది. బెంగాలులో విప్లవోద్యమము వ్యాపించినపుడు, ధీమంతుఁడగు యువకుఁ డొకఁ డాంగ్లద్వేషపూరితుఁడాయెను. సహజముగ నతఁడు ప్రేమమయుఁడు, మృదుస్వభావుఁడు, సరళమనస్కుఁడు; కాని యీ ద్వేషోద్వేగమునఁబడెను; ఆంగ్లేయుల ద్వేషింపని తోడిభారతీయుల యెడఁ గూడఁ గినుక వహించెను. తుద కతఁడు పిస్తోలుతోఁ దనపూర్వమిత్రు నొకనిని జంపిన ట్లింపు వర్ణింపఁబడినది. దేశభక్తి చాల పవిత్రమైనను, అది ప్రేమతత్త్వముపైననే యాధారపడవలెను; పరులపై ద్వేషము కూడదు; ప్రేమతత్త్వమువీడి పాశ్చాత్యులయెడ ద్వేష మూనుట జాతిద్వేషములకు, శాఖావిభేదములకుఁ బరస్పరదారుణహింసాచర్యలకును గారణమగును. కాన హింసాతత్త్వము మనదేశీయుల కీస్థితిలో మహానర్థదాయకమని యాగ్రంథమునందలి భావము. ఇట్టినవల వ్రాసినందులకు వంగీయులలోఁ గొంద ఱాతనిపై నీసు వహించిరి. కాని జాతీయత పరిశుద్ధముగ విశ్వజనీనముగ నుండవలెనని నమ్మి, రవీంద్రుఁ డాసాంఘికోద్రేకమునకు వెఱువక, ఇంక నట్టిరచనల సాగించెను. రవీంద్రునికీరత్త్వమున కిదియొక గొప్పనిదర్శనము.

---

† దీనియాంధ్రానువాదము "ఇంటా-బయటా"

రవీంద్రుఁడు చిన్నకథలనుఁగూడ (Short stories) విశేషముగ రచించెను. "క్షుధితపాషాణ", "నళిని" మున్నగునవి ప్రసిద్ధిఁ జెందినవి. వీనిలోఁ గొన్ని యాంగ్లములోని కనువదింపఁబడి Hungry stones and other stories మొదలగు పేరులతోఁ బ్రచురింపఁబడినవి. ఈకథలు హృద్యములై రంజకములై, భావగర్భితములై, నీతిని ధ్వనింపఁజేయును. నిర్బంధమును శ్లేషమును లేకుండ బాలురకు రుచికరముగను, ఆకర్షకముగను విద్యనేర్పుట చాలముఖ్యమని, ప్రస్తుతపద్ధతి బాలురకు విద్యయం దాసక్తికి బదులు విరక్తినే గల్గించునని, ఆయన స్వానుభవమువల్ల గ్రహించెను. ఆభావముతో స్వభాషయందు బాలుర కాసక్తిగల్గించు చక్కని వాఙ్మయము సృజించెను. కొంతకాలము "బాలక్" అను మాసపత్త్రిక నడపెను. అనేకగ్రంథములలో బాలురమనోభావముల నతఁడు చక్కఁగఁ జిత్రించెను. ఆపుస్తకములలో "శిశు" ఆంగ్లములో Crescent moon అనుపేరఁ బ్రచురితమైనది.

విమర్శగ్రంథములనుఁ గూడ రవీంద్రుఁడు రచించెను. ఇందు "ఆలోచన్" "సమాలోచన్", "సాహిత్య", "ప్రాచీనసాహిత్య", ముఖ్యముగఁ జెప్పఁదగినవి. సంస్కృతమందలి వాల్మీకి, కాళిదాసు, భవభూతి, మొదలగు మహాకవుల గ్రంథముల ప్రాశస్త్యము వివరించుచు, ఇంతవఱకు వెల్లడికాని విశేషము లెన్నియో బయల్పరచి, సహేతుకముగ నిరూపించి యున్నాఁడు.

రవీంద్రుఁడనేకపత్త్రికలను స్వభాషలో నడిపినట్లు గమనించియున్నాము. సంపాదకధర్మమున నతఁడు వంగవాఙ్మయమున ముఖ్యగ్రంథములనన్నిటిని విమర్శించెను. అందౌదార్యము, సూక్ష్మదర్శిత్వము, ప్రతిభ గన్పఱచి యువకులకు విశేషప్రోత్సాహ మిచ్చినాఁడు.

ఆధ్యాత్మిక సాంఘికవిషయములఁగూర్చి రవీంద్రుఁడు తఱచుగఁ బత్రికలలో వ్రాయుచుండును. తనవిద్యార్థుల కాతఁడిచ్చిన యుపన్యాసముల సంపుటి "శాంతినికేతన్" అనుపేరఁ బ్రచురితమైనది. వీనిలోఁ

గోన్ని యాంగ్లమున Sadhana అనుపేర వెలువడెను. ఆతని మతభావములు మూఢవిశ్వాసములను దురాచారములను సహింపవు; ఆతఁడు బ్రాహ్మసమాజపు సంప్రదాయమునఁ బుట్టిపెరిగినవాఁడు. సర్వమతసముఁడు. అన్నిమతముల మూలసిద్ధాంతములను, వానియేకత్వమును, రాజా రామమోహనరాయలవలె గ్రహించినాఁడు. ప్రస్తుత హిందూమతభావములలోను, ఆచారములలోనూ, చాలసంస్కరణములు కావలెనని యాతనిదృఢవిశ్వాసము. బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, రామకృష్ణవివేకానందుల సిద్ధాంతములు మున్నగుప్రత్యేక సంస్కరణపక్షములలో నేవియు హిందువుల సామాన్యమతము కాఁజాల దనియు, ఇప్పటి హిందూమతములోనే క్రమముగ లోలోనఁ బరిణామముగల్గి, తద్ద్వారా హిందూసంఘము పూర్వపుఔన్నత్యమునకు రాఁగలదనియు రవీంద్రుని విశ్వాసము. ఆతనిగ్రంథములనిది తెల్లమగును. తండ్రివలెనేరవీంద్రుఁడును బ్రకృతిలీనమగు దేవమహాత్వమును గుర్తించును. తనగ్రంథములలో గిరులు,ఋష్యాశ్రమములు, అరణ్యములు, సస్యశోభితభూములు, గంగాపద్మాదినదులు, మున్నగువాని నతిమనోహరముగ వర్ణించెను. గ్రామజీవితమును "జీవనదేవతా" మున్నగుగీతములలోను వచనకథలలోను జక్కగఁ జిత్రించి, సానుభూతిఁ జూపెను. ప్రకృతికి నరునకు నన్యోన్యత కలదని చక్కగ నిరూపించినాఁడు.

రవీంద్రుని రచనలయందు దేశభక్తి తొలుకాడుచుండును. కాని రాజకీయపరుఁడుగాక, వాఙ్మయవృద్ధినే తన ముఖ్యవృత్తిగఁ జేసికొనెను. సంఘాభివృద్ధికి శాఖావిభేదము చేసి, అందొకదానికిఁ దక్కినవానితో సంబంధము లేదనుటకు వీలులేదు. ముఖ్యముగ, పరాధీనజాతిహృదయము, మనస్సు, సంకుచితమై యుండును; వక్రపరిణామము లేకుండ విశాలవృద్ధి గల్గింపఁ గోరు వాఙ్మయసేవకులు జాతీయ స్వాతంత్ర్యమునకై కృషిచేయకతప్పదు. వారందులకు సహాయకరమగు సాహిత్యమును సృజింపవలెను. అట్టిభావముతో రవీంద్రుఁడు యౌవనమున జాతీయో

ద్యమమునఁ బాల్గొని దేశసేవఁజేసి, జాతీయోత్సాహముగల్గించు నవ న్యాసములను, వ్యాసములను విరివిగఁ బ్రకటించెను. 1919 లో పంజా బుసంఘటనలోఁ దననిరసనము సూచించుటకు "సర్" బిరుదు వదలుకొ నెను. అంతకుముందే గొప్పజాతీయగీతముల నాతఁడు వ్రాసెను. ఆతని రచనలలో "స్వదేశి, సంకల్ప"మున్నగు కొన్నిగ్రంథములు మనదేశమున కార్థికరాజకీయస్వాతంత్ర్య మావశ్యకమని బోధించును. కాని జాతీయ భావములో స్వార్థపరతయు విదేశీయులపై ద్వేషము నుండరాదని రవీం ద్రునిభావము; అమెరికాలో నిచ్చిన Nationalism అను నుపన్యా సమున నీసంగతిని స్పష్టపఱిచెను. రవీంద్రుఁడు విశ్వజనీనవాది; ముఖ్య దేశములన్నిటికి వెళ్ళి ఆయాదేశములమధ్య జాతులమధ్య పరస్పరమైత్రి హెచ్చించుటకు యత్నించెను. తనయాత్రలందుఁ గల్గిన యనుభవముల వివరించుచు, లేఖల వ్రాసెను. అవి "యూరప్ ప్రవేశేర్ పత్రి" "రుసీ చిట్టి" మున్నగు పేర్లతో గ్రంథరూపముగఁ బ్రకటింపఁబడినవి.

తనరచనలలోను, ఉద్దేశములలోను రవీంద్రుఁడు, బంకించంద్రు నిశిష్యుఁడనని, చాలవఱకాతని ననుసరించినాఁడు. ఉభయులకుఁ గొలఁది భేదము మాత్ర మున్నది. ఇరువురివి యున్నతాదర్శములే; ఉభయులును బ్రజాక్షేమపరులే. రవీంద్రుఁడు నవ్యభావములఁ దెల్పుచుఁ దనయాత్మ వ్యక్తిత్వమును దనరచనలలో వివరించి ప్రదర్శించినాఁడు. నేఁటి "భావ కవిత్వము"నకాతఁడు జనకుఁడని చాలమందిభావన. వంగవాఙ్మయముననే కాక, మనదేశభాషలన్నిటి వాఙ్మయములలోను గ్రొత్తపంథ యేర్పడి నసంగతి నిజము. ఆంధ్రమున రాయప్రోలు సుబ్బారావు, మళయాళ మున వల్లత్తోళ్ నారాయణ మీనన్, హిందీలో జైనేంద్రకుమార్ మున్నగు కవు లీతనిచేఁబ్రభావితులై, నవ్యగ్రంథముల రచించిరి. కాని, ఆతనిమార్గ మనుసరించునట్లుచెప్పుచు బెంగాలీలోను మన యితరభాష లలోను వెలువడినవానిలోఁ జాలభాగ మాయునయుద్దేశప్రకారము లే

నట్లు తెలియుచున్నది. అనవసరనిర్బంధములులేక, రంజకమై, స్వతంత్రమై, కవిత్వము నవరసయుతముగ నుండదగుననియు, వెంటనే రసము గ్రహింపవీలై యానందమయమగుట దాని ముఖ్యప్రయోజనమని పూర్వాలంకారికులలోను గొందఱు చెప్పియున్నారు.* రవీంద్రునిరచనలు వాఙ్మయరంగమున స్వేచ్ఛావిహార మొనర్చుచున్నటులు తోఁచుటయు నిజమే. కాని యందున్న తాదర్శములు స్పష్టముగ గోచరించును. అవి సచ్చిదానందస్వరూపద్యోతకములై గంభీరమగు నాధ్యాత్మిక భావములతో నిండియున్నవి.

"నిరంకుశాః ఖలు కవయ స్సార్వపథీనాః" అనువచనము రవీంద్రునిశైలిసందర్భమున వర్తించును. కేవలము కళాత్మక మనఁబడురచనల లోను గొప్పయుపయుక్తత, సంఘక్షేమకరత్వము లీనమైయుండును. ఉదారమగు నైతికభావమును, ఔచిత్యమును, రవీంద్రుఁ డెన్నడును తప్పలేదు.

రవీంద్రునిశైలి లలితమైనది; ప్రాచీనప్రబంధములవృత్తములను, వానిమాత్రాసనియమముల నంతగా గమనింపఁడు. గ్రామ్యజీవనమునఁ బ్రచారముగల యక్షగానద్విపదాదుల చిత్రవిచిత్రములగు వృత్తముల నాతఁడు తనగీతముల కుపయోగించెను. "ముత్యాలసరము" బోలు కొన్నివృత్తముల భావానుగుణముగ మనోహరముగఁ గల్పించెను. క్లిష్టపదముల వాడక, మృదుమధురముగ వ్రాయును. తనవిశిష్టభావములఁ దెల్పుటకుఁ జాలవలసికు సంస్కృతపదముల నుపయోగించుచుండును.

---

"నియతికృతనియమరహితాం, హ్లాదైకమయీం, అనన్యపరతంత్రాం,
నవరసరుచిరాం నిర్మిత మాదధతీ భారతీ కవే ర్జయతి......
సకలప్రయోజనమౌళిభూతం సమనంతర మేవ
రసాస్వాదనసముద్భూతం విగళితవేద్యాంతరం ఆనందం"

(మమ్మటుని: కావ్యప్రకాశము)

ఆయన శైలి కుదాహరణములు:—

"భవ్యతార్ బందీమాఝే
శాంతినహిమాని."

(దురంతమగు నాశాసాంద్రప్రదాయికములనడుమ నాకు శాంతికలుగదు.)

"సంసారస్రోత జాహ్నవీసమ,బహుదూరే గేఛే సరియా పరిశుద్ధి ఊషరబాలుకధూసరమరురూప అఛేమరియే హృదయ అమార్ క్రందన్ కరే, మానవహృదయే మిళితే నిఖిలేర్ సాథే మహారాజపథే, చలితే దివస-నిశీథ"

(ప్రపంచప్రవాహము బహుదూరమున గంగానదివలె సాగిపోవు చున్నది. కాని యీ చవిటినేల నిర్జలమై, ధూళిరేగి మృతప్రాయమైనది. నాహృదయము మందటితోఁ గలిసి రాజపథములో, రేయింబవళ్లు మానవహృదయముతోఁ గలిసిపోవుట కాతురపడుచున్నది.)

"వైరాగ్యసాధనే ముక్తిసే ఆమార్ నయే" (జనసంపర్కములేని వైరాగ్యముద్వారా కల్గురీతి మోక్షము నాకు వలదు.)

"సార్థక్ జన్మ అమార్, జన్మేఛి ఎయి దేశే
సార్థక్ జన్మ మాగో తో మాయ్ భాలోవసే."

(ఈదేశమునఁ బుట్టుటచే మాజన్మ సార్థకమైనది. మాతృభూమి యగు మీకు మేలొనరించుటచే జన్మకు సార్థకత సిద్ధించును.)

దాండావ్ విశాలధరణీర్ తలే
ఘుసేగె లాభయలాజ్
బుఝిలే పారిను ఏజగతీ మాఝే
అమారో దయేఛే కాజ్
స్వదేశేర్ కాచే డాండాయ్ ప్రభాతే
కహిలాం జోడ్ కరే
ఏలహ, మాతః, ఏచిరజీవన్
సంపిను తోమారితరే.

(విశాలమైన పృథ్విపై నిలువగా, నాకు భయము లజ్జ పోయినవి. ఈజగత్తున నాకును గార్య మున్నదని బోధపడినది. ఉదయమున, స్వదేశమునకుఁ జేతులుజోడించి, 'తల్లీ, అందుకొమ్ము. ఈజీవితమంతయు నీసేవకే యర్పింతును' అనియంటిని.)

"జనగణ ఐక్యవిధాయక, జయహే భారతభాగ్యవిధాతా,
జయహే, జయహే. జయహే, జయజయహే
రాత్రిప్రభాతిల్ ఉదిత రవిచ్ఛవి, పూర్వ ఉదయగిరి భాలే
గాహే విహంగమ, పుణ్యసమీరణ నవజీవనరసధాలే,
తవకరుణారుణరాగే నిద్రితభారతజాగే
గాహే తవ జయగాధా.

(జనులకైక్యముఁగల్గించి, భారదేశీయులకు క్షేమంకరుఁడవగునో ప్రభూ ! తెల్లవారి, తూరుపున సూర్యోదయమై, పక్షులు పాడుచున్నవి. నీదయచే మనోహరమైన వాయువు ప్రాణప్రదమై వీచుచున్నది. నిద్రించియుండిన భారతీయులు మేల్కాంచి నీజయము పాడుచున్నారు.)

నైవేద్య.

చిత్త యథా భయశూన్య, ఉచ్ఛ యథా శిర్,
జ్ఞాన యథా ముక్త, యథా గృహేర్ ప్రాచీర్
అపన్ ప్రాంగణతలే దివసశర్వరీ
వసుధారే రాఖేనాఇ ఖండక్షుద్రకరి,
యథా వాక్యహృదయేర్ ఉత్సముఖ్ హతే
ఉచ్ఛ్వసియా ఉఠే, యథా నిర్వారితస్రోతే
దేశేదేశే దిశేదిశే కర్మధారాధాయ్
అజస్ర సహస్రవిధచరితార్థతాయ్;
యథా తుచ్ఛ ఆచారేర్ మరువాలురాశి
విచారేర్ స్రోతఃపథ ఫేలేనాయిగ్రాసి,
పౌరుషేరే కరేని శతధా; నిత్య యథా

తుమిసర్వకర్మచింతా ఆనందేర్ నేతా,
నిజహాస్తే నిర్దయ అఘాతకరి, పితః
భారతేరే సేయ స్వర్గే కరో జాగరిత్."

(మనసు నిర్భయమై, తలయెత్తుకొనియుండి, జ్ఞానముస్వతంత్రమై రాత్రింబవళ్లు అంతర్భేదములచే సంఘమున కేర్పడిన భిన్నభిన్నత పోయి, స్వేచ్ఛతో హృదయమునుండియే మాటాడుచు, అన్నిప్రాంతములలోను గార్యశూరత సర్వవిధముల నేర్పడి, తుచ్ఛదురాచారపుటెడారులలో విమర్శప్రవాహ మింకిపోకుండి, దృఢత్వ మేర్పడి, సర్వకర్మభావములు నీచేనడుపఁబడునట్టిస్వాతంత్ర్యస్వర్గమునకునాదేశమును మేల్కొలుపుము). రవీంద్రుఁడు స్వయముగ నాంగ్లమున రచించిన దీనియనువాద మింకను మనోజ్ఞము.

"Where the mind is without fear and the head is held high; where knowledge is free;

Where the world has not been broken up into fragments by narrow domestic walls;

Where words come out from the depth of truths;

Where tireless striving stretches its arms towards perfection;

Where the clear stream of reason has not lost its way into the dreary desert sand of dead habit;

Where the mind is led forward by thee into ever widening thought and action:—

Into that heaven of freedom, my Father, let my country awake."

రవీంద్రునిభావము లత్యుదారములు. శైలి సంస్కృతపదభరిత మైనను లలితమై మనోజ్ఞముగ నుండును. ఆంగ్లగ్రంథములభావములు శైలియు నద్భుతములని యాతనిరచనలవల్ల నాంగ్లవాఙ్మయమున నొక

నవయుగమేర్పడినదని సుప్రసిద్ధపాశ్చాత్యవిమర్శకులు లేకగ్రీవముగ నంగీకరించియున్నారు. కేవలభిన్నభాషలలో నిట్లఖండప్రజ్ఞను విశేషప్రశస్తిని గాంచుట రవీంద్రునకే చెల్లినది.

ఆఙ్గ్లరచనలచే నిట్లమృతకీర్తియు, తనగ్రంథములవిక్రయమున లక్షలకొలఁది ద్రవ్యమును సమకూరినను, రవీంద్రునకు నేటికిని మాతృభాషయందే విశేషాభిమానము. ఆయన తనరచనలనన్నిటిని ముందు స్వభాషయందు వ్రాసెను. వంగీయులమధ్య నెప్పుడును బంగాళీలోనే యుపన్యసించును. తనయవిచ్ఛిన్నసేవచే మాతృభాషకేగాక భారతదేశమంతటికిఁగూడ లోకమంతటను గౌరవస్థానము గల్గించెను.

రవీంద్రుని ముఖ్యగ్రంథములు ఫ్రెంచి, జర్మను, జపానీ, మున్నగు విదేశభాషలలోని కనువదింపఁబడినవి. హిందీ, గుజరాతీ, మరాటీవంటి మనదేశభాషలలోనికిఁ దర్జుమాయగుటలో నాశ్చర్యములేదు. విద్యాబోధఁగూర్చియు రవీంద్రునిభావములు స్వతంత్రములే. శైశవమం దతని కప్పటిపాఠశాలల బోధనపద్ధతులు రుచింపలేదు. ఇప్పుడు, అధికారరీత్యా నిర్బంధముగ సాంప్రదాయికవిషయములను బాలురమనస్సులోని కెక్కించుచున్నారు. బాలురు విధిలేక వానినివల్లించి జ్ఞప్తిలోనుంచుకొనుచున్నారు. అట్లుగాక శిశుహృదయమును, మనస్సును వికసింపఁజేసి, వారి కాయావిషయములం దభిరుచిని, స్వతంత్రాలోచనశక్తిని వృద్ధిచేయుట మొదటికర్తవ్యమని రవీంద్రునియభిప్రాయము. "శిశు" అను తనగ్రంథమున శిశుహృదయ మెట్లుక్రమవికాసమునొందునో కవిసూచించినాఁడు. 1905 నుండియు జాతీయపద్ధతులను బాలురకు విద్యాబోధఁజేయించుటకాయన కలకత్తా "జాతీయశిక్షాపరిషత్తు" లో సభ్యుఁడై, ఆసందర్భములలో నప్పటియువకులలో గొప్ప ప్రచారముచేసెను. జాతీయవాఙ్మయమెట్లుండవలెనో, ఆయన గొప్పసూచనలఁ జేయుచు వ్యాసములు వ్రాసెను. ఇవి "సాహిత్య" "సమాలోచన" అను పేరులతో గ్రంథములుగఁ బ్రచురితములైనవి.

నవ్యభావములతో నాదర్శప్రాయమగు విద్యబోధించుట కాయన స్వీయముగ బోల్పురములో శాంతినికేతనపాఠశాలను జాలయేండ్లు నడిపి, దానిని గొప్పయాదర్శకళాపరిషత్తుగఁ జేసెను. నోబెలు బహుమానపుసొమ్మును, తద్గ్రంథవిక్రయపుసొమ్మును, అమెరికా మున్నగు చోట్ల తనయుపన్యాసములయాత్రలో వసూలైన ధనమంతయుఁగూడ రవీంద్రుఁడు విశ్వభారతికే వినియోగించెను. బాలురమానవత్వమును వృద్ధిచేయుట కనువగు పద్ధతులే చిన్నతరగతులనుండి పట్టభద్రులు చేయుపరిశోధనలవఱకును, శాంతినికేతనమున నేర్పఁబడుచున్నవి. అందు భారతీయభాషలన్నిటిలో సాహిత్యము, సంగీతము, చిత్రలేఖనాదికళలు నవ్యవిజ్ఞానము, వివిధశిల్పవిద్యలు, చేతిపనులుగూడ నేర్పఁబడును. ఆయా సంస్కృతులమధ్య సమన్వయమునకై చీనా జపాను వగైరాలవాఙ్మయ శాఖల నేర్పఱిచి, అందుఁ బ్రత్యేకకృషి నేర్పఱుచుచున్నాఁడు. ప్రపంచమం దన్నిభాషలలోని యున్నతవాఙ్మయమును విశ్వభారతిలో సేకరించి, తగుబోధకుల నేర్పఱిచియున్నారు. ఇట్లే ముస్లింసంస్కృతివంటి విషయములఁగూర్చియుఁ బరిశోధనలు జరుగుచున్నవి. దేశసౌభాగ్యమునకై గ్రామపునర్నిర్మాణపద్ధతులు నేర్పఁబడుచున్నవి. గృహపరిశ్రమలోను, ఆరోగ్యపద్ధతులలోను, నవీనవ్యవసాయపద్ధతులలోను, యువకుల కచ్చటశిక్షణమిత్తురు. ఈశాఖకు 'శ్రీనికేతన' మనిపేరు. నీతివర్తనమలవఱచుటకును, ధార్మికబోధమునకును యుక్తమగు నిబంధనలుకలవు.

రవీంద్రుఁ డపురూపమగు సంగీతసంగతులను, చిత్తరువులను స్వీయముగఁ దయారుచేసి, ఆయాకళలలోఁ బ్రత్యేకనిపుణులనుగూడ నాశ్చర్యముగ్ధులఁజేసినాఁడు. ఆతనిగంభీరరూపమునకుఁదోడు,రవీంద్రుని కంఠస్వరమును లలితమై సమ్మోహనకరముగ నుండును. బంగాళీగీతముల నాతఁడు స్వీయముగఁ బాడునప్పుడు, వానియర్థ మెఱుఁగని పాశ్చాత్యులుగూడఁ బరమానందముతో వానిరుచి నాస్వాదింతురు. కవిత్వవిశేష

మునను, వివిధతలోనేగాక విస్తీర్ణతలోను, రవీంద్రుని కెన యగువారు చాలనరుదు. రవీంద్రునికిఁ గవిసార్వభౌమబిరుద మెల్లవిధముల సార్థక మైనది. "కవులు తాత్త్వికులు కారు ; తత్త్వవేత్తలు కవులు కానేరరు" అను సూక్తి చాలవఱకు నిజమైనను, రవీంద్రుని కిది యన్వయింపదు. ఆతనిగ్రంథములలోఁ దత్త్వవేదాంతములసూచన విశేషముగ నుండును. ఆతఁడు గొప్పయాదర్శవాది. దేశభక్తి, ఆత్మదర్శనము, ఆత్మానుభవము, విశ్వప్రేమ, పరోపకృతి యాతనిగ్రంథము లుద్ఘోషించు సందేశములు.

మధ్యకాలపుఁ గ్లిష్టతార్కిక చర్చలరీతి శల్యపరీక్ష లాయనకు రుచింపలేదు ; సాంప్రదాయికమగు మూఢాచారములను లేనిపోని విభేదములనువదలి, మానవులుతమలోని పశుత్వమును బూర్తిగఁ ద్యజించి, అంతర్యామి ప్రతిహృదయములోను ప్రేమించు దైవత్వమును వికసింపఁ జేసికొనవలెనని యాయన కోరును. అట్టి మతబోధకుఁడగు కబీరుని గీతముల నూఱింటిని రవీంద్రుఁ డాంగ్లీకరించినాఁడు.

డెబ్బదియెన్మిదేండ్ల వయస్సున్నను, రవీంద్రుఁడు యువకులకంటె నధికోత్సాహముతోఁ బనిచేయుచుండును. మహావర్చస్వి ; ధీశక్తి, ఔదార్యము, స్వార్థరాహిత్యము, ప్రజాక్షేమదృష్టియునుగలవాఁడు.

" ఆకారసదృశప్రజ్ఞః, ప్రజ్ఞయా సదృశాగమః
ఆగమై స్సదృశారంభః ప్రారంభసదృశోదయః॥"

అనికాళిదాసు దిలీపునిఁగూర్చిచెప్పిన శ్లోకము రవీంద్రునియెడఁ బ్రత్యక్షముగ సార్థకమైనది.

---

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

## (విమర్శన సమాధానము)

విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు.

(పిఠాపురము, 15—12—1939.)

---

(౧౧, ౧౨, ౧౪, ౧౫, ౧౬, ౧౭, ౨౨, ౨౬, ౩౮, ౪౩, ౪౪, ౪౬, ౫౦ ఆక్షేపములు సమాధానములు ముఖ్యముగాఁ బరిగింప విద్వాంసులు ప్రార్థితులు.)

కళాప్రపూర్ణ, రావుసాహేబు, శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు ప్రతిభ 3 సంపుటి 2, 3, 4, సంచికలలో శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువుపై నొక విమర్శనము వ్రాసినారు. అందు రెండవ సంచికలో వ్రాసినవిషయము ఆనిఘంటు సంపాదకులపై వ్రాయఁబడుట చేతను, సమాధాన మీయఁదగిన యంశమేమియు లేకుండుటచేతను దానికి సమాధాన మిచ్చుట మాని, మూఁడు నాలుగు సంచికలలో వ్రాసినదానికి మాత్రమే సమాధానము వ్రాయఁదలఁచితిని. పంతులుగారు తమ విమర్శనములోఁ జాలచోట్ల సంపాదకులతోపాటు పండితులనుగూడఁ దమ యాగ్రహమునకు గుఱిచేసినారు. మఱియు నిఘంటు రచనా విధానమే సూర్యరాయనిఘంటువువారికిఁ దెలియదనియును, అవ కతవక నిఘంటువును వారు రచించినా రనియును వ్రాసినారు. తెనుఁగు గ్రంథములలోనిపదములు, పంచకావ్యములలోని పదములు, ఆప్తే. ని. కౌముదులలోనిపదములు, అనేకములు సూర్యరాయనిఘంటువులో లేవని యాక్షేపించినారు. ఇవియే కాక మఱికొన్ని యాక్షేపములు గూడఁ జేసినారు. పై యాక్షేపములు ప్రమాదభూయిష్ఠములుగా నున్నవి. వీరి యాక్షేపములును వానికి నేను వ్రాసినసమాధానములును సావధానముగాఁ బరికించువారికి కీవిషయము గోచరింపఁగలదు. పంతులు

గారి విమర్శనములోఁ గలమంచివిషయములను నిఘంటుకర్తలు కృతజ్ఞతాపూర్వకముగా స్వీకరింతురు.

౧. ఆక్షే:—ఆంధ్రకవులు ప్రయోగించిన సంస్కృతశబ్దములలో వీరు విడిచినవి ముందుగా కొన్ని ఉదాహరిస్తాను. 'అర్పణమ్, సమర్పణమ్' అని నపుంసకములుగా ఆ త్రైనిఘంటువులో ఉన్నవి. కాని తెలుగు కవులు (సంస్కృతకవులుగూడా) స్త్రీలింగములుగా ఇట్టిశబ్దములు ప్రయోగించడము అరుదుకాదు ... చ ... సమర్పణసేసె ... భార. ఆది. ౨ ౪౦. ఉ...సహస్రాక్షుఁడు భీమలింగమున కర్పణచేసిన... భీమ. ౫ ౩౦. సీ...పర్యుషితమును నర్పణసేయఁజాల ... పాండు. ౪. ౧౬౬. ఉ...ప్రాణములర్పణసేతు...శశాంక. ౩. ౮౪. "అర్పణ" సాధువు అని ఇకను అంగీకరిస్తారా? అంగీకరించరా? ఇట్లే ఆ త్రైలోను శబ్దరత్నాకరములోను నపుంసకమని వ్రాసి ఉన్న 'వర్తనమ్' అనుశబ్దమును మహాకవులు 'వర్తన' అని ప్రయోగించి ఉన్నారు. బోలెడు ప్రయోగాలున్నవి...ఇట్టిది లేకుంటే ఆంధ్రనిఘంటు వవుతుందా?

(౧౮౯, ౧౯౦, ౧౯౧, పా.)

సమా:—దానార్థకములగు 'అర్పణా, సమర్పణా' శబ్దములు కల్పద్రుమము, వాచస్పత్యము, లఘుశబ్దార్థసర్వస్వము, విల్సమ్సు, వైజయంతి, కేశవము, మేదిని, అమరము, మున్నగుసంస్కృతనిఘంటులలో లేవు. పంతులుగారిచ్చినప్రయోగము లన్నింటిలోను 'అర్పణచేయు, సమర్పణచేయు' అనియే యున్నది కనుక 'అర్పణము + చేయు, సమర్పణము + చేయు' అనియుండఁగా 'ము' వర్ణకము లోపించి'అర్పణచేయు, సమర్పణచేయు' అయిన దని గ్రహింపవలెను. ఇవి 'నిరాకరణచేయు' మున్నగువానివంటివి.

క. మన్ననఁ దోఁచంగి నిను నీ
యన్న నిరాకరణచేసి యాఁడెనో నీ కా
యన్నవయి భక్తి దోలఁగెనో... ఉ. రా. ౬. ౨౬౦

ఈప్రయోగమునుబట్టి 'నిరాకరణా' అను స్త్రీలింగశబ్దమున్న దనుట తప్పు. 'నిరాకరణము + చేయు' అనునప్పుడు మువర్ణలోపము వచ్చిన దనియే చెప్పవలయును. సూర్య. ని. లో ఇట్టివి 'చేయు' శబ్దమునఁ జూపఁబడియున్నవి. 'వర్తన' ఇది చరిత్రాదులలోనిది. కనుకనే 'వర్తనము' అను రూపాంతరముకూడ, భార. అశ్వ. ౪. ౨౧౭. ఉత్తర హరివంశము. ౨. ౨౦౨. మున్నగుచోట్లఁ గలదు. ఈయర్థమున స్త్రీలింగము కల దనుట సర్వగ్రంథవిరుద్ధము.

౨ ఆక్షే:—'అనుగమ్యమానుఁడు' ఇది లేదు. (౧౯-౨ పొ.)

సమా:—ఇది 'గమ్యమానము. వి ణ.' లో గతార్థము. సోపసర్గములకడ నన్నిరూపములు చూపకున్నను, అనుపసర్గములకడఁ జూపఁబడును గనుక వానిలో గతార్థము లగును.

౩. ఆక్షే:—ఆ స్తై. ని. లోని 'అంగనాజనులు' లేదు. 'అంగనాప్రియము' మాత్రమే సూర్య. ని. లో ఉన్నది. (౧౯-౨ పొ.)

సమా:— 'అంగనాజన' శబ్దము 'అంగనా, జన' శబ్దములలో గతార్థము. 'అంగనాప్రియము' నకు 'అశోకము' అనువిశేషార్థముండుటచే గ్రహించినారు. ఇట్టి యల్పవిషయములనుగూడ గ్రహింపక విమర్శకులు ప్రశ్నించుట యాశ్చర్యకరము.

౪. ఆక్షే:—'అశ్రుతపూర్వము, అదృష్టశ్రుతపూర్వము' ఇవి లేవు. 'అదృష్టపూర్వము' వ్రాసినవారు ఇవి ఎందుకు విడిచినారు?

(౧౯-౨ పొ.)

సమా:—ఇట్టి సఞ్సమాసపదములనన్నిటిని గ్రహింప నక్కఱ లేదనియును, సూర్య. ని. లోని 'అ. సం. అవ్య' లో నివి యన్నియు గతార్థములే యనియును నేను 'భారతి' ప్రమాథిభాద్రపదమాస సంచికలో వ్రాసిన 'సూర్యరాయాంధ్రనిఘంటు విమర్శపరామర్శము' న నిరూపించి యున్నాను. కనుకనే యిక్కడ మరల వివరింప లేదు. దిక్ప్రదర్శనార్థము 'అదృష్టపూర్వము' వంటివి సూర్య. ని. లోఁ గొన్ని చూపఁబడినవి.

౭. ఆక్షే:—అవలుంచించు.

వ. మఱియు నొక్కజట యవలుంచించి వేల్చిన.

భార. ఆర. 3. ౨౮౯.

ఇది సూర్య. ని. లో లేదు. (౧౯-౨ పా.)

సమా:—ఇక్కడ వ్రాఁతప్రతులలో

వ. మఱియు నొక్కజట తెంచి వేల్చిన.

(N 11-5-6 ఓరియంటల్ లైబ్రరీ.)

వ. మఱియు నొక్కజట యవలంబించి.

(N 14-2-30. ,, ఈపాఠము చాలప్రతులలోఁ గలదు.)

ఇట్లు భిన్నభిన్నపాఠములు కనఁబడుటచేతను, మాచూచిన వ్రాఁతప్రతులలో 'అవలుంచించు' కనఁబడకపోవుటచేతను, 'తెంచి' అను పాఠమే సరిగానొప్పు నని తలఁచి యిది త్యజింపఁబడినది.

౮. ఆక్షే:—'అసమేక్షణుఁడు, అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి' లేవు. (౧౯-౨, ౧౯-3 పా.)

సమా:—'అసమేక్షణుఁడు' 'అసమ, ఈక్షణ' శబ్దములలో గతార్థము. ఇట్టిదేయగు 'అసమనయనుఁడు' ఇచ్చియుండుటచేత 'అసమేక్షణుఁడు' ఈయకున్నను దోషములేదు. ఈవిషయము 'భారతి'లోని నా వ్యాసమున నిరూపించియున్నాను. 'అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి' బహువ్రీహిలో (ఇది-తద్గుణసంవిజ్ఞానబహువ్రీహి, అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి-అని ద్వివిధము.) అని వ్రాసి యుదాహరణాదులు చూపియున్నారు. కనుక దానిలో నిది గతార్థము.

౯. ఆక్షే:—'ఆర=అంగారకుఁడు'

కం. మందారార్కాలయములు... కు. సం. ౮. 3౭3.

ఇది సూర్య. ని. లో లేదు. (౧౯-3 పా.)

సమా:—పైయర్థమున 'ఆర' శబ్దము స్త్రీలింగము కాదు. కనుక 'ఆరము' అనురూపముతో సూర్య. ని. లో గ్రహింపఁబడియే

యున్నది. పంతులుగారు లేదనుటకుఁ గారణము తెలియదు. ఇట్లే "ఉప లశబ్దము స్త్రీ అన్నారు. పుం. కూడాను" (౨౦౧ పా.) అని పంతులు గారు వ్రాసినారు. కాని "ఉపలము. పుం" కూడ సూర్య. ని. ౨౬౨. పొరటలో గ్రహింపఁబడియే యున్నది. ఇట్టి ప్రమాదములు వీరివిమర్శ నమునఁ జాలచోట్లఁ గలవు.

౮. ఆక్షే:—"అవాఙ్మానసగోచరము" శివతత్త్వ. ౧౯౨. భార. శాంతి. ౫. ౯౦. దీనికి నిర్ధారకములు. ఈశబ్దము సూర్య. ని. లో లేదు. "అవాఙ్మనసగోచరము" మాత్రమే ఉన్నది. సంస్కృతపండితులు "వాఙ్మ నసమ్, అవాఙ్మనసమ్" మాత్రమే సాధుశబ్దాలంటారు. (౧౯3 పా.)

సమా:—వ్యాకరణము చదువుకొనిన సంస్కృతపండితులెవరును "అవాఙ్మానసము, వాఙ్మానసము" మొ. వానిని దప్పు లనరు. "అవాఙ్మ నోగోచరము, వాఙ్మనోగోచరము" మొ. వానిని మాత్రమే తప్పు లనె దరు. 'వాక్, మన' శ్శబ్దములకు సమాసము వచ్చునపుడే 'అచతురవిచ తు' రేత్యాది సూత్రమునఁ బాణిని 'వాఙ్మనస' అని నిపతించెను గనుక 'వాఙ్మనోగోచరము' మున్నగునవి తప్పులు. 'వాక్, మానస' శబ్దముల కు సమాసము వచ్చి 'వాఙ్మానసమ్' అగుట కెట్టి యాక్షేపమును లేదు. కనుకనే విశేషము గల "అవాఙ్మనసగోచరము" సూర్య. ని. లో గ్రహిం పఁబడినది. ఎట్టివిశేషమును లేని "అవాఙ్మానసగోచరము" గ్రహింపఁ బడలేదు.

౯. ఆక్షే:—'ఏకమతి, ఏకవాక్యత' లేవు. (౧౯3 పా.)

సమా:—'ఏక, మతి; ఏక,వాక్య' శబ్దములలో గతార్థములు. ఇట నెట్టివిశేషార్థమునులేదు. ఇట్టినిర్విశేషసమస్తశబ్దముల నన్నింటి నీయ వలయు ననుట సమంజసము కాదని 'భారతి' లోని నావ్యాసమున నిరూ పించియున్నాను.

౧౦. ఆక్షే:—"ఆబాలవృద్ధము, ఆబాలగోపాలము, ఆమూల చూడము" లేవు. వీనికి నిర్వ. 3.౭౯, ౮.౬౭, విక్ర. ౭.3౯. మొ. ప్రయోగములుకలవు. (౧౯3 పా)

సమా:—సూర్య. ని. లోని "ఆ. సం. అవ్య"లో నిట్టివి చూపఁబడినవి. కనుక వీనిని ప్రత్యేకముగా గ్రహింప నక్కఱ లేదు. ఇవియే గాక యిట్టి వింక నెన్నియున్నను దానిలో గతార్థము లగును.

౧౧. ఆక్షే:—'అప్సరలు' శ్రీనాథుడే ప్రయోగించినాడు'అప్సర' తప్పంటారు సంస్కృతపండితులు, అమరవ్యాఖ్యలు చదువనివారు. క్షీరస్వామి (గొప్పవ్యాఖ్యాత) "అప్సరా ఇతి దర్శనాత్" సాధువు అన్నాడు. ప్రాకృతములో 'అచ్ఛర' ఎలాగైనది? శిష్టులు 'అప్సరా' అంటూ ఉంటే, అశిష్టులు 'అచ్ఛరా' అన్నారు. భీమఖండము చూడండి. ఉ... సహా, స్రష్టుఁడు భీమలింగమున కర్పణచేసినయప్సరల్ విరూ, పాక్షు నెనుర్గొనం జనిరి... భీమ. ౫. ౩౦. (౧౯౮ పొ.)

సమా:—నేనీసందర్భమున క్షీరస్వామివ్యాఖ్య మున్నగుననేకామరవ్యాఖ్యలు చదివినాను. కాని పంతులుగారు వ్రాసినట్లు 'ఆకారాంతమగు-అప్సరా'శబ్దము కల దన్న వ్యాఖ్య యొక్కటియుఁ గానఁబడలేదు. ఇఁక "క్షీరస్వామి 'అప్సరా ఇతిదర్శనాత్' సాధువు అన్నాడు" అని పంతులుగారు వ్రాయుట సరియగునో కాదో కొంచెము పరిశీలింతము.

"స్త్రియాం బహుష్వప్సరసః" అమరము. "అద్భ్యః స్సృతా- అప్సరస ఇతి-ఏకాపి శబ్దశక్తిస్వాభావ్యాత్. అప్సరా ఇతి దర్శనా త్ప్రాయికం బహుత్వమ్" క్షీరస్వామివ్యాఖ్య. అమరమున 'అప్సర' శ్శబ్దము బహువచనాంతమని చెప్పినాఁడు గదా! ఒక్కయచ్ఛరను బహువచనాంతమగు నీ శబ్దమెట్లుచెప్పును? అని ప్రశ్నించుకొని యీశబ్దమున కట్టిశక్తి గలదు గనుక నేకవ్యక్తిని గూడ బహువచనాంతమే చెప్పును అని మూలమును సమర్థించి (అనది చ. అష్టా. ౮. ౪. ౪౭. సూత్రభాష్యమున) అప్సరాః' అని యేకవచనాంతప్రయోగముకలదు గనుక నమరుఁడు చెప్పిన బహుత్వము ప్రాయికము-అని క్షీరస్వామి వ్రాసినాఁడు. "అప్సరా ఇతి" అనుచోట సంధికార్యములు చేయుటచేత విసర్గలోపము వచ్చినది. ఆకారాంతమే యైనచో 'అప్సరేతి' అనియుండ వలయును. మఱియు నిక్కడ

'అప్సర' శ్శబ్దము సకారాంతమే కాక, ఆకారాంతముకూడఁగలదా? లేదా? యనువిచారణయే లేదు. పంతులుగారు పైవ్యాఖ్యనుబట్టి ఆకారాంతమగు "అప్సరా"శబ్దముకలదని సిద్ధాంతీకరించుటపొరపాటు. మఱియు "సూ. స్రర్తే రప్సూర్వ్వాదసిః. ఉణాది. ౪. ౭౭౩. అప్సరాః ప్రాయేణాయంభూమ్ని. అప్సరసః." అనికౌముదిలోను, అమరసుధమొదలగునమరవ్యాఖ్యలలోను "అప్సరస్స్వప్సరాః ప్రోక్తా సుమనా స్సుమనస్స్వపి" అని ద్విరూపకోశము లోను గలదు. "అస్య(=అప్సరశ్శబ్దస్య) శుభంయూశబ్దవద్రూపమితి ముకుటోక్తం చింత్యమ్. అప్సరశ్శబ్దస్య సాంతత్వాత్" అని సుధావ్యాఖ్యలో నప్సరశ్శబ్దము సాంతమే యనికూడఁ గలదు. కనుక వైదికోదాహరణముతో వాచస్పతి యిచ్చిన 'అప్సరా' శబ్దము వైదికమేకాని లౌకికము కాదు. ఆప్తేయిచ్చిన "అనప్సరేవ ప్రతిభాసి" విక్రమో. ౧. అంకములో "అనప్సరా ఇవ మే ప్రతిభాసి" అనుపాఠము కొన్ని గ్రంథములలోఁ గనఁబడుచున్నది. తద్వ్యాఖ్యాతలు కూడఁ బై పాఠమునే గ్రహించినారు. కావున నిదియు ఆకారాంతము లౌకిక మనుటకు సాధకము గాదు. "అప్సరాసు చ యా మేధా గంధర్వేషు చ యన్మనః" ఇత్యాద్యనేకస్థలములలో వేదమున ఆకారాంతము కలదు. లోకమునఁ గలదనుటకు నిర్ధారకప్రమాణము కనఁబడ లేదు. వైదికమగు 'అప్స' శబ్దము నాధారముగాఁ జేసికొని 'అప్సరా'శబ్దమునకు వాచస్పతి వ్రాసిన వ్యుత్పత్తికూడ నిది వైదికమనియే సూచించుచున్నది. మహావిద్వాంసులును మిక్కిలిపరిశీలకులు నగురంగాచార్యులుగా రీశబ్దము నాకారాంతముగాఁ దమనిఘంటువున నీయకుండుటయు మూలనిఘంటువులలో లేకుండుటయుఁ గూడ నిది లౌకికము కాద నుటకే సాధకములు. ఇట్టి వైదికశబ్దమును శ్రీనాథుఁ డెట్లు ప్రయోగించును ? కావుననే సూర్య. ని. ఈశబ్దమును గ్రహింపలేదు.

ఇఁక సంస్కృతమున ఆకారాంతమగు 'అప్సరా' శబ్దము లేకున్నచోఁ బ్రాకృతమున 'అచ్ఛరా' ఎట్లైనది ? అను పంతులుగారి ప్రశ్నమునకు సమాధాన మిచ్చెదను.

ప్రాకృతవైయాకరణులు, ప్రాకృతనిఘంటుకర్తలు, సంస్కృతనాటకవ్యాఖ్యాతలు మున్నగువా రందఱును సకారాంత మగునప్సరశ్శబ్దము నుండియే "అచ్ఛరా" వచ్చిన దని వ్రాసినారు. చూడుఁడు. హేమచంద్రుఁడు తనప్రాకృతవ్యాకరణమున "సూ. ఆయురప్సరసోర్వా. ౪.౧.౨౩. ఏతయో ర న్త్యవ్యంజనస్య సో వా భవతి. ఉదా:—అచ్ఛరసా, అచ్ఛరా. సూ. హ్రస్వాత్ థ్యశ్చత్సప్సా మనిశ్చలే ... ఉదా:-అచ్ఛరా" అని వ్రాసినాఁడు. ప్రాకృతసర్వస్వమునఁ గూడ 'అప్సరశ్శబ్దభవము 'అచ్ఛరా' అని కలదు. మఱియుఁ బ్రాకృతమంజరిలో "శ్చత్సప్సాంఛః" అను సూత్రమున "శ్లో. శ్చత్సప్సానాం త్రయాణాంచ ఛకారాదేశ ఇష్యతే, పశ్చాత్తు త్సాప్సరాశ్చేతి పచ్ఛాకుచ్ఛాచ్ఛరాక్రమాత్" అని సకారాంతమునకే 'అచ్ఛరా' అగునని కలదు. శాకుంతలము విక్రమోర్వశీయము మున్నగు సంస్కృతనాటకములలో 'అచ్ఛరా' అను ప్రాకృతరూపము కలదు. వానిఛాయలలోను వ్యాఖ్యలలోను 'అప్సరస్' శబ్దమే దానికి మూలరూపముగా నున్నది. "మేణఆ ణామ అచ్ఛరా" ప్రాకృతము. "మేనకా నామాప్సరాః" ఛాయ. శాకుం. ౧. ౩౧ పా. విక్రమో. ౧. ౨౮.

"Childers" పాళీనిఘంటువులోఁ గూడ 'అచ్ఛరా' శబ్దము 'అప్సరస్' శబ్దభవ మనియే గలదు. వస్తుస్థితి యిట్లుండఁగాఁ బంతులుగారు సంస్కృతమున 'అప్సరా' శబ్దము లేకున్నఁ బ్రాకృతమున 'అచ్ఛరా' కాదని వ్రాయుట సరి కాదు.

భీమఖండములోని 'అప్సరల్' ముద్రణప్రమాదపతితము. 'అచ్ఛరల్' అనియుండవలయును. అట్లుకాక 'అప్సరశ్శబ్దమునకే 'అప్సరలు, అప్సరసలు, అప్సరస్సులు' అను మూఁడు తత్సమరూపములు కలవని చెప్పుటకైనను 'అప్సర' అను దానికి నిర్ధారకప్రయోగములు కనఁబడలేదు. ఆంధ్రవ్యాకరణములలోఁగూడ నీరూపము సాధింపఁబడ లేదు. పై భీమఖండమునఁబోలె "వ...దివ్యాప్సరలు...కాశీ. ౩.౧౭౦" అని ముద్రిత

గ్రంథమునఁ గలదు. కాని యిక్కడ వ్రాఁతప్రతులను బరిశీలింపఁగా "దివ్యాప్సరసలు" (N. 4377; N. 2884 పరిషత్కార్యాలయమునందలి తాళపత్ర పుఁబ్రతులలో) అను సాధుపాఠము గాన్పించినది. మఱియు, భీమ. ౫. ౮౦, ౧౧౭. కాశీ. ౩. ౧౬౯. మొదలగుచోట్ల 'అప్సరసలు' అనుటకు నిర్ధారకప్రయోగములను శ్రీనాథుఁడే ప్రయోగించియుండుటచేత భీమ. ౫. ౩౦. లో 'అచ్చరల్' అనియే యుండుట స్వారసికము. వ్రాఁతప్రతులలో 'అప్పరుల్, అప్చరల్' మొ॥ భిన్నభిన్న పాఠములు భీమ. ౫. ౩౦. లోఁ గనఁబడుచున్నవి. కావుననే సూర్య. ని. 'అప్సరలు' అను రూపమును గ్రహింపలేదు.

౧౨. ఆక్షే:—'అనుభవత' ఈశబ్దము ఆ పైనిఘంటువులో లేదు. అందుచేతనే సూర్య. ని. లోనూ లేదు. తెలుగుకవులు ఇది ప్రయోగించియున్నా రని ఈనిఘంటువురచించిన పండితమహాశయులకు తెలియదు. చూడండి నారాయణకవి రచించినపంచతంత్రము.

సీ... అనుభవతకు రానియర్థంబు... మిత్రభేదము. ౭౦. (౧౯-౫ పొ)

సమా:—పైశబ్దము 'అనుభవిత (=అనుభవము)' కాని 'అనుభవత' కాదు. కనుకనే ఆముక్తమాల్యద. ౨. ౨౧. పద్యవ్యాఖ్యలో శ్రీ వేంకటరామశాస్త్రులుగారు "అనుభవతమున్-అను పాఠము పొరపాటు దానికి 'అనుభవమునకు' అనునర్థమును రాదు. అందలి 'తల్' ప్రత్యయము 'అప్రసక్తము' అని వ్రాసినారు" పంతులుగారి యీ యాక్షేపము బాలకవిశరణ్యములో 'అడుగెంట' అను సాపవిభక్తికమునకు వీరు వ్రాసిన "అడుగు + వెంట" అనువ్యుత్పత్తిని స్మృతికిఁ దెచ్చుచున్నది.

ఇక్కడకు సూర్య. ని. లో లేవని విమర్శకులు చూపిన యాంధ్రకవిప్రయుక్తసంస్కృతశబ్దము లైనవి.

౧౩. ఆక్షే:—పంచకావ్యాలలోని మాటలలో మీరు విడిచినవి కొన్ని ఎత్తివ్రాస్తాను. (౧౯-౫ పొ)

సమా:— ఈయాక్షేపముతో విమర్శకు లిచ్చిన శబ్దములు చాల వఱకు గృహీతము.లలో గతార్థములు, అనావశ్యకములు. కనుకనే వానిని గ్రహింపలేను. గ్రంథవిస్తరము లేకుండుటకై సూక్ష్మరీతితో వానికి సమాధాన మిచ్చెదను.

| ఈక్రిందిశబ్దములు లేవని విమర్శకుల యాక్షేపము. | సమాధానము. |
|---|---|
| 1. అగృధ్నుః. | 1. 'అ, గృధ్నువు. విశ'లలో గతార్థము. ఇట్టి నఞ్సమాసముల నన్నింటి నీయలేదని యాక్షేపించుట సమంజసముకాదని ౮. ఆక్షేపసమాధానమున వ్రాసినాను. |
| 2. అసాంప్రతమ్. | 2. 'అ, సాంప్రతము'లలో గతార్థము. |
| 3. ఆత్మేశ్వరః. | 3. 'ఆత్మన్, ఈశ్వర' శబ్దములలో గతార్థము. |
| 4. ఉభయాంసమ్. | 4. ఇది 'సన్నమితోభయాంసం శివం' అనుదానిలోనిది. 'ఉభయ, అంస' శబ్దములలో గతార్థము. |
| 5. ఉచ్ఛిలీంధ్రా. | 5. 'ఉద్, శిలీంధ్ర' శబ్దములలో గతార్థము. |
| 6. అత్యాదిత్యం. | 6. 'అతి' ౩ వ యర్థములో నిట్టివి సోదాహరణముగాఁ జూపఁబడినవి. కనుక దానిలో నిది గతార్థము. దిక్ప్రదర్శనార్థము 'అత్యగ్ని, అత్యంకుశము' వెం. కొన్ని ప్రధానపదములుగా గ్రహింపఁబడినవి. |
| 7. అదేవమాతృకా. | 7. 'అ, దేవమాతృకము. విశ'లలో గతార్థము. |
| 8. ఉపస్నుతా. | 8. 'ఉప, స్నుతము'లలో గతార్థము. |
| 9. అవిపత్తిః. | 9. 'అ, విపత్తి' శబ్దములలో గతార్థము. |
| 10. అనాత్మనీనః. | 10. 'అ, ఆత్మనీనుఁడు. విశ'లలో గతార్థము. |
| 11. అంతర్వహ్నిః. | 11. 'అంత, వహ్ని' శబ్దములలో గతార్థము. |

12. ఉష్ణభాః. 12. ఇది 'ఉష్ణాంశువు'లో వ్రాసిన విశేషములో గతార్థము.

13. అహివిద్విట్. 13. 'అహిరిపువు' ఉండఁగా నీపదము లేకున్న నేమి? కల్పనాసాధ్యములగు నిట్టివానిలో దిక్ప్రదర్శన మునకై కొన్నిమాత్రమే చూపెదరు. అట్లు కానిచో 'అహిశత్రువు, అహివైరి, అహిసపత్నుఁడు, అహ్యరి' మొ. పదములుమాత్రము గ్రహింపవలదా? ఈవిషయము 'భారతి'లోని నావ్యాసమున విపులముగా విమర్శింపఁబడినది.

14. అధరవాసస్. 14. 'అధర, వాసస్' శబ్దములలో గతార్థము.

15. ఉపరిచితా (కిరాతార్జునీయము.౭.౬) 15. ఇది 'ఉపరచితా' కాని 'ఉపరిచితా' కాదు. (చూ. వ్యాఖ్య.) 'ఉప, రచితము. విణ'లలో లో నిది గతార్థము.

16. ఏకవేణీ. 16. 'ఏక, వేణీ' శబ్దములలో గతార్థము.

17. ఆశ్వాంసుడు ('అనాశ్వాంసుడు' మాత్రము ఎత్తుకొన్నారు 'ఆశ్వాంసుడు' లేదు. ౧౬౭ పా.) 17. పంతులుగారు "సూ. ఉపేయివానవాశ్వాననూచానశ్చ. అష్టా 3. ౨. ౧౦౯. లో 'అనాశ్వాన్' కలదుగనుక 'ఆశ్వాన్'కూడ నుండవచ్చు నని యూహించి "ఆశ్వాన్" సూర్య. ని. లో లేదని యాక్షేపించినారు. కాని 'నఞ్'ఉపపదముగా నున్నప్పుడే 'అశ'ధాతువునకు లోకమున 'క్వసు' ప్రత్యయమును, ఇడభావమును వచ్చి 'అనాశ్వాన్' అనురూపమగునని పాణిని "ఉపేయివా ననాశ్వా ననూచానశ్చ. అష్టా.3. ౨. ౧౦౯" అనుసూత్రమునఁ జెప్పినాఁడు. కనుక 'ఆశ్వాంసుఁడు' అనునది యపశబ్దము.

డుట దానికి గౌరవావహము కాదా? మఱియు 'అనాశ్వాన్' మొదలగునవి కొన్నితప్పఁ దక్కిన 'క్వసు' ప్రత్యయాంత శబ్దములు వైదికములు. ఐనను వీనిలోఁ గొన్నింటిని మహాకవులు తమ కావ్యములలోఁ బ్రయోగించియున్నారు. వానిని మాత్రమే నిఘంటువులు గ్రహించును. కనుక 'ఆరివాంసుఁడు' మున్నగు-కవిప్రయుక్తములు గాని 'క్వసు' ప్రత్యయాంత శబ్దములు సూర్యా. ని. లో నీయలేదని వీఁవ్యాసమున నక్కడక్కడఁ జేసిన యాక్షేపము లాదరణీయములు కావు.

18. ఆదిపూరుషః
19. ఆదిపురుషః
(ఈరెండూ లేవు)

18. 19. ఈరెండును 'ఆది, పూరుష; ఆది, పురుష' శబ్దము లలో గతార్థములు.

20. అపస్పశా
(మాఘము. ౨.౧౧౨)

20. ఇక్కడ శ్లేష కలదు. కనుక "అ, పస్పశ; అప, స్పశ" శబ్దములలో గతార్థము.

21 ఔర్ధ్వీ.

21. సంబంధార్థమున సాధారణముగా వచ్చు 'అణ్' ప్రత్యయము చేత సిద్ధించెడి రూపము లసంఖ్యా కములుగా నుండును. కనుక నట్టివాని నన్నింటిని గ్రహించుట నిఘంటుసంప్రదాయము కాదు. వానిని వ్యాకరణమువలననే తెలిసికొనవల యును.

22 అభూమిః

22. 'అ, భూమి' శబ్దములలో గతార్థము.

23. ఉద్రశ్మిః

23. 'ఉద్, రశ్మి' శబ్దములలో గతార్థము.

24 అరవిందనాభిః
(మాఘము 3-౬౫)

24. 'అరవిందనాభియే' కాక 'అరవిందనాభుఁడు' అను రూపాంతరముకూడఁ గలదు. ఇట్లే కమల నాభుఁడు, సారసనాభుఁడు' మొదలగు ననేక

శబ్దములు కలవు. ఇవియన్నియును 'నాభి' శబ్దములో సోదాహరణముగా వ్రాసిన విశేషములో గతార్థములు.

25. అసంబాధమ్. 25. ఇదియు 'నఞ్'సమాసమే కనుకఁ దత్తచ్ఛబ్దములలో గతార్థము.

26. అధివేలమ్. 26. విభక్త్యర్థమున నవ్యయీభావము వచ్చి నిష్పన్నములగు నిట్టిశబ్దము లనంతములుగా నుండును. వానినన్నింటిని నిఘంటువులు గ్రహించుట యశక్యము. కనుక సవిశేషములగు 'ఉపగిరమ్, ఉపగిరి' మున్నగువానినే తప్పఁ దక్కిన యవ్యయీభావసమాసముల నన్నింటిని నిఘంటువులు గ్రహింప నక్కఱలేదు.

27. ఉత్తమలాభః ('ఉత్తమసాహసము'వంటిదే. వ్రాసినారు కాదు) 27. 'ఉత్తమ,లాభ' శబ్దములలో గతార్థము. 'ఉత్తమ సాహసము'వంటిది కాదు. అం దర్థవిశేషము కలదు. ఇం దెట్టివిశేషమును లేదు.

28. ఉత్పిత్సుః. 28. 'ఉద్, పిత్సు' శబ్దములలో గతార్థము.

29 అస్వర్గ్యము. 29. 'అ, స్వర్గ్యము'లలో గతార్థము.

"వ్యాకరణశాస్త్రమందు వ్రాసిఉన్నవే చాలామాటలు సూర్య. ని. లో లేవు. అట్టివాటిలో కొన్ని ముందుగా ఉదాహరిస్తాను." అని విమర్శకులు వ్రాసి చూపిన శబ్దములకు సమాధానములను జిత్తగింపుఁడు.

౧౮. ఆక్షే:—"అహర్దివి, అహస్పతి, అహఃకరుడు" ఇవి ఆప్తే. ని. లో ఉన్నవి. వీరు విడిచినారు. రూపాంతరము లన్నీ నిఘంటువులో వ్రాయకపోతే విద్యార్థులకు అవి ఉన్నవని తెలియదు. ఎవరైనా అవి ప్రయోగిస్తే తప్పు లనుకొంటారు....(౧౯౯ పే.)

సమా:—"అచతురవిచతు" రేత్యాదిసూత్రమున (అష్టా. ౫. ౪. ౭౭) 'అహర్దివము' అని నిపతింపఁబడినది గనుక లోకమున 'అహర్దివ

ము' అనునదియే సాధువు. 'అహర్దివి' అనునది వైదికము. ఈ వైదిక శబ్దము నీయ లేదని యాక్షేపించుట సమంజసము కాదు. ఆప్టే వైదికలౌకిక శబ్దనిర్ణయమునఁ జాలచోట్లఁ దప్పినాఁడు. ఈవిషయ మిందే స్థలాంతర మున విశదముగా నిరూపించితిని.

'అహస్పతి' అపశబ్దము. "అహరాదీనాం పత్యాదిషువా రేఫః" అనువార్తికము చేత "అహర్పతి, అహఃపతి, అహఁపతి" అనురూపము లగును. సత్వవిధాయకము లేదు గనుక 'అహస్పతి' అసాధువు. అందు చేతనే ప్రామాణికులగు రంగాచార్యులుగారును,విల్యమ్సును దమనిఘం టువులలో నీశబ్దమును గ్రహింప లేదు.

కస్కాదిగణములో 'అహస్కర' శబ్దమును బఠించి "కస్కాది షుచ. అష్టా. ౮. ౩. ౪౮" అను సూత్రముచేత దానికి నిత్యముగా సత్వ మును బాణిని విధించినాఁడు. కనుక 'అహఃకరుఁడు' అను రూపము తప్పు. 'అమరసుధ' మొదలగు నమరవ్యాఖ్యలన్నియు నిట్లే వ్రాసినవి. అందుచేతనే రంగాచార్యులుగారు, విల్యమ్సు, ఈ రూపము నీయలేదు.

ఇట్టి యపశబ్దములు సూర్య. ని. లో లేకుండుట గుణమా? దోషమా?

౧౭. ఆక్షే:— "అహోరాత్రము. సం. వి. అ. పుం." అని సూర్య. ని. లో ఉన్నది. కాని ఆప్టే. ని. లో "అహోరాత్రః, అహో రాత్రమ్" అని రెండులింగములలో ప్రయోగములతో కూడా ఈశబ్ద మున్నది. సంస్కృతవిద్యార్థుల కేలాగున తెలుస్తుంది. (౧౮౯ పొ.)

సమా:— 'అహోరాత్ర' శబ్దమునకు నపుంసకలింగము వేదమున నుండును. లోకమునఁ బుంలింగము మాత్రమే యుండును. అని "హేమంతశిశిరావహోరాత్రే చ ఛందసి. అష్టా. ౨. ౪. ౨౮; రాత్రా హ్నాహాః పుంసి. అష్టా. ౨. ౪. ౨౯" అను సూత్రములలోఁ బాణిని యనుశాసించినాఁడు. ఈయర్థమునే అమరుఁడును "శ్లో. రాత్రాంతాః ప్రాగసంఖ్యకాః" అని యనువదించినాఁడు. ఇఁక ఆప్టే చూపిన మను

స్మృతిప్రయోగమునే వాచస్పత్యకారుఁడును జూపి "రాత్రాహ్నాహాః పుంసీతి పాణిన్యుక్తేః పుంస్త్వేఽపి ఆర్షత్వాత్క్లీబమ్"అని స్పష్టముగా నపుంసకలింగ మార్షమని వ్రాసినాఁడు. రంగాచార్యులుగారు కూడ నపుంసకలింగము వైదిక మని వ్రాసినారు. ఇప్పుడు ఆప్తే. ని. వ్రాసినది తప్పో? సూర్య. ని. వ్రాసినది తప్పో? విద్వాంసులు నిర్ణయించి సంస్కృత విద్యార్థులకుఁ దెలుపుదురుగాక.

౧౩. ఆక్షే:— 'ఇషణిః, ఇషణ్యా' లేవు. (౧౯౯ పు.)

సమా:—ఇవి రెండును వైదికములు.లోకమున నుండవు. 'అగువు' వైదికము కాకున్నను వైదిక మనుకొని " 'అగువు' వంటి వైదికశబ్దములను సూర్య. ని. లో గ్రహించినారు. అట్టివానిని వైదికము లని తెలియక విద్యార్థులు ప్రయోగించి నిందపాలు కావలసివస్తుంది. అందు కుత్తరవాదు లీనిఘంటు నిర్మాతలు" అని వ్రాసినపంతులుగారే పై వైదిక శబ్దములు గ్రహింప లేదని యాక్షేపించుట యతివిచిత్రము. వాచస్పత్యమున నివి వైదికము లని స్పష్టముగాఁగలదు. చూడుఁడు. "ఇషణి. స్త్రీ. ఇష-భావే అని. వేదే నిపాతనా ద్గుణాభావః...ఇషణిమిచ్ఛతి క్యచ్. వేదే నిపాతనా దిలోపః. ఇషణ్యతి...తతః భావే అ. ఇషణ్యా."

ఇప్పు డైనను ఆప్తే వైదికలౌకిక శబ్దనిర్ణయమునఁ దప్పిపోయినాఁడని పంతులుగా రంగీకరించెదరా? లేదా? ఇట్టివాని నన్నింటిని సవిమర్శముగాఁ బరిశీలించి యర్హాము లగువానినే సూర్య. ని. గ్రహించినది.

౧౪. ఆక్షే:— "అ వ. సం. అవ్య. దీని యాద్యక్షరము వైకల్పికముగా లోపించును. ఉదా: అవతంసము, వతంసము" ఎంత హాస్యాస్పదముగా ఉన్నది! ఆప్తేలో వైకల్పిక మని లేదు.కొన్నిచోట్ల అకారము లోపిస్తుంది. ఉదా: 'వ గాహ్య' అని ఉన్నది. అవనతము, అవమానము, అవతారము మొదలగువాటిలో "అ" లోపిస్తుందా? ఇదెక్కడి శాస్త్రము? ఇదెట్టిపాండిత్యము? (౧౯౯, ౨౦౦ పు.)

సమా:—"వష్టి భాగురి రల్లోప మవాప్యో రుపసర్గయోః" అని భాగురిమతమున 'అవ' అను దానిలోని "అ" కారము లోపించును. పాణిని మతమున లోపింపదు. కనుకనే వైకల్పికముగా లోపించు నని సూర్య. ని. వ్రాసినది. 'అవనతము' మొ. శబ్దములన్నింటను భాగురిమతమున 'అ' తప్పక లోపించును. 'అవగ్రహము, అవధానము' మొదలగువానిలో లోపింపలేదా? ఆప్తేవ్రాత నిష్ప్రమాణము. కనుకనే వాచస్పత్యమున "అవ. అస్య వా అతో లోపః" అనియే కలదు. కౌముది చదువుకొన్నవారి కెల్ల నిది తెలిసినదే.

౧౮. ఆక్షే:— 'అవినాయిన్, అవిశాయిన్' మొ. లేవు. (౨౦౦ పో.)

సమా:—ఇవి ఆప్తే, వాచస్పతి, విల్యమ్సు, రంగాచార్యాది సంస్కృతనిఘంటువులలో లేవు. కాశికావృత్తిలోని గ్రహ్యాదిగణములో మాత్ర మున్నవి గణరత్నమహోదధిలోని గ్రహ్యాదిగణములో లేవు. కౌముదీగణపాఠములో "అవిశాయిన్" లేదు. సంస్కృతనిఘంటువులు కూడ గ్రహింపనివియు, గణపాఠములలోను సందిగ్ధములుగా నున్నవియు నగు నిట్టిశబ్దము లాంధ్రనిఘంటువులలో గ్రహింపఁబడ లేదని యాక్షేపించుట సమంజసమో యసమంజసమో యుభయభాషాభిజ్ఞులు నిర్ణయింతురుగాక.

విమర్శకులు తమవిమర్శనమున నక్కడక్కడ నిట్టివియే యింకను గొన్నిశబ్దము లిచ్చి యివి సూర్య. ని. లో లే వని యాక్షేపించినారు. వానికిఁ గూడ నిదియే సమాధానము.

౧౯. ఆక్షే:—"అనుచ్ఛిత్తిధర్మా, అధిజ్యధన్వా, అంగవిమంగః" ఇవిలేవు. (౨౦౦ పో)

సమా:—"ధర్మా దనిచ్కేవలాత్. అష్టా. ౫. ౪. ౧౨౪" అను సూత్రముచేత "గృహీతధర్మా, ఆదృతధర్మా, నివృత్తిధర్మా" మున్నగు ననేకశబ్దములు కాఁగలవు. వీని నన్నిటిని సంగ్రహించుట యశక్యము.

కనుకనే యుదాహరణార్థము "అఘర్మము" మొ. కొన్నిగ్రహించి 'ఘర్మ' శబ్దములో నీరూపముల నెల్లఁ దెలిసికొనుటకు వీలుగా నుండునట్లు పైసూత్రముయొక్క భావమును వ్రాసి యుదాహరణములు చూపి యున్నారు. ఇట్లే "ధను" శ్శబ్దమునను వ్రాయఁబడినది. స్వరూపప్రదర్శ నార్థము "ఇక్షుధన్వఁడు" మున్నగునవి కొన్ని చూపఁబడినవి. కనుక నిట్టివి యన్నియును దత్తచ్ఛబ్దములలో గతార్థము లగును.

'అంగవిషంగ' శబ్దము కౌముదిలోను, ఆప్టే. ని. లోను లేదు. కౌముదిలో "సమాసేంగులేః స్సంగః. అష్టా. ౮. ౩. ౮౦" లో "అంగులి షంగః" అని కలదు. అది సూర్య. ని. లో గ్రహింపఁబడియే యున్నది. 'అంగులిషంగము' అనుదానికి బదులు గా 'అంగవిషంగము' అని పంతులుగారు వ్రాసినారేమో ?. ఇట్టిప్రమాదములు వీరివ్యాసమునఁ జాలఁ గలవు. వానిలోఁగొన్ని నావ్యాసమున నాయాస్థలములలోఁ జూపినాను.

౨౦. ఆక్షే:— ఉత్తరతీరమ్, ఉత్తరతారమ్—రెండూ లేవు... ఇట్టిశబ్దములు లేనందున ఈనిఘంటువు ప్రమాణముగా అంగీకరించ దగినది కాదు. (౨౦౦ పో)

సమా:—"దిక్శబ్దేభ్య స్తీరస్య తారభావో వా" అను వార్తికము చేత, దిగ్వాచకశబ్దములకుఁ బరముగా నున్న 'తీర' శబ్దమునకు 'తార' అను నాదేశము వికల్పముగా వచ్చును. కనుక "ఉత్తరతీరమ్, ఉత్తరతారమ్, ఉదక్తీరమ్, ఉదక్తారమ్, అవాక్తీరమ్, అవాక్తారమ్, దక్షిణతీరమ్ దక్షిణతారమ్" మొదలగు ననేకశబ్దము లగును. వాని నన్నిటిని బ్రత్యేకముగా గ్రహించిన వ్యర్థముగా గ్రంథము పెరుఁగును. కనుక 'తార' శబ్దములో నీవిషయమును సోదాహరణముగాఁ జూపి పైశబ్దముల నన్నిటిని బ్రత్యేకముగా గ్రహించుట మానివేసినారు. వాచస్పత్యాది నిఘంటు కర్తలు గూడ నీమార్గమునే యనుసరించినారు.

౨౧. ఆక్షే :— అధోధః, ఉపర్యుపరి, అధ్యధి, మొ. లేవు. (౨౦౦ పో.)

సమా:— ‘ అధస్, ఉపరి, అధి ’ అనువానిని సూర్య. ని. లోఁ ప్రత్యేకముగా గ్రహించియున్నారు. వానియామ్రేడితరూపము లగు ‘అధోధః’మున్నగు శబ్దములను గ్రహింపలే దనుట సమంజసము కాదు. అట్లుకాక యామ్రేడితరూపములను గూడ నీయవలయు నను నెడల “వనే, వనే, వృక్షం వృక్షమ్, మందం మందమ్, సుందర సుందర, చోరచోర, సర్పస్సర్పస్సర్పః”మున్నగువాని నన్నిటిని గ్రహింప వలసియుండును. అట్లు గ్రహించుట యశక్యము. అది నిఘంటు సంప్రదాయము కూడఁ గాదు.

౨.౨. ఆక్షే:—ఆచర్యమ్. (=కర్మశోభనమ్), అపరపరా, అపరకరః- లేవు. (౨౦౦ పొ)

సమా:- ‘ఆచర్యము’ అనుశబ్దము సూర్య. ని. లో “ఆచరింపఁదగినది” అనునర్థముతో నున్నది. కాని. “సూ. ఆశ్చర్య మనిత్యే. అష్టా. ౬. ౧. ౧౪౭.” లో “అనిత్యేకిమ్. ఆచర్యం కర్మ శోభనమ్” అని కౌముదిలో దీనికి “శోభనకర్మము” అను నర్థము కూడఁ గలదు. ఆయర్థము సూర్య. ని. లో లేదు, అని పంతులువారి యాక్షేపము. ఇదిచూడఁగా “అక్షయ్యము అనుదానికి ‘గ్రాసమాత్రభిక్ష’ అను నర్థము శ్రీనాథుని కాశీఖండమునఁ గలదు. ఆయర్థము సూర్య. ని. వారియ్యలేదు” అని ప్రమాథిసంవత్సరాది సంచికలో వ్రాసిన వఝ్ఝ్లమూడి వేంకటరత్నముగారి వ్రాఁత స్మృతికి వచ్చి నవ్వు వచ్చుచున్నది. ఆఙ్పూర్వకమగు “చర” ధాతువునకు అద్భుతార్థము గమ్యమాన మగునప్పుడే ‘సుట్’ వచ్చి ‘ఆశ్చర్యమ్’ అనురూప మగును. అద్భుతార్థము గమ్యమానము కానప్పుడు ‘సుట్’ రాదు. కనుక ‘ఆచర్యమ్’అను రూపమే యుండు నని పై కౌముదికిఁ దాత్పర్యము. ఈవిషయమును స్పష్టపఱుచుటకే కాశికలో నిచ్చిన ‘ఆచర్యం కర్మ శోభనమ్’ అనువాక్యమునే కౌముదీకారుఁడు గూడ నుదాహరించినాఁడు. ఆవాక్యమునకు “శోభనమ్=మంచి, కర్మ=పని, ఆచర్యమ్=ఆచరింపఁదగినది.” అని యర్థము. ఇక్కడ నద్భుతార్థస్ఫూర్తి లేదుగనుక ‘సుట్’ రాలేదు. వస్తుస్థితి యిట్లుండఁగాఁ బంతులుగారు పై

కౌముదినిబట్టి 'ఆచర్య' శబ్దమునకు 'శోభనకర్మము' అనునర్థము కల దను కొని యాయర్థము సూర్యా. ని. లో లే దని యాక్షేపించుట సరి కాదు.

'అపరపరా' ఈశబ్దము కౌముదిలో "సూ. అపరస్పరాః క్రియా సాతత్యే. అష్టా. ౬. ౧. ౧౪౪"లో "క్రియేత్యాది కిమ్. అపరపరా గ చ్ఛంతి" అనుచోటఁ గలదు. పంతులుగా రిక్కడి 'అపరపరా' ఆకారాంత స్త్రీలింగ మనుకొన్నారు కాఁబోలు. అది కాదు. పుంలింగము. బహువచ నాంతము. సంధిని విసర్గలోపము. క్రియాసాతత్యరూపవిశేషార్థము గమ్యమాన మగునపుడు 'సుట్' నిపాత మైనదిగనుక నట్టివిశేషము గల 'అపరస్పర' శబ్దము సోదాహరణముగా సూర్యా. ని. లో గ్రహింపఁ బడినది. ఇఁక నట్టి విశేషమును లేని 'అపరపరము' మున్నగు ప్రత్యుదా హరణశబ్దములు సూర్యా. ని. లోని 'అపర, పర' ప్రభృతిశబ్దములలో గతార్థములుగనుక వాని నీయ లే దని యాక్షేపించుట సరికాదు.

'అపరకరః' ఈశబ్దము ఆప్తే. ని. లోను, కౌముదిలోను లేదు. కాని "సూ. అపస్కరో రథాంగమ్. అష్టా. ౬. ౧. ౧౪౯. అపకరో న్యః" అని కౌముదిలోఁ గలదు. 'అపకరః' అనుదానినే పంతులుగారు పొరపాటున 'అపరకరః' అని వ్రాసినారుకాఁబోలు. సవిశేషమగు 'అప స్కర' శబ్దము సూర్యా. ని. లో గ్రహింపఁబడియే యున్నది. నిర్విశేష మగు 'అపకర' శబ్దము సూర్యా. ని. లోని 'అప, కర' శబ్దములలో గతా ర్థముగనుకఁ ద్యజింపఁబడినది.

౨౩. ఆక్షే:-'ఇక్షువాహణమ్' ఆప్తేలో ఉన్న దయినా దీనిలో లేదు. (౨౦౦ పు)

సమా:—ఈశబ్దము ఆప్తే. ని. లో లేదు. "సూ. వాహన మాహి తాత్. అష్టా. ౮. ౪. ౮...ఇక్షువాహణమ్." అని కౌముదిలోఁ గలదు. కాని, సూర్యా.ని. లోని 'వాహన' శబ్దమున దానికి ణత్వ మెప్పుడు వచ్చు నో యెప్పుడు రాదో సోదాహరణముగా వ్రాసియున్నారు. అట్లువ్రాసి ననే యిట్టివాని నన్నింటిని సంగ్రహింప వీ లగును. అట్లుకాక 'ఇక్షువా

హాణము' ఒక్కటిమాత్ర మిచ్చినచో "ఇషువాహాణమ్, వ్రీహివాహాణమ్, క్షీరవాహాణమ్, ఝషవాహాణమ్" మున్నగు ననేకశబ్దము లగు నని తెలియదు. అందుచేతనే సూర్య. ని. ఈమార్గము నాశ్రయించినది.

౨౮. ఆక్షే:- 'అపథం, అపంథాః, అపథః' వీటిలో మూఁడోది మాత్రమే సూర్య. ని. లో ఉన్నది. (౨౦౦. పా.)

సమా:—సూర్య. ని. లోని 'అపథము'లో విశేషణవిశేష్యార్థములు రెండు నిచ్చినారు. కనుక దానిలో మొదటిది మూఁడవదియు సంగృహీతములైనవి. ఈవిషయము గ్రహింపక పంతులుగారు "మూడోది మాత్రమే సూర్య. ని. లో ఉన్నది" అనుట యసత్యము.

'అపంథాః' అనుదానితత్సమరూపము 'పథిన్' శబ్దతత్సమరూపము ననుసరించి యుండును. 'అన్యేషాం చ వా లు గంత్యస్య' అను చింతామణి సూత్రవ్యాఖ్యలో నహోబలుఁడు 'పథిన్' శబ్దమునకు 'పథము' అనురూపము తత్సమమున నగు నని వ్రాసినాఁడు. కనుక 'అపథిన్' శబ్దమునకుఁగూడ 'అపథము' అనురూపమే తత్సమమున నగును. సూర్యా. ని. లోని 'అపథము'లో 'వి. అ. న.' అనియే కాక 'వి. అ. న, న్. పుం.' అని వ్రాసినచో నిదియును గృహీతమగును. ఆవిధముగానే యనుబంధములో గ్రహించెదరు.

౨౯. ఆక్షే:—ఆజానేయ శబ్దానికి స్త్రీలింగరూప మున్నది. 'ఆజానేయీ'. ఇది విడిచినారు. 'అతికేశా, అతికేశీ, అనుశిష్టము లిందు లేవు. ఏలాగున ఇవి విద్యార్థులు తెలుసుకోగలరు ఈనిఘంటువు ఉంచుకుంటే? (౨౦౧. పా)

సమా:- 'ఆజానేయ' శబ్దమునకు స్త్రీలింగమున 'ఆజానేయీ' అనురూప మగు నని వాచస్పత్యరంగాచార్యనిఘంటువులలో లేదు. 'ఆజానేయ' శబ్దము తురగాదిశబ్దములవలె జాతివాచకము కాదుగనుక "సూ. జాతే రస్త్రీ విషయా దయోపధాత్. అష్టా. ౪. ౧. ౬౩" అనుసూత్రముచేత 'జీష్' రాదు. జాతివాచక మన్నను 'అయోపధాత్' అను నిషేధ

ముండుటచేతను "యోపధప్రతిషేధే హయగవయముకయమనుష్య మత్స్యానా మప్రతిషేధః" అనువార్త్తికమున సంగృహీతము కాలేదు గనుకను 'జీష్' రాదు. గౌరాదిగణములోఁగూడ లేదుగనుక "షిద్గౌరా దిభ్యశ్చ. అష్టా. ౪. ౧. ౪౧." అనుసూత్రముచేతను 'జీష్' రాదు. కనుక 'ఆజానేయీ' అనుట తప్పు. "పుంయోగాదాఖ్యాయామ్. అష్టా. ౪. ౧. ౪౮." అనుసూత్రముచే వచ్చు 'జీష్' రావచ్చునుగాని యది దీక్షితమతమునఁ బుంవాచకశబ్దము లన్నింటికిని సాధారణముగా వచ్చు నదియేగనుక దానిచే సిద్ధించినస్త్రీలింగరూపములు నిఘంటువులు చూపవు. విశేషముగల 'హయీ, గవయీ' మున్నగు స్త్రీలింగరూప ములను మాత్రము తప్పక నిఘంటువులు చూపును. నిఘంటురచయిత లందఱు నీమార్గమునే యాశ్రయించినారు. అందుచేతనే వాచస్పత్య రంగాచార్యనిఘంటువులలో వలెనే సూర్య. ని. లోఁ గూడ నీస్త్రీలింగ రూపము త్యజింపఁబడినది.

"అతికేశా, అతికేశీ" అనునవియే కాక 'అసంయోగోపధములు నుపసర్జనములు ద్వ్యచ్కములు నగుస్వాంగవాచకశబ్దముల కన్నింటికి' నిట్లే రెండురూపములు నుండును. కనుక "అతికచా, అతికచీ; అధికకచా, అధికకచీ; దీర్ఘకచా, దీర్ఘకచీ; నీలకచా, నీలకచీ; మృదుకచా, మృదు కచీ; అధికకేశా, అధికకేశీ; దీర్ఘకేశా, దీర్ఘకేశీ; నీలకేశా, నీలకేశీ; మృదుకేశా, మృదుకేశీ"మున్నగురూపము లగును. ఇట్లే తక్కిన స్వాం గవాచకశబ్దముల కన్నిటికిని రెండురూపములు నుండును. ఇట్టివానితో నిఘంటువుల నింపుట మొదలిడినచో వ్యర్థముగా గ్రంథము పెరుఁగును. అట్లు పెంచుట నిఘంటుసంప్రదాయవిరుద్ధము. సూర్యరాయాంధ్రనిఘం టువునే కాక దేని నుంచుకొన్నను వ్యాకరణమువలననే తెలిసికొనఁ దగిన పైరూపము లన్నియును దెలియవు.

౭౬. ఆక్షే:—అలుక్సమాసాలలోవి "ఓదనస్యపాచకః, అపాం స్రష్టా" మొ. మాటలు లేవు. 'అప్స్రష్టా' అన గూడదే, 'అపాంపతిః' వ్రాసినవారు 'అపాంస్రష్టా' ఎందుకు విడిచినారు? (౨౦౨ పో)

సమా:—పై రెండును అలుక్సమాసము లనుకొనుట తప్పు. అవి వ్యస్తములు కాని సమస్తములు కావు. చూడుఁడు. "సూ. తృజకాభ్యాం కర్తరి. అష్టా. ౨. ౨. ౧౫. కర్త్రర్థతృజకాభ్యాం షష్ఠ్యా న సమాసః. అపాం స్రష్టా, వజ్రస్య భర్తా, ఓదనస్య పాచకః" కౌముది. ఇది చూచియే కదా పంతులుగారు పై యాక్షేపము చేసినది ? దీనికివారేమి యర్థము చేసికొనిరో ?

మఱియుఁ బై సూత్రమునఁ జెప్పినషష్ఠీసమాసనిషేధము కారకషష్ఠికే కాని శేషషష్ఠికిఁ గాదు. కనుకఁ దృజంతముతో శేషషష్ఠి సమసింపవచ్చును. ఇట్లే తృన్నంతముతోఁగూడ సమాసము రావచ్చును. అప్పుడు 'అప్స్రష్టా' అనవచ్చును.

"అపాంపతిః" "అపాంస్రష్టా" వంటిది కాదు.

౨౭. ఆక్షే:—అలుక్సమాసాలలోది 'ఆయుష్టోమః' (అష్టా. ౮. 3. ౮3.) లేదు. (౨౦ ౨పే.)

సమా:—"జ్యోతిరాయుషః స్తోమః. అష్టా. ౮. 3. ౮3" అను సూత్రసంఖ్యను జూపియు 'ఆయుష్టోమ' శబ్దమలుక్సమాసములలోనిదనుకొనుట మిక్కిలి తప్పు. పై సూత్రము షత్వవిధాయకము గాని యలుగ్విధాయకము కాదు.

౨౮. ఆక్షే:—'ఉదశ్విత్త్కతిపయ్యా' ఇది లేదు. (౨౦౨ పే.)

సమా:—ఇది కౌముదిలోను, ఆప్తే. ని. మున్నగువానిలోను గూడ లేదు. "పోటాయువ" తీత్యాదిసూత్రమున 'ఉదశ్విత్కతిపయమ్' అనిమాత్రము కౌముదిలో నున్నది. దానినే పై విధముగా పంతులుగారు వ్రాసినారేమో ? 'ఉదశ్విత్కతిపయమ్' అనుచోటఁగూడ 'కతిపయ' శబ్దవిషయమునవే విశేష ముండుటచేత ద్వితీయసంపుటమున 'కతిపయ' శబ్దములో సవిమర్శముగాను సోదాహరణముగాను దానికి సంబంధించిన విషయము వ్రాయఁబడియున్నది.

౨౯. ఆప్టే:—"అజకవః, అజకవమ్, అజకావః, అజకావమ్, అజగమ్, అజగవమ్" ఇట్లు రూపాంతరములతో ఆప్టే. ని. లో ఉన్నట్టు శబ్దాలు అన్ని వ్రాయడము నిఘంటుకారులకు విహితధర్మము. (౨౦౨ పే.)

సమా:—"అజకవమ్, అజకావమ్, అజగవమ్" అను పర్యాయ పదములు నపుంసకలింగములుగా (శివుని విల్లు. అను నర్థమున) సూర్య ని. లో నున్నవి. "అజకవః, అజకావః, అజగమ్" అను పదములు సూర్య. ని. లో లేక ఆప్టే. ని. లో మాత్రము కలవు. కనుక వీనిని గూడ గ్రహించుట నిఘంటుకారులకు విహితధర్మ మని పంతులుగారు సెలవిచ్చినారు. కాని సూర్యరాయాంధ్రనిఘంటురచయితలు పంతులు గారు సెలవిచ్చినట్లు ఆప్టే. ని. లోని శబ్దములను ముక్కకి ముక్కి తెనిఁగించి పెట్టువారు కాకపోవుటచేతఁ బై శబ్దముల నన్నిటిని గ్రహింపలేదు. చూడుఁడు. "అజకవ. అస్త్రీ" అని వాచస్పత్యములో నుండుటచే ఆప్టే 'పుం. న' అని వ్రాసినాఁడు. కాని వాచస్పత్యములో నాశబ్దమునకుఁ బ్రమాణముగా నిచ్చిన శబ్దార్ణవమున "ధను ష్యజగవం యుగ్య మజకావ మజీకవమ్" అని నపుంసకము గానే కలదు. మఱియు నమరసుధావ్యాఖ్య లో 'అజకౌ విష్ణుబ్రహ్మాణౌ వా తీతి అజకవమ్' అని నపుంసకలింగముగానే గ్రహింపఁబడినది. ఇట్లే వంద్యఘటీయసర్వానందప్రణీత మగు 'టీకాసర్వస్వ' మనుమఱియొకయమరవ్యాఖ్యలోఁ గూడఁ గలదు. వాచస్పత్య ములో 'అస్త్రీ' అనుటకుఁ బ్రమాణము కనఁబడలేదు. మహావిద్వాంసు లగు పరవస్తురంగాచార్యులుగారు గూడఁ దమ నిఘంటువులో దీనిని నపుంసకము గానే గ్రహించినారు. ఇన్నివిధములఁ బరిశీలించియే సూర్య. ని. దీనిని పుంలింగముగా గ్రహింపలేదు.

"అజకావ...శివధనుషి. న." అని వాచస్పతి. ఇట్లే సుధావ్యాఖ్య రంగాచార్యప్రభృతినిఘంటుకర్తలును వ్రాసినారు. ఆప్టే. "పుం. న" అని వ్రాయుట సరికాదు.

"అజగమ్. న...శివధనుషి...ప్రజ్ఞాదిత్వాత్స్వార్థే అణ్. ఆజగమపి. శివధనుషి. స్థాణోర్ధను ష్యాజగ మిత్యమరమాలా." అని వాచస్పత్యము. ఇక్కడ వాచస్పతి యమరమాలలో 'ఆజగమ్'అని యుండుటచే 'అజగమ్' అను రూపమొకటి కల్పించి దానిపైఁ బ్రజ్ఞాద్యణ్ణు చేసి 'ఆజగమ్' అనురూపమును సాధించినాఁడు. కాని "అజగవశబ్దాత్ ప్రజ్ఞాదిత్వా దణి ఆజగవ మపి. స్థాణో ర్ధను రాజగవ మిత్యమరమాలా" అని సుధావ్యాఖ్య. ఇతరము లగునమరవ్యాఖ్యలలోను బైయమరమాలా శ్లోకమున 'ఆజగవమ్' అనియే కలదు. కనుక వాచస్పతి గ్రహించినపాఠము సరియైనది కా దనుట స్పష్టము. పద్యనిఘంటువులలోఁ గాని రంగాచార్యాదిప్రామాణికనిఘంటువులలోఁ గాని "అజగ, ఆజగ" శబ్దములు లేవు. అదియును బై రూపములు లే వనుటకే సాధకము.

వస్తుస్థితి యిట్లుండగా నిర్విమర్శముగా నాక్షేపండితుఁడు వాచస్పత్యాదులనుండి గ్రహించినయిట్టిశబ్దముల నన్నిటిని సూర్య. ని. లో గ్రహింప లే దని యాక్షేపించుట యుక్తము కాదు.

౩౦ ఆక్షే:—'అన్యథాకారము' వ్రాసినవారు 'ఇత్థంకారము, ఏవంకారము' విడిచిపెట్టడమునకు కారణము కనబడదు. (౨౦౨ పా)

సమా:—"అన్యథైవంకథమిత్థంసు సిద్ధాప్రయోగశ్చేత్. అష్టా. ౩. ౪. ౨౭" అను పాణినియనుశాసన ముండుటచేత నందులోని 'అన్యథాకారము' వ్రాసినవారు తక్కినవి వదలుటకుఁ గారణము కనఁబడ దని పంతులుగా రాక్షేపించినారు. కాని సూర్య. ని. లో నిచ్చిన 'అన్యథాకారము' నకును, పాణిన్యనుశాసనమున నున్న 'అన్యథాకారము'నకును నెట్టిసంబంధమును లేదు. పై సూత్రముచే సిద్ధించు 'అన్యథాకారము' ణముల న్తావ్యయము. సూర్య. ని. లోనిది విశేష్యము. కనుకఁ బై యాక్షేపము రూపైక్యభ్రమజనితము. పంతులుగారు తమవిమర్శనమునఁ జాలచోట్ల నిట్లే పరస్పరసంబంధము లేనిశబ్దములను సంబంధము కలవానినిగా భావించి వ్రాసియున్నారు. ఆక్షే.ని. మున్నగువానిలోని శబ్దములు

చూచికొనుటయే తక్క నవి ప్రకృతోపయోగు లగునా? కావా? యనువిమర్శనము చేయకుండుటచేత నట్టి దోసఁగులు పొసఁగినవి. సూర్య. ని. ఆంధ్రనిఘంటువు కనుకఁ గేవలసంస్కృతమున నున్న యవ్యయముల నన్నిటిని గ్రహింపక తెనుఁగున కావశ్యకము లగువానిని మాత్రమే గ్రహించినది. అట్లుకాక యవ్యయముల నన్నిటిని గ్రహింపవలయు నన్న "తు, హి, చ, స్మ, హ, వై" మొదలగువానిని, "క్త్వా, తుమున్, ణముల్, ల్యబంతములు" మున్నగువానిని, నిర్విశేషసర్వావ్యయీభావసమాసప్రభృతులను గూడ గ్రహింప వలసియుండును. అట్టిపని కుభయభాషాభిజ్ఞు లెవ్వరును సమ్మతింపరు.

౩౧. ఆక్షే:—'అవాక్కు' క్రింద-'అవాఙ్ముఖ, అవాఙ్ముఖీ' కనబడవు. ఇటువంటిలోపాలు వందలు వందలుగా ఉన్నవి. అన్నీ ఎత్తిచూపించగలనా? (౨౦౩ పో)

సమా:—పై శబ్దములు 'అవాక్కు, ముఖ' శబ్దములలో గతార్థములు. ఇట్టిశబ్దము లన్నియును నిఘంటువులు గ్రహింప నక్కఱలేదని (౨౫) ఆక్షేపసమాధానమున విపులముగా వ్రాసినాను. కనుక నిట్టివి లేకుండుట లోపము గాదని విమర్శకులు గ్రహింతురుగాక.

౩౨. ఆక్షే:—'అనవస్థిత'శబ్దమునకున్ను, 'అనశన' శబ్దమునకున్ను మధ్యను "అనవహ్వర, అనవాఙ్క్, అనవానం, అనవాయు, అనవేక్షక, అనవేక్షా, అనవేక్షణం, అనవ్రత" అనే శబ్దా లున్నవి. ఇవి అన్నీ సూర్య. ని. లో లోపించినవి. ఇట్లే అన్నిపుటలలోను లోపాలు ఉన్నవని నమ్ముతాను. 'అనవాయు'నుండే 'అనవాయుత' వచ్చినది. (౨౦౩ పో)

సమా:—సూర్య. ని. లోని 'అవహ్వర, అవాక్కు, అవేక్షకుఁడు, అవేక్ష, అవేక్షణము, వ్రతము'లలోఁ బై శబ్దములు గతార్థములు. ఇట్టి

నఞ్ సమాసముల నీయలేదని యాక్షేపించుట సరి కా దని చాలచోట్ల వ్రాసినాను.

'అనవానమ్' ఇది వాచస్పత్యాదులలో లేకపోవుటచేతను, అవ్యయ మని వ్రాసి యైతరేయబ్రాహ్మణమునుండియే విల్యమ్సు ఉదాహరణ మిచ్చి యుండుటచేతను ద్యజింపఁబడినది.

'అనవాయు' ఇది వాచస్పత్యమునుండి ఆప్టే గ్రహించినాఁడు. కాని వాచస్పతి దీనికి "అనవాయం కి మీాదిసే.ఋగ్వేదము. ౭.౧౦౪.౨." అని వేదమునుండియే యుదాహరణ మిచ్చినాఁడు. సంస్కృతమూల నిఘంటువులలోను, రంగాచార్యులుగారి నిఘంటువునను గూడ నీపదము లేదు. కనుక వైదికము కావచ్చు నని పరిత్యజింపఁ బడినది.

ఇట్లు సవిమర్శముగాఁ బనిచేయుటయే లోప మైనచోఁ బై శబ్దములు గ్రహింపకుండుటయు లోపమే యగును. ఇట్టిలోపములే సూర్య. ని. లోనియున్నపొరటలలోను ఉన్నయెడల నవి గౌరవావహములే కాని యగౌరవావహములు కా వని సద్విమర్శకులు నిర్ణయింపఁ గలరు.

ఆప్టే. ని. లోని 'అనవాయు' అనునదియే వైదిక మని తోఁచుచుండఁగా "అనవాయు-నుండే 'అనవాయత' వచ్చినది" అని సుప్రసిద్ధ శబ్దమును గూర్చి వోలె పంతులుగారు వ్రాయుటకుఁ గారణ మేమో ?

33. ఆక్షే:—ఆప్టే. ని. లో 'అన్న, అగ్ని, అశ్వ, అల్ప, అధః' మొదలగు శబ్దములతో సమసించిన శబ్దాలు వేలకొలదిగా ఉన్నవి... ఈసమాసాలు ఆప్టే. ని. లోనుండి పెరికి సూర్య. ని. లో తెచ్చిపోసినప్పుడు నూటికి యాభై అరవై చొప్పున తరిగిపోయినవి. ఇంతతరుగా ? మాటలు గాని మన్ను గాదే! (౨౦౩ పే)

సమా:—పై శబ్దములతో సమసించినశబ్దములు సూర్య. ని. లో లేనివి మచ్చుకై కొన్ని చూపి యట్టివి గ్రహింపకున్న లోప ముం

డునో ? లేదో ? తెలిపెదను. అన్నిటిని విమర్శించుచో వృథా గా గ్రంథము పెరుఁగు నని యీపద్ధతి నాశ్రయించినాను.

అన్న.

అన్నాద్యమ్ (=అన్నము మొదలైనది). ఇది సూర్య. ని. లోని 'అన్న, ఆద్య' శబ్దములలో గతార్థము.

అన్నాచ్ఛాదనమ్:—'అన్న, ఆచ్ఛాదన' శబ్దములలో గతార్థము.

అన్నవస్త్రమ్—'అన్న,వస్త్ర' శబ్దములలో గతార్థము.

అన్నకాలః—'అన్న, కాల' శబ్దములలో గతార్థము.

అన్నజాతమ్—'అన్న,జాత' శబ్దములలో గతార్థము. మచ్చునకై యిట్టివానిని గూడఁ గొన్నిటిని సూర్య. ని. చూపియే యున్నది.

అగ్ని.

'అగ్న్యగారమ్, అగ్న్యాలయః, అగ్నిగృహమ్' మొదలైనవి ఆప్తే. ని. లో నున్నవి. సూర్య. ని. లో 'అగ్నిగృహము' ఒక్కటి గ్రహించి తక్కినవి దీనివంటివే గనుక నిర్విశేషము లని త్యజింపఁబడినవి. ఐనను 'అగ్ని' తో సమసించినపదములు 96 సూర్య. ని. లో నున్నవి. ఎన్ని యిచ్చిన విమర్శకులకుఁ దృప్తి గలుగునో?

అశ్వ.

అశ్వాధికః—'అశ్వ, అధిక' శబ్దములలో గతార్థము.

అశ్వాధ్యక్షః—'అశ్వ, అధ్యక్ష' శబ్దములలో గతార్థము. ఇట్టి యమూల్యపదములు సూర్య.ని. లో లేవని పంతులుగారు చాల విచారించినారు. అయినను "అశ్వ" శబ్దముతో సమసించినపదములు 66 సూర్య. ని. లోఁ గలవు.

అల్ప.

'అల్పాయుస్, అల్పారంభః, అల్పాహారః, అల్పాహారిన్' వంటి ఆప్తే. ని. లోనిశబ్దములు 'అల్ప, ఆయుస్' ప్రభృతిశబ్దములలో గతా

ర్థము లేదు గనుక గ్రహింపఁబడలేదు. 'అధస్' శబ్దముతో సమసించిన వా నిలోఁ బ్రధానశబ్దము లిచ్చినారు. మఱియు 'అధస్' శబ్దమును బ్రత్యేకముగా గ్రహించి దానికిఁ గలయర్థములను సోదాహరణముగాఁ జూపినారు. కనుక దానిలో మిగిలిన వన్నియును గతార్థము లగును.

౩౪. ఆక్షే:—'అంతర్' తో సమస్తమైనవి 160 ఉన్నవి. వాటిలో 77 సూర్య. ని. లో లేవు. (౩౦౩ పు)

సమా:—77 మాత్రమే కాదు, ఏడువందలు లేకున్నను 'అంతర్' లో సూర్య. ని. లో వ్రాసినవిశేషములో నవి గతార్థము లగును. కనుకనే త్యజింపఁ బడినవి. తక్కినశబ్దములకుఁ గూడ నిట్లే సమాధానమూహ్యము.

౩౫. ఆక్షే:—'అభి'తో చేరినవి అనేక మున్నవి. వాటిలో కొంచెము దీనిలో ఉన్నవి. (౨౦౪ పు)

సమా:—కొంచెము కాదు, 424 పదములు 'అభి'తో సమసించినవి సూర్య. ని. లో నున్నవి. మఱియు 'అభి' దానికిఁ గలవివిధార్థములతోను, ఉదాహరణములతోను బ్రత్యేకముగా గ్రహింపఁబడినది. లేవనినశబ్దములు దానిలో గతార్థము లగును.

౩౬. ఆక్షే:—'అప' తో చేరినవాటిలో అత్యల్పముగా దీనిలో ఉన్నవి. 'అపకిరణము' వంటివి లేవు. (౨౦౪ పు.)

సమా:—'అప'తో సమసించినవి '240' కిఁ బైఁగా సూర్య. ని. లో నున్నవి. మఱియు 'అప' ప్రత్యేకముగా గ్రహింపఁబడియుండుట చేతఁ దక్కినవి దానిలో గతార్థము లగును.

సవిశేష మగు 'అపస్కిరణము' సూర్య. ని. లో గ్రహింపఁబడియుండఁగా నిర్విశేష మగు 'అపకిరణము' లేదని యాక్షేపించుట సరి కాదు. ఇక్కడి తక్కిన యాక్షేపములు గూడ నిట్టివే కనుక వానికి సమాధానము వ్రాయ నక్కఱ లేదు.

౩౭. ఆక్షే:—సంస్కృతములో 'పరి, అధి' మొదలగువాటికి 'పరీ, అధీ' అని రూపాంతరము లున్నవి. "పరితాప=పరీతాప". ఇటువంటివి నిఘంటువులో వ్రాయకపోతే విద్యార్థులను మోసపుచ్చినట్లవుతుంది. ఇవి ఊహించి కనుక్కోలేరు. ఆప్తే. లో 'అధీవాసః' ఉన్నది. (౨౦౮ పే.)

సమా:—సంస్కృతమున 'పరి, అధి' మున్నగు నుపసర్గముల కెల్ల 'పరీ, అధీ' మొ. రూపాంతరము లున్న వనుట తప్పు. ఉన్నచో 'అధీకరణము, అధీకృతి, అధీక్రియ' మున్నగురూపములు గూడ నుండ వలసివచ్చును. అట్టి వుండఁ గూడదు. 'ఘఞ్' ప్రత్యయాంతశబ్ద ముత్తర పదముగా నుండి, సముదాయము మనుష్యవాచకము కానప్పుడు ఉప సర్గమునకు బహుళముగా దీర్ఘము వచ్చును. (చూ. సూ. ఉపసర్గస్య ఘ ఞ్యమనుష్యే బహుళమ్. అష్టా. ౬. ౩. ౧౨౨.) కనుక "పరీతాప, పరీపాక, పరీహా"సాదిశబ్దములు సిద్ధింపఁగలవు. వానిని దక్కిననిఘంటు వులతోపాటు సూర్య. ని. కూడ గ్రహింపఁ గలదు. అట్టిదే యగు 'అధీ కారము' గ్రహింపఁబడియే యున్నది. అట్లుకాక యట్టివాని నన్నిటిని గ్రహించిననే కాని విద్యార్థులకుఁ దెలియ వందురేమో సమాధానము వినుఁడు. సంస్కృతమున సుమారు రెండువేలధాతువులు గలవు. వాని కన్నింటికిని గర్తృభిన్నకారకములు వాచ్యము లగునపుడు ఘఞ్ప్రత్యయ ములు చేసి తద్రూపములకెల్ల నజంతోపసర్గములతో సమాసము చేసి దీర్ఘము వచ్చినరూపమును రానిరూపమును జూపుట కారంభించిన చో సుమారు కొన్నిలక్షల పదము లగును. వీనిలో మనుష్యవాచకము లగుటచేతను బహుళగ్రహణముచేతను గొన్ని పోయినను దక్కినవి కూడ లక్షలలోనే యుండును. ఇట్టివానిని వ్యాకరణమే తెలుపును గాని నిఘంటువులు తెలుపవు. మఱియు ఆప్తే. ని. లో నొక్క 'అధీవాసః' ఇచ్చినంతమాత్రమున నే మైనది ?. తక్కిన వన్నియును లేవుగదా ! అది యైనను కాత్యాయనశ్రౌతసూత్రమునుండి వాచస్పతి చూపినదే. కనుక వేదమునను శ్రౌతగ్రంథములలోను గలవియును, వ్యాకరణమువలననే

తెలియఁదగినవియును నగు శబ్దముల నన్నింటి నాంధ్రనిఘంటువున నీయ లే దని యాక్షేపించుట సమంజసమో? అసమంజసమో? పాఠకు లూహించుకొనుటకై యిక్కడ విషయమును వివరించినాను.

౩౫. ఆక్షే:—'ఊర్వశీ' శబ్దము 'ఉర్వశీ' శబ్దానికి రూపాంతరముగా సూర్య.ని. లో ఉన్నది. ఆ_ప్తే.ని. లో లేదు. 'ఊ'కారమేలాగున వచ్చినది? వేదములోను కావ్యనాటకాదులలోను 'ఉర్వశీ'. (౨౦౮ పొ)

సమా:—'ఊర్వశీ' శబ్దము విల్స్యమ్సు, వాచస్పత్యము, కల్పద్రుమము, రాయముకుటాద్యమరవ్యాఖ్యలు మున్నగు ననేకగ్రంథములలో నున్నది. "ఊరుం=నారాయణ స్యోరుం; కారణత్వేనాశ్ను తే" అని వ్యుత్పత్తి ప్రదర్శనపూర్వకముగా నీశబ్దము వాచస్పత్యములోను, అమర వ్యాఖ్యలలోను సాధింపఁబడినది. మఱియు శ్రీహర్షుఁడు రచించిన ద్విరూపకోశములో "శ్లో. ఊర్వశీచోర్వశీ తథా" అని రెండురూపములు చూపఁబడినవి. కనుక 'ఊర్వశీ' కూడ సాధువే. అందుచేతనే భారతాద్యాంధ్రగ్రంథములం దెల్ల "ఊర్వశీ"అనియే కలదు.

౩౬. ఆక్షే:—ఆప్తే. ని. లో 'ఊర్ణనాభః, ఊర్ణవాభిః' అనే శబ్దా లున్నవి. సూర్య. ని. లో "ఊర్ణనాభము, ఊర్ణనాభి" ఉన్నవి. రెండోది ఎక్కడనుండి వచ్చినది? ఆప్తే. ని. లోని 'ఊర్ణవాభిః' అనేశబ్దము 'ఊర్ణనాభి' అని పఠించి దానిని 'ఊర్ణనాభి'గా తెలుగించినారా?

(ఈశబ్దము ఆర్యభాషాతత్త్వజిజ్ఞాసువులైన పాశ్చాత్యపండితులు సావధానముగా పరీక్షించినది......ఇట్టిశబ్దాలు చరిత్రకు ఆధారము.)

భాషాతత్త్వజిజ్ఞాసువులకు సూర్య. ని. వంటివి ప్రమాణము కావు గదా! భాషాతత్త్వవేత్తలకు 'ఊర్ణవాభి' కి బదులుగా 'ఊర్ణనాభి' కనబడితే ఏమనుకొంటారు?. (౨౦౭ పొ.)

సమా:—"ఊర్ణనాభము, ఊర్ణనాభి" అను శబ్దములు రెండును వాచస్పత్యమునను విల్స్యమ్సులోను గలవు. వాచస్పత్యమున "సమాసాంతవిధే రనిత్యత్వాత్ క్వచిత్ అచ్ న.శ్లో.నాచాకేణ వినా సృష్టి మూర్ణ

నాభే రమీష్యతే, న చ నిస్సాధనః కర్తా కశ్చిత్సృజతి కించన." అని సప్రమాణముగా 'ఊర్ణనాభి' శబ్దము సాధింపఁబడియున్నది. కనుకనే సూర్య. ని దీనిని గ్రహించినది. 'ఊర్ణవాభి' శబ్దము వైదికము. అందుచేతనే వాచస్పతి, విల్సన్ను దీనికి వేదమునుండియే యుదాహరణము లిచ్చినారు. ఈవైదికశబ్దము చరిత్ర కెంత యాధారమైనను లౌకికనిఘంటువగు సూర్య. ని. దీనిని గ్రహింపదు.

౨౦. ఆక్షే:—'అభిమానము' క్రింద 'ఆత్మగౌరవము' 'అందలము' క్రింద 'ఆందోళః' ఉన్నవిగాని మూలపదాలలో చేరలేదు. 'అరాబు' క్రింద 'ఉపసాలము' ఉన్నది. అందుకు ప్రమాణము ఆంధ్రభాషార్ణవము. సంస్కృతములోనిది యున్నదా? తెలియదు. 'ఉపశాలమ్' ఉన్నది. అది దీనిలో చేరలేదు. 'ఉపసాలాఖ్యయగు నరాబు' అనే పాఠము తప్పా?......వ్యవస్థలేకుండా పనిజరిగినది, అస్తవ్యస్తమైనది. 'వెంకన్న వేమవరం వెళ్ళి వచ్చాడు.' అన్నట్టు. (౭౦౫ పా.)

సమా:—'ఆత్మగౌరవము' 'ఆత్మన్, గౌరవ' శబ్దములలో గతార్థము. 'ఆందోళము' మూలపదముగా సూర్య. ని. లో గ్రహింపఁబడియే యున్నది. 'ఉపసాలము' సంస్కృతనిఘంటువులలో లేదు. సంస్కృతనిఘంటువులలో లేని సంస్కృతపదములు కొన్ని యాంధ్రభాషార్ణవమునఁ గల్పింపఁబడియున్నవి. అవి తదేకప్రమాణము లగుటచేఁ జాలవఱకుఁ ద్యజింపఁబడినవి.

ఆప్టే. ని. లోని 'ఉపశాలమ్' స్త్రీలింగ మగు 'శాలా' శబ్దమునకు సంబంధించినది. ఆంధ్రభాషార్ణవములోని 'ఉపసాలము' పుంలింగ మగు 'సాల' శబ్దమునకు సంబంధించినది. ఈరెండింటికిని అర్థమునఁ గాని శబ్దమునఁ గాని సంబంధ మేమియును లేదు.

౨౧. ఆక్షే:—శబ్దస్వరూపము వికృత మైనందుకు నిదర్శనము. "ఇహము. సం. అవ్య"అని వ్రాసినారుగదా; విద్యార్థులు సంస్కృతమునందు 'ఇహమ్' ఉంటుం దనుకోరా? 'సం. ఇహ. అవ్య' అని వ్రాయ

వలెను. 'జగము. సం. వి.' అని వ్రాస్తే సంస్కృతములో 'జగమ్' అనే శబ్ద మున్న దనుకోవడమునకు కారణము కాదా? (౨౦౬ పొ.)

సమా:—ఈయాక్షేపమే సమంజసము గా లేదు. "ఇహము. సం. అవ్య" అని వ్రాసిన 'ఇహమ్' అని, "జగము. సం. వి."అని వ్రాసిన 'జగమ్' అని, "నగము. సం. వి" అని వ్రాసిన 'నగమ్' అని, సంస్కృత మున నుండు నని విద్యార్థులను కొనుటకును, 'ఇహ,జగ,నగ' అని సంస్కృతమున నుండఁగాఁ దెనుఁగుప్రత్యయమగు 'ము'చేరిన దని యనుకొనకుండుటకును గారణము కళాప్రపూర్ణులకే తెలియును. మఱియు 'ఇహము' మున్నగువానియొద్దఁ బంతులుగారు వ్రాయ వలయు నని చెప్పి నంట్లంగీకరించినచో "చిరము" మున్నగువాని యొద్దఁగూడ "సం. చిరమ్. అవ్య." అని వ్రాయ వలయునుగదా? అప్పుడు విద్యార్థులు "చిరమ్+ఉ" కలిసి 'చిరము' అను రూప మేర్పడిన దనియును, 'ఉ' తెనుఁగుప్రత్యయ మని యును, దానికి 'వృద్ధు' మున్నగునవి యుదాహరణము లనియును భావించుకొనరా ?. 'చిరము' మున్నగువానిలో 'ము' ప్రత్యయసన్నిధానమున 'మ్' లోపించునని విద్యార్థులు తెలిసికొందు రని పంతులుగా రన్న యెడల నట్టిజ్ఞానము కలవిద్యార్థులు సూర్య. ని. లోని 'ఇహపరములు' అను నుదాహరణమును, "ఇహలోకము, ఇహాగతుఁడు, ఇహాముత్రఫలము" మున్నగుపదములను జూచుకొని సంస్కృతమున 'ఇహ' అని యుండు నని భావించుకొనఁగల రని సమాధానము చెప్పవచ్చును. ఏభాషానిఘంటువైనను దద్భాషలో నల్పప్రవేశ మేనియు లేనివారికిఁ గలుగుశంకలను దీర్పఁ జాలదు. కనుక గ్రంథము చదువుట కెట్టివాఁ డధికారియో మొదట నిర్ణయించుకొని పిమ్మట గ్రంథమును విమర్శింప వలయును. పంతులుగా రట్లు చేయ లేదు.

౧౨. ఆక్షే:—తెలుగులో 'ఇహమందు' విశేష్యము.(౨౦౬పొ)

సమా:—'ఇహము' అనుదానిపై 'అందు' మొదలగువిభక్తులు కూడఁ బ్రయోగములం దున్నవి. కనుకఁ దెనుఁగున దాని నవ్యయ మని

వ్రాయఁ గూడదు. 'జగము' మున్నగువానినిబోలె 'విశేష్య'మని వ్రాయ వలయు నని పంతులుగారియాశయము కావచ్చును. కాని, సంస్కృతమున 'ఇహ' అనునవ్యయ మధికరణశక్తిప్రధానము. (అనఁగా "ఈలోకమందు" అనునర్థ మిచ్చు నని భావము) ఐనను ప్రత్యయసంబంధము కలిగినప్పు డధికరణశక్తిప్రాధాన్యము పోయి శక్తిమత్త్వము మాత్రమే మిగులును. (అనఁగా "ఈలోకము" అనునర్థమే యిచ్చు నని భావము.) అంతమాత్రమున నవ్యయత్వము పోదు. (ఈవిషయ మహోబల పండితీయమున నజంతపరిచ్ఛేదమునఁ జర్చింపఁబడియున్నది.) కనుక 'అందు' మున్నగు విభక్తులతోఁ గూడియున్నను 'ఇహము' మున్నగువాని నవ్యయము లనియే చెప్పవలయును. అట్లే సూర్య. ని. వ్రాసినది.

౮౩. ఆక్షే:— వేరువేరు ప్రకృతులనుండి పుట్టి వేరువేరు అర్థము కలిగి ఏకరూపము పొందినశబ్దాలు (Head words) గా వ్రాయవలెను. ఈసూర్య. ని. లో అట్లు జరుగ లేదు. "ఉదా:— ఆదుఁడు. (1) తినువాఁడు. (2) తీసికొనువాఁడు." ఈశబ్దము మూల శబ్దముగా వ్రాయడమే హాస్యాస్పదముగా ఉన్నది. "అన్న + అద = అన్నాద" అని... ఆక్షే. ని. లో ఉన్నది. "అన్న + ఆదుఁడు" అని సూర్య. ని. లో వ్రాసినవారు భ్రమపడ్డారు. ఏదయినా ఈయర్థమందు 'అద్' ధాతువునుండి వచ్చినశబ్ద మిది. 'దాయాదః' అన్నది 'దాయం ఆదత్తే' 'ఆ' అనే ఉపసర్గతో కూడిన 'దా' ధాతువునుండి వచ్చినది. అది జుహోత్యాదివర్గములోనిది. శ్లువికరణము. 'అద్' అదాది, లుగ్వికరణము. (౨౦౩ పే.)

సమా:— వేఱువే ఱర్థముల నిచ్చుచు సమానరూపములుగా నున్న తత్సమేతరశబ్దములు మూలశబ్దములుగానే సూర్య. ని. లో వ్రాయఁబడినవి. ఆంధ్రనిఘంటువులో సంస్కృతశబ్దములవిషయమున నట్టి విభాగము చేయుట యనవసరముగా గ్రంథము పెంచుట యగు నని మానివేసినారు.

'ఆదుఁడు' మూలపదముగా గ్రహించుటయు, 'అన్న + ఆదుఁడు' అని వ్రాయుటయు భ్రాంతిమూలకము కాదు. కర్మవాచక మగు 'అన్న' శబ్ద ముపపదముగా నున్నప్పుడు 'అద్' ధాతువునకు "కర్మణ్యణ్. అష్టా. ౩. ౨. ౧." అనుసూత్రముచే 'అణ్' ప్రత్యయము రాఁగా 'ఆద' అను రూప మగును. "అన్న + ఆద = అన్నాద" అని రూపసిద్ధి. కనుకనే "ఆదుఁడు...౨. (అ. ఈ. అ.) తినువాఁడు. (ఉదా:—అన్నాదుఁడు, మొ. దీని కీయర్థమున వ్యస్తప్రయోగము లేదు.)" అని సూర్య. ని. వ్రాసినది. ఇది "కుంభకారుఁడు" మున్నగువానివంటిది. 'ఆదుఁడు' ప్రత్యేకముగా వ్రాయుటచేత "పిండాదుఁడు, ఫలాదుఁడు, మాంసాదుఁడు" మున్నగు ననేకశబ్దములు సంగ్రహింపఁబడును. ఇట్టిచోట్ల నీవిధముగా వ్రాయకున్నఁ బై శబ్దముల నన్నింటిని వ్యర్థముగా గ్రహింప వలసివచ్చుటయు, అందేవేని గొన్ని దాఁటిపోయినచోఁ బంతులుగారివంటివారు 'ఇవి లేవు, అవిలేవు' అనియాక్షేపించుటయు సంభవించును. ఇట్టివిషయముల నెల్ల నాలోచించియే సూర్య. ని. ఈమార్గము ననుసరించినది.

ఆప్టే 'అద'లో (ఇది సమాసాంతముననే యుండును.) అని వ్రాసి 'అన్నాద' లో "అన్న + అద" అనివ్రాయుటచేత 'అణ్' ప్రత్యయాంత రూపమునే యాతఁడు చూపినట్లు భావింపవలసియున్నది. కాని యప్పుడు 'అద'లో 'ఆద' అనియును, 'అన్నాద'లో "అన్న + ఆద" అనియును వ్రాయవలెను. ఆప్టేయట్లు వ్రాయక ద్వైవిధముగా వ్రాయుట పొరపాటు. లేక "వ్యత్యయో బహులమ్. అష్టా. ౩. ౧. ౮౫." అనుసూత్రముచేత (కర్మవాచక ముపపదముగా నున్నప్పుడే) 'అణ్' కు బదులుగా 'అచ్' వచ్చినచో ఆప్టే వ్రాఁత సరిపడును. కాని యట్టిప్రత్యయవ్యత్యయము వైదికము. చూడుఁడు.

"సూ. వ్యత్యయో బహులమ్. అష్టా. ౩.౧.౮౫...ఛందసి... తద్వాచినామ్ (=కారకవాచినామ్.) కృత్తద్ధితానాం వ్యత్యయః. అన్నాదాయ. అణ్విషయే అచ్. అవగ్రహే విశేషః" (కౌముది.) "అవగ్రహ

ఇతి. అణికృతే అన్న ఆదాయేతి, అచితు అన్న అదాయేతి భావః"
(సుబోధినీవ్యాఖ్య.)

కావున నెన్నివిధములుగా నాలోచించినను సూర్య. ని. వ్రాసినదే యుక్తముగా నున్నది

౪౪. ఆక్షే:—"అధివసించు. సం. అ. క్రి. నివసించు." దీనిక్రింద వ్రాసిన ప్రయోగాలలో స. క్రియగా ఉన్నది. సంస్కృతమందు "ఉపాన్వధ్యాఙ్వసః" అనేసూత్రము చొప్పున, అధివస్, ఉపవస్, అనువస్-ఇవి స. క్రి. 'అధిష్ఠించు' స. క్రి. అని వ్రాసినాకే, దానివంటిదే 'అధివసించు' 'అధిశీఙ్ స్థాసాం కర్మ' కర్మ గలది సకర్మకము. (౨౦౬. పొ.)

సమా:—"అధివసించు; అధిష్ఠించు" మున్నగు తత్సమక్రియలకుఁ దెనుఁగుకవుల ప్రయోగములను బట్టియే సకర్మకత్వాకర్మకత్వములు నిర్ణయింప వలయును. అట్లు కాక పంతులుగారు వ్రాసినట్లు సంస్కృత వ్యాకరణమునుబట్టి సకర్మకత్వాకర్మకత్వనిర్ణయము చేయునెడల "కోపించు=క్రోధించు" అనునది యకర్మకము కావలయును. ఎవనిపైఁ గోపముండునో తద్వాచకపదమునకు (క్రుధద్రుహేర్ష్యాసూయార్థానాం యం ప్రతి కోపః.అష్టా. ౧. ౪. ౩౭" అనుసూత్రముచేతఁ జతుర్థియును రావలయును. తెనుఁగున నిట్టిప్రయోగములు లేకపోవుటయే కాక 'కోపించు' స. క్రి, అ. క్రి. గాను, ఏవనిపైఁ గోపముండునో తద్వాచకపదమునకు ద్వితీయాతృతీయావిభక్తులును ప్రయోగములందుఁ గనబడుచున్నవి. చూడుఁడు.

మ. గురుశాస్త్రార్థగరిష్ఠు లైన బుధులన్ గోపింపఁగా రాదు...

మల్లభూపాలీయము. నీతి. ౧౩.

క. ఆపడవాలును దమభటుఁ, గోపించుచు...

సింహాసనద్వాత్రింశిక. ౭. ౩౩.

క. రక్కసులరాజు సీతో, మిక్కిలి కోపించినాఁడు...

భాస్కరరామాయణము. యుద్ధ. ౧౫౨.

కనుకనే యథర్వణాచార్యుఁడు—

"శ్లో. అకర్మణ స్సకర్మత్వ మకర్మత్వం సకర్మణః, తద్వతాం క్వచి దైక్యం స్యా చ్ఛబ్దశక్తి ర్హి తాదృశీ. క్రియా. ౧౧" అని చెప్పినాఁడు.

సూర్య.ని. లో 'అధివసించు' క్రింద నిచ్చిన ప్రయోగములు స. క్రి. గా నున్నవనుట సరి గాదు. చక్కగాఁ బరిశీలించుకొనినచో వరాహపురాణము. ౪. ౧౫౫, రంగారాయచరిత్ర. ౨. ౧౩౧. అ. క్రి. అనుటకే నిర్ధారకములు. మఱియు 'అధివసించు' అ. క్రి. అనుటకుఁ జాల ప్రయోగము లున్నవి. చూడుఁడు.

వ. ఊర్వశి మేనక రంభ ...వీరు మొదలుగా నలువది వేలు దివ్యాప్సరస లీలోకంబునం దధివసింతురు. కాశీ. ౩. ౧౭౦.

సీ. భ్రూవల్లరీయుగ్మమునకు మధ్యంబున
నానంద వనతీర్థ మధివసించు. కాశీ. ౨. ౧౧౭.

వ. ఇడానాడియందుఁ జంద్రుఁ డధివసించి యుండుం గావున నందుఁబవనం బుద్గమించుకాలంబు రాత్రి. ప్రవేశించుకాలంబు పగలు. పింగళా నాడియందు సూర్యుం డధివసించుం గావున నందుఁ బవనం బుద్గమించుట దివంబు... కాశీ. ౨. ౧౨౭.

ఇప్పటి కైనను "సూర్య.ని. సవిమర్శముగా రచింపఁబడినది. ప్రమాణము" అని కళాప్రపూర్ణు లంగీకరింపరా ?

౭౫. ఆక్షే:—సమస్తశబ్దాలకు సూర్య. ని. కర్తలు సమష్టిశబ్దాలని పేరు పెట్టినారు. (చూ. పీఠిక. 7,9. పుటలు) నాకు వింతగా ఉన్నది ఈపేరు. ఏశాస్త్రములో ఉన్నదో. సిద్ధాంతకౌముది చదువుకొన్నవారిని కొందరిని నేను అడిగినాను. తమకు తెలియ దన్నారు. (౨౦౩ పా.)

సమా:—ఆంగ్లపదమగు 'Phrase' (=సమాపకక్రియా రహిత మగుసర్థవత్పదసముదాయము.) అను దానియర్థమును దెల్పుటకై 'సమష్టిపదము' అనునది కల్పింపఁబడినదిగాని, సమస్తశబ్దమునకుఁ బర్యాయపదముగాఁ గల్పింపఁబడ లేదు. ఈవిషయము పీఠికను సరిగాఁ

జూచుకొనిన స్పష్ట మగును. సమ స్తపదము లన్నియు సమష్టిపదములు కావచ్చును గాని, సమష్టిపదము లన్నియు సమ స్తపదములు కావు.
ఉదా:—అదరకబెదరక, ఇదియది యనక, ఎత్తుకెత్తు, మొ.

ఇవి సమష్టిపదములే కాని సమ స్తపదములు కావు.

౭౬. ఆక్షే:—మీాది ఎనిమిదిపేరాలలో చూపించినదోషాలకూ లోపాలకూ ఉత్తరవాదు లెవరు? (౨౦౭ పే.)

సమా:—నిజముగా దోషములు లోపములు నున్నయెడల వానికి నిఘంటుకర్తలే యుత్తరవాదులు. కాని గుణదోషనిర్ణయమునకు బహుగ్రంథద్రష్టలు, ద్వేషరహితులు, ఉభయభాషాపండితులు నగు విమర్శకులు మాత్రమే యర్హులు.

౭౭. ఆక్షే:—కీ.శే.కళాప్రపూర్ణ,వేదం,వేంకటరాయశాస్త్రులు గారు ప్రకటించిన నిఘంటుస్వరూప దిక్ప్రదర్శనపత్రములలో ఉదాహృతమైన సంస్కృతశబ్దాలలో కొన్ని సూర్య. ని. లో లేవు. ఉదా:—అంగాధిపుఁడు, అంగాపూర్వము, మొ. 'అంగము' క్రింద—పంచాంగములు, షడంగములు, సప్తాంగములు, అష్టాంగములు, అంగుఁడు, ఆకారము ... లేవు. (౨౦౭ పే.)

సమా:—'అంగాధిపుఁడు' మొదలగునవి తత్తచ్ఛబ్దములలో గతార్థములు. పంచాంగములు మున్నగునవి ప్రత్యేకముగా నాయాస్థలములలో వ్రాసినారు. ఈవిషయము సూర్య.ని.లోని 'అష్టాంగములు' అనుపదము చూచుకొనిన స్పష్ట మగును.

"అంగుఁడు"—దీనికి "౧. వేరునితండ్రి. ౨. బలిపెద్దకొడుకు. 3. కౌరవయుద్ధమున భీమునిచే మడిసినమ్లేచ్ఛరాజు." అనునర్థము లిచ్చినారు. సుప్రసిద్ధములగు సంజ్ఞావాచకములుగూడ గ్రహింపనక్కఱలేదని శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు కొంతకాలముక్రితము భారతిలో వ్రాసినారు. ఇప్పుడు గిడుగువా రట్టి యప్రసిద్ధసంజ్ఞావాచకములుగూడ నుండవలె ననుచున్నారు. పై రెండుమతములును సరియైనవి కా వని

తలఁచి నిఘంటుకర్తలు సుప్రసిద్ధము లగువానిని మాత్రమే గ్రహించినారు.

"అకారము"—ఇది "కారము. ౧౦ అర్థము"లో గతార్థము. దీనిని ప్రత్యేకముగా గ్రహించిన 'ఇకారము' మున్నగువానినిగూడ గ్రహింపవలెను. అప్పుడు వ్యర్థముగా గ్రంథము పెరుఁగును.

౪౭. ఆక్షే:—'అర్షవివాహము' క్రింద— కశ్యపసంహితలోని శ్లోకాలు వ్రాసినారు. 'అనిష్టానుబంధి' క్రింద—కాదంబరిలోని వాక్యము వ్రాసినారు. 'అగ్రేవణము' క్రింద—గణరత్నమహోదధిలోని శ్లోకాలు వ్రాసినారు. ఈలాగుననే అనేక సంస్కృతశబ్దాలకు ప్రయోగాలు సంస్కృతగ్రంథాలలోనివే వాచస్పత్యమునుండి ఎత్తి వ్రాసినారు. వాటికి తెలుగున అర్థం లేదు. ఎవరికోసం ఈశ్రమ అంతా! ఆశ్లోకాలకు అర్థం తెలుసుకో గలవారికి ఈనిఘంటువు అక్కర లేదు. (౨౦౭ పొ.)

సమా:—సంస్కృతభాషలోఁ బ్రవేశము లేక నిఘంటువులో వ్రాసిన యర్థముతోనే తృప్తిపడువారికిఁ బ్రమాణములు చూపవలసిన యక్కఱ లేదు. సంస్కృతభాషలోఁ బ్రవేశము కలిగి నిఘంటువులో వ్రాసినదానికిఁ బ్రమాణము నపేక్షించువారికొఱకే తత్తత్సంస్కృతగ్రంథములనుండి ప్రమాణములు చూపవలసియుండును. అందుచేతనే ముఖ్యస్థలములలోఁ దక్కఁ దక్కుచోట్లఁ బ్రమాణముల కర్థము వ్రాయలేదు. ప్రమాణముల కన్నింటికి నర్థము వ్రాయవలయు నన్న గ్రంథ మతిమాత్ర మగును. మఱియుఁ దెనుఁగుగ్రంథములనుండి యుదాహరించుపద్యములన్నియు నిఘంటువు చూచుకొనువారికెల్ల నర్థ మగునా? కావు. కనుకఁ దెనుఁగుపద్యములకుఁగూడ నర్థము వ్రాయవలదా ? అట్లు వ్రాయుట మొదలిడిన గ్రంథ మెంత యగును? అది యవసర మగుపనియా? అని యాలోచించి పైపద్ధ యే మంచి దని సూర్య.ని. నిర్ణయించుకొన్నది. ఆప్టే.ని. కూడఁ దాను బ్రమాణముగా నిచ్చిన సంస్కృతశ్లోకములు మున్నగువాని నన్నింటి నాంగ్లమున ననువదింపలే దని పంతులుగారికిఁ దెలియదా?.

౭౯. ఆక్షే:—సూర్య. ని. లోని తెలుగుమాటలలో 'అవక తవక' అనేమాట లేకపోవడము పెద్దలోపముగా శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారికి కనబడినది......నాకూ ఆలాగుననే తోచింది...... (౨౦౮ పొ.)

సమా:—'అగు' ధాతువునకు వ్యతిరేకార్థమున 'కాక' అను రూప మగు నని తెలియక—'తగు' కు రూపాంతరమగు 'తవు' కు వ్యతిరేకార్థమున 'తవక' అయినట్లే 'అగు' కు రూపాంతర మగు 'అవు' కుఁ గూడ 'అవక' అగు నని సారూప్యభ్రమచే ననుకొనువారి నధిక్షేపించుటకై 'అవకతవక' కల్పింపఁబడియుండవచ్చును. ఆవిషయమును స్ఫురింపఁ జేయుటకే 'అవక, తవక' అను రెండుపదములను గలిపి వాడుచున్నారు—అని కొందఱుచెప్పుచున్నారు. ఇది గ్రాంథికశబ్దము కాదు. దీనిని బ్రౌణ్యనిఘంటువైనను గ్రహింపలేదు. కేవలవ్యవహారముననే యున్నయిట్టి గ్రామ్యశబ్దములను గ్రహించుట సూర్య. ని. ఉద్దేశమునకు విరుద్ధము.

(౮౦) ఆక్షే:—ఆప్టే నిఘంటువులోని వైదికశబ్దములు కూడా 'అగువు' వంటివి గుర్తుచేసి బడ్డట్టు' వివేకం లేకుండా ఎత్తుకొన్నారే! ఆప్టేగారు అవి వైదికము లని స్పష్టముగా నిర్దేశించినారు. వీరిబృహన్నిఘంటువులో అట్టినిర్దేశము లేదుగదా ! విద్యార్థులు ఇవి లౌకికశబ్దాలను కొని మోసపోరా ?...'అగువు' వంటివైదికశబ్దాలు వీరినిఘంటువులో నుంచి ఎత్తుకొని భావికవులు వాడితే ఎవరిది ఆదోషము ? ఆపాపము ? (౧౨౫ పొ)

సూర్య. ని. లోని 'అగువు' అనేశబ్దము 'అగుః' యొక్కరూపము.'అగుః' వైదికశబ్దము. అది సంస్కృతములో నైనా వాడ గూడదే. తెలుగులో వాడవచ్చునా ? ఆశబ్దము 'వైదికము' అనిస్పష్టముగా తెలియజేసే గుర్తు పెట్టకపోతే శబ్దరూపమునుబట్టి అది వైదిక మని యెవరూ తెలుసుకోలేరు. 'అగుః' వలెనే కనబడుతున్నవి 'చిత్రగుః, శబలగుః, తిష్ఠద్గు, వహద్గు' ఇవి వైదికములు కావు...'అరాతిః'లౌకికమైనా 'రాతి'

వైదికము. సమాసములలోఁగూడా ఇట్టిభేద మున్నది. 'అంతఃపురమ్' వంటిదే 'అంతఃపాత్రమ్' అయినా అది వైదికము... 'అంతః'తో చేరిన సమాసాలలో... అంతఃపేయమ్, అంతఃకథ, మొ. వైదికాలు. సమాసాలు, తద్ధితాలు, కృదంతాలు, స్త్రీలింగాలు మనయిష్టము వచ్చినట్లు కల్పించి ప్రయోగించ గూడదు. ఆప్తే. ని. లో అన్నిసమాసాలు వ్రాసినారు. వాటిలో ఏవి వైదికములో తెలియ జేసినారు. ఈనిఘంటువులో 'అవకతవక'—నిఘంటునిర్మాతలు ఏనియమము చొప్పున ఆప్తే. ని. లోనిమాటలు ఎత్తుకొన్నారో తెలియదు... లౌకికభాషఅంటే యేమిటో పతంజలి మొ. ఆచార్యులు అందరూ చెప్పినారు. తెలుగుపండితులకు అది తెలియదా? బోధపడదా? (౨౦౮—౨౧౦ పొ.)

సమ:—శ్రీపంతులుగారు పై విధముగా నాలుగుపొరటలలో ఆప్తే వైదికము లని తెలుపుగుర్తు పెట్టినశబ్దములు వైదికము లనియును, అట్టిగుర్తు పెట్టనిశబ్దములు లౌకికము లనియును, ఆవిషయమును సూర్య. ని. కర్తలు గ్రహింపక 'అగువు' అను వైదికశబ్దమును గూడ లౌకికనిఘంటువగు సూర్య. ని. లో గ్రహించినా రనియును వ్రాసి, లౌకికవైదికశబ్దములనుగూర్చి తమకుఁ దెలిసినదానిని మిక్కిలి విపులముగాఁ బాఠకులకుఁ దెలిపినారు. కాని 'అగువు' వైదికము కాదు. చూడుఁడు.

లోకవ్యవహారమున నుండుటకు వీలు లేనివియును, వేదమున మాత్రమే యుండు నవియును నగుశబ్దములు వైదికములు. తద్భిన్నములు లౌకికములు. 'కర్ణేభిః, గృభ్ణామి, త్రియంబకః' మున్నగు కేవలవైదికశబ్దములను పాణిన్యాదులు 'ఛందసి, వేదే, మంత్రే, ఋషౌ, నిగమే' మున్నగుశబ్దములతోఁ గూడిన "సూ. బహుళం ఛందసి. అష్టా. ౭.౧.౧౦. (వా) హృగ్రహో ర్భశ్ఛందసి. (వా) తన్వాదీనాం ఛందసి బహుళమ్. సూ. బభూథాతతన్థ జగృభ్మ వవ్థేతి నిగమే. అష్టా. ౭.౨.౬౪." మున్నగు సూత్రవార్త్తికాదులచేఁ బ్రత్యేకముగా సాధించియున్నారు. ఇట్లే కేవల లౌకికశబ్దములను గూడ "సూ. భాషాయాంసదవసశ్రువః. అష్టా. 3.౨.

౧౦౮. (వా) భాషాయాం ధాఞ్కృసృగమిజనినమిభ్యః” మున్నగు భాషాదిశబ్దఘటితసూత్రవార్త్తికాదులచేఁ బ్రత్యేకముగా సాధించియున్నారు. ఇట్టి ‘భాషాయాం, ఛందసి’ మున్నగుశబ్దములతో సంబంధము లేని యితరసూత్రవార్త్తికాదులచేత సాధ్యము లగుశబ్దములు లోకవేద సాధారణములు. ఇదియే సర్వవైయాకరణసిద్ధాంతము. ఆ ప్తేపండితుఁడైనను, ఇతరులైనను, ఈమార్గము ననుసరించియే వైదికలౌకికశబ్దనిర్ణయము చేయవలెను. తెలుఁగుపండితులకుఁ దెలిసినదియు బోధపడినదియు నీసిద్ధాంతమే. సూర్య. ని. కూడ నీసిద్ధాంతము ననుసరించియే వైదికలౌకికశబ్దవిభజనము చేసికొని లౌకికశబ్దములుమాత్రమే గ్రహించినది. ఆప్తేపండితుఁడు వైదికము లేవియో లౌకికము లేవియో సరిగా విమర్శింపక వైదికము లని తెలియఁజేయు గుర్తు పెట్టినంతమాత్రమున నా శబ్దములు వైదికము లని తెలుఁగుపండితులు నిర్విమర్శముగా నిర్ణయింపరు. బాగుగాఁ బరిశీలించినచో ఆప్తేపండితుఁడు వాచస్పత్యము, విల్సను నిఘంటువులలోనిశబ్దముల నొక్కచోఁ జేర్చి తననిఘంటువు రచించినట్లును, వారు వైదికము లని చెప్పకున్నను వేదములనుండి యుదాహరణముల నిచ్చినంతమాత్రమునఁ జాలచోట్ల నాశబ్దములను వైదికము లని తననిఘంటువున వ్రాసినట్లును దెలియఁగలదు. “ఇషణిః, ఇషణ్యా” మున్నగువైదికశబ్దములకు వైదికము లని తెలియఁజేయు గుర్తు పెట్టకపోవుటయు, స్వరాదిభేదములచేఁ గేవలవైదికములు, కేవల లౌకికములు, లోకవేదసాధారణములు గూడ నగు ‘రాతి’ మొదలగుశబ్దముల నావిధముగా గ్రహింపకుండుటయు, ‘అగువు’ మున్నగు లోకవేద సాధారణశబ్దములను వైదికము లనియే గ్రహించుటయు మున్నగునవి పై విషయమునకుఁ బ్రమాణములు.

పంతులుగారు ఆప్తేనుబట్టి వైదికము లని వ్రాసినవానిలోఁ గొన్నింటి నుదాహరణార్థము విమర్శించెదను.

'రాతి'

అన్తోదాత్తమును, 'క్తిన్' ప్రత్యయాంతమును, కర్తృభిన్నకారక భావార్థవాచకమును, అగు 'రాతి' శబ్దము వైదికము. (చూ. సూ. మన్త్రే వృషేషపచమనవిదభూవీరా ఉదాత్తః. అష్టా. 3. 3. ౯౬.)

ఆద్యుదాత్తమును, 'క్తిన్' ప్రత్యయాంతమును, కర్తృభిన్నకారక భావార్థవాచకమును, అగు 'రాతి' శబ్దము లౌకికము. (చూ. సూ. స్త్రియాం క్తిన్. అష్టా. 3. 3. ౯౪. సూ. ఞ్నిత్యాది ర్నిత్యమ్. అష్టా. ౬. ౧. ౧౯౭.)

'అరాతి' శబ్దమునందున్న 'రాతి' శబ్దము కర్త్రర్థక 'క్తిచ్' ప్రత్యయాంతము. ఇదిలోకవేదసాధారణము. (చూ. 'అరాతి' శబ్దములోని అమరసుధావ్యాఖ్య.) కనుక వైదికమగు 'రాతి' శబ్దమునకును, 'అరాతి' శబ్దములోని 'రాతి' శబ్దమునకును సంబంధము కల దనుట సమంజసము కాదు. మఱియు వేదమున నున్నంతమాత్రమున నేశబ్దమును వైదికము కాదు. కావుననే వేదముననున్నలౌకికశబ్దముల నన్నింటిని లౌకికభాషలో వాడియున్నారు.

ఉదా:—అగ్నిమీళే పురోహితమ్. (ఋగ్వేదము.) ఇందలి 'ఈళే' మాత్రమే వైదికము. తక్కినవి లోకవేదసాధారణములు. అన్నిగ్రంథములలోను వాడఁబడియున్నవి.

'అంతఃపాత్రమ్'—ఇది ఆప్టే వ్రాసినయర్థమున వైదిక మైనను గాకున్నను "అవ్యయం విభ" క్తీత్యాదిసూత్రముచే విభక్త్యర్థమున నవ్యయీభావము వచ్చినప్పుడు మాత్రము లోకవేదసాధారణము. కనుకనే "అంతస్తంత్ర మరంస్తే" త్యాదిమల్లినాథాదిప్రయోగములు లోకమున సాధువు లైనవి.

'అంతఃపేయమ్'—ఇది 'అంతఃపాత్రమ్' వంటిదే.

'అంతఃకథ'—ఈపదము ఆప్టే. ని. లో లేదు. వీరు దీనిని వైదికమనుటకుఁ బ్రమాణము లేదు. ఆప్టే. ని. లో నున్న "అంతఃపథ" అను దానికి బదులుగా 'అంతఃకథ' అని వ్రాసినారా ?

'అగువు'—ఇది లోకవేదసాధారణమే కాని కేవలవైదికము కాదు. "న విద్యంతే గావో యస్య" అని విగ్రహము. (వా. నఞోఽస్త్యర్థానాం వాచ్యో వా చోత్తరపదలోపః. సూ. నలోపో నఞః. అష్టా. ౬. 3. ౭3. సూ. గోస్త్రియో రుపసర్జనస్య. అష్టా. ౧. ౨. ౪౮.) అనుసూత్రవార్తికములచే 'అగువు' అనురూప మగును. ఈసూత్రవార్తికములు లోకవేదసాధారణములు. "చిత్రగు, శబలగు" శబ్దములు కూడ "సూ. అనేక మన్యపదార్థే. అష్టా. ౨. ౨. ౨౪. సూ. గోస్త్రియో రుపసర్జనస్య. అష్టా. ౧. ౨. ౪౮." అనుసూత్రములచేతనే సిద్ధించినవి. కనుక "అగువు" వంటివే కాని భిన్నములు కావు.

వస్తుస్థితి యిట్లుండఁగా 'అగువు' వైదిక మనుకొని పంతులుగారు వ్రాసిననాలుగుపొరటలలోనినిందావాక్యము లెవరికిఁ జెంద వలయునో విద్వాంసులు నిర్ణయింతురుగాక.

శ్రీగిడుగు వెంకటరామమూర్తిపంతులుగారు సూర్యరాయాంధ్రనిఘంటువుపై దీర్ఘవిమర్శనము వ్రాసి, తన్మూలమున, ఆనిఘంటువు చేసినపనియును, చేయుచున్నపనియును లోకమునకుఁ గొంతవఱకుఁ దెలుపుటకు నావంటివాని కవకాశ మిచ్చినందులకు వారికి నాకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను.

---

ఈ సమాధానము 16-12-39 నాఁటికే మాకుఁజేరినను శ్రీరామమూర్తిపంతులుగారు సజీవులైయుండఁగాఁ బ్రకటింపలేనందులకుఁ జింతిల్లుచున్నారము. (ఆం. సం.)

# గ్రంథస్వీకారము.

1. శ్రీ వివేకానంద జీవిత చరిత్రము—మాధవ చైతన్య బ్రహ్మచారిగారిచే రచింపఁబడినది. సంసారసాగరమునఁబడి జననమరణాది దుఃఖతరంగపరంపరాతాడనములకుఁ దాళఁజాలక సంకటపడు సంసారులను, నిజహితోపదేశనౌకలచే నుద్ధరించి, శాశ్వతానందసుందరమగు పరమేశ్వరచరణారవింద మందిరమునఁ జేర్చువార లోకైకజ్ఞానకళాపరిపూర్ణులగు దేశికసుధాకరులే. సందియములేదు.

నేఁటి పరదేశనాగరకతా వ్యామోహములచే సనాతనమత సాంప్రదాయములు సడలుచుండుటను గాంచి, "యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం" అను గీతాప్రతిజ్ఞానుసారము అధర్మమునడంచి ధర్మమును నుద్ధరింపనెంచి కరుణామయుఁడగు భగవానుఁడు భారతవసుంధరను, వంగదేశాన శ్రీరామకృష్ణపరమహంస రూపముతో నవతరించి, నిజసుబోధసుధావాహినులచే, సనాతనమతవిముఖులైన జనతను, వైదికమతాసక్త చిత్తులుగాఁ జేసి లోకైకవిఖ్యాతింగాంచి పరబ్రహ్మమున లయమయ్యెను.

ఆసంయమీంద్రుని శిష్యగణములో నగ్రగణ్యుఁడై స్వవివేకానందచంద్రికల భూవలయమంతటను బ్రసరింపఁజేసి, అప్రతిహత వాగ్వైఖరీశోభితుఁడై, కుమతమత్తేభపంచాననుఁడై, అసమాన బ్రహ్మచర్య తేజోభాస్కరుఁడై, విద్వజ్జనచక్రవర్తియై, శ్రీ శంకరభగవత్పాదులవలె నిజసుభాషితామృతవర్షములచే జనసమూహముల నానందాబ్ధి నోలలాడించి, ముప్పదితొమ్మిదవ యేఁట నద్వైతానందపదమున కేఁగిన శ్రీవివేకానందచంద్రుని పూతజీవితచరిత్రము నాంధ్రభాషను విరచించి చెన్నపురి శ్రీరామకృష్ణమఠమునుండి శ్రీ మాధవచైతన్య బ్రహ్మచారిగారు మాసోదరులకు దయతో నందఁజేసియుండిరి. మే మాచరిత్రమును భక్తి గౌరవములతో నామూలాగ్రము పఠించి అమితానందము నందితిమి.

ఈగ్రంథరాజమునందలి భాషాశైలి మృదుమధురమై ఆబాల

వృద్ధము జనసమూహామునకంతకును సుబోధమగురీతిని సమకూర్పఁబడి నది. ఇం దనేకములగు నశ్రుతాపూర్వవిషయము లెన్నియో చెన్నారు చున్నవి. శ్రీ స్వామివారి జీవితకథావైభవములఁదెల్పు నిందలి ప్రకర ణము లోకదానిని మించి యొకటి ముందెట్టిమనోహరచరితము పొందు పఱుపఁబడియున్నదో యను నభిలాష నుదయింపఁజేయుచున్నవి.

మఱియు వివేకానందయతీంద్రుని వదనారవిందమునుండి వెలు వడిన సుధామయభాషితములెన్నియో యిందుఁ గ్రోడీకరింపఁబడి, వీను లకు విందొనర్చుచున్నయవి. ఈగ్రంథమును జదువునపుడు హృదయ మానందతుందిలమగుచుండును. కనుఁగొనలనుండి యానందాశ్రుబిందు వు లాణెముత్తెములట్లు నేల రాలుచుండును. హస్తమునన్నున్న పుస్తక ముపట్టువీడి యొడిలోఁ బడుచుండును. పైకుబాస లేల ? దీనింజదువునపు డంతరంగమున నేదియో తెలియరాని యానందతరంగమాలిక తాండ వమాడుచుండును. భౌతికవిషయవ్యామోహితులై యెట్టినిలకడయును లేక తబ్బిబ్బగుచున్న నేఁటిభారతసోదరీసోదరులకిట్టి సుందరసందేశములే యొందియఁదగినవి. ఈగ్రంథరాజము ప్రత్యాంధ్రకుటుంబమునందును స్త్రీపురుషులచేఁ దప్పక పఠింపఁబడవలయునని మాయభిలాష.

(గ్రంథము వెల రూ 1—8—0.)
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.
కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

---

2. నందపురచరిత్రము—జయపురవాసులగు కుమారవిద్యాధర సింహవిరచితము. కీ. శే. జయపురమహారాజులగు రామచంద్రదేవు బహద్దరువారి కంకితము (Nandapur a Forsaken Kingdom)

దక్షిణకాశియని ప్రసిద్ధిని గాంచినదై ఈశానగంగాతీరమునఁ బ్రాచీనరాజధానియగు నందపురమున నేఁటి జయపురమహారాజుల పరి పాలనమునఁగల రాజ్యభాగమును నంద, శీల, గజపతి, శంకరవంశపు

రాజులు పాలనముచేసిరి. నేఁటి జయపురరాజులు శంకరవంశీయులు, వీరి వంశము పదునైదవశతాబ్దమున శ్రీ వినాయకదేవునితోఁ బ్రారంభమయినది. ఈవంశీయులు ప్రథమమునఁ గాశ్మీరదేశమునకుఁజెందినవారనియు, నందు శ్రీ వినాయకదేవుఁడు కడపటి గజపతిరాజపుత్రికను బరిణయమై యీదేశమునకుఁ బ్రభుత్వమును వహించెననియుఁ దెలియుచున్నది. గజపతుల పాలనానంతర మీవంశీయులు ప్రాముఖ్యమును వహించి నాఁటినుండియు జయపురప్రాంతమును బాలించుట మనకు విదితము. ఈగ్రంథమున నేఁటి జయపురవంశీయులచరిత్రము మాత్రమే వివరింపఁబడినది. ప్రాచీనచరిత్రము దిఙ్మాత్రముగ నిరూపింపఁబడినది. అనుబంధముల, నీచరిత్రమున గ్రంథకర్త కుపకరించిన గ్రంథభాగములు క్రోడీకరింపఁబడినవి. పెక్కువిషయములఁబరిశోధించి గ్రంథకర్తలు జయపురచరిత్రమున ఆధునికచరిత్రభాగమును రచించినందులకు వారిని మనము ప్రశంసింపవలసియున్నది.

---

3 కమ్మవారిచరిత్రము—శ్రీ కొత్తభావయ్యచౌదరిగారిచే రచింపఁబడినది. (History of the Kammas-part I) గ్రంథశీర్షికవలననే కమ్మవారు ప్రాచీనాంధ్రక్షత్రియులని నిరూపించుటయే గ్రంథకర్తల యుద్దేశమని విదితమగుచున్నది. కమ్మవారాంధ్రులనియు, ప్రాచీనాంధ్రులు కర్మపరులై కమ్మరాష్ట్రము నేర్పఱిచిరనియు, వీరు కరికాల దుర్జయవంశీయులనియు, చోడచాళుక్యవంశీయులు వెలమరాచవంశమువారైరనియు గ్రంథకర్తలు నిర్ధారణమొనర్చుటకుఁ బ్రయత్నించియున్నారు. నేఁటికాలమున కమ్మవారు, రెడ్లు తాము చతుర్థకులజులముకామనియు, ప్రాచీనక్షత్రియవంశమువారమనియుఁ బరిశోధనలసలుపుచుండుటం దఱకును విదితమే. కాకతీయులు క్షత్రియులా? అనువిషయమునుగూర్చియుఁ గొన్ని సంవత్సరములక్రిందట నిట్టి చర్యలు జరిగినవి. పూర్వకాలమున క్షత్రియవంశములవారు రాష్ట్రాధిపతులగుటవలననేమి, ఇతరకారణముల వలన

నేమి రెడ్డి కమ్మ తెగలవారితో సంబంధ బాంధవ్యములను జరిపియుండుట నిజము. కాని యిట్టిసంబంధములు రెడ్ల యొక్కయు, కమ్మవారియొక్కయు క్షత్రియత్వమును నిస్సందేహముగ నిరూపింపఁజాలవు. ఈ రెండు తెగల వారును ఆంధ్రరాజ్యమునఁ గొన్నిరాజ్యభాగములను బరిపాలించియుండుటమాత్ర మందఱంగీకరింప వలసియున్నది. వీరందఱును నిజముగ క్షత్రియవంశముల వారైనచో వారినట్లు గణింప నెట్టి యభ్యంతరములు నుండరాదు. కాని శాసనాద్యనేక ప్రమాణములు వీరలను చతుర్థకులజులుగఁ జేర్కొనుచున్నవి. ఈ గ్రంథము రెడ్డికులనిర్ణయచంద్రికవంటిది. ప్రథమమున క్షత్రియులై తరువాతఁ జతుర్థకులము వారైనట్లు వాదించుట యుక్తియుక్తము కాదు. ఇయ్యది గ్రంథమునఁ బ్రథమభాగము. మిగిలినవి ప్రచురింపఁబడిన తరువాత వీరివాదోపవాదములఁ బాఠకులు సవిమర్శముగఁ గైకొందురు గాక.

---

4. బరోడా ప్రాచ్యపరిశోధకసంఘనివేదిక (1937-38) బరోడా మహారాజావారిచే నీ సంఘము 1904 వ సంవత్సరమున నేర్పఱుపఁబడి నాఁటినుండియు వారిరాజ్యములోఁగల ప్రాచీనకట్టడములు, శాసనములు మొదలగువానివిషయమై పరిశోధనల జరుపుచున్నది. దీనికి జ్ఞానరత్న డాక్టరు హీరానందశాస్త్రిగారధ్యక్షులు. 1937-38 సంవత్సర నివేదికయందుఁగొన్ని నూతనవిషయములు దెలుపఁబడినవి. సరస్వతీనదీగర్భమున నద్భుతమైన చెక్కడపుఁబనిగలిగిన ప్రాచీనశిలాఖండములు దొరకినవి. దీనినిగూర్చి నివేదికయందిట్లు తెలుపబడినది. ' It is one of the finest pieces of carved stone work. The design is that of a large floral scroll with arabesque curls and the piece seems to have been a pendant from a ceiling a favourite form of decoration with the Hindu and Jaina Silpins of early Guzerat or ancient India '

మఱియు 'సందకస' యని బ్రాహ్మీలిపిలో వ్రాయఁబడిన క్రీ.శ. రెండవ శతాబ్దమునాఁటిదగు ఘటభాగమును, బ్రాహ్మీలిపియందే విగ్రహము వెనుకను బౌద్ధయుగమునాఁటి మహాదీశాసనమును వీరికి లభించినవి. మిగిలిన శాసనములర్వాచీనములు. ఘూర్జరదేశమునఁ బ్రాచీనకాలమున నత్యద్భుతమగు శిల్పచాతుర్యమును గనఁబఱుచు చెక్కడము లుండెననియు (Wood Carving) నట్టివానిని ధనాశచే పాశ్చాత్యదేశములవారికి మనదేశీయులు విక్రయించుట గలదనియు, నట్టివి విక్రయింపఁబడకుండ నుంచుటకై దొరతనమువారు దండనమును విధింపవలసియున్నదనియు నీవేదికయందు హెచ్చరింపఁబడినది. మనదేశమున నుండినప్రాచీనశిల్పము, విలువగలవస్తువులు విదేశములకుఁబోవుచుండుటయు, నచటి వస్తుప్రదర్శనములఁ జేర్పఁబడుటయు విషాదకరము. శాసనసభలయందట్టివానినిగూర్చి తగిన చర్యలు జరుపఁబడవలసియున్నవి. మఱియొక ముఖ్యవిషయమీ నివేదికయందు (పు. 5) చర్చింపఁబడినది. దేవాలయములపై నసభ్యములగు ప్రతిమల నెందులకుఁ జెక్కించుచుండిరను ప్రశ్నకు సమాధానముగ శైవ, వైష్ణవమతములకు సంబంధించి శాక్తేయులు కొందఱు వామమార్గమున ననుసరించుచుండిరనియు,

అంతఃశాక్తా బహిశ్శైవాః సభామధ్యేచ వైష్ణవాః

నానారూపధరాః కౌలా విచరంతి మహీతలే—అనినరీతిని వామమార్గసూచకముగ నిట్టివి చిత్రింపఁబడుచుండెననియు, దృష్టిదోషమును నివారించుటకుఁగాని, భక్తుల నాకర్షించుటకుఁగాని, వారిమనస్సులను శృంగారవిషయ విముఖములుగఁ జేయుటకుఁగాని యట్టియసభ్యశిల్పమేర్పడినదనుట యుక్తముకాదనియు నూహింపఁబడినది.

కందాళ అన్నగారు పెద్దనకు గురువైనట్లు "కందాళయన్నగారిశిష్యుడఁ బెద్దన కవివరుండ" అనువాక్యమువలనఁ దెలియనగును. అప్పయగారి శిష్యుఁడగు విహారి వేదాద్రి 1581, 1611 ప్రాంతములవాఁ డగుటచే అన్నగారు 16 వ శతాబ్దమధ్యమున నుండవచ్చును. కవులచరిత్రప్రకారము 16 వ శతాబ్దమునందలి యీపెద్దన,యాశతాబ్దమధ్యమందలి అన్నగారికిఁ బిన్నవయస్సున శిష్యుఁడై యుండి, యాశతాబ్దాంతమునఁ బ్రౌఢవయస్సున లక్షణసారసంగ్రహము రచించెనని చెప్పవచ్చును. సులక్షణసారము రచించిన వెల్లంకి తాతంభట్టును, కవిసంజీవిని రచించిన ముద్దరాజు రామన్నయును నీశతాబ్దములోనివారే. ఆశతాబ్దివాఁడగు తాతంభట్టు వృద్ధుఁడై యుండును. దాన ఛందశ్శాస్త్రమును దెనుఁగునఁ జెప్పినవారి నుతించుచు ముద్దరాజు రామనను విడిచిపెట్టి, తాతంభట్టును మాత్రమే స్మరించుట కల్గినది.

ఉ. త్ర్యక్షవరప్రసాదకవితాఢ్యుని వేములవాడభీము, న
వ్యక్తభక్తి విస్ఫురదనంతు ననంతుఁ గవిత్వలక్షణా
ధ్యక్షులఁ గాచిరాజు బసవార్యుని, భైరవు, నూత్నదండి, వా
గ్దక్షణకర్ణనేతయగు వెల్లఁకి తాతబుధేంద్రు నెన్నుచున్.

అని ప్రాచీనులలో వెల్లంకి తాతంభట్టును స్మరించి ముద్దరాజు రామనను జేర్పనలేదు. ఒకవేళ రామన తనకు సమకాలికుఁడైనను భిన్నస్థలవాసులయి యొండొరుల నెఱుంగకుండుటచే విడిచినను విడువవచ్చును.

ఈతఁడు రచించిన గ్రంథములు:— 1. ఆంజనేయశతకము. 2. లక్షణసారసంగ్రహము. * లక్షణసారసంగ్రహావతారికలో స్వప్నమునఁ దన కాంజనేయుఁడు కానవచ్చి,

* రమణకవి సాంబవిలాసమున సీ. సర్వలక్షణసారసంగ్రహం బొనరించి తనరె మీ తాత పెద్దన కవీంద్రుఁడు"అని దీనినే సర్వలక్షణసారసంగ్రహమని వ్రాసెను.

"క. మున్నొక శతకము మాకుం
జిన్నపుడె సమర్పణంబు చేసితి విఁకనున్
సన్నుతలక్షణకృతి య
స్మన్నామాంకితము సేయుమా యిపు డనినన్."

ఈలక్షణసారము రచించినాఁడఁట. శతకమున్నదో లేదో తెలి యదు కాని యాంధ్రులభాగ్యవశమున నేఁటి కీ లక్షణసారసంగ్రహము బయలుపడినది.

ఆంధ్రచ్ఛందోగ్రంథములు.

ఆంధ్రభాషయందు కవిజనాశ్రయము, అనంతునిఛందోదర్ప ణము, లక్షణసారసంగ్రహము, కావ్యాలంకారచూడామణి, లక్షణసా రము, సులక్షణసారము, కవిసంజీవిని, అప్పకవీయము, రంగరాట్ఛందము, సర్వలక్షణసారసంగ్రహము, మున్నగుఛందోగ్రంథములు పెక్కులు గలవు. నన్నయభట్టకృతమగు ఛందస్సారమను గ్రంథమొకటి కలదను ప్రతీతియే కాని యాగ్రంథ మెచ్చటను లేదని చరిత్రకారులు దెలిపి యున్నారు. తరువాతిది భీమనగ్రంథము. అందుఁ గేవలము ఛందస్సును గూర్చియు, దోషములనుగూర్చియు మాత్రమే కలదు. అనంతునిఛంద మునఁ గవిజనాశ్రయమందలి దోషములు మాత్రమేకాక షట్ప్రత్యయ ములనుగూర్చి విపులము చేయఁబడి, సమాసములు, సంస్కృతసంధులు, విశేష్యవిశేషణములువర్ణములు మున్నగువిశేషములు వెలయింపఁబడినవి. పిమ్మటిదగు నీలక్షణసారసంగ్రహమున వర్ణములు, అక్షరజాత్యాదిలక్షణ ములు, గురు, లఘు, గణసంజ్ఞలు, కావ్యస్వరూపము, కవినేతృస్వరూప ములు ప్రాసభేదములు యతివిశేషములు, * షడ్వింశతిచ్ఛందములు, సమార్ధవిషమ వృత్తవివేచనము, షట్ప్రత్యయములు, దండకలయగ్రా హికందగీత్యక్కరాదిభేదములు, రేఫనిర్ణయమును, నాటకలక్షణమును,

* ప్రాసములు పదునెనిమిది విధములనియు, యతు లిరువదియేడు విధములనియు వివరింపఁబడెను.

# పీ ఠి క.

లక్షణసారసంగ్రహమను నీఛందోగ్రంథమును రచియించిన చిత్రకవి పెద్దన కవివరుఁడు శుక్లయజుశ్శాఖికాప్రభాసురుఁడు. కాత్యాయనసూత్రుఁడు. భారద్వాజగోత్రుఁడు. ఈతనితాత చెన్నయ. తండ్రి సర్వయామాత్యుఁడు. తల్లి లక్కమాంబ. కాశ్యపసగోత్ర నల్లగట్ల మైలయాచార్యుఁ డీతనిమాతామహుఁడు. వీరి యింటిపేరు పార్శ్వంచాలవారు కావచ్చును. * కాని, చిత్రకవితయందు ఘనుఁడగుటంజేసి యీతనినాఁటినుండియుఁ జిత్రకవివారైనట్టు లీతనిపుత్రుఁడు అనంతకవియుఁ బౌత్రుఁడగు రమణకవియుఁ దమకావ్యములగు ఇందుమతీపరిణయ సాంబవిలాసములందుఁ దెలిపియున్నారు.

ఈతని గురువు 'కందాళ అన్నగారు.' అని గురుస్తుతిచేయఁబడుటచే నీతఁడు వైష్ణవమతావలంబియనుట నిజము. కృతిపతియగు వెలలూరి యాంజనేయుని శ్రీరామచంద్రదాసచంద్రుఁడనియు, 'రాఘవదాస' యనియు, 'శ్రీరామపాదసేవారామ' యనియుఁ బ్రపత్తిపూర్వకముగ స్తుతించుట వైష్ణవసంప్రదాయమును దెలుపుచున్నది.

ఇక్కవినివాసస్థలము వెలలూరని కలదు. వెల్లటూరు అనునది శ్రీశైలప్రాంతమున నున్నట్లును బండితారాధ్యుఁ డచ్చటికి వెళ్లినట్లును

* ఈ లక్షణసారసంగ్రహము తాళపత్త్రములమీఁద వ్రాసికొనినవాఁడు చిత్రకవిబుచ్చయాచార్యులతమ్ముఁడు రామాచార్యుఁడు. ఈతఁడు రచించిన రఘునందనవిలాసమునం దాశ్వాసాంతగద్యములలో వెక్కిరేల చిత్రకవివారని చెప్పుటం జూడ భారద్వాజగోత్రులగు నీ చిత్రకవివా రాయాగ్రామనామములనుగూడఁ జేర్చి యింటిపేరు వాడుకొనుచుండిరని యూహింపనైయున్నది. ఈతఁడు వెక్కిరేల చిత్రకవివంశపువాఁడైనట్లే "పార్శ్వంచాల చిత్రకవి వంశపువాఁడేమో పెద్దనకవి" యని యూహ పొడముచున్నది. ఎట్లూహించిన నట్లుసరిపడు సందిగ్ధావస్థయందున్నది గానియిదమిత్థమని నిర్ణయింపనాధారము లింతవఱకుఁ గానరావు.

పండితారాధ్యచరితమున వర్ణింపఁబడియున్నది. అయ్యది కడపమండలము లోనిది. ఆవెల్లటూరే యీవెల్లలూరేమో వ్రాఁతయందలి భేదమువలన నట్లు భిన్నముగా నైనదేమో యనిపించుచున్నది. "ధరానుత వెలలూరీ పురీహనుమంతునకున్, వెల్లలూరి హనుమన్మూర్తీ" యని యిందుఁ బేర్కొనఁబడినతావులందు 'వెల్లటూరు' అనినను బాధ లేదు. పండితారాధ్య చరిత్రమునందే 'వెల్లలూరు' అనియుండుట కందు 'వెల్లటూ'రని పడిన దేమో! స్థలజ్ఞు లావిషయమై నిర్ణయించుదాఁక వెల్లలూరో వెల్లటూరో నిశ్చయింపఁజాలము. *

కవికాలమునుగూర్చి యిందేమియుఁ దెలుపఁబడలేదు. కాని, కందాళ అన్నగారు—పాండురంగమాహాత్మ్యకృతిపతి విరూరి వేదాద్రి మంత్రి—మతగురువగు కందాళ యప్పగారితండ్రియని రామలింగనిచేఁ బేర్కొనఁబడినవా రొకరు గలరు. అందు అణ్ణగారని ణకారఘటితముగా మాత్రమున్నది. అయ్యది కన్నడభాషాసంప్రదాయమై యుండును. ఆ

---

*శివతత్త్వసారమున కుపోద్ఘాతము వ్రాయుచు శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు వెల్లటూరినిగూర్చి యిట్లు వ్రాసియున్నారు. "గుంటూరుజిల్లాలో రెండు వెల్లటూళ్లు గలవు. ఒకటి రేపల్లెతాలూకాలోను, నింకొకటి వినుకొండతాలూకాలోను నున్నవి. నైజామురాజ్యమున నల్లగొండజిల్లాలోఁ గూడ నొక వెల్లటూరు గలదు. కాని శ్రీశైలమునకు సంబంధించినది వినుకొండతాలూకాలోనిదియే. ఇది వినుకొండనుండి శ్రీశైలమునకుఁబోవు త్రోవకు నాలుమైళ్లు ప్రక్కగనుండును."

వెల్లటూరినిగూర్చి రేపల్లె వినుకొండ తాలూకాలలోనున్న వెల్లటూళ్లకు నుత్తరములు వ్రాసి స్థానికులఁ గొందఱ నడుగ వారు తమ గ్రామములందు ఆంజనేయస్వామి యాలయములు పురాతనము లేవియు లేవనియుఁ, జిత్రకవివా రాగ్రామములలో లేనట్లును దెలిపిరి. నైజాముమండలములోని వెల్లటూరేమో యని సందేహించి "విభూతి" పత్రికాధిపతులగు శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారికి వ్రాసి కనుఁగొన వారాప్రాంతముల వెల్లటూరను గ్రామమున్నదని యనుకొనుటయే కాని దానినిగూర్చిన వివరములు తెలియవనియుఁ గనుంగొని తెలియవచ్చిన వృత్తాంతము నెఱిఁగింతుమనియు వ్రాసినారు. కావున వారేనాఁడేని దెలిపినయెడల నందాధారమేమేని దొరకినచో వెంటనే ప్రచురింతుము.

పెద్దనార్యునికవితాశక్తియు, వైదుష్యమును నిరుపమానములు. కాని యచ్చటచ్చటఁ బ్రమాదములు లేకపోలేదు. అంతమాత్రమున నీగ్రంథము ప్రాశస్త్యమునఁ గొఱఁతవడనేరదు.

క. నీపేర నంకితంబుగ
దీపితమతి ఛంద మొకటి తెనుఁగునఁ గడుసం
క్షేపమునఁ జేతు నీ కృప
ప్రాపున నని విన్నవించి యఁట మ్మెలంగెన్. ఆశ్వా ౧. ప. ౧౧.

అను దానిలోని 'ప్రాపు' శబ్దము సంస్కృతమనుకొని ప్రాదిగా భావించి యందలి స్వరముతో యతి చెల్లించినాఁడు.

క. స్వరకచటవర్గములు భూ
సురు లగుఁ దపవర్గరవలు క్షోణీపతులు వి
ద్వరులు యలోష్మలు పాదజు
లరయఁగ శత్రులు కృతుల నాది నిడంగన్. ఆశ్వా. ౧. ప. ౨౬.

క. అల వర్గసమూష్టటవ
ర్గలవి మహాప్రాణము లవిగాక మిగిలియు
న్న లిపులె యల్పప్రాణం
బులిందులోనిడునివిశుభములుకృతిమొదలన్. ఆశ్వా. ౧. ప. ౩౫.

('వర్గము, వర్గువు, వర్గు' అని ప్రాచీనప్రయుక్తరూపములు గల వుకాని 'వర్గ, వర్గ' లనుట యున్యత్రకానరాదు)

సీ. నిడుదగీత్లైమగానిడి...

... ... ... ... ...

సిద్ధసాధ్యసుసిద్ధారి చిహ్నాలన్ని
చౌకములఁగల్గు నని చూచి సరవితోడఁ
దెలిసి పతివర్ణమునముండి ఫలము గనుచు
వీనిలోనున్న రిపులిపుల్ విడువవలయు. ఆశ్వా. ౧. ౪౬.

"అన్నియుపసర్గలు స్వరసమన్వితముగ..."

మున్నగుచోట్ల "ఊష్మ,వర్గ,విహార్పసర్గాదిశబ్దములు మువర్ణకరహితముగాఁ బ్రయోగించెను. "కవిప్రయుక్తము సర్వము గ్రాహ్యమేకాని, కాదన మీరెవ్వ"రనువారిఁ జెప్పి యొప్పింపఁ జాలము. కాని క్వాచిత్కములు, నేకదేశపతితములును, బ్రమాదములేకాని ప్రమాణములుకానేరవని యొప్పుకొను సహృదయులకుమాత్ర మెత్తి చూపక తప్పదు. ఎంతవానికేని ప్రమాదము రావచ్చును. ప్రమాదము ప్రమాదమే. ఊష్మాదిశబ్దములు చరిత్రాదులలోఁ జేర్చి సాధుత్వ మొకవేళ సాధించినను, శబ్దరత్నాకరములో వైకృతపదమని చెప్పఁబడిన 'ప్రాపు' శబ్దములోని 'ప్ర' యుపసర్గముగా సాధించుట సాధ్యమెట్లు? అయ్యది భ్రాంతిపతిత మనవలయును.

ఈభ్రాంతి యిటుండనిండు. బోడలకు లక్ష్యముగా నొసంగిన యీకందపద్యము తిలకింపుఁడు.

క. క్షితి ధృతి నిధిని నిలిపితివి
స్థితి నిక్క దివికి నిగిడితి శిఖిజిగి నిర్జిం
చితి ద్విడ్వ్యధి విరివి విడిచి
కృతిని వినిర్మించితి సితి ఘృణికి గిరి గృహీ. ఆశ్వా 3. ప ౧౨౫.

ఇందలి ధృతి, కృతి, ఘృణి, గృహీ, శబ్దములలోని వట్రసుళ్లను బూర్వకాలమున ధ్రితి, క్రితి, ఘ్రిణి, గ్రిహీ, అని యికారవిశిష్టములుగా వ్రాయు సంప్రదాయ ముండుటవలన బోడలకు లక్ష్యముగాఁ గవి ప్రయోగించెను. కాని పరిష్కర్తలిప్పటిలిపి ననుసరించి వట్రసుడిగలదిగాఁ బరిష్కరించిరి. అట్లు పరిష్కరింపరేని నేఁటివారి కీమార్గము విపరీతముగా నుండుటనిజమే. కాని, దాని నా పుటయడుగుభాగమున వివరింపవలసినది. ఇట్టి వేవేని ప్రమాదము లున్నచోఁ బాఠకలోకము సవరించుకొని పఠింతురుగాక.

ఇట్లు,

అమలాపురం. విబుధవిధేయుఁడు,
15—1—1940. విద్వాన్—వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

చిత్రకవిత్వలక్షణమునుగలవు. అప్పకవీయపూర్వమగు సులక్షణసారమున నిన్నివిశేషములు లేవు. పూర్వపద్ధతినిగాక, కేవలము ఛందస్సు, షట్ప్రత్యయములు, యతి, ప్రాస, కవినేత్రగణోత్పత్తివిచారము మాత్రము కలవు. ఈక్రమము లక్షణసారమునకును, అప్పకవీయమునకును దలక్రిందులుగా నున్నది. షట్ప్రత్యయములు:—కవిజనాశ్రయము, ఛందోదర్పణములందు సూక్ష్మముగాఁ దెలుపఁబడినవి. వానికంటె లక్షణసారమునను, నన్నిటికంటె నప్పకవీయమునను విపులీకరింపఁబడినవి. షట్ప్రత్యయములలోని ప్రస్తారము, వృత్తసంఖ్య మాత్రమే సులక్షణసారమునఁ గలవు. తక్కిన నాల్గు విభాగములు గానరావు. కళికోత్కళికాదులగు చిత్రకవితారీతులు కవిజనాశ్రయమునను, సులక్షణసారమునను లేనేలేవు. కావ్యాలంకారచూడామణియందు లక్షణములు మాత్రముగలవు. కాని లక్ష్యములు లేవు. ఆలక్షణములును సూక్ష్మములుగాఁ జూపఁబడినవి. ఇఁక లక్షణసారమునను, అప్పకవీయమునను లక్ష్యలక్షణములతో విపులముగా నున్నవి. అప్పకవి వివరించిన వ్యాకరణవిచార మిందు లేదుగాని యాంధ్రలాక్షణికులు ప్రాచీను లెవ్వరును వివరింపని నాటకలక్షణము మాత్రము సంస్కృతనాటకలక్షణానుసారముగాఁ జక్కగ వివరింపఁబడినది.*

షట్ప్రత్యయవివేకము కవిజనాశ్రయముకంటె ననంతునిఛందమున విపులముగానున్నది. లక్షణసారమున సూక్ష్మరూపముగానై యప్పకవీయమునఁ బరిపూర్ణతఁ గాంచినది. అప్పకవి యందఱికంటెను విపులముచేసి లక్షణము తీర్చినాఁడు. షట్ప్రత్యయములవిషయమై అప్పకవికంటె నెక్కువ వివరించినవారు పూర్వులలో నెవరును లేరన్న మాటయే.

---

* వృత్తలక్షణములు ఛందోగ్రంథము లన్నిటియందును రెండు మూఁడు పాదములలోఁ గాని యిముడనివి యిందొక్కొక్కపాదముననే యిముడ్పఁబడియుండుటవలన విద్యార్థులు సులభముగాఁ గంఠస్థములు చేసికొనననువగును.

చిత్రకవిత్వవైఖరులలో నీకవి మిగులఁ జాతుర్యమును జూపి యున్నాఁడు. అందుఁ గల్పితకల్పవల్లికాబంధము మిగుల మెచ్చఁదగి నది. అప్పకవి యీతనిపోకడనే యనుకరించినవాఁడు. ఈబంధమున నాలుగు చంపకమాలావృత్తములనుండి పదునేడు వృత్తములు వెలువడుచున్నవి. ఇయ్యది తాళపత్రప్రతులందుఁ గ్రిమిదష్టమై వ్రాయసగాండ్రపొరపాటు వ్రాఁతలతో నిండియున్నది. అట్టిదానిని నర్థయుతముగాఁ గవిభావమునూహించి సంస్కరించి ప్రచురించిన సాహిత్యపరిషద్వ్యవహర్తలగు (Manager) బ్రహ్మశ్రీ వ్యాకరణ విద్యాప్రవీణ చిలుకూరి పాపయ్యశాస్త్రిగా రెంతయుఁ బ్రశంసార్హులు. వీరికిఁ బూర్వము వ్యవహర్తలుగానుండి పనిచేసి కీర్తిశేషులైన శ్రీయుత క్రొత్తపల్లి సూర్యరావుగా రీగ్రంథప్రకటనమునకుఁ బూనుకొని 3. ఆ. ౬౬ ప. వఱకు మాత్రము ప్రకటించిరి. ఇట్టి గ్రంథములఁ బ్రకటించుటలోఁ గలకష్టము తాళపత్రప్రతులను జూచినవారికేఁగాని తెలియదు. మొట్టమొదట నట్టనడుమ నుపక్రమించి యిట్టి లక్షణగ్రంథమును సమగ్రముగా సంస్కరించుట దుష్కరకార్యమని వేఱె చెప్పనేల ?

"ప్రాచీనగ్రంథముల నన్నిటిని బండితులు దిద్ది పాడుచేయుచున్నారనుచు ఘోషించు నాధునికవిమర్శకులకు ప్రేల్పెట్టి చూపనక్కఱ లేకుండఁ బలుతావుల గ్రంథపాతస్థలములను బూరింపక యట్లే యుంచినారు. లేఖకులప్రమాదములను సవరించిరి. తృతీయాశ్వాసమున 'వెలయఁ దొమ్మిదంకముల దేవిపరికాయ' మనిమూలమునయున్నదనియు, శారదాతనయుని భావప్రకాశమునఁ "దొమ్మిదంకములతో దేవీపరిణయమను రూపక మొకటి చెప్పఁబడినది. కావున నియ్యది దేవీపరిణయమే కాని దేవిపరికాయము కా"దని సవరించిరి. సవరించిన వేవేని యున్నచో నిట్టివే కాని తమమతమున కనుకూలముగా నుండవలెనని సవరించిన భాగములు లేవనవచ్చును. కావున భాషాభిమానులగు విమర్శకు లాగ్రహింపకుందురు గాక.

శ్రీరస్తు.

# పరిషత్పుస్తక భాండాగారము

## మూఁడవభాగము.

## లక్షణగ్రంథములు.

---

### 1. లక్షణశిరోమణి—గ్రంథసంఖ్య-1297.

ఇది పొత్తపి వేంకటరమణకవిచే రచింపఁబడినది. అఱువదిమూఁడు తాటియాకులపై వ్రాయఁబడియున్నది. ఇందుఁ బ్రథమ ద్వితీయాశ్వాసములు పూర్ణముగను, తృతీయాశ్వాసము కొంతభాగమును గలవు. గ్రంథాంతమున "కానాల నరసప్ప కొమారుడు వెంకట్రాయడు వ్రాసిన లక్షణశిరోమణి శ్రీరామార్పణమస్తు" అనికలదు. గ్రంథమెప్పుడు వ్రాసినది యెచ్చటను సూచింపఁబడియుండలేదు. గ్రంథమున నున్నంతదనుక గ్రంథపాతములు లేవు. వ్రాఁతరీతియుఁ బ్రాచీనమే. వ్రాఁత తప్పులంతగ లేవు.

గ్రంథారంభము.

క. శ్రీరామా రమణజయ
శ్రీరమ్యగుణాభిరామ శ్రీవేంకటలో
కారాధ్య ప్రోవు మమ్ము ద
యారససుమధామ వేంకటాచలధామం!

... ... ... ...

క. ధరఁ గలుగు సకల విద్యా
పరిణతు నతసుకవి సార్వభౌముని నస్మ
గ్గురు తరుణి వాయుకుల గురు
నరసింహకవీంద్రు నెమ్మనంబునఁ దలఁతున్.

ఈకవి తన్ను గూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. శ్రీనాథు చక్రప్రసిద్ధ బంధాభిజ్ఞ
భీమునిఫణిబంధ పేశలంబు
శబ్దశాసనుని యిచ్ఛా వాగ్విలాసంబు
కొమరనంతుని పాదగోపనగతి
భాస్కరు వరఖడ్గబంధసంధానంబు
ప్రబలు సోముని పద్మబంధ మహిమ
మాధవు శయ్యాచమత్కారము మురారి
కలితత్రిప్రాస సంఘటితపటిమ

గీ. భారవికవి పదార్థసత్కారవంబు
భారతీవృత్తి సీయందె పరిణమించి
నిలిచె పుంభావలీలనై నిక్క మహహ
రమణ సుకవీంద్ర సత్కవిరాజచంద్ర!

సీసమాలిక.

తత చిత్రబంధసంధానధౌరంధర్య
అక్షరలక్షణాధ్యక్షు దక్షు
ఆశుమాధుర్య విస్తార ధీచాతుర్య
ఘనవిధాయుధయుద్ధకౌశలజ్ఞు
కల్పితవృత్తాధికారజ్ఞు హల్లుగో
పన లక్ష్య లక్షణప్రాభవజ్ఞు
జ్యోతిషగ్రంథైక సారజ్ఞు వివిధావ
ధానమేధా నిధానచరిత్రు

కలితైక రేఫఱకారోష్ఠ్యనైరోష్ఠ్య
కల్పితవృత్తసంకలితచతుర
వ్యస్తాక్షరాభిజ్ఞు వాస్తుశాస్త్రవిధిజ్ఞు
నేకాక్షరి ద్వ్యక్షరీధురీణు
బ్రహ్మప్రబంధోచిత ప్రక్రియాపద్య సం
గ్రహణధారణ నిరాఘాటపటిమ
సంతతనూతనేచ్ఛాకల్పితాద్భుత
కరలిపిప్రకటనోత్కట మనీష
అధికచాతుర్య జిహ్వాచల జిహ్వాద్య
నేక చమత్క్రియా శ్లోకశ్లాఘ్య

గీ. గణితభరతయతిప్రాసగణరసజ్ఞ
అతులతాత్పర్య పాదపద్యభ్రమక ర
చనసుధీనిధి లక్షణచక్రవర్తి
యనుచు ననుఁ జాలఁ గవిరాజు లభినుతింప.

సీ. నందవరంబున నలువొందఁగా దశ
గ్రంథాలవారన గణుతి కెక్కి
పిష్టట రాయన ప్రగ్గడవారనఁ
దనరి తర్వాత పొత్తపి యనేటి
గ్రామనామమునఁ బ్రఖ్యాతిఁ గాంచి యనంత
రంబున ధర దుర్గ రాజుపేర
పౌరుషేయంబునఁ బ్రాఘిచే గౌతమ
గోత్రుండగు పసిండి కొండగార్గ
రాజువేంగన పౌత్రుండ రామఘనుని
పుత్రుఁడ మదూరి కొండార్యపుత్రుఁడైన
యెలమిరఘునాథమంత్రి దౌహిత్రుఁడ కవి
రాజమిత్రుఁడ వేంకటరమణకవిని.

ఉదాహృతపద్యములఁబట్టి గ్రంథకర్తయొక్కసామర్థ్యమును వంశాదికమును విదితము లగుచునేయున్నవి.

ఇందు వర్ణగణవృత్తవిశ్రమాధికారగమ్ములను నాలుగాశ్వాసములు కలవని కవిప్రథమాశ్వాసమందలి గద్యయందుఁ జెప్పియున్నాఁడు. కాని యీప్రతి తృతీయాశ్వాసమందలి వృత్తాధికారములోఁ గొంతభాగము కలది. తొలి రెండాశ్వాసములయందును వర్ణగణములనుగూర్చిన విషయమంతయు మిక్కిలి విపులముగఁగలదు. గ్రంథాంతరగద్యలయందుఁగూడఁ దాను వ్రాసిన విషయములన్నియుఁ గ్రమముగాఁ దెల్పియేయున్నాఁడు.

గ్రంథాంతభాగము:—

సీ. క్రమముతోఁ జక్రాదిఁగల యడ్డపంక్తిలో
సర్వంబు గురువుల సంజ్ఞగలవి
క్రింది-నొలియం దమరిన లెక్క న
లరిన వృత్తము లొక్కలఘువుగలవి
యావెన్క దానిలో నందిన వృత్తము
లవియు రెండేసి లఘువులు గలవి
యీనాలుగవ విధియందలి వృత్తము
లవియు మూఁడేసి లఘువులు గలవి

గీ. ఇటులఁగలపంక్తు లన్నింటి కిష్టకరణి
సంజ్ఞ తుదపంక్తివృత్తముల్ సర్వలఘువు
లవి లగక్రియాప్రక్రియ యనఁగఁబరఁగు
ప్రత్యయము లీలగోపాలబాలకృష్ణా.

ఇయ్యది కేవలము లక్షణస్వరూపమునే దెలుపుచున్నది. ప్రతి లక్షణమునకు సంబంధించిన యితరకవుల లక్షణముల నాకాలమునకుఁ బ్రచారములోనుండిన లక్షణగ్రంథములనుండి గ్రహించి వ్యక్తపఱిచినాఁడు. ఈతఁడుపేర్కొనినలక్షణగ్రంథములు.

భీమనఛందస్సు, అనంతునిఛందస్సు లక్షణసారసంగ్రహము (చిత్రకవిపెద్దన) లక్షణదీపిక(వార్నాకవి రాఘవయ్య)అధర్వణచ్ఛందస్సు,

శ్రీధరచ్ఛందస్సు, గోకర్ణచ్ఛందస్సు, కవిసర్పగారుడము, కవిరాజ గజాంకుశము, నాదాంగచూడామణి మున్నగునవి. వాఙ్మయచరిత్రకారులకు, విమర్శకులకు నియ్యది మిక్కిలియుపయోగించును.

లక్షణశిరోమణియను నింకొక పెద్దలక్షణగ్రంథము గణపవరపు వేంకటకవిచే రచింపఁబడినదిగలదు. అదియు నిదియు భిన్నమని పైవిషయముచే వ్యక్తమగుచున్నది.

## 2. లక్షణశిరోమణి. గ్రం. సం. 148.

ఈవఱకు వివరించిన గ్రంథమునకుఁ దరువాతిభాగమిందుఁ గలదు. ఇదియు నసమగ్రమే. ఇందు తృతీయాశ్వాసము పూర్ణముగను, చతుర్థాశ్వాసమునఁ గొంతభాగమును గలదు. ఇదికొండపల్లిపీచుకాగితముల పై వ్రాయఁబడియున్నది. నూటముప్పదిమూఁడు పత్రములు గలవు. వ్రాయసగాని పేరుగాని, కాలముగాని యెచ్చటను దెలుఁపబడియుండలేదు. వ్రాఁతప్రాచీనమై కన్నడమోడీని కలదు. అచ్చటచ్చట వ్రాఁత తప్పులు పరిశీలింపఁబడి యున్నవి. కొన్నితావుల నాగరిలిపియందు శ్లోకములు టిప్పణములుగఁ గానవచ్చుచున్నవి.

తృతీయాశ్వాసమున వృత్తములనుగూర్చి విపులముగఁ జర్చింపఁబడినది. పెక్కుతావుల వృత్తరత్నాకరము ప్రమాణముగఁ గైకొనఁబడినది.

చతుర్థాశ్వాసమునఁగవిచెప్పఁబూనినవిషయము నిట్లుపేర్కొనియున్నాఁడు.

సీ. జగతి విరతులు ప్రాసస్థానసంజ్ఞలు
వడులుప్రాసములు తత్ప్రాసవిధులు
రేఫఱకారముల్ ఋక్షిభక్తిక్రమ
సంధిసమాస విచారములును
దశవిధదోషభేదంబులు నవరస
సంగతుల్ చజయువసర లనియెడి

వర్ణసంకేతముల్ వట్రువల్ ప్రకారలు
కవికల్పితములైన కవులకృతులఁ
జిత్రలక్షణకవితా విశేషములును
మఱియు రచనలఁగల యన్నిమార్గములును
కవులకృపచేత నిత్యాదికంబు లన్ని
తేటపఱిచెద నవధారు దేవ కృష్ణా!

పై విషయములలో సమాసములవఱకుఁగల గ్రంథమంతయుఁ బూర్తిగఁ గలదు. ఇందు యతిప్రాసవిషయము నేఁడు మనకు లభించుచున్న లక్షణగ్రంథము లన్నింటికంటె విపులీకరింపఁబడియున్నది. పెక్కు ప్రాచీనగ్రంథములనుండి లక్ష్యములు గైకొనఁబడినవి. దీనిం బట్టిచూడ నీకవి అప్పకవికంటెఁ బూర్వుఁడుగఁ దలంపఁదగియున్నాఁడు.

మచ్చునకొక విషయము.

రఘునాథయ్యగారి దీపికయందు, ఆంధ్రకవి పితామహుని యలంకారంబున గీతిలక్షణముగాఁ బ్రయోగము వ్రాసినది.

గీ. ఇందురేఖాకలాప లోకైకసేవ్య
యురగకంకణ నుతవిబుధౌఘ యనిన
నెఱుఁగ నివి వృద్ధియతులన నరయవీని
నెలవున నవారమైనను నిలుపవచ్చు.

మఱియు నీవఱకు లాక్షణికులుదాహరింపని పూర్ణార్ధబిందు ప్రాస మిందుఁ జెప్పఁబడినది. ఇట్లే పెక్కు నూతనవిషయము లిందుఁ గలవు.

### 3. లక్షణశిరోమణి. గ్రం. సం. 31

ఇది 'ప్రబంధరాజ వేంకటేశ్వరవిలాసము'ను రచించిన గణపవరపు వేంకటకవి ప్రణీతమగు లక్షణగ్రంథము. ఇందు ఛందోవ్యాకరణాలంకారములఁ గూర్చి తెలుపు పదియుల్లాసములున్నట్లు తెలియవచ్చుచున్నను, పరిషత్పుస్తక భాండాగారమునందలి పైప్రతియందు నాలుగుల్లాసములు సంపూర్ణముగను, ఐదవయుల్లాసమునఁ గొంతభాగమును

గలవు. ఉండుగల పత్రములు నూటయెనుబదియొకటి. వ్రాంత బాగు గనేయున్నది. అచ్చటచ్చట బత్రములు క్రిమిదష్టములైనవి. ఆద్యంత పత్రములు రెండును బూర్తిగ శిథిలమైనవి. ఉన్నంతవఱకు గ్రంథ పాఠములు లేవు.

ప్రథమోల్లాసము — మహాకావ్యస్వరూపకథనము.

ద్వితీయోల్లాసము — వేంకటేశాంధ్రనిఘంటువు.

తృతీయోల్లాసము — ఆంధ్రకౌముది.

చతుర్థోల్లాసము — ఛందోవిషయము.

పంచమోల్లాసము — రేఫఱకారనిర్ణయము.

ఈ గ్రంథమున నీకవి చెప్పఁబూనిన విషయములు తెలియుటకై ప్రథమోల్లాసాంతగద్యము నుదాహరించుచున్నాము.

ఇది శ్రీ మత్పెరంబూదూరి యతిరాజాచార్యవర్యకరుణాకటాక్ష సంప్రాప్తాంధ్రకవితాసామ్రాజ్యధురంధర, నీతియుగంధర, నందవరకుల కలశజలధిపూర్ణిమాచంద్ర, సత్యహరిశ్చంద్ర, వాసిష్ఠగోత్రపవిత్ర, ప్రశస్తాశ్వలాయనసూత్ర, కార్యఖడ్గప్రవీణ, కామినీజనపంచబాణ, కర్ణాటతుండీరచోళపాండ్యమండలాధీశప్రముఖాఖిల మహీమండలాఖం డలదత్తమత్తసింధురసైంధవాందోళికా చిరత్నరత్నాంబరాదివస్తుప్రశస్త మందిర నిరస్తరవసదిన్దిర, సకలకలావిచక్షణ, నిత్యశుభలక్షణ, లక్షణకవి వేంకటపత్యమాత్యవిరచితంబును, మంగళాంబాసమేతగణపవరాప్పయ మంత్రిమణివిఖ్యాతిమజ్జనకరూపాలవేల్మంగాసనాథతిరువెంగళనాథాంకి తంబునగు లక్షణశిరోమణియను మహాకావ్యంబు నందలి ఛందోనిర్ణ యంబునందు, వాగ్దేవీస్వరూపంబును, విప్రకులమాతృకావిధంబును, తద క్షరనిర్ణయంబును, దేవతిర్యగ్గౌరవగతిభేదంబును, కళాసంజ్ఞ చక్రస్థానఫలం బును, అక్షరవర్ణప్రకారంబునువర్ణదేవతాశ్రమంబును, అన్యగ్రహ నిర్ణ యంబును, గ్రహమైత్రి విరోధప్రచారంబును, బీజాక్షరమార్గంబును, సత్వాదిగుణాక్షరప్రకారంబును, శుభగ్రహపాపగ్రహపద్ధతియును, శ్వేత

వర్ణాదిచంద్రఫలంబును, సాజ్ఞాక్షరభేదంబును, అల్పప్రాణమహాప్రాణం
బును, తారాప్రకారంబును, త్రిలింగవర్ణక్రమంబును, నక్షత్రయోని
తద్గణమైత్రివైరతత్ఫలప్రకారంబును, రాశి తద్రాశ్యాధిపతివిధంబును,
పంచాశద్వర్ణఫలాఫలప్రకారంబును, గురులఘుస్వరూపంబును, గణ
నిరూపణంబును, ప్రాసభేదంబును, యతినిర్ణయంబును, కందగీతివృత్త
సీసాది తత్తత్పద్యక్రమంబును, ద్విపదరీతియు, దండకవిధంబును, యక్ష
గాననాటకబిరుదగద్యచతుర్భద్రోదాహరణచాటుప్రబంధనిర్మాణంబును,
సద్దళిపద్దళి కళ్యాణబిరుదావళి ధాటిపంచక అష్టదిగ్గజనవరత్నకళామాలి
కాతారావళీశతకకందవృత్తసీసత్రయమాలికా రగడచౌపదప్రభృతి నా
నావిధవిశేషప్రకటనంబును, గణదోషమైత్రిస్థితియు, శుభగణనిర్ణయం
బును, రేఫఱకారప్రాసనిర్ణయంబును, అష్టగణాదిగోత్రసప్తస్వరతదధి
దైవతయోనికూట తారాగ్రహగణవర్ణన రాశిరసఫలప్రకరణంబును,
కాలస్వరూపంబును, వాసరయామఘటికాదినిర్ణయంబును, నవరసమైత్రి
వైర తద్దేవతానిరూపణంబును, నాయకోదాహరణంబును, నాయకప్రక
రణంబును, దూతికాక్రమంబును, వృత్తిప్రశంసయు, రీతివిధంబును,
పాకభేదంబును, అవస్థానిర్ణయంబును, దశగుణతద్రూపదశప్రాణప్రకా
రంబును, విభావానుభావసాత్త్వికభావప్రపంచంబును, తచ్ఛృంగారరస
స్థాయిభావనిర్ణయంబును, రసప్రకరణంబును, సంభోగవిప్రలంభశృం
గారక్రమంబును, భావహావవిలాసరీతియు, సంచారీభావసర్వరససాధా
రణతామార్గంబును, రసాభాసవిధంబును, కవిసమయపద్ధతియు, భావో
దయభావశాంతి భావసంధిభావశబలతాస్వరూపకథనంబును, వీరరసత్ర
యనిర్ణయంబును, కవిలక్షణంబును, అష్టాదశవర్ణననిరూపణంబును, చిత్ర
కవిత్వబంధాదిస్వరూపంబును, ప్రబంధదోషవాక్యదోష నిరూపణంబును,
షడ్విరోధనిరూపణంబును, తద్దోషఫలప్రకారంబును, మహాకావ్యస్వరూ
పంబునునగు ప్రథమోల్లాసము.

ఆంధ్రవాఙ్మయమునఁగల లక్షణగ్రంథములలో నీ లక్షణశిరోమణియు, పొత్తపి వేంకటరమణకవి రచితలక్షణశిరోమణియు సంపూర్ణముగ ఛందోవ్యాకరణములనుగూర్చి తెలుపుచున్నవి. ఈగ్రంథకర్త లిరువురును క్రీ. శ. 17 వ శతాబ్దమువారయ్యును, అపూర్వములయిన ప్రాచీన గ్రంథముల నుద్ధరించిరి. ఈవిషయ మాంధ్రవాఙ్మయచరిత్ర రచయితలకెంతేని యుపయుక్తము. ఈగ్రంథములకుఁ బ్రచారము లేనికారణమున వీని నెవ్వరును దడవినట్లగపడదు. ఇవి ముద్రింపఁబడినచో నాంధ్రవాఙ్మయమున నూతనశక మేర్పడు ననుటలో సందియము లేదు.

## 4. సకలలక్షణసారసంగ్రహము. 3471 గ్రం. సం.

ఇదియొక సంకలితలక్షణగ్రంథము. తొలియాఱుపత్రములందును, తుదినైదుపత్రములందును సులక్షణసారము యాదవామాత్యచ్ఛందము లును గలవు. ఏడవ పత్రము మొదలు 25 పత్రములవఱకును సకలలక్షణసారమను ఛందస్సుగలదు. ఆవెనుక రెండుపత్రములలోఁ గొన్ని బట్రాజు పద్యములు, ఒక తిట్టుదండకమును గలవు. కాఁగా నిందు సంపూర్ణము గ నున్నది సకలలక్షణసారసంగ్రహ మొక్కటియే యని చెప్పనగును. ఇది రత్నాకరము గోపాలకవి ప్రణీతము. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవు. గ్రంథపాతము లేదు. పరాభవనామసంవత్సర జ్యేష్ఠబహుళ ౧౦ గురువారమువఱకు గుడిమెట్ల వేంకటప్పయ్య వ్రాసికొనిన తాళపత్రగ్రంథము అనికలదు.

రత్నాకరము గోపాలకవి తాను గ్రంథమునఁ జెప్పినవిషయమును గ్రంథాంతమున నిట్లు తెలిపినాఁడు.

క. అందంబుగ దశవిధముల
ఛందంబుల లక్షణముల సకలకృతులలోఁ
జెందిన ప్రయోగవితతులఁ
బొందికగాఁ గూర్చినాఁడ బుధులౌనఁగఁగ.

ఇందులఁ బ్రయోగములు రాజశేఖరచరిత్రము, కమలాకర చరిత్రము,అంబాలభాణమున్నగు నపూర్వగ్రంథములనుండి కైకొనఁ బడినవి. గ్రంథాదిని ఛందస్సుఁగూర్చియు, విశ్రమములఁ గూర్చియు, విషయములు సులక్షణసారమునుండియే తీసికొనఁబడినవి. పద్యముల యం దేమియు మార్పులేదు. మచ్చునకొక ఘట్టము.

వికల్పప్రాసము:—

గీ. సానునాసికలై వర్గ హల్లు లవి ద్వి
తయలు కవికల్పప్రాసమై యలరు ప్రాఙ్న
గంబుపై రవిదోఁచె నగ్నివోలె
ప్రాఙ్ముఖుండయి వినుతించె వాగ్మి యనఁగ.

లక్ష్యము—పద్మావతిచరిత్రము:—

క. పద్మాసమానమగు నా
పద్మావతిఁ జూచి ధరణిపాలసుతుండు
ద్యన్మోదంబునఁ దనముఖ
పద్మము నలరించె ననుచుఁ బరిజను లలుకన్.

'సౌగంధికప్రసవాపహరణ'మను ద్విపదకావ్యము రచియించిన రత్నాకరము గోపాలకృష్ణకవికి నీ గోపాలకవి మనుమఁడో లేక ముని మనుమఁడో కానోపును. గోపాలకృష్ణకవి క్రీ. శ. 1560 ప్రాంతము వాఁడు. సకలలక్షణసార సంగ్రహమున 'సారంగధరచరిత్రము' మున్నగు ప్రబంధములయందలి పద్యములుండుటచే నీతఁడు క్రీ. శ. 1630 తరు వాతివాఁడని చెప్పనొప్పును.

కవినిగూర్చిన వివరము తెలియుటకై గ్రంథాంతగద్య మీక్రింద నుదాహరింపఁబడినది.

ఇది శ్రీ మద్వేంకటాచలాధ్యక్ష సంలబ్ధాసాధారణ ప్రజ్ఞావిచక్ష ణాక్షీణప్రబంధాంధ్రశబ్దసారలక్షణ బహుచిత్రకవిత్వరచనాచమత్కార రత్నాకరకృష్ణమరాజ గర్భరత్నాకరసుధాకర గోపాలసత్కవిరాజప్రణీ తంబయిన సకలలక్షణసారసంగ్రహము సంపూర్ణము.

## 5. సుకవికర్ణామృతము. 850 గ్రం. సం.

కౌలూరి ఆంజనేయకవి విరచితము. ఇది యేబదియెనిమిది తాళపత్రములు గలది. వ్రాయసగాని పేరుగాని, కాలముగాని తెలియదు. వ్రాత యొకమాదిరిగ నున్నది. తప్పులంతగ లేవుగాని, మూడువంతులకుఁబైగఁ బత్త్రములచివరలు పోయినవి.

ఈ గ్రంథమునకు "కుకవికర్ణకఠోర" మను వేఱొకనామమును గలదు. యతిప్రాసప్రకరణములు రెండుమాత్రమే యిందుఁ గలవు. తొలిప్రకరణమున గురులఘునిర్ణయము, గణవిభజనము మున్నగువిషయములు తెలుపఁబడియున్నవి. ఈగ్రంథము శోభనాద్రీశ్వరునకుఁ గృతియొసంగఁబడినది. గ్రంథాదిని ప్రాచీనసంప్రదాయానుసారముగా సంస్కృతశ్లోకము వ్రాయఁబడినది.

శ్లో॥ శ్రియ మధిగణ్యతే గుణవశీకరణాయ భవత్పదాంబుజా
శ్రయధిషణావతాయ చ నిశమ్య భవత్సుగుణాన్ భవత్సదా
క్షయదయోధిషికా సలవిసారి విహారి దయారసస్య హే
క్షితలతనశోభనాద్రి నరసింహకరోమి నమ స్సదా.

ఈ లక్షణగ్రంథమున లింగమకుంట తిమ్మన్న "బాలబోధచ్ఛందస్సు"నుండియు, చిత్రకవి పెద్దన "లక్షణసారసంగ్రహము"నుండియు లక్షణములు గైకొనఁబడినవి. ఈకవికాలము తెలియరాదు. లాక్షణికోదాహృతులఁబట్టి పదునాఱవశతాబ్దిప్రాంతమువాఁడని యూహింపనగును. ప్రకరణాంతమున నిట్లు గలదు.

ఇది శ్రీ వరలక్ష్మీనృసింహప్రభావ భవత్కృపాపాఙ్గవిలసదాంజనేయ విరచితంబైన కుకవికర్ణకఠోరంబను సుకవికర్ణామృతమునందు...... ప్రకరణము.

## 6. లక్షణమంజరి—4506 గ్రం. సం.

ఇది నైషధము తిమ్మకవి ప్రణీతము. ఒకే యాశ్వాసము కలది. నూటయిరువదిమూఁడు పత్రములు కలది. గ్రంథమునఁ గొన్నిచోట్లఁ

బత్రములు విరిగియున్నను గ్రంథపాతము లేదు. వ్రాంత బాగుగనున్నది. వ్రాంత రీతి కన్నడమోడీ నున్నదని చెప్పనగును. తప్పులంతగ లేవు. ఇది ఛందోవిషయికమైనను గొలఁదిగ వ్యాకరణవిషయమునుగూడఁ దెల్పు గ్రంథము. లక్షణలక్ష్యముల రెండిటిని కవి స్వయముగానే రచియించి నాఁడు. ఈగ్రంథము గరళపురీశ్వరునకుఁ గృతియొసంగఁ బడినది. కావున నే దీనికి "గరళపురీచ్ఛంద"మను పేర వ్యవహారమును గలదు.

ఇందలి తొలిపద్యము:—

క. శ్రీ రజతశైల మందిర
సారసభవ ముఖ్యదివిజ సన్నుతవిశ్వా
ధార నిరామయ భవశుభ
కారణ దేవప్రకాశ గరళపురీశా!

ఈగరళపురము మైసూరురాజ్యమునఁ గలదు. ఈగ్రంథ మాప్రాంతములోనిదే యన్నట్లు పై వ్రాంత తీరు చెప్పుచున్నది.

గ్రంథవిషయిక ప్రతిజ్ఞ.

క. యతులును గుణములు ప్రాసము
లతులంబగు సంధివిధము లక్షరఫలముల్
వితతాంధ్ర మహిమ నెల్లను
జతురత వివరింతు సుకవిజాలము మెచ్చన్.

ఈపద్యమువలన నీగ్రంథమం దుదాహరింపఁబడిన విషయము విదితమగును. ఈతఁ డితరలాక్షణికులకంటె విలక్షణముగ నేఁబదియతులను జేర్చినాఁడు. వాని స్వరూప మిట్లున్నది.

౧ శుద్ధస్వరయతి ౨ స్వరప్రధానయతి 3 ఉభయస్వరప్రధాన యతి ౪ స్వరసంబంధయతి ౫ వృద్ధిస్వరయతి ౬ గూఢస్వరయతి ౭ ఋయతి ౮ ఋత్వహితయతి ౯ ఋత్వనిమిత్తయతి ౧౦ సమయతి ౧౧ సంయుక్తయతి ౧౨ వర్గయతి ౧3 బిందుయతి ౧౪ పోలికయతి ౧౫ చక్కటియతి ౧౬ భిన్నవర్గయతి ౧౭ మకారయతి ౧౮ అభేదయతి

౧౯ అభేదవర్గయతి ౨౦ ప్రకారసంధియతి ౨౧ వికల్పయతి ౨౨ సరసయతి ౨౩ అనునాసికయతి ౨౪ తద్భవయతి ౨౫ యక్కటియతి ౨౬ భిన్నయతి ౨౭ ఊష్మయతి ౨౮ ప్రత్యేకయతి ౨౯ చిత్రయతి ౩౦ శకంధుయతి ౩౧ నఞ్సమాసయతి ౩౨ ప్రాదియతి ౩౩ ఆదేశయతి ౩౪ అఖండయతి ౩౫ శబ్దద్వయయతి ౩౬ సహార్ధయతి ౩౭ అవ్యయసంధియతి ౩౮ విభాగయతి ౩౯ ప్లుతయతి ౪౦ ఉభయప్లుతయతి ౪౧ ఆగమయతి ౪౨ చతుర్థీవిభక్తియతి ౪౩ పంచమీవిభక్తియతి ౪౪ ప్రభునామయతి ౪౫ దేశ్యనిత్యసమాసయతి ౪౬ ప్రాసయతి ౪౭ మిశ్రయతి ౪౮ అభేదవర్గయక్కటియతి ౪౯ అనుస్వారసంయుక్తప్రాదియతి ౫౦ సంయుక్తోష్మసహార్ధయతులును.

ఆశ్వాసాంతగద్యము.

ఇతి శ్రీ మదుదయాద్రీశ్వర కృపాకటాక్షసమాసాదిత సంస్కృతాంధ్రభాషాధౌరేయ శివపూజావిధేయ నైషధాన్వయరాకాసుధాకర మహితచరిత్రపాపయామాత్య పుత్త్ర సకల విద్వత్కవిజనాధార...... సరసగుణాభరణ సావిత్రీమనోరమణ మదనసౌందర్య తిమ్మయామాత్యవర్యప్రణీతంబైన లక్షణమంజరి యను ఛందంబునందు సర్వంబు నేకాశ్వాసము.

7. కవితాలక్షణసారము—4478 గ్రం. సం.

రామయకవి ప్రణీతము. ఇది యేడధ్యాయములుగల ఛందోగ్రంథము. ముప్పదియేను పత్త్రములున్నవి. వ్రాత మంచిది. గ్రంథపాతము లేదు. చాలవఱకుఁ దప్పులు పరిశోధనచేయఁబడినవి. "విళంబిసంవత్సర భాద్రపదబహుళ త్రయోదశీ శుక్రవారము మాతృకనున్న క్రమాన వ్రాసినాఁడు" ఈఛందము నాల్గవవంతు అవసరాల వేంకటరాయఁడు వ్రాసినాఁడు, అని యున్నది.

ఇందు "కవిచింతామణి" మొదలగు లక్షణగ్రంథములనుండి యుదాహరణములు గైకొనఁబడినవి. ఇంతియేగాక ఉదాహరణములు,

లిన పదునొకండు పత్రముల నీలక్షణ దీపికయునుగలవు. వ్రాత చక్కం గనున్నది. తప్పులంతగ లేవు. గ్రంథపాతము లేదు. పత్రము లచ్చటచ్చటం గ్రిమిదష్టములైనవి.

ఇందైదు పరిచ్ఛేదములుగలవు. వీనిలోంగ్రమముగ, అక్షరములు వానిప్రయోగమునం గలుగు శుభాశుభఫలములు, వర్ణాధిదేవతలు, దూక్షస్నిగ్ధవర్ణవిచారము, గణములు గణాధిదేవతలు, తత్తద్గణప్రయోగమునం గలుగు శుభాశుభఫలములు, మిత్రామిత్రగణవిచారము, నక్షత్రములు, రాసులు, మాతృకార్చన మున్నగు విషయములు చర్చింపంబడినవి.

గ్రంథారంభము:—

ప్రణమ్య విద్వజ్జనపారిజాతం
కవీంద్రవిప్రార్చిత పాదపఙ్కజమ్
విభుంప్రభుం విశ్వసృజం మహేశం
సంవక్ష్యతే లక్షణదీపికేయమ్.

అస్య గద్యప్రబంధానాం ఛందో లక్షణ నియామకస్యాదౌతావత్ప్రకారః పఠ్యతే.

ఒకలక్షణమును వివరించునపుడు ఆలక్షణమునకు సజాతీయమగు నితరలాక్షణికుల పద్యములను శ్లోకములనుగూడ నుదాహరించినాడు. మచ్చున కొక ఘట్టము.

అథనగణస్య సాహిత్యచంద్రోదయే:—

నగణస్యసమీపస్థో దుర్గణశ్శుభదో భవేత్

తథా కవిరాజగజాంకుశే :—

పర్వతానాం యథామేరు స్సురాణాం శంకరో యథా
మృగాణాం చ యథాసింహో గణానాం నగణ స్తథా.

ఆంధ్రగోకర్ణఛందే

## ఆంధ్రసాహిత్యపరిషత్తు— ప్రతిష్ఠాపకులు.

శ్రీశ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పిఠాపురము మహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.
కీ. శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ, బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ, బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు (కోశాధ్యక్షులు)
పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గోడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ, ఎల్. టి.
ప్రతివాది భయంకరం పార్థసారథిగారు బి. ఏ, యల్. యల్. బి.
అళక్కి వేంకట్రామయ్యగారు.
కేశవరపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావునాయుడుగారు.
కోకా శివనాథశాస్త్రిగారు బి. ఏ.
పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.
నిడుదవోలు వేంకటరావుగారు బి. ఏ.